సరస్వతీ గ్రంథమండలి :

# అమెరికా సంయుక్తరాష్ట్ర సంగ్రహ చరిత్ర



అనువాదం :
బి. వి. సింగరాచార్య

సరస్వతీ గ్రంథమండలి :



# అమెరికా సంయుక్తరాష్ట్ర సంగ్రహచరిత్ర

రచయిత :

## ఫ్రాంక్లిన్ ఎశ్చర్ (జూనియర్)

అనువాదం :

## బి. వి. సింగరాచార్య





పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

B

# AMERICA SAMYUKTA RASHTRA SANGRAHA CHARITRA

(A Brief History of the United States)

by

FRANKLIN ESCHER (Junior)



Translated by

B. V. SINGARA CHARYA

Second Edition - June 1962 - Price 2-75





Publishers ADDEPALLY & Co.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.) India

# ఉపోద్ఘాతము

ఈ చిన్న గ్రంథం అమెరికా చరిత్రలో అక్కడ కొంచెం ఇక్కడ కొంచెంగా తెలిసికొన్నవారి కోసము, అసలే తెలియనివారి కోసము రచించ బడింది. అమెరికా సంయుక్త రాష్ట్రాలను ఏక జాతిగా రూపొందించిన మహా శక్తులను, సమస్యలను గురించి ముఖ్యంగా ఇందులో విశదీకరించ బడింది. భౌతిక, నైతిక, ఆర్థిక రూపములయిన ఈ వివిధ శక్తులు సంయుక్తరాష్ట్ర ప్రజల కొక విలక్షణతను చేకూర్చినవి.

అసలు ఉత్తర అమెరికా మహారణ్యాలలోకి మొదట ఎవరు గాని వలస రావడానికి హేతు వేమిటి? పురాతన ప్రపంచ దేశాల వ్యవస్థలకు, నిర్బంధ శాసనాలకు దూరంగా పోయి, తాము వేరుగా నూతన వ్యవస్థలను స్థాపించుకొన గోరిన వారు మొదట ఆ విధంగా వలస వచ్చారు. కనుక, ఆ తొలి వలసదారులకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు తమ ప్రాణాల కన్న ప్రియతమాలు అవడం వల్ల, అమెరికాలో తామేర్పరచుకొన్న అధికార వ్యవస్థలకు తామే తల ఒగ్గలేక, జట్లుజట్లుగా ఇంకా పశ్చిమ దిశకు తరలి పోయి, క్రొత్తక్రొత్తవలసలు నిర్మించుకొన్నారు. వాటిలో తమకు హితమైన జీవిత విధానాలను, శాసనాలను ఏర్పాటు చేసుకొన్నారు. "నేను నా యిష్టానుసారం బ్రతకాలి, నన్ను వదలిపెట్టండి" అన్న ఈ ధోరణి వల్లనే, మొదట ఈ వలసల స్వాతంత్ర్యానికి మాతృదేశమైన ఇంగ్లండు నుండి ప్రమాదం ఏర్పడి నప్పుడు వేరువేరుగా ఉన్న ఈ వలసలన్నీ ఏకమై సమిష్టిగా ప్రతిఘటించడం చాలా కష్టసాధ్యమయింది. అయితే, క్రమంగా వీరు ప్రజాసామ్య సహకార విధానం అలవరచుకొని, అద్భుతమైన అఖండమైన అభ్యుదయం సాధించారు.

## 2

అమెరికా చరిత్రలో గమనించ దగిన ప్రత్యేక విషయాలు చాలా ఉన్నవి. బానిసత్వం, భారీ పెట్టుబడిదారీ విధానం సంస్కరణ శీలం, తత్ఫలితమైన తిరుగుబాటు ధోరణి, ఈ జాతి క్రమంగా అపారమైన అభ్యుదయం సాధించి ప్రపంచ నాయకమణిగా తయారైన తీరు—ఇలాంటివి. ఈ విషయాలన్నీ — దేనికదే భిన్నభిన్న రీతులలో—ఆకర్షణీయమైనవి. ఇవన్నీ కలిస్తే అమెరికా సంయుక్తరాష్ట్ర చరిత్ర అయింది. ఇంత రంజకమైన గాథ ప్రపంచ చరిత్రలో చాలా అరుదు.

ఈ గాథ విశదంగా ఈ గ్రంథంలో అభివర్ణితమైన దనీ, కనుక ఈ గ్రంథం పాఠకుడికి వికాసం కలిగించడం ద్వారా ప్రయోజనకారి కాగల దనీ ఈ గ్రంథకర్త ఆశిస్తున్నాడు.

గ్రంథకర్త.

4

# విషయసూచిక

I

# ప్రథమాధ్యాయము

## అమెరికా ఆవిష్కరణ : తొలి వలసలు

ఉత్తర అమెరికాఖండ ప్రాచీన చరిత్ర ఇప్పటికీ అగమ్యగోచరంగానే ఉంది. మొదట ఈ ఖండంలో నివాసం ఏర్పరచుకొన్న (ఎర్ర) ఇండియనులు ఆసియా ఉత్తర దిశనుంచి అలాస్కాకు, అచటనుండి క్రమంగా అంతకన్న వెచ్చని దక్షిణ ప్రాంతాలకూ వలసవచ్చినట్లు సాధారణంగా విశ్వసిస్తున్నారు. అమెరికాలోని (ఎర్ర) ఇండియనుల రూపు రేఖలు, వారి నల్లనిజుట్టు, తామ్రవర్ణం, ఎత్తైన దవడ ఎముకలు - వారు ప్రాచ్యప్రపంచవాసుల సంతతివారై ఉండాలని సూచిస్తున్నవి.

ఇరవైవేల సంవత్సరాలకు పూర్వం, అనగా కట్టకడపటి హిమానీ ప్రళయ సందర్భంలో ఉత్తర అమెరికా, ఆశియాఖండాలకు బేరింగ్ జలసంధి వద్ద అంకె ఏర్పడినదని శాస్త్రవేత్తలు అంచనాలు వేసిన తర్వాత ఈసిద్ధాంతం మరింత విశ్వసనీయంగా కనిపిస్తుంది.

అమెరికా తీరాన్ని మొట్టమొదట కనుగొన్నవారు బహుశః స్కాండినేవియా ఆదిమవాసులైన నార్స్‌మెన్ కావచ్చు. వారు ఒక్కే తెరచాపగల తమ గుండ్రని వర్తకపు ఓడలలో సాహసంగా ప్రమాదభూయిష్టమైన ఆర్కిటిక్ సముద్రంమీద ప్రయాణం చేసి క్రీ. శ. 985లో గ్రీన్‌లెండ్ చేరుకున్నారు. ఈ సువిశాల ద్వీపం నుంచి వారి ఓడలు ఇంకా పశ్చిమంగా పయనం సాగించినవి. క్రీ. శ. 1000 లో లీఫ్ ఎరిక్సన్, మరి కొందరు ప్రస్తుతం అమెరికా సంయుక్త రాష్ట్రాలనబడే భూభాగంమీద దిగారనడానికి కొన్ని నిదర్శనాలు కనిపిస్తున్నవి

నార్స్‌మెన్ సాధించిన ఈవిజయం ఘనమైనదే అయినా నూతన ప్రపంచం (అమెరికా)లో వారు నిలవద్రొక్కుకుని ఉండనూ లేకపోయారు; తామా అన్వేషణలో కనుగొన్న విషయాలను గురించిన అభివర్ణనలను వ్రాయనూ లేకపోయారు. అందువలన 1490 ప్రాంతంలో అమెరికా తూర్పు తీరాన వున్న పశ్చిమ ఇండీస్ దీవులకు వచ్చినా రి. వాటినిగురించి వివరముగా అభివర్ణించి, పిమ్మట వలసవచ్చిన వారికి

దారిచూపిన క్రిస్టోఫర్ కొలంబస్ కే అమెరికాఖండాన్ని తొలుత ఆవిష్కరించిన ప్రతిష్ఠ యావత్తూ దక్కుతున్నది. కొలంబస్ ఇటలీ దేశస్థుడు. స్పెయిన్ దేశపురాజు ఫెర్డినాండ్, రాణి ఇజబెల్లాలవద్ద వారి నౌకాదళంలో పనిచేస్తూఉండేవాడు.

అమెరికా ఆవిష్కరణ తలవనితలంపుగా జరిగిన సంఘటన. టర్కీ ఈమహాత్సంఘటనకు నిమిత్తకారణమయింది. 15వ శతాబ్దిలో, అతివేగంగా పెరిగిపోతున్న సువిశాలతురుష్క సామ్రాజ్యం పశ్చిమ యూరప్‌దేశాలు, ఆసియా ఖండంలో యథాప్రకారం భూమార్గాన వ్యాపారం సాగించడానికి వీలులేకుండా అరికట్టింది. ఆ విధంగా మార్కోపోలో నాటినుండి ప్రాచ్యపాశ్చాత్య దేశాలమధ్య భూమార్గాన సాగుచుండిన వాణిజ్యం కట్టుబడిపోవడంతో, పాశ్చాత్యదేశాలు తురుష్కులకు వెరచి, ఆసియాకు పోవడానికి మరొకమార్గం అన్వేషించాలని నిశ్చయించుకున్నాయి. అంధయుగాల సుషుప్త్యవస్థనుండి వారు మేల్కొన్నారు. భూమి గుండ్రంగా ఉన్నదని నాడు చాలామంది భూగోళశాస్త్రవేత్తలు అంగీకరించడంవల్ల, ఆమాటే నిజమయితే స్పెయిన్‌నుండి పశ్చిమంగా బయలుదేరి, మళ్ళీ భూమితగిలేవరకూ చేస్తే, తప్పకుండా ఆ భూమి ఆసియాఖండమే అయివుండాలని వారు భావించారు. మధ్యలో అమెరికాఖండం ఉన్నదని ఆనాడు కొలంబస్‌కిగాని, అతని సమకాలికు లెవ్వరికిగాని తెలియదు.

అందువల్ల, కొలంబసు, మరికొందరు సాహసులైన భూగోళ పరిశోధకులు అట్లాంటిక్ మహాసముద్రం దాటి బహామా దీవులకు, పెనామాకు, దక్షిణ అమెరికాకు చేరుకున్నామనే ఆ నాడు వారు భావించారు. తాను కనుగొన్నవి, పశ్చిమ ఇండియాదీవులుగాని, తూర్పు ఇండియాదీవులు కావని కొలంబస్ జీవితకాలంలో అతనికి తెలియదు. ఆ నాడు వారు కేవలం భ్రమపడ్డారన్నసంగతి 1519-22 సంవత్సరాల మధ్య మాజెల్లాన్ భూప్రదక్షిణ యాత్రలవలనగాని వెల్లడికాలేదు. స్పెయిన్ దేశస్థుడైన ఫెర్డినాండ్ మాజెల్లాన్ దక్షిణఅమెరికా దిగువ అగ్రాన్నిచుట్టి అపారంగా కనిపిస్తూ ఉండిన పసిఫిక్ మహాసముద్రంలో ప్రయాణం చేసిచేసి. చివరకు ఆసియా చేరుకున్నాడు. కాని ఫిలిప్పైన్ దీవులలోని ఆదిమవాసులు మాజెల్లాన్‌ని హత్యచేశారు. ఆయన అనుచ

గులు యాత్రను కొనసాగించి, ఆఫ్రికాఖండంచుట్టూ తిరిగిపోయి మరల స్పెయిన్ దేశానికి చేరుకున్నారు. ఈ యాత్రవలన భూమి గుండ్రంగా ఉన్నదన్న సిద్ధాంతం ప్రత్యక్షంగా ధ్రువపడడమే కాకుండా భూగోళం పైన భూగోళశాస్త్రవేత్తల ఊహలను మించినవింతలు చాలా వున్నవని వెల్లడి అయింది.

అమెరికా ఖండమనే పేరు "అమెరీగో వెస్పూచ్చి" అనే ఇటలీ దేశస్థుని పేరునుండి సంక్రమించింది. ఇతడు 1501 లో బ్రెజిల్ తీరాన్ని కనిపెట్టాడు. ఆయన స్వదేశానికి తిరిగి వెళ్ళిన తరువాత, తాను చూచిన విశేషాలనుగురించి విపులంగా, విస్తృతంగా వ్రాసి ప్రకటించడంవలన, కొలంబస్ కన్న ఇతనికి ఎక్కువ ప్రఖ్యాతివచ్చింది. ఈ నూతన ప్రపంచానికి ఏదోఒక పేరు నిర్ధారణచేయవలసి వచ్చినప్పుడు, నాటి దేశపట చిత్రకారులు వెస్పూచ్చి పేరే ఆ ఖండానికి పెట్టాలని నిశ్చయించారు. కొలంబస్ సాధించిన విజయాలు ఇంతకన్న ఎంత ఘనమైనవో పరిశీలిస్తే, చరిత్రలోని విచిత్ర విరోధాభాస (Irony) లలో ఈ సంఘటన ఒకటి అనే సంగతి బోధపడుతుంది.

అమెరికా ఖండాన్ని జయించడంలో ఆలో స్పెయిన్ తక్కిన దేశాలన్నింటికన్న ముందంజవేసింది. హెర్నాండో కార్టెజ్ 1521లో తగిన సాయుధసైన్యంతో వెళ్ళి, బాగా నాగరకమైన అజ్టెక్లను తరిమివేసి, ఆదేశాన్ని స్పెయిన్ దేశపు వలసరాజ్యం చేశాడు. ఫ్రాన్సిస్కో పిజారో 1533 లో పెరూలోని ఇన్కా సామ్రాజ్యాన్ని కొల్లగొట్టి తెచ్చిన అపారమైన ధనరాసులతో (వెండి బంగారాలతో) స్పెయిన్ చక్రవర్తి ధనాగారాలన్నీ నింపివేశాడు.

స్పెయిన్ దేశస్థులు, అమెరికాలోని అత్యుష్ణమండలాలలోగల దట్టమైన అడవులలోకి చొచ్చుకొని పోయినకొలది, క్రమంగావారిలో కొందరు నేడు అమెరికా సంయుక్త రాష్ట్రాలని పిలువబడుతూన్న ప్రదేశంలోకూడా ప్రవేశించారు. పాన్స్ డాలీయాన్ అనే స్పానిష్ పరిశోధకుడు రెడ్ ఇండియనులు చెప్పుచుండిన "శాశ్వత యౌవనం కలిగించే నీటి బుగ్గ" ను అన్వేషించడంకోసం బయలుదేరి, 1521 లో ఫ్లోరిడా ద్వీపకల్పంలో దిగి, టాంపావద్ద ఒక వలసను స్థాపించడానికి ప్రయత్నించి, విఫలుడయాడు. కాచేతాడావాకా ప్రయాణిస్తూన్న

నౌక మెక్సికో సింధుశాఖలో భగ్నమైపోగా అతడెలాగో ప్రాణాలు దక్కించుకొని టెక్సాస్ గుండా పోయి పోయి కాలిఫోర్నియా చేరు చేరుకున్నాడు. ఎర్ర ఇండియనులు దేముడు, దేముడంటూ అతని వెంట బడ్డారు. ఈ స్పెయిన్ దేశపు వీరులు స్ఫురద్రూపులు. చేతులులేని కేపు అంగీలతో అందమైన కవచాలతో బుజాలనుండి వ్రేలాడే తుపాకులతో, గుర్రాలతో, ఇతర పెంపుడు జంతువులతో హుందాగా, నవీన ప్రపంచమైన అమెరికాలో అంతకుపూర్వం ఎన్నడూ కనివిని ఎరుగని దర్జాతో వారు అడవులవెంట సాగిపోతూ ఉంటే, చూచేవారికి కనుల విందుగా ఉండేది.

ఉత్తర అమెరికా నడిగడ్డను దూసుకొని ప్రవహించే మిసిసిపీ మహానదిని 1541 లో హెర్నాండో డాసోటో కనుగొన్నాడు. కాని, పాపం. ఇతడు ఆ అన్వేషణయాత్రలోనే విషజ్వరం తగిలి చనిపోయాడు. ఆవార్త శత్రువులైన ఎర్ర ఇండియనులకు తెలియకుండా ఉండడం కోసం ఆయన కళేబరాన్ని రహస్యంగా మిసిసిపీ నదిలోకి నెట్టివేశారు. సాహస పరిశోధకుడు కోరోనాడో ఇప్పుడు కాన్సాస్ అని వ్యవహరింపబడుతూన్న ప్రాంతంలో బంగారపు గనులకోసం అన్వేషించి విఫలుడయాడు.

భవిష్యత్తులో అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ఒకటి కావలసి ఉన్న తొలివలస 1565 లో ఫ్లారిడాలో సెయింట్ అగస్టీన్‌వద్ద స్థాపించబడింది. ఎర్ర ఇండియన్ దాడిదారులనుండి, విదేశములనుండి వలసవచ్చిన ఇతరులనుండి కాపుదలకోసం స్పెయిన్ దేశస్థులు ఆగ్రామం చుట్టూ గొప్ప కోటలు కట్టారు.

అప్పటికే ఫ్రాన్సు, ఇంగ్లండ్, హాలెండు, స్వీడెన్, పోర్చుగల్ దేశాలకు ఈ నూతన ప్రపంచాన్ని గూర్చిన ఆసక్తి ఎక్కువవుతూంది. ఈ దేశస్థులు తమతమ నౌకలలో అమెరికా ఆవాసుల తీరాలవెంట తిరుగుతూ, వీలైన నౌకాశ్రయాలలో ప్రవేశిస్తూ, నదులవెంట ఎగువకు భూభాగానికి చొరబడిపోతూ, తాము చూచిన వింతవింత ప్రదేశాలను గూర్చిన వర్ణనలు, పటాలు తయారుచేస్తున్నారు. ఒక ఆంగ్లనౌకకు అధిపతిగావచ్చిన జాన్ కాబట్ అనే ఇటలీదేశపు నావికుడు అట్లాంటిక్ సముద్రాన్ని దాటి ఉత్తరంగాపోయి, 1497 లో లేబ్రడార్, న్యూ

ఫౌండ్‌లాండ్ ప్రాంతాలను శ్రద్ధగా పరిశీలించాడు. ఉత్తర అమెరికా
ఖండంమీద తమకు ఎక్కువ హక్కు ఉన్నదని ఆంగ్లేయులు వాదించ
డానికి నాటి ఈ జాన్ కాబట్ పరిశీలనే కారణం. ఫ్రాన్సు దేశీయుల
యాజమాన్యాన వెరజానో 1524 లో కరోలినాలు మొదలు న్యూ
ఫౌండ్‌లాండ్ వరకు ఉన్న ఉత్తరఅట్లాంటిక్ తీరాన్నంతా పరిశీలిం
చాడు. జాక్విస్ కార్టియర్ అనే మరొక ఫ్రాన్సు దేశీయుడు 1535 లో
సెయింట్ లారెన్స్ నదీ ముఖద్వారంగుండా ఎగువకుపోయి నేటి
కెనడాలోని మాంట్రియల్ ప్రాంతాన్ని పరిశీలించాడు.

ఈలోగా ఈ నూతన ప్రపంచంలోని సామ్రాజ్యాల రూపురేఖ
లను నిర్ధారణచేయగల ముఖ్యసన్నివేశాలు ఐరోపాలో జరుగుతున్నవి.
స్పెయిన్ దేశస్థులు ఎప్పటికప్పుడు తమ బృహన్నౌకలనిండా కరిబియన్
సముద్ర తీరంనుంచి వెండి బంగారాలను నింపుకొని తెచ్చుకుంటూ
ఉండటంతో ఇంగ్లీ వారికి కన్నుకుట్టింది. దానితో స్పెయిన్ దేశంపైన,
ప్రజలపైన ఇంగ్లండుకి అసూయ, క్రమంగా ద్వేషభావముకూడా ఏర్ప
డింది దీనికితోడు మత సంస్కరణకాలంలో ఇంగ్లండు ప్రొటెస్టెంటు
దేశం అవడం, స్పెయిను ప్రబల కాథలిక్ దేశం అవడంతో - వారి
అసూయ విద్వేషాలు వైరభావంగాకూడా పరిణమించాయి.

పదహారవ శతాబ్ది ద్వితీయార్ధంలో, ఎలిజబెత్ రాణి కాలంలో
ఆంగ్లసముద్రపు దొంగలు స్పెయిన్ దేశపునౌకలను విచ్చలవిడిగా దోచు
కొనేవారు హాకిన్స్, కావెండిష్, గుండెలు దీసిన నావికుడు సర్
ఫ్రాన్సిస్ డ్రేక్ మున్నగు సాహసులు సముద్రమంతటా గస్తీ తిరు
గుతూ స్పెయిన్ దేశపు నౌక ఎక్కడ కనిపించినావెళ్ళి కొల్లగొట్టి,
అందులోని వెండి, బంగారాలను స్వదేశానికి చేరవేసేవారు. వాళ్ళు
ఆ దోపిడిదారులు, ఓడదొంగలు అయినప్పటికి వారికి ఈ దుండగాలు
చేయడంలో ఎలిజబెత్ రాణి ఆశ్రయం, ప్రోత్సాహంకూడా ఉండేవి.

స్పెయిన్ దేశపురాజు ఫిలిప్‌కి, ధనరాసులు తెచ్చిపోస్తూన్న తన
వాణిజ్యానికి అపారనష్టం కలిగించే ఈ గాడులవల్ల అమితమైన ఆగ్రహం
కలిగింది. ఈ దుర్గంతాలను పూర్తిగా శాశ్వతంగా అరికట్టివేయడానికి
గాను ఇంగ్లండును జయించడానికి నిశ్చయించి 1588 లో బ్రహ్మాండ
మైన నౌకాదళం "స్పానిష్‌ఆర్మడా" ను దండయాత్రకు పంపాడు.

భారీనౌకలతో కూడిన ఈ బ్రహ్మాండమైన నౌకాదళం ఇంగ్లీ ఛానెల్‌లో ప్రవేశించగానే జిత్తులమారి ఆంగ్లనావికులు అతివేగంగా పయనించగల తమ చిన్న ఓడలలో పోయి ఈ నౌకాదళాన్ని ఛిన్నాభిన్నం చేశారు. ఇంకా మిగిలిన నౌకలు, ఆ వెనువెంటనే సంప్రాప్తమైన గొప్ప తుపానులో దెబ్బతిన్నవి. ఈ ఓటమితో స్పెయిన్ దేశపు నౌకాబలాధిక్యం దెబ్బతినిపోయింది. ఆపైన స్పెయిన్‌దేశం ఉత్తర అమెరికా తీరంపై ఆధిపత్యంకోసం ఇంగ్లాండుతో పోటీ చేయలేకపోయింది; అప్పుడప్పుడే ఆ నూతన ప్రపంచంలో వలసలు నెలకొల్పబడుతున్నవి,

ఇంగ్లండు 1578 లో వలస సామ్రాజ్యస్థాపనకు ప్రబలయత్నం చేసింది "క్రైస్తవ ప్రపంచంలోని రాజులెవరూ అప్పటికి స్వాధీనం చేసుకొని ఉండని (అమెరికాలోని క్రైస్తవేతర ప్రాంతాలను స్వాధీనంచేసుకొని అక్కడ జీవించడానికి" ఎలిజబెత్‌రాణి హంఫ్రీ గిల్బర్ట్ అనే వీరుడికి పట్టా, ఫర్మానా మంజూరుచేసింది. గిల్బర్ట్ న్యూఫౌండ్‌లాండ్‌పై దండయాత్ర సాగించాడు. కాని చలి, తుపానువల్ల ఆ దాడి విఫలమయింది. తిరిగి వచ్చేటప్పుడు సముద్రంమీద తిరుగు ప్రయాణం చేస్తూనే అతడు మరణించాడు. తరువాతి ఐదుసంవత్సరాలకు, ఎలిజబెత్ రాణి ఉత్తరాన సెయింట్ లారెన్స్‌నదికీ, దక్షిణాన ఫ్లారిడాకూ మధ్యనున్న ప్రదేశమంతా ఆంగ్లేయుల వలస అని ప్రకటించి దానికి వర్జీనియా, అని నామకరణం చేసింది. నూతన ప్రపంచంలోని ఉత్తరఅట్లాంటిక్ తీరమంతా ఈప్రాంతంలోనే చేరివుంది. ఆప్రాంతంలో ఎక్కడో ఒకచోట వలసఏర్పాటు చేయడానికి గాను ఆమె తన సభాసదులలో తనకిష్టుడైన "సర్‌వాల్టర్‌రాలీ" ని నియమించింది.

ఉత్తర కెరోలినా తీరానికి సమీపంలోవున్న రావనోక్ దీవిపైన 1585, 1587 ల మధ్య చాలా దాడులుచేయబడినవి. అచటి ఎర్ర ఇండియనుల వైరుధ్యంవల్లను, అచటి జీవనపరిస్థితులు దుస్సహంగావుండడం వల్లను మొదటిదాడి విఫలమైపోయింది. అవసరమైన పదార్థాలు సరఫరా కాకపోవడం మరొక పెద్దలోపం అయింది. చివరిదాడి కేవలం విచిత్రంగా, విషాదకరంగా అంతమయింది. వలసవెళ్ళిన వారందరు అమెరికా గడ్డమీద పుట్టిన మొట్టమొదటి ఆంగ్లశిశువు వర్జినియా డేర్‌తోసహా, అసలు ఏమైనది జాడకూడా లేకుండా మాయమైపోయారు.

కాని, ఇట్టి విపత్తులవలన ఆంగ్లేయులు నిరుత్సాహపడి వెనుకంజ వేయలేదు. ఎలిజబెత్ రాణి ఆగ్రహం, స్పానిష్ ఆర్మెడాపై విజయం వారికి అత్యంత ప్రోత్సాహ హేతువులైనవి. ఇంగ్లండులో జరుగుతూన్న వివిధ సాంఘిక పరిణామాలు ఈవుత్సాహానికి చిహ్నాలు; ప్రొటెస్టెంట్లు, ప్యూరిటన్లు మొదలైన నూతన మత శాఖలు రూపొందడం, వ్యక్తులు ప్రభుత్వామోద ముద్రగల మతశాఖనుకూడా కాదని, తామొక ప్రత్యేక ఆరాధనావిధానాన్ని ఏర్పరచుకొనడం ఇట్టి వుత్సాహానికి ఉదాహరణలుగా చెప్పవచ్చు. తమ జీవనానికిగాక, విదేశాలలో కొద్ది పెట్టుబడులు పెట్టడానికి కూడా తగినంత సంపాదించుకొన్న మధ్య తరగతి వ్యాపారస్థుల వర్గమొకటి క్రొత్తగా ఏర్పడడంకూడా మరొక నిదర్శనంగా పేర్కొనవచ్చు.

అమెరికాలో వలసలను స్థాపించడానికిగాను, ఆంగ్లేయ వ్యాపారస్థులు క్రమంగా కొన్ని కంపెనీలను స్థాపించారు. దేశం తీవ్రమైన ఆర్థికపరిణామాలకు లోనౌతూ వుండడంవల్లనూ, పనిలేని ప్రజల సంఖ్య హెచ్చుగావుండడంవల్లనూ వలసవెళ్ళడానికి యిష్టపడేవారిని సమకూర్చడం ఏమంత కష్టమైన పనిగాలేదు. ప్రాచీనభూస్వామ్య విధానం విచ్ఛిన్నమై పోవడంతో పూర్వపురైతులు చాలామంది నిర్వ్యాపారులై పోయారు. అట్టివారికి నూతన ప్రపంచంలో అద్భుతావకాశాలు కనిపించినవి. ప్రభుత్వామోదముద్రగల (క్రైస్తవ) మతాధిపులతో భిన్నాభిప్రాయాలు యేర్పడినవారికి, ఉత్తర అమెరికా ఖండం, ఆరాధనాస్వేచ్ఛగల సువర్లోకంగా కనిపించింది.

స్పష్టంగా నిర్వచించిన కొన్ని ప్రాంతాల్లో వలసలను స్థాపించి లాభంకొరకు వ్యాపారం చేయడానికిగాను, 1606లో మొదటి జేమ్సు చక్రవర్తి లండన్, ప్లిమత్ కంపెనీలకు పట్టాలు యిచ్చాడు. ఈ ఒడంబడిక ప్రకారం లండన్ కంపెనీ అట్లాంటిక్ తీరంలో 34°-41° అక్షాంశ రేఖలమధ్య, ప్రస్తుతం న్యూయార్కు నగరంవున్న ప్రదేశం లగాయితు దక్షిణాన ఫియర్ అగ్రం. దక్షిణ కేరోలినాలవరకుగల ప్రాంతంలో తన వలసలను స్థాపించుకోవాలి. అలాగే 38°-45° అక్షాంశాలకు మధ్య, ఎగువ న్యూఇంగ్లండ్, న్యూయార్కు రాష్ట్రాల లగాయితు దక్షిణాన పొటోమెక్ నదివరకుగల ప్రాంతంలో ఒక వల

సను స్థాపించుకొనడానికి. ప్లిమత్ కంపెనీకి అధికారమీయబడింది. 38°-41° అక్షాంశాలకు మధ్య వుభయులకు పట్టా యివ్వబడిన భూమి విషయంలో ఆ కంపెనీలు రెండూ పరస్పరం సంప్రదించుకొని ఒప్పందం చేసుకోవాలి. ఈ రెండుకంపెనీలు స్థాపించేవలసలకు కనీసం వందమైళ్ళు దూరంవుండాలి. సరిహద్దు తగాదాలు రాకుండా వాదించడానికిగాను ఈషరతు పెట్టబడింది.

కాబట్ కనుగొన్న ప్రాంతాలుతప్ప మిగిలిన ఉత్తర అమెరికా ఖండమంతా తమ దేనంటూ స్పెయిన్ దేశస్థులు అభ్యంతరాలు తెలిపినా లెక్క చేయకుండా లండన్ కంపెనీ 1607 లో వర్జీనియాలోని చెసాపీక్ అఖాతంవద్దకు మూడు చిన్న నౌకలను తరలించింది. కాప్టెన్ క్రిస్టఫర్ న్యూపోర్ట్ యీ నౌకలకు ఆధిపత్యం వహించాడు. సుమారు నూట యిరవైమంది వలసదారులు యీ నౌకలలోవచ్చి జేమ్సునదివెంట ఎగువకుపోయి ఒక చిన్నద్వీపకల్పంలో దిగారు. తమచక్రవర్తి పేరు మీదుగా జేమ్స్‌టౌన్ అని యీ ద్వీపకల్పానికి వారు మతాచార విధుల సహితంగా నామకరణం చేశారు. మే నెలలో ఆరోజున చరిత్రలో ఒక నూతన ఘట్టానికి అంకురార్పణ జరిగింది; ఇదే అమెరికా సంయుక్త రాష్ట్రాలలో సుస్థిరంగా నెలకొల్పబడిన ప్రప్రథమ ఆంగ్ల అధినివేశం, లేక వలస.

ఈ చిన్నవలస ఆదినుంచీ అనేక కష్టాలను ఎదుర్కొనవలసి వచ్చింది. చివరికి ఎర్ర ఇండియనులూ, మరొకవంక చుట్టుప్రక్కల బురద నేలల ఫలితమైన భయంకరమైన మలేరియా జ్వరమూ, వారికి ప్రాణాంతకంగా పరిణమించినవి. పైగా, యీ తొలి వలసదారులు బంగారుగనులు కనిపెట్టాలని, నదుల వెంట ఎగువకుపోయి, ఆసియా ఖండానికి త్రోవ కనిపెట్టాలని తంటాలుపడ్డారుగాని అక్కడ స్థిరపడి ఇళ్ళూవాకిళ్ళూకట్టుకుని పంటలు పండించుకొనడానికి శ్రద్ధగా ప్రయత్నించలేదు. ఆరు నెలలలో ఆ వలసలోని వారిలో నూటికి ముప్పాతిక మంది మరణించారు.

ఐశ్వర్యాన్వేషకుడు, భూగోళశాస్త్రవేత్త, రచయిత అయిన కెప్టెన్ జాన్‌స్మిత్ చేసిన యించుమించు మానవాతీతమైన చెప్పదగిన మహాప్రయత్నాలవలన ఆ వలస ఉద్వాసన చెప్పబడకుండా ఎలాగో

నిలబడగలిగింది. స్మిత్ ఎర్ర ఇండియనులను బుజ్జగించి, ...త్రగా వుపవాసాలు చేసుకొనవలసివచ్చిన ఆ వలసదారులకు మొక్కజొన్నలు సఫలగా చేయించాడు. వివేకపూరితమైన ఆయన సలహాలవల్ల బలముడిగిపోయి, కళ్ళలో ప్రాణాలుపెట్టుకుని బ్రతుకుతున్నవారుకూడా ధైర్యం తెచ్చుకుని తామంతా బ్రతకడానికిగాను, మరికొన్ని త్యాగాలుకూడా చేయడానికి సిద్ధపడ్డారు. ఈప్రతిష్ఠలో కొంత జాన్ రోల్ఫ్ కికూడా దక్కవలసి వుంది; - ఈయన పొగాకు పంటకుగల వాణిజ్యావకాశాలను కనిపెట్టాడు. ఈ పంట వారి స్వదేశంలో వెంటనే బాగా ఖర్చయిపోవడం ప్రారంభించడంతో, యీవలసదారుల ఆర్థికస్థితి కొంత చక్కబడింది. రాల్ఫ్, ఎర్ర ఇండియనుల రాజైన పహబాన్ కుమార్తె పోకహాంటాన్ వివాహమాడడంవలన, ఆదివాసులకు, యీ వలసదారులకు మైత్రి ఏర్పడి చాలా సంవత్సరాలవరకూ ప్రశాంతంగా గడచిపోయింది. ఈ వివాహగాథ మానవచరిత్రలో ప్రముఖ శృంగార గాథలలో ఒకటిగా పరిగణింపబడుతున్నది. ఈ ఎర్ర ఇండియను రాజపుత్రి రోల్ఫ్ తో కూడా లండన్ వెళ్ళింది. ఈదంపతులు ఆంగ్లేయరాజభవనంలో విందారగించారు. చివరకు ఆమె స్వదేశంనుండి దూరంగా, ఆ ఆంగ్లరాజధానిలోనే మరణించింది.

క్రమంగా జేమ్స్ టౌనులోని వలసదారులు ఇళ్ళు వాకిళ్ళు, కోటలు నిర్మించుకోనడ మారంభించడంతో వారికి పనిపాటలు చేసేందుకు అంగబలం అవసరమైంది. అందుకోసం 1619లో ఒక ఓడనిండా నీగ్రో బానిసలను తెప్పించుకున్నారు. దానితో అనంతరం కొన్ని శతాబ్దాలకు అమెరికాలో అంతర్యుద్ధానికి కారణమైన ఒక సమస్యకు అంకురార్పణ జరిగింది; నిజానికి నేటివరకు యీ నీగ్రోలసమస్యతో అమెరికనులు తలపట్లు పట్టవలసి వస్తూనేవుంది.

ఈ బానిసలువచ్చిన సంవత్సరంనుంచే జేమ్స్ టౌన్ వలసలో ప్రజాస్వామ్య పరిపాలనకు బీజం నాటబడింది. జేమ్స్ టౌన్ లోని లిటిల్ చర్చిలో గవర్నరును కలుసుకుని, ఆయనకు ప్రజల కష్టసుఖాలను, అవసరాలను నివేదించడానికిగాను ఒక్కొక్క పట్టణం లేక వ్యవసాయకేంద్రం నుండి ఇద్దరు ప్రతినిధుల నొప్పార ఎన్నుకో వలసివదిగా

జేమ్సుచక్రవర్తి ఫర్మానా జారీచేశాడు. ప్రథమసమావేశంలోనే చాలా శాసనాలు చేసినతరువాత 1619 ఆగస్టు 4 వ తేదీన 27 గురు సభ్యులతో కూడిన ఆ పౌరశాసనసభాసమావేశం వాయిదా వేయబడింది. చర్చలలో పట్టుదలలు, కోపాలు ఎక్కువ అవడంవల్లను, ఇంకా ఎక్కువ అయ్యేటట్టు కనిపించడంవల్లను ఆనాడాసభ వాయిదా వేశారు. ఈ విధంగా పరిపాలనా వ్యవహారాలలో ప్రజాప్రతినిధులకు స్థానమిచ్చినందుకు అనంతరం జేమ్సుచక్రవర్తి చాలా విచారించి, ఎలాగైనా యీప్రజాప్రతినిధి సభను అణచి వేయాలని ప్రయత్నించాడు. కాని యీసంకల్పం నెరవేరక పూర్వమే ఆయన మరణించడంవల్ల, ఆ స్వాతంత్ర్యజ్యోతి అవిచ్ఛిన్నంగా వెలుగొందుతూ నిలువగలిగింది.

వర్జీనియాలో 1625 నాటికి వేయిమంది వలసదార్లకుపైగా నివసిస్తూండేవారు. ఇంకా అదనపు సామగ్రులు, మరికొన్ని కొత్త వలసలను స్థాపించడానికి ఇంకా కొందరు వలసదార్లు రావడం మొదలుపెట్టారు. ఈ దురాక్రమణదార్లందరినీ తుడిచి పెట్టడానికిగాను ఎర్రయిండియనులు 1622 లో కట్టకడపటి ప్రయత్నంచేశారు. కాని క్రైస్తవమతం పుచ్చుకున్న ఛానో అనే ఒక ఎర్ర ఇండియను ముందుగా, తగినంత వ్యవధి వుండగానే, యీ వార్తను ఆంగ్లేయ వలసదార్లకు తెలియజేసినందువల్ల సర్వనాశనం తప్పిపోయింది. ఆపైన క్రమంగా ఆదివాసుల ప్రాబల్యం క్షీణించి, వలసదార్ల ప్రభ హెచ్చిపోయింది.

ఆ సమయంలో ఇంకా ఉత్తరాదినకూడా కొన్ని ప్రముఖసంఘటనలు జరిగినవి. ప్లిమత్ కంపెనీ మెయినీ ప్రాంతంలో ఏర్పరచిన వలస భగ్నమైపోయింది. డచ్చివారి నావికుడుగావచ్చిన హెన్రీహడ్సన్ అనే ఆంగ్లేయుడు అది హాలెండ్ దేశానికి చెందిన ప్రాంతమని అభ్యంతర పెట్టాడు. న్యూఇంగ్లండ్ తీరంనుంచి అనేక దేశాల ఓడలు అన్నివైపులా పోతూవుండేవి. వాటిలో కొన్ని చేపలు పట్టుకునే ఓడలు; కొన్ని ఉన్ని వర్తకపు ఓడలు. మరికొన్ని నూతన ప్రాంతాలను పరిశోధించడానికి బయలుదేరినవి. మసాచూసెట్స్ చుట్టూవున్నప్రాంతం చాలా ప్రసిద్ధిలోనికి వచ్చింది.

ఈమసాచూసెట్స్ తీరంలోనే 1620 లో "మేఫ్లవర్" అనే చిన్నఓడలో ఒక వందమంది స్త్రీ పురుషులు వచ్చి చేరారు. "పిలి

గ్రిమ్" - అనగా యాత్రికులు అనే పేరుతో వీరు చరిత్రలో సుప్రసిద్ధులు ఈ "యాత్రికులు" అనేక కష్టనష్టాలను గడచి, ప్రథమ సంవత్సరపు వలసజీవితం పూర్తిచేసినమీదట ఆ అడవినడుమ తమను కాపాడి గట్టెక్కించిన భగవంతుడికి అభివందనలు తెలిపి విందు చేసుకున్న నాటి వుత్సవానికి చిహ్నంగా, ఇప్పటికీ ఏటేట ఒకరోజు "అభివందనదినం" (Thanks giving) అనే పేరుతో అమెరికా జాతీయ పర్వదినంగా, సెలవురోజుగా పరిగణింపబడుతూంది.

ఈ యాత్రికులు మసాచూసెట్స్‌కి రావడం కేవలం దైవికంగా జరిగిన సంఘటన. జేమ్సుటౌన్‌కి చేరుకోవాలని ఆదిలో వారి సంకల్పం, కాని, తుపానులవల్లను, బహుశః వారి అభిప్రాయంలోనే కలిగిన మార్పులవల్లనువారిత్రోవ మరొకదెసకు మారడం, చివరకు వారు నవంబరు నెలలో హిమమయమైన ఒకానొకరోజున కాడ్ అగ్రంవద్ద దిగటం తటస్థించింది. ఆ తీరాన దిగడానికి వారివద్ద ఏవిధమైన అనుమతిపత్రము లేదు. మొదటి ఏర్పాటుప్రకారం, వారు ఇంకా బాగా దక్షిణాన దిగాలి. నిర్భయం, సర్వతంత్ర స్వతంత్రం అయిన ఆ సంఘం స్వపరిపాలనకు తగిన "మేఫ్లవర్ శాసనం" (May flower Compact) అనే పేరుతో ఒక ధర్మశాసనం తయారుచేసుకొని ప్లిమత్ వద్ద ఒక చిన్న గ్రామాన్ని నిర్మించుకున్నది. అంతవరకు వారు చాలా కష్టాలను, నష్టాలను ఎదుర్కొన్నప్పటికీ, వారి అసలుబాధలు అప్పుడే ప్రారంభమైనవి.

ఈ వలసదార్లలో రకరకాలవారు వున్నారు. కొందరు మతవిషయికమై పట్టుదలలకారణంగా పన్నెండేళ్ళక్రితం ఇంగ్లండునుండి హాలెండ్‌కి తరిమివేయబడినవారు. ఇంగ్లండులో ప్రభుత్వాధికారబలంతో నిర్వహింపబడుతూన్న "ప్రొటెస్టెంటు ఎపిస్కోపల్ చర్చి" అనబడే వ్యవస్థలో మార్పుచేయవలసిన పూర్వకాలపు సంప్రదాయ వాసనలు ఇంకా చాలావున్నా యని ఆక్షేపించినందువల్ల వీరికీ ప్రవాసయోగం పట్టింది. ఈ మతవిషయిక భిన్నాభిప్రాయాలలో కూడా చాల మంది విద్వాంసులు, కులీనులు వున్నారు. కేంబ్రిడ్జ్‌లో విద్యాభ్యాసం చేసిన విలియం బ్రూస్టర్, విలియంబ్రాడ్‌ఫర్డ్ మొదలైనవారిని ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు.

హాలెండ్ నుండి నూతన ప్రపంచానికి వలసపోవాలని నిశ్చయించుకున్న యీ వర్గంవారు, తమ వుద్యమానికి తగిన ఆర్థిక సహాయం చేయడానికి ఇంగ్లండులోని కొందరు వర్తకులను ఒప్పించారు. ఈసహాయానికి ఫలితంగా తాము స్థాపించే వలసనుండి ఇంగ్లండుకి ఎగుమతిచేసే పదార్థాలలో చాలాభాగం యీ పెట్టుబడిదారులకే పంపగలమని వారు వాగ్దానంచేశారు. పిమ్మట లండన్ వీధులలో తిరుగుతూ అంతకన్న మంచి జీవనాధారంకోసం నూతన ప్రపంచానికి వలసవెళ్ళడానికి సిద్ధమయిన మరికొందరితో వారు తమ ఓడను నింపుకున్నారు. ఇలా వచ్చిన వారిలో జాన్ ఆల్డెన్ విలక్షణమైనవాడు. ఇతడు తన ప్రయాణపు ఖర్చులు చెల్లింపలేక అందుకు బదులుగా కొన్ని సంవత్సరాలు నౌకరీ చేస్తానని ఖరారునామా వ్రాసి యిచ్చి, యీ నౌకలో వచ్చాడు.

ఈవిధంగా భిన్నభిన్న ప్రకృతులు, ప్రవృత్తులుగల వ్యక్తులందరు ఏకలక్ష్య ప్రేరితులై కలిసికట్టుగా ఎలా బ్రతకగలిగారన్నది ముఖ్యమైన విషయం; వీరి సామర్థ్యమే అమెరికా ప్రజాస్వామ్యానికి మొట్టమొదటి పరవడి. విద్యావిధానంలో జాతి విచక్షణలేకుండా అన్ని తరగతుల పిల్లలకు ఆనాడు వీరే సమానావకాశాలు ఏర్పాటుచేశారు. అడుగడుగున ఎర్ర ఇండియనుల పీడ నెదుర్కొనవలసి వస్తూవుండిన ఆ అడవిలో ఆహారపదార్థాలు చాలా అరుదుగా దొరికేసమయంలో అందరినీ సమానంగా సత్కరించే మృత్యువు ఎల్లప్పుడు వీధులలో వీర విహారంచేస్తూ ఒకరివెంట ఒకరిని కబళిస్తూన్నది. ఆ వలస గుడిసెలలో జన్మనుబట్టికాక, యోగ్యతనుబట్టే గౌరవాగౌరవాలు లభించేవి.

అమెరికా నడిగడ్డపైన వారుగడిపిన తొలిశీతకాలపు చలికి తట్టుకోలేక ఆవలసదారులలో సగంమంది విషజ్వరాలవల్ల మరణించారు. కాని వసంత ఋతువు వచ్చేసరికి వారిపట్ల స్నేహభావంగల ఎర్ర ఇండియనులు కొందరు మొక్కజొన్న ఎలా పండించవలసిందీ, ప్రకృతి ప్రాతికూల్యాన్ని ఎలా ఎదుర్కొనవలసిందీ వారికి బోధించారు. క్రమంగా వెచ్చని ఎండలువచ్చినవి; దారుణ మహాపద గడచిపోయింది.

మసాచూసెట్స్ తీరంలో మొదట ఎలాగో కాలూనిన యీ వలసదారులు క్రమంగా కొన్నిసంవత్సరాలకు బాగాపడి స్థైర్యం చిక్కించుకున్నారు. ఇంగ్లండులో మరల మత సంఘర్షణలు చెలరేగి

వని; లోగడ యీ వలసదారులవలెనే ఇంగ్లండు మతాధికారులతో భిన్నాభిప్రాయులై ప్యూరిటనులు కూడా దేశమునుండే వెడలగొట్టబడ్డారు.

అలాంటివారు, ఉత్తర అట్లాంటిక్ తీరంలో వివిధ ప్రాంతాల్లో వలసలు ఏర్పరచుకొనడానికి అనుమతి సంపాదించి తండోపతండాలుగా రావడం మొదలుపెట్టారు. ఈవిధంగా కొందరు ప్యూరిటన్లను బోస్టను పరిసరప్రాంతాలకు పంపడానికి ఇంగ్లండు చక్రవర్తి ప్రథమ చార్లెస్ మసాచూసెట్సు బే కంపెనీకి అనుమతి ఇచ్చాడు. అక్కడవారు ఆంగ్లేయప్రభుత్వ శాసనాలకు లోబడి స్వపరిపాలన ఏర్పాటుచేసుకో వచ్చునని కూడా ఆయన అనుమతించాడు. 1628 లో వచ్చిన తొలి జట్టుకి జాన్ ఎండికాట్ నాయకుడు. తరువాత రెండువందలమందితో కూడిన మరింత పెద్దజట్టు వచ్చింది. ఈజట్టు నాయకుడైన జాన్ విన్ థ్రప్ అనంతరం గవర్నరు అయ్యాడు.

ఆ తీరంవెంట ఇంకా బాగా దిగువనుకూడా ఇలాగే చాలామంది వలసదారులువచ్చి ఆక్రమించుకున్నారు. ఇంగ్లండులోని ప్రొటెస్టెంటు తమ వాతావరణంలో నానాబాధలు పడుతూన్న కాథలిక్కులు అక్కడనుండి తరలివచ్చి 1634 లో లార్డ్ బాల్టిమోర్ నాయకత్వాన మేరీలాండ్ వలసను ఏర్పాటుచేశారు. విలియంపెన్ నాయకత్వాన క్వేకర్ మతశాఖకు చెందిన కొందరు 1682 లో పెన్సిల్వేనియాలో మరొకవలస ఏర్పాటు చేసుకున్నారు. ఈ కొత్తవలస లన్నింటినుండి వలసదార్లు క్రమంగా పొరుగుప్రాంతాలకు ప్రాకిపోవడం ప్రారంభించారు. ఈవిధంగా 1700 నాటికి అట్లాంటిక్ తీరంలో మసాచూసెట్స్ నుండి కెరోలినావరకు ఒకదానినొకటి అంటిపెట్టుకొని వున్న అనేక ఆంగ్లాధినివేశాలు వెలసినవి.

ఈ లోగా డచ్చివారు హెన్రీహడ్సన్ సూచన ననుసరించి ఇప్పటి న్యూయార్క్ ప్రాంతంలో న్యూ ఆమ్‌స్టర్‌డాం అనే అభ్యుదయకరమైన వలసను నెలకొల్పారు. స్వీడన్ నుండివచ్చిన వలసదారులు న్యూజెర్సీ డిలావేర్ ప్రాంతాలలో కొన్నివలసలు ఏర్పాటుచేసుకున్నారు. కాని ఏ పని చేసినా పట్టుదలగా ఒకపద్ధతి ప్రకారం చేసే ఆంగ్లేయులు క్రమంగా వారిని లొంగదీసుకొని, తమ పదమూడు వలసలు ఒకదాని ప్రక్కన ఒకటిగా ఏకఖండంగా వుండేటట్టు ఏర్పాటుచేసుకున్నారు.

ఫ్రాన్సుకూడా నూతన ప్రపంచంలో తన ప్రయత్నాలు తాను చేసింది. ఛాంప్లేన్ 1608 లో కెనడాలో క్విబెక్ నగరానికి పునాది వేశాడు. ఉత్సాహవంతులైన క్రైస్తవమత ప్రబోధకులు అచటినుంచి మిసిసిపీ నదిగుండా మధ్య పశ్చిమ ప్రాంతానికిపోయి తమ ప్రార్థనలతో ఎర్ర ఇండియనులకు ప్రబోధం కలిగించి ఆవిశాలప్రాంతాలు ఫ్రాన్స్ దేశపు చక్రవర్తికి చెందుతాయని ప్రకటించారు. ఏమైనా ఫ్రెంచి వారిలో వలసదార్లకన్న బోనులొడ్డి, జంతువులనుపట్టేవారు, వ్యాపారస్థులు ఎక్కువ. వలసివచ్చిన ఫ్రెంచివారి సంఖ్య స్వల్పంగావుండేది. అందుచేత వారు కెనడాలోను మిసిసిపీ లోయలోనుస్థాపించిన ఫ్రెంచి సామ్రాజ్యం ఎర్ర ఇండియనులతో ఏర్పరచుకొన్న వాణిజ్యసంబంధాలమీద, వారిపైన సంపాదించిన పలుకుబడిమీద ఆధారపడినదేగాని, బలిష్ఠమైన తెల్లవారి వలసలతో కూడినదికాదు.

పదిహేడవ శతాబ్ది ప్రారంభంలో స్పెయిన్ దేశస్థులు మధ్య దక్షిణఅమెరికాలో దృఢమైన స్థానంకల్పించుకొన్నారు, కాని ఇప్పటి అమెరికా సంయుక్తరాష్ట్ర భూభాగంలో మాత్రం వారి ఆస్తిపాస్తులు చాలా తక్కువ. ఫ్లోరిడా, టెక్సాస్, న్యూమెక్సికోలలోను, కాలిఫోర్నియా తీరంవెంటను స్పెయిన్ దేశస్థుల మతప్రచారక కేంద్రాలు మాత్రం కొన్నివున్నవి. అయినప్పటికి యీ పోటీలలో స్పెయిన్ దేశం తనతో పోటీచేసిన బ్రిటన్ ఫ్రాన్సుదేశాలకన్న ఎంతమాత్రం వెనుకపడలేదు.

ఇప్పటి అమెరికా సంయుక్తరాష్ట్రాల స్వరూపం 17వ శతాబ్దిలో ఎలావుండేదంటే : అందమైన ప్రదేశం; మిసిసిపీనదికి తూర్పున అంతా దట్టమైన అడవి; ఉడతలు ఒకచెట్టుమీదనుంచి మరొక చెట్టుమీదికి దూకుతూ కొన్నివేలమైళ్ళు భూమిమీదికి దిగకుండా ప్రయాణం చేయజాలినంత ఒత్తైన, విస్తృతమైన అరణ్యం. అట్లాంటిక్ తీరంవెంట మాత్రం పీలిక వంటి సన్నని మైదానం వున్నది. ఈమైదానంనుండి భూమి మెల్లగా ఎత్తవుతూ పోగాపోగా చివరకు అపలేచియన్ పర్వతాలు తగుల్తాయి. ఈపర్వతాలకు పశ్చిమానవున్న రాకీపర్వతాలకు మధ్యను వేయిమైళ్ళపై చిలుకు వెడల్పుగల ప్రాంతంలో అడవులు మిసిసిపీనదీతీరపు మైదానాలు వున్నవి. ఈభూమి బాగా సారవంతమైనది,

వలసలు ఏర్పరచుకొనడానికి అత్యంతానుకూలమైనది. పసిఫిక్ తీరంలో రాకీపర్వతాల పొడుగునా వున్నపీలిక మరొక అద్భుతసుందరమైన అరణ్యాలతో దివ్యలోకంవంటి ప్రదేశం. ఎర్ర ఇండియనుల కది అత్యంతప్రియమైనది. వారు అక్కడ చేపలుపట్టుకుంటూ, అడవిజంతువు లను వేటాడుతూ జీవిస్తున్నారు.

ఈ అద్భుతమైన ఖండాన్ని ఎవరు స్వాధీనంచేసుకోవాలి అనే సమస్య పరిష్కరించుకొనడానికి బలాబలాలను పరీక్షించుకొనవలసిన తరుణం వచ్చింది.

---

# ద్వితీయాధ్యాయము

## వలస స్థాపన యుగం

ఆంగ్లవలసలలో, మొదట కొన్ని సంవత్సరాలపాటు జీవితం చాలా మొరటుగా అనేక కష్టనిష్ఠురాలతో కూడినదిగా వుండేది. దాని పర్యవసానాలు ఆ వలసదారులలో స్పష్టంగా కనిపించేవి. న్యూ ఇంగ్లండు ప్రాంతంలో ఇది ఇంకా బాగా కనిపించేది. అచటిభూమి రాతి నేల; అతి శీతల వాతావరణం; అందుచేత వారు వ్యవసాయం చేసు కొని బ్రతకడం దుర్లభమయింది. ఈవిధంగా వారు ప్రకృతిశక్తులతో పోరాడుతూ తాముకూడా మొండిగా, మొరటుగా సమయస్ఫూర్తిగల సాహసులుగా తయారయారు. అమెరికా ప్రజలలో ఇప్పటికీ కొంత వరకు కనిపించే ఆ ప్యూరిటన్ల గంభీరస్వభావం మొదట ఆ రోజులలోనే రూపొందింది.

మసాచూసెట్స్‌లో స్థిరపడిన ప్యూరిటన్లు స్వదేశాలలో తా మెదుర్కొన వలసివచ్చిన మత నిర్బంధాలనుండి విముక్తిపొంది తమ విశ్వాసానుసారం, ఆరాధనాదులు చేసుకొనే స్వేచ్ఛకోసం అమెరి కాకు వలసవచ్చినవారు. కాని వారి నాయకులు అందరికీ మతారాధన స్వాతంత్ర్యాన్ని ప్రసాదించడానికి బదులు అంతా ప్యూరిటన్ల మత

సంప్రదాయాలనే అనుసరించాలని పట్టు పట్టేవాళ్ళు; తమ చర్చిలో కొంతకాలం సభ్యత్వం గలవారికే ప్రభుత్వప్రతినిధుల ఎన్నుకొనడానికి వోటింగ్ హక్కు వుంటుందని 1631 లో జెనరల్ కోర్టు ప్రకటించాడు. ఆ విధంగా ప్రాచీన ప్రపంచంలోని నిరంకుశ విధానాల బాధపడలేక లేచివచ్చిన వారే. నూతన ప్రపంచంలోని తమవలసలలో నిరంకుశులై తమ మత విశ్వాసాలతో ఏకీభవించని వారిని బాధించడం మొదలు పెట్టారు.

మతాధిప అధికారానికి లోబడిన యీ ప్రభుత్వ విధానం మసాచూసెట్స్‌లోని వలసదారులలో కొందరికి ఇష్టంలేదు. ఇలాంటి ప్రభుత్వ వ్యవస్థలలో అన్యమత విశ్వాసాలు గలవారందరినీ ప్రభుత్వం నానాహింసలు పెట్టి నిర్మూలించివేస్తూంది. ప్రభుత్వం తన అధికారాలను అతిక్రమించరాదని ధైర్యంగా అభ్యంతరం చెప్పిన ప్రముఖ వ్యక్తులుకూడా యీవలసను స్థాపించిన తొలిరోజులనుంచీ వున్నారు. ఇలాంటి వ్యక్తులలో మొట్టమొదటివాడు రోజర్ విలియమ్స్. ఇతడొక గొప్పయింటిబిడ్డ; మతాచార్యుడు; కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ పట్టభద్రుడు; మతసహిష్ణుత వుండాలనీ, చర్చి, ప్రభుత్వవ్యవస్థా, వేరు వేరుగా వుండాలనీ ఆయన వాదం

ఆ దేశం ఇంగ్లాండు రాజుదికాక వాస్తవంగా ఎర్ర ఇండియనులది. గనుక వారితో మర్యాదగా వ్యవహరించడం అవసరమనికూడా ఆయన వాదించాడు. ఆవిధంగా ఆయన ప్రభుత్వాగ్రహానికి గురియై 1635 లో కారాగారశిక్ష పొందాడు. కాని తరువాత తప్పించుకొని పోయి తన అనుచరవర్గంతో సహా రోడ్ దీవిలోని ప్రావిడెన్స్‌కి చేరుకొన్నాడు. అక్కడ వారు ఒక వలస ఏర్పరచుకొన్నారు. అయితే ఆ భూమిని వారు బలాత్కారంగా ఆక్రమించుకొనలేదు; ఎర్ర ఇండియనుల వద్దనుండి ఖరీదుకి కొనుక్కున్నారు. ఈ కొత్త వలసలో అందరికీ సంపూర్ణ మతస్వాతంత్ర్యం ఉంటుందనీ; నాస్తికులు క్వేకర్లు, ఐరోపాలో ఆశ్రయంలేని యూదులూ మొదలైన వారెవరైనా సరే వచ్చి స్వేచ్ఛగా ఆ వలసలో స్థిరనివాసాలు ఏర్పరచుకొనవచ్చుననీ, వారందరికీ ప్రభుత్వాన్ని ఎన్నుకొనడంలో సమానావకాశాలు వుంటాయనీ ప్రకటించారు. విలియమ్స్ ఎనభైయేళ్లు నిండినపిదప రోడ్ దీవిలోనే

కాలం చేశాడు. ఆయన ఉదార భావాలను అంగీకరించనివారు కూడా తమకు ఇష్టం కాకపోయినా ఆయన మహాపురుషుడని ప్రశంసించారు.

ఈవిధంగా మతవిషయకమైన అభిప్రాయభేదాల కారణంగా మసాచూసెట్స్ నుండి నిష్క్రమించిన ఇతరులలో ఆన్ హచిన్సన్ సతి ఏ యుగంలోనైనా, ఏ కాలంలోనైనా గొప్పవ్యక్తిగా పరిగణింపదగినది. ఆమె పదునలుగురు బిడ్డలతల్లి. వారంతా ఇంగ్లాండులోనే జన్మించారు. ఆమె తన నలభైయవయేట అమెరికాకు వలసివచ్చి వివేకవతిగా మతనాయకురాలుగా విశేషప్రఖ్యాతి సంపాదించింది. కాని ఆమె స్వతంత్రంగా యోచించగల బుద్ధిమతి అవడంవలన భగవంతునికి, భక్తునికి మధ్యగల సంబంధంలో మతాచార్యులపాత్ర ఆమెకు మనస్కరింపలేదు. ఈ కారణంవలన 1635 లో యీమె మతాచార్యుల ఆగ్రహానికి గురి అయింది. హచిన్సన్ సతి అనుచరులు కొంతమంది న్యూహాంప్‌షైర్‌కి పోయి అక్కడ ఒక క్రొత్తవలస ఏర్పాటు చేసుకున్నారు. ఆమె, ఆమె కుటుంబంలో కొంతమంది పెల్‌హాం (న్యూయార్కు) వెళ్ళి అక్కడ 1643 లో ఎర్ర ఇండియనులచే చిత్రవధ చేయబడ్డారు.

థామస్ హుకర్ నాయకత్వాన తొలి వలసదారులు కొందరు 1636 లో కనెక్టికట్ నదీతీరంవెంట దిగువకు వలసపోయి, అక్కడ 1636లో హార్ట్‌ఫర్డ్ (కనెక్టికట్) మొదలైన అనేక పట్టణాలను నిర్మించుకొన్నారు. ఈవలసదారులు తమ పశువులు, కోళ్ళతో సహా, పెద్దపెద్ద పెట్టె బండ్లమీదను, కాలినడకను బయలుదేరి వెళ్ళారు. అనంతరం రెండువందల యేళ్ళకు వీరి వంశస్థులు తిరిగి సరిగా ఇలాగే పశ్చిమంగా పసిఫిక్ తీరానికి తరలిపోయారు. హూకర్, ఆయన అనుచరులు తమ వలసలలో తమతమ విశ్వాసాలతో భిన్నమైన అభిప్రాయాలు గలవారికికూడా వోటింగ్ హక్కు కలిగించారు. ప్రజలందరికీ స్వపరిపాలనాధికారం ఉన్నదని ప్రకటించారు. ఆ ప్రకటన పత్రంలో ఇంగ్లండు చక్రవర్తి అధికారాల ప్రసక్తికూడా లేదు. తక్కిన వలసలతో మతసంబంధమైన ఇంత తీవ్రసంఘర్షణ ఏదీ జరుగలేదు. మేరిలాండ్ వలసలోకి చుట్టుప్రక్కల వలసలనుండి ప్రొటెస్టెంట్లు చాలామంది వచ్చిపడి మొదట ఆవలసను స్థాపించిన కాథలిక్కుల కన్న వీరే

అధిక సంఖ్యాకులైపోయారు. వీరు శాఖకీయులను అణచివేయడం తప్ప దన్నట్లు కనిపించింది. కాని వారి శాసనసభలో 1649 లో క్రైస్తవు లందరికీ మతస్వాతంత్ర్యాన్ని ప్రసాదించే బుద్ధిమంతులంతా కలిసి యోచించి మతసహన శాసనం చేసి, ఆ ప్రమాదాన్ని వారించారు.

ఈ వలసదారులకు గృహనిర్మాణంలోను, వ్యవసాయపు పనుల లోను సాయపడగల అంగబలం అవసరమయింది. అందువల్ల అక్కడ వ్యక్తుల విశ్వాసాలకన్న హస్తాలతో చేయగలపనికివిలువ హెచ్చింది. పరాతన వాదులతో కూడిన వర్జీనియాకు ఎలాంటివాళ్ళు కావాలి? - కాథలిక్కు లా? లూథరన్ చర్చికి చెందినవారా? - అంటే తమశక్తియుక్తుల చేత అనటి పరిస్థితులను చక్కబరచడానికి తోడ్పడగలవారు ఎవరైనా ఫరవాలేదు. అనే స్థితికి వచ్చింది. ఈ విధంగా మెయిన్‌నుండి దిగువకు కరోలినాలవరకు, జార్జియావలసలోను మత విశ్వాసాలను గురించిన పట్టుదలలు క్రమంగా సడలిపోయినవి పరలోక విషయాలతో కనీసం సమానమైన ప్రాముఖ్యమైనా ఇహలోకవిషయాలకు ఉన్నదనే అభిప్రాయం చాలామందికి కలిగింది.

అడపాదడపా అక్కడక్కడ మత సంబంధమైన హింసలు జరుగుతున్నప్పటికీ మొత్తంమీద అమెరికా కాందిశీకులకు తగిన ఆశ్రయమనే అభిప్రాయం ప్రాచీన ప్రపంచమందంతట వ్యాపించింది. బహుశః చరిత్రలో ఎన్నడు ఎరుగనంతటి దారుణ సంక్షోభాన్ని ఐరోపా ఎదుర్కొంటున్నది. యుద్ధాలు ఇంచుమించు నిరంతర వ్యవహారంగా పరిణమించినవి. శరీర సౌష్టవంగల పురుషులందరు 1618 – 1697 ల నడుమ ఐరోపాను నాశనంచేసిన ముప్ఫై సంవత్సరాల యుద్ధం, డివల్యూషన్ యుద్ధం, పాలటినేట్ యుద్ధాలలో పోరాడడానికి బలవంతాన వెళ్ళవలసి వచ్చింది. కాథలిక్ దేశాలు తమ పొరుగు ప్రొటెస్టెంటు దేశాలతో పోరాడేవి. ప్రొటెస్టెంటు దేశాలు తమలో తాము పోరాడుకొనేవి.

అమెరికా వలసల తొలి నూరేళ్ళచరిత్రలో ఐరోపాలోని అనేక జాతులకు, మతవర్గాలకు చెందిన ప్రజలు వేనకువేలుగా వలసరావడానికి హేతువులేమిటో తెలుసుకోవాలంటే ఐరోపాలో నాడు జరుగుచుండిన యీ సంఘటనలు మనకు కీలకాలుగా ఉపకరింపగలవు. నూతన

వలసదారుల కాపాడి పర్యవసానం అయింది. ఇంగ్లండు రాజు రెండవ జేమ్స్‌ని ప్రజలు పదవీచ్యుతుణ్ణి చేశారని అవార్త. వెంటనే మసాచూసెట్స్ వలసదారులు కూడా నడుములు బిగించారు. తమను నానా బాధలు పెట్టిన అండ్రాస్‌ను పట్టుకొని బంధించి, నూతన చక్రవర్తిచే విచారింపబడి, తగినశిక్ష పొందడానికి గాను అతణ్ణి ఖైదీగా ఇంగ్లండు పంపారు. న్యూయార్కులో స్వాతంత్ర్యప్రియులైన పౌరులు అండ్రాస్ సహోద్యోగి అయిన ఫ్రాన్సిస్ నికల్సన్‌ను అచటి నుండి బహిష్కరించి, జర్మనీ దేశస్థుడైన జాకోబ్ లీస్లర్ అనే నాయకుని ఆధిపత్యాన రెండు సంవత్సరాల కాలం సుఖంగా కాలక్షేపం చేశారు.

వర్జీనియాలోని వలసదారులు కూడా, ఆంగ్ల చక్రవర్తి నియోగించిన సర్ విలియమ్ బర్క్లీ అనే గవర్నరు పరిపాలనలో నానా కష్టాలు పడ్డారు. ఈ గవర్నరుకి ఈ వలసదారుల క్షేమంకన్న ఎర్రఇండియనులతో జరిపే ఉన్ని వ్యాపారం ముఖ్యం; అందువల్ల 1765లో సస్క్వహాన్నాక్ అనే అమెరికా ఆదిమజాతివారు సరిహద్దుల వలసదార్లను నానాహింసలు పెడుతూ ఉన్నా, వారిపైకి సైన్యాన్ని పంపడానికి ఇతడు నిరాకరించాడు. ఈ బాధలు భరించలేక నథేనియల్ బేకన్ అనే వ్యవసాయదారుడు ఒక వలంటీర్ల జట్టును తయారుచేసి ఆ దాడిదార్లను చితుకగొట్టేసరికి గవర్నరు బర్క్లీ అతడు తిరుగుబాటుదారుడని, అతణ్ణి పట్టి ఇచ్చిన వారికి బహుమానం ఇవ్వబడుతుందని ప్రకటించాడు. తత్పర్యవసానంగా చెలరేగిన అంతర్యుద్ధంలో బేకన్ అనుచరులు గవర్నరునీ, ఆతని సల్పై ఇద్దరు మంది సిబ్బందినీ చావ చితుకగొట్టారు. కాని, తీరా తనకు విజయం లభిస్తూన్న సమయంలోనే బేకన్ విషజ్వరంవల్ల మరణించాడు. పిమ్మట నాయకుడు లేని అతని అనుచరులను బర్క్లీ అణిచివేశాడు. ఈ సంఘర్షణల్లో జరిగిన రక్తపాతాన్ని చూచి ఆంగ్ల ప్రభుత్వం బర్క్లీని వెంటనే ఇంటికి వచ్చేయవలసినదిగా అవమానకరంగా ఉత్తరువు పంపింది.

పిమ్మట ఈ వలసదారులు మాతృదేశ ప్రభుత్వంమీద మరల బహిరంగంగా తిరుగుబాటు చేయగలగడానికి ఆపైన వందయేళ్ళు పట్టింది. వలసదార్లలో అధిక సంఖ్యాకులకు ఇంకా ఇంగ్లండుపట్ల భక్తి ప్రపత్తులు ఉన్నవి. శక్తి ఉన్నవాళ్ళు తమ బిడ్డలను చదువులకోసం ఆక్స్

ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలకు పంపుతున్నారు. తాము కూడా అడపాతడపా మాతృదేశానికి వెళ్ళి వస్తున్నారు.

అమెరికాలో ఐశ్వర్యం అపారంగా వృద్ధి అవుతూంది ఇందులో ముఖ్యమైనది వ్యవసాయసంపద. పొగాకు వరిపంటలవల్ల దక్షిణ ప్రాంతపు రైతులు అడవి నరికి వ్యవసాయం ప్రారంభించిన తర్వాత ఒకటి రెండు తరాలలోనే బాగా సంపన్నులయారు. దక్షిణాదిని, కొంతవరకు మధ్యవలసలలో ఉన్న సువిశాల ప్రాంతాలు పెద్దపెద్ద వ్యవసాయ కేంద్రాలకు, తోటలు వేయడానికి అనుకూలంగా ఉన్నవి. న్యూయింగ్లండుమాత్రం దీనికి భిన్నంగా ఉంది. అచటి సన్నని ఇరుకైన లోయలు, రాతినేలలు విస్తృతంగా వ్యవసాయం చేయడానికి అనుకూలమైనవి కావు.

కాని, న్యూఇంగ్లండు వలసదారులు ప్రతిభావంతులు. తాము వ్యవసాయంవల్ల సంపన్నులు కాలేకపోతే వారు ఇతర మార్గాలు తొక్కారు. తమ చుట్టూ కావలసినంత కలప దొరుకుతూండడంవల్ల వారు దానిని వరికి ఓడలు చేయడం, కలపగానే ఇతరదేశాలకు ఎగుమతిచేయడం మొదలుపెట్టారు. ఇంతేకాదు, ఆతీరంలో చేపలు పుష్కలంగా ఉన్నవి. భూమి మీద ఎర్ర ఇండియనులు చిన్నచిన్న నగలకు, రమ్‌సారాయి సీసాలకుమారుగా విలువైన ఉన్ని మారకం ఇచ్చేవారు. వీటితో వారు మంచి లాభసాటి వ్యాపారం సాగించారు.

ఈవలసలలో సహజ సంపద అపారంగా ఉన్నదని ఆదినుండి తెలియడం వల్లనే ఆంగ్ల ప్రభుత్వం వాటిని పూర్తిగా చక్రవర్తి ఆధిపత్యం క్రిందకు తీసుకొని వాటివల్ల, సాధ్యమైనంత లాభం తీయడానికి ప్రయత్నించింది.

ఇంకా బాగా వృద్ధికాని క్రొత్తవలసల్లోనివారు తమకు అవసరమైన పారిశ్రామిక వస్తువులన్నింటినీ తమ మాతృదేశంనుంచి తెప్పించుకొని, వాటికి బదులుగా ఇక్కడినుంచి పొగాకు, కలపపలకలు, తోళ్ళు మొదలైన ముడివస్తువులు ఎగుమతి చేసేవారు. "వ్యాపార సరళి" (Mercantile System) అని పిలువబడుచుండిన ఈ వర్తకం సామాన్యంగా మాతృదేశానికే ఎక్కువ లాభదాయకంగా ఉండేది. నిజానికి ఈలాభం కోసమే ఆయాదేశాలు అమెరికాలో అసలీ వలసలు

ఏర్పాటు చేసింది. అయితే, వలసదారులు తమ ఉత్పత్తులకు సాధ్యమైనంత ఎక్కువ ధర రాబట్టుకొని, మాతృదేశాలలోని వర్తకులు పంపే పారిశ్రామికోత్పత్తులకు వారు కోరిన ధరలు ఇచ్చేవారు. ఈ వలసలు మాతృదేశంతోనే వర్తకం చేయాలనీ ఇతర దేశాలతో వ్యాపారం చేయడంగాని, తమ వస్తువులు తామే తయారు చేసుకొనడంగాని, కూడదని కట్టడి చేయడం కోసం బ్రిటనులో శాసనాలు చేయబడినవి.

కాని ఆంగ్లవలసలు కొంచెం బలపడి, తమ కాళ్ళపైన నిలబడగలిగే స్థితి ఏర్పడడం మొదలవగానే నూతన ప్రపంచంలోని ఎగుమతి దిగుమతి వర్తకులు తమపై మాతృదేశ ప్రభుత్వం విధిస్తూన్న నిర్బంధాలను ఏవగించుకొనడం మొదలు పెట్టారు. ముఖ్యంగా 1660-63 లో రెండవ ఛార్లెసు ప్రభుత్వం చేసిన నౌకా నియమశాసనాలు న్యూ ఇంగ్లండు వలస వర్తకులకు మరింత బాధ కలిగించినవి. అందువల్ల వారు న్యూ ఇంగ్లండులోనే స్వతంత్రంగా పరిశ్రమలను నెలకొల్పుకొని మాతృదేశపు పారిశ్రామిక వస్తువుల అగత్యం తమకు లేకుండా చేసుకొనడానికి తీర్మానించుకొన్నారు. వలసదారుల అదృష్టవశాత్తు ఆశాసనాలు గట్టిగా అమలు జరుపబడలేదు. అందువల్ల ఈ వలస వర్తకులు ఫ్రాన్సుతోను, స్పెయిన్ దేశానికి చెందిన పశ్చిమ ఇండియాదీవులతోను రహస్యంగా వర్తకం చేయడం ప్రారంభించారు.

పద్ధెనిమిదో శతాబ్ది మధ్యకాలానికి ఈ వలసల జనాభా దాదాపు ఐదు లక్షల వరకు పెరిగింది. న్యూయార్కు, న్యూజెర్సీలలో ఫ్రాన్సు దేశస్థులు, వివిధ ప్రాంతాలలో చెదురుగా ఫ్రాన్సు దేశపు హ్యూగనాట్ (ప్రొటెస్టెంటు) లు, పెన్సిల్వేనియాలో జర్మనులు చాలామంది ఉన్నా మొత్తంమీద ఆంగ్లేయులదే పైచేయిగా ఉంది. స్కాట్లండ్ ఐర్లెండు వాసులు కూడా చాలామంది వచ్చారు. వీరు పెన్సిల్వేనియా నుండి షెనండోవా లోయగుండా దక్షిణానికి వ్యాపించి వర్జీనియా, కరోలినాల పొలిమేరలలో వలసలు ఏర్పరచుకున్నారు.

ఈ స్వాతంత్రులకు తోడు దక్షిణాఫ్రికానుండి తీసుకువచ్చిన చాలామంది నీగ్రో బానిసలు కూడా ఉన్నారు. పాపమీ దురదృష్టవంతులైన ఆఫ్రికనులను ఆఫ్రికాలోని వారి గ్రామాలలో మృగాలలాగ పట్టుకొని, నిరంతరం దుర్గంధభూయిష్టమైన, అంధకారపూరితమైన,

బానిస నౌకలలో పశువులవలె బంధించి ఇక్కడికి తీసుకొని వచ్చారు. వారిలో కొంతమందిని న్యూఇంగ్లండ్‌లోని వలసదార్లకు సేవకులుగా అమ్మారు. చాలా మందిని మధ్య వలసలకు తీసుకొని వెళ్ళారు. కాని అత్యధిక సంఖ్యాకులు దక్షిణాది తోటలలో పని చేయడానికి పంపబడ్డారు. ఈ విధంగా 1750 నాటికి మొత్తం అమారంబాపతు రెండు రెండున్నర లక్షల నీగ్రో బానిసలు అమెరికా వచ్చారు.

ఇక, అమెరికా ఆదివాసులైన ఎర్రఇండియనులు క్రమక్రమంగా పశ్చిమానికి వెళ్ళిపోవడం మొదలు పెట్టారు. తెల్లవారు మొదట అమెరికా గడ్డపై కాలుమోపిన రోజులలో అక్కడ ఈ ఎర్రఇండియనుల జనాభా సుమారు ఎనిమిది లక్షలు ఉండవచ్చునని అంచనా వేశారు. వలసదార్లు తమను నీచంగా చూడడం వల్లను మోసం చేస్తూ వుండడం వల్లను ఎర్రఇండియనులు ఆగ్రహంతో ఎదురు తిరిగి భయంకరమైన అనేక హత్యాకాండలు సాగించారు. వలసదారులు కూడా అదే ఘోరణిలో, బహుశః అంతకన్న కూడా దారుణంగా వారికి ప్రతికారం చేశారు. యుద్ధాల చరిత్రలో అత్యంత భయంకరమైన ఒకానొక సంక్షోభం 1637 లో పిక్వాట్ యుద్ధసందర్భంలో జరిగింది. కెప్టెన్ జాన్ మేసన్ నాయకత్వాన న్యూ ఇంగ్లండ్ వలసదారులు ఒక ఎర్ర ఇండియన్ గ్రామాన్ని ముట్టడించి, వారిలో ఒక్కరు కూడా బయటికి పోవడానికి వీలులేకుండా చుట్టూ కాపు పెట్టి ఆ గ్రామానికి నిప్పు ముట్టించారు. ఆ గ్రామంలోని సుమారు ఐదువందల మంది ఎర్రఇండియన్ స్త్రీలు, పురుషులు, బాలబాలికలూ ఆ అగ్నిలో సజీవంగా ఆహుతి అయిపోయారు.

మసాచూసెట్స్‌లోని ప్యూరిటన్లు ఇతర వలసలలోని ప్యూరిటన్లకన్న విలక్షణ స్వభావంగలవారు. వారిది ద్వంద్వ ప్రకృతి అందులో ప్రశంసనీయమైనదీ కూడా ఉన్నది. ఒకవంక ప్యూరిటన్లందరికీ విద్యయందు విశేషాసక్తి ఉండడంవల్ల 1636 లోనే, వారి గ్రామాలకు రెడ్ ఇండియనుల ప్రమాదం ఇంకా చాలా దారుణంగా ఉన్నప్పుడే హార్వర్డ్ కళాశాలను స్థాపించారు. 1650 లో ప్రభుత్వ పాఠశాలల్లో నిర్బంధ విద్య ఏర్పాటు చేసుకున్నారు. కాని, మరొకవంక న్యూఇంగ్లాండువాసులంతా మతవిషయాల్లో ప్రచండమైన ఈ పట్టుదల గలవారు పట్టుదలలేబాగా ముదిరి

పోయి 1692 లో మసాచుసెట్స్‌లోని సలేంవద్ద జరిగిన మంత్రవేత్తల విచారణలు, మరణదండనలు మున్నగు విషాద సంఘటనలకు దారి తీసినవి.

న్యూఇంగ్లండులోని చిన్నపట్టణాలలో ప్రజల జీవితాలన్నీ ప్రార్థన మందిరాల్లోనో, పాఠశాలల్లోనో, పంటచేలల్లోనో గడచిపోతూ ఉండేవి. ప్రజలంతా బాగా సన్నిహితంగా ఉండడం వలన తమ బ్రతుకులు ఇరుగు పొరుగుల యోగక్షేమాల మీద ఆధారపడి ఉన్నవనే సంగతి, దక్షిణాదిన ఉన్న తమతోటి వారికన్న వీరు ఎక్కువగా గుర్తించడం, తత్పర్యవసానంగా ప్రజాస్వామ్యంలో వీరు ప్రత్యేకానుభవం సంపాదించడం జరిగింది. పట్టణపాలకసభలలో వీరు పట్టణానికి సంబంధించిన స్థానిక స్వపరిపాలన సమస్యలను చర్చల ద్వారాను, రాజీపద్ధతి ద్వారాను ప్రశాంతంగా పరిష్కరించుకోవడం బాగా నేర్చుకొన్నారు. ఈ విధంగా చాలా కాలం క్రిందటే ఈ వలసలు అనూయ సమానత్వం అనే రెండు భిన్న ప్రకృతుల సమీకరణాలుగా రూపొందినవి.

పోటోమాక్ నదికి దక్షిణాన వర్జీనియా, కరోలినాలలోని రైతులు దూరదూరంగా చెదురువాటుగా ఉన్నచోట ప్రజాస్వామ్య స్వపరిపాలన ఇంత సమర్థంగా సాగినట్లు లేదు. తరచు జరుగవలసిన సభలకు కొన్ని మైళ్ళకొలది ప్రాంతాల్లో అక్కడక్కడ ఉన్న ఈ రైతులందరినీ సమావేశం చేయడమే కష్టసాధ్యంగా ఉండేది. ముఖ్యంగా ఉన్నచోట కలుసుకున్నా రాకపోకలకు చాలా కాలం పట్టేది. ప్రభుత్వ పాఠశాలలు నడపడానికి కూడా ఇదే ఇబ్బంది ఏర్పడింది. కేవలం దూరాలవలన అక్కడ విద్య దెబ్బతిన్నది. తత్పర్యవసానంగా అక్కడ ప్రతివ్యవసాయ కేంద్రం, లేక తోట ఒక చిన్న గ్రామంలాంటిదిగా తయారయింది.

ఈ విధంగా రూపొందడంవలన, ఈ దక్షిణాదిన కలవారికీ లేనివారికీ మధ్య అంతరువు బాగా ఎక్కువయింది. స్వతంత్రులైన దాక్షిణాత్యులలో కొందరు చాలా ఐశ్వర్యవంతులై, తమ వ్యవసాయ కేంద్రాలలోను, తోటలలోను, తమ నీగ్రో బానిసల చేత పని చేయించు

కొనేవారు. మరొకవంక పేద రైతులు స్వయంగా చెమటోడ్చి కష్టపడి వ్యవసాయంచేస్తూ అర్ధాకలితో బ్రతికేవారు. న్యూ ఇంగ్లండులోవలె ఇక్కడ మధ్యతరగతివారు ఎక్కడో పట్టణాలలో తప్ప ఉండేవారు కారు. ఈ వ్యత్యాసమే ఈ రెండుప్రాంతాల నిర్మాణ కళలో కనిపిస్తుంది. ఉత్తరాదిన ప్రజలలో అధికసంఖ్యాకులకు పరిశుభ్రమైన తెల్లని కర్రఇళ్ళు ఉండేవి. దక్షిణాది గ్రామసీమల్లో కొందరు భూస్వాములకు మాత్రం బాగా సారవంతమైన చేలలో గొప్ప గొప్ప భవనాలు వుండేవి. కొండ నేలల్లో గల చేలలోని రైతులందరికి ఇంచుమించు ఆదవాసుల గుడిసెలలాంటి చిన్న చిన్న ఇళ్ళు ఉండేవి. నీగ్రోలకు అసలు ఇళ్లంటూనే ఉండేవి కావు. "ఫలానా ఇంతమందికి కప్పు" అని జార్జివాషింగ్టన్ అభివర్ణించినట్లు, చాలామంది బానిసలకు కలిపి ఒక పశువుల పాకలాంటి ఆశ్రయం ఉండేది.

దక్షిణాదివారు మతవిశ్వాసాలను అల్పంగా చూడకపోయినా న్యూఇంగ్లండు వాసులకున్నంత తీవ్రమైన పట్టుదల మాత్రం వారికిలేదు. వ్యవసాయకేంద్రంలో జీవితం సుఖంగా, లాభసాటిగా సాగుతూ ఉండేవి. ఏ విధమైన చీకు చింతలు లేవు. బానిసలలో కొందరిని వారి యజమానులు సరిగా చూడక బాధిస్తూన్నప్పటికీ, మొత్తంమీద వారు కూడా అచట సురక్షితమైన సులభ జీవనవిధానంలో భాగంపంచుకొనేవారు. భాగ్యవంతులలో నృత్యం, త్రాగుడు, వేట, ద్వంద్వయుద్ధాలు, గుర్రపు పందాలులాంటి వినోదాలు వృద్ధిఅయినవి. ఇలాంటి దురాచారాల పేరు చెపితేనే న్యూ ఇంగ్లండువాసులు మండిపడేవారు.

మధ్య వలసలలో గొప్ప భూస్వాములకు చెందిన పెద్ద పెద్ద వ్యవసాయ కేంద్రాలు కొన్ని ఉన్నప్పటికీ మొత్తంమీద మధ్యరకానివీ, చిన్నవే ఎక్కువగా ఉన్నవి. క్వాకర్ ప్రముఖుడైన విలియంపెన్ నాయకత్వంక్రింద, పెన్సిల్వేనియా వలసప్రాంతం ఇళ్ళు వాకిళ్ళుగల రైతులతో ఇరుగు పొరుగు ఎర్ర ఇండియనుల స్నేహంతో సుఖసమృద్ధులతో తులతూగుతూ ఉండేవి. ప్రభుత్వశాసనాలు అందరికీ న్యాయంగా ఉండేవి. మతారాధనా స్వాతంత్ర్యం పుష్కలంగా ఉండేది. "సోదరప్రేమ నగర" మని ప్రఖ్యాతి చెందిన ఫిలడెల్ఫియా 18వ శతాబ్దిలో అమెరికాలోకల్లా గొప్పనగరంగా వృద్ధి పొందింది. బెంజమిన్

ఫ్రాంక్లిన్ అనే గొప్ప రాజకీయవేత్త, ముద్రాపకుడు ఈ నగరాభి వృద్ధికి చాలా తోడ్పడ్డాడు.

న్యూయార్కు నగరం ఆతొలి రోజులలోనే వ్యాపార, వాణిజ్య కేంద్రంగా ఉపయోగపడుతూ, నేటి మహా నగరానికి బీజంగా తయారయింది. వ్యాపార ప్రాముఖ్యానికి సర్వసమత్వానికి న్యూయార్కు డచ్ వారి కాలం నాటి నుండీ కూడా పేరు మోసింది. అద్భుతమైన నౌకాశ్రయం అవడం, హడ్సన్ నదీ ముఖద్వారాన ఉండటం న్యూయార్కు విలక్షణ ప్రాముఖ్యానికి ముఖ్య హేతువులు.

ఈవిధంగా, భిన్నభిన్న ప్రకృతులు, తత్త్వాలూ గల వీరంతా, స్వాతంత్ర్య సంపాదన మనే ఉదాత్తాశయ సాధనకు, సోదరుల వలె ఏకమవడం ఎలా సంభవించినదీ తెలుసుకోవడమే ఇక ఈవలసల చరిత్రలో ప్రధాన విషయం. మొదట వీరంతా పరస్పరం కలుసుకోవడం జరగాలి కదా! కాని, తిరుగుబాటుకి పూర్వం, ఆ తరువాత చాలా కాలం వరకూ కూడా ప్రయాణాలు చేయడం చాలా కష్టంగానే ఉండేది. రోడ్లు చాలా తక్కువగాను, ఉన్నవైనా చాలా దరిద్రంగానూ, ఉండేవి. గుర్రపు బళ్ళమీద కొన్ని వందల మైళ్లు ప్రయాణం చేయడానికి చాలా వారాలు పట్టేది. ఉత్తరాది నుండి, దక్షిణ కరోలినాకు గాని, జార్జియాకు గాని వెళ్ళాలంటే ఒక్కటే దారి, అట్లాంటిక్ తీరం వెంట సముద్రయానం.

ఇలా పరస్పరం దూరంగాఉన్నా, ఈ వలసలమధ్య ఒక విధమైన సామరస్యం, ఐకమత్యం వృద్ధిఅవుతూ వచ్చింది. తపాలా సౌకర్యాలు ఏర్పాటు చేసుకున్నారు. ముద్రణ యంత్రాలు దిగుమతి చేసుకున్నారు. క్రమంగా లేఖలద్వారాను వార్తాపత్రికలవల్లనూ, కరపత్రాల మూలంగానూ బుద్ధిమంతులమధ్య భావవినిమయం,ఆ భావాలు ప్రజలందకీ కూడా అందజేయబడడం సాధ్యమయింది.

పైగా అట్లాంటిక్ తీరంవెంట సుమారొక వేయిమైళ్ళ పొడుగునా వలసలు నిర్మించుకొన్న వీరందరిలో కొన్నిసహజ ధర్మాలు ఉన్నవి. మొదటిది వీరిలో అత్యధిక సంఖ్యాకులు ఇంగ్లీషువారు. ఆంగ్ల సంప్రదాయానుసారం స్వతంత్రులైన ఆంగ్లేయులందరికీ లభించే స్వపరిపాలన, న్యాయాధిపతివర్గ (Jury) విచారణ మొదలైన హక్కులకు అల

పాటుపడినవారు. వారి అధినివేశ శాసనసభలే ప్రభుత్వపు వ్యయాన్నంతటినీ మంజూరు చేసేవి. అనేక పర్యాయాలు తమ కార్యక్రమాలకు అవరోధం కలిగించినందుకుగాను ఈ శాసనసభలు గవర్నర్లకు జీతాలు మంజూరు చేయకుండా తొక్కిపట్టి, శాస్తి చేసినవి. స్వతంత్రులుగా జన్మించిన ఆంగ్లేయులు మాత్రమే ఇట్టి సాహసాలు చేయగలిగేవారు.

క్రమంగా ఈ వలసలు పరస్పరం సంబంధబాంధవ్యాలు ఏర్పరచుకొని, అందరి యోగక్షేమాలకు సంబంధించిన విషయాలలో సమష్టిగా వ్యవహరించడం ప్రారంభించినవి. 1643 లో మాసాచూసెట్స్, ప్లిమత్, కనెక్టికట్, న్యూహావెన్‌లు కలిసి న్యూ ఇంగ్లండ్ సమాఖ్య (Confederation) ఏర్పాటు చేసికొనడం ఈ సమష్టి కార్యాచరణకు ప్రథమసోపానం. ఈ వలసల ప్రజలు "సుదృఢమైన శాశ్వత స్నేహ సామరస్యాలతో దండయాత్ర చేయవలసివచ్చి, రక్షణ చేసుకొనవలసి వచ్చినా న్యాయమైన అన్ని సందర్భాలలో పరస్పరం సంప్రదించుకొని సహాయం చేసుకుంటూ, సత్యాన్నీ జీసస్ బోధనలనూ, సంరక్షించడంలోను, ప్రచారం చేయడంలోనూ, పరస్పర యోగక్షేమాలకు సంబంధించిన అన్ని విషయాలలోను ఏకంగా వ్యవహరించడానికిగాను ఆ సమాఖ్యను ఏర్పరచుకొన్నారు. ఈ న్యూ ఇంగ్లండు సమాఖ్య అనేక సంవత్సరాలు పనిచేసింది. తరువాత మసాచూసెట్స్, ప్లిమత్ వలసలు రెండూ ఒకే వలసగా చేయబడినవి. అలాగే కనెక్టికట్, న్యూహావెన్ ఒకే వలస అయినవి.

ఇలాగే వర్జీనియా, మసాచూసెట్స్, న్యూయార్కు వలసలు తమ వాణిజ్యాభివృద్ధికిగాను మరొక పరస్పర సహాయసంధిని ఏర్పాటు చేసుకున్నవి. నిజానికి వీటివల్ల పెద్దగా సాధించినదేమీ లేకపోయినా భవిష్యత్తులో ఈ వలసల పరస్పర సహకారానికీ ఐకమత్యానికీ యివి త్రోవ చూపినవి.

నిజానికి ఈ ఆంగ్ల వలసలన్నీ ఏకమవడానికి ప్రబల కారణం, అమెరికాఖండ ఆధిపత్యం కోసం ప్రముఖ ప్రపంచరాజ్యాల మధ్య సాగిన భయంకర సంఘర్షణ. నూతన ప్రపంచంలో స్పెయిన్, ఫ్రాన్స్ సామ్రాజ్యాల విస్తరణ విషయంలో 1690 వరకు ఆంగ్ల వలసదారులు ఏమీ పట్టించుకో లేదు. కాని ఆ దేశాలు, వలస భూమికోసం గట్టిగా

ఇంగ్లండుతో తగాదాలు సిద్ధమయే సరికి ఈ ఆంగ్ల వలసలకు ప్రమాదం ఏర్పడింది. స్పెయిను, ఫ్రెంచి వలసదార్లవద్ద పనిచేస్తూ ఉండి ఎర్ర ఇండియనులు వారి సరిహద్దులలో నున్న ఆంగ్ల వలసలపై అధాటున వచ్చి దెబ్బతీసి పారిపోతూ ఉండేవారు. సముద్రంమీద కూడా ఆంగ్ల వలసదారుల ఓడలకు ఇలాంటి ప్రమాద మేర్పడింది. అందువల్ల ఆంగ్ల వలసల ప్రజ లందరికీ సంబంధించిన యీ సమిష్టి ప్రమాదం వారిని మేల్కొల్పి ఏకం చేసింది.

1689 లో నూతన ప్రపంచంలోని ఫ్రెంచి సామ్రాజ్యం కెనడా లోని, విశాల ప్రాంతాలను, మిసిసిపీనదీ తీరాన్ని నేడు అమెరికా సంయుక్త రాష్ట్రాలని పిలువబడుతూన్న ప్రాంతంలోని మధ్యభాగ మంతటిని. మధ్య పశ్చిమ (Mid West) ప్రాంత మనబడే దాన్ని కూడా ఆక్రమించు కొన్నది. అనగా ఎలిఘెనీ పర్వతాలు మొదలు రాకీ పర్వతాల వరకు, ఉత్తరాన కెనడా మొదలు దక్షిణాన మెక్సికో సింధుశాఖ వరకు వ్యాపించి ఉంది. కేవలం ఎలిఘెనీ పర్వతాలకు తూర్పున తీరంవెంట నున్న చిన్న పీలికవంటి భూభాగంలో మాత్రమే ఉన్న ఆంగ్లవలసల విస్తీర్ణంకన్న ఈ ఫ్రెంచి వలసల విస్తీర్ణం ఎన్నో రెట్లు ఎక్కువ.

ఈ ప్రాంతమంతటిపై ఆధిపత్యం తనదని ఫ్రాన్స్ అనడానికి కారణం : సాహసికులైన మతప్రబోధకులూ, కామందులూ జరిపిన అన్వేషణయాత్రలు. ఇట్టి అన్వేషకులలో రేనిరాబర్ట్ కెవెలియర్, షూర్ డా లా సాలే అనేవారు ముఖ్యులు. లాసాలే 1682 లో మహా సరస్సులవద్ద బయలుదేరి మిసిసిపీ నదిని కనుగొని, దానిపొడుగునా దిగువను మెక్సికో సింధుశాఖవరకు ప్రయాణం చేశాడు. ఈవిధంగా అతడు ఉత్తరంనుంచి దక్షిణాదికి మొత్తం దేశమంతా తొక్కివచ్చి, చివరికి మిసిసిపీ ముఖద్వారంవద్ద ఫ్రాన్స్ దేశపు లిల్లీపతాకను స్థాపించి, తాను చూచివచ్చిన నేలంతా ఫ్రాన్స్ చక్రవర్తి పద్నాలుగవ లూయీకి చెందుతుందని ప్రకటించాడు. ఆ భూమి అంతటికి ఆ చక్రవర్తి పేరు మీదుగా "లూసియానా" అని నామకరణం చేశాడు.

నూతన ప్రపంచంలోని ఈ ఫ్రెంచి సామ్రాజ్యం చాలా విశాల మైనదే అయినా దాంట్లోఉన్న వలసదార్ల మొత్తం మాత్రం 18,000కు

మించిలేదు కాని తూర్పుతీరాన 2,00,000 మంది ఆంగ్లవలసదారులు ఉన్నారు. అయితే, ఫ్రాన్సు దేశపు వలసదార్లు ఎర్రఇండియనులమైత్రిని సంపాదించుకొనడంవలన ఈసంఖ్యాలోపం వారికి అస్లే కనిపించలేదు. ఫ్రెంచి వలసదారులు ఎర్రఇండియన్లను తమ సహోదరులులాగ చూచుకునేవారు. వారి పిల్లలను పెళ్ళిచేసుకునేవారు. తమ పనులన్నింటిలో వారి సహాయం పొందేవారు. ఆంగ్లేయులు సులభంగా నూతన ప్రపంచ పరిస్థితులను అనుగుణంగా మారలేక పోయారు.

తరువాత 1689 లో ఐరోపాలో కాథలిక్కుల దేశమైన ఫ్రాన్సుకి, ప్రొటెస్టెంట్ల దేశమైన ఇంగ్లండుకీ నడుమ "విలియం చక్రవర్తి యుద్ధం" ప్రారంభమై అమెరికాఖండాధిపత్యంకోసం అడపా దడపా పోరాటాలతో సుమారు ముప్పాతిక శతాబ్దిపాటు సాగింది. ఐరోపాలో రగుల్కొనిన యుద్ధాగ్నిజ్వాల అచిరకాలంలోనే అమెరికాకు ప్రాకింది. దాంతో ఆంగ్లవలసదారులు తమబ్రతుకుకోసం పోరాటానికి తలపడవలసి వచ్చింది.

న్యూయార్కు వలస ఎలిఘెనీ పర్వతాలలోని ఒక కనుమగుండా పశ్చిమ దిశకూ, మహాసరస్సులవరకూ ఉత్తరాన కెనడా సరిహద్దు వరకూ విస్తరిల్లి ఉన్నది. ఇంగ్లండ్‌నుండి ఎలాగైనా ఈ వలసను లాగికొనగలిగితే, అమెరికాలోని బ్రిటిష్ సామ్రాజ్యం రెండు ఖండాలుగా తెగిపోతుందనీ, ఆపైన మెల్లగా ఫ్రెంచి పతాకాలను న్యూయార్కు నుండి దక్షిణంగాను, ఉత్తరంగాను కూడా కొనిపోయి అట్లాంటిక్ తీరమంతట ప్రతిష్ఠించి ఆంగ్లేయులకు అమెరికాలోనిలువ నీడలేకుండా చేయవచ్చుననీ ఫ్రెంచివారు ఆశించారు.

ఆ విధంగానే కెనడాలో ఫ్రెంచి గవర్నరు కౌంట్ ఫ్రాంటెనాక్ కెనడా సరిహద్దుకు దిగువ న్యూయార్కు వలసపైన, ఇతర న్యూఇంగ్లండ్ వలసలపైన బలిష్ఠమైన దాడులు జరిపించాడు. ఫ్రెంచివారు, వారి మిత్రులైన ఎర్ర ఇండియనులు షెనెక్టడీ, న్యూయార్కు, డోవరు, న్యూహాంప్‌షైర్‌ల మీద పెద్ద దెబ్బలు తీసి ఒడుపుగా పట్టణాలన్నిటినీ తుడిచిపెట్టి ప్రజలను హత్యలు చేశారు.

కాని "విలియం చక్రవర్తి యుద్ధం" పర్యవసాన మేమీ తేలకుండానే 1697 లో ముగిసిపోయింది. కాని మళ్ళీ 1701 లోనే

స్పెయిన్ దేశపు వారసత్వపు యుద్ధం ఆరంభమయింది. స్పెయిను నూతన చక్రవర్తి ఎవరన్న సమస్య వచ్చినప్పుడు ఫ్రెంచి చక్రవర్తి, పధ్నాలుగవ లూయీ, ఆ వారసత్వం తన మనుమడికి రావలసి ఉన్నదంటూ అతణ్ణి తీసికొని పోయి స్పెయిన్ సింహాసన మెక్కించడంతో ఈయుద్ధం రేగింది. తానలా చేయడంవల్ల కాథలిక్కుల దేశాలైన స్పెయిను ఫ్రాన్సులు ఏకమయి, ప్రొటెస్టెంట్ల దేశమైన ఇంగ్లండును సులభంగా ఎదిరించ వచ్చునని లూయీ భావించాడు.

మొత్తంమీద ఈ యుద్ధానికి ఇంగ్లండు పూర్తిగా సంసిద్ధంగానే ఉండడంవల్ల మార్ల్బరో ప్రభువు ఐరోపా యుద్ధరంగాలలో చాలా చోట్ల ఫ్రెంచివారికి ఘోర పరాజయాలు కలిగించాడు. క్రమంగా, ఈ సమరాగ్నిజ్వాల అమెరికా గడ్డ పైకి కూడా ప్రాకింది. ఉత్తర దక్షిణ కెరోలినాల పైన, న్యూ ఇంగ్లండు పైన ఎర్ర ఇండియనులు తీవ్రమైన దాడులు చేశారు. కాని, చిట్టచివరకు బ్రిటిషువారికే విజయం కలగడం వల్ల 1713 లో యూట్రెక్ట్ వద్ద చేసుకున్న సంధి ప్రకారం ఫ్రెంచి వారు న్యూఫౌండు లాండును, మరికొన్ని ముఖ్యమైన ప్రాంతాలను ఇంగ్లీషువారికి వదలి వేయవలసి వచ్చింది.

మళ్ళీ 1744-48 ల మధ్య "జార్జి చక్రవర్తి యుద్ధం" లో అంతర్జాతీయ రంగంలో రేగిన తుపాను దెబ్బ అమెరికాకు కూడా కొంత తగిలింది. ఈ సంఘర్షణలో వలసదార్ల సైనికులు చాల ప్రముఖ పాత్ర నిర్వహించారు.

వెనుకటి యుద్ధాలలో ఆంగ్లేయులు వలస సైన్యాలను అప్పుడప్పుడు మాత్రమే పనిచేప్పేవారు. పైగా వారికి చిన్నచిన్న పోరాటాలలోకూడా తమ నౌకాదళాన్ని సహాయం పంపేవారు. అయినా, ఈ యుద్ధంలో సరియైన సహకారం లేక పోవడంవల్ల ఫలితాలు ఏమంత సంతృప్తికరంగా ఉండేవి కావు. కాని "జార్జి చక్రవర్తియుద్ధం" లో మాత్రం సెయింట్ లారెన్సు నది. ముఖద్వారానికి రక్షణదుర్గంవలె కేప్‌బ్రిటన్ ఐలండ్ మీదనున్న లూయీజ్ బర్గు అనే బలమైన కోటను మెయినీ వలసకు చెందిన దళాధపతి కర్నల్ విలియం పెపెరల్ నాలుగు వేలమంది వలససైనికులతో వెళ్ళి ముట్టడించి స్వాధీనం చేసుకున్నాడు. న్యూ ఇంగ్లండు శాసనసభలు ఈ సైన్యాన్ని తయారుచేసి పంపినవి.

కమోడోర్ వారెన్ నాయకత్వాన బ్రిటిషు నౌకాదళం కిరికి తోడు పడింది. ఫ్రెంచి సైన్యాలను మట్టపెట్టించి విజయం సాధించడంలో అమెరికనులు అద్భుతమైన శౌర్యసాహసాలను ప్రదర్శించారు. ఈవిజయంవల్ల వీరికి అపారమైన ప్రతిష్ఠ సిద్ధించడమే కాకుండా న్యూ ఇంగ్లండ్‌లోని వీరి బంధుమిత్రులందరికీ గొప్ప గర్వకారణ మయింది.

కాని, యుద్ధం ముగిసిన తరువాత వలసలన్నింటినీ అంధకారం, అమితాగ్రహం ఆవరించినవి. తరువాత చేసికొన్న సంధిప్రకారం లూయిజ్‌బర్గ్‌ని తిరిగి ఫ్రాన్సుకి ఇచ్చివేయవలసి వచ్చింది. యుద్ధంలో వలససైన్యాలు చేసిన త్యాగమంతా బూడిదలోపోసిన పన్నీరయింది. ఈ విధంగా అసంతృప్తులైన ఉన్న వలసదారులను ఎలాగో సమాధాన పరచాలనే ఆశయంతో ఇంగ్లండు ఆ యుద్ధానికి వారుపెట్టిన ఖర్చును తాను ముదరా యిచ్చింది, కాని ప్రయోజనం లేకపోయింది.

నూతన ప్రపంచాధిపత్యంకోసం ఫ్రెంచివారికి ఆంగ్లేయులకు చివరిసారిగా జరిగిన చరిత్రాత్మకమైన యుద్ధం 1756-63 సంవత్సరాల నడుమ జరిగింది. దీనికి "సప్తసంవత్సర సమర" మనీ, "ఫ్రెంచి ఎర్ర ఇండియన్ యుద్ధ" మనీ పేరు.

బ్రహ్మాండమైన ఈ యుద్ధం ఉత్తర అమెరికాలోనే కాదు. ప్రపంచమంతటా జరిగింది. కరీబియన్ సముద్రం, ఇండియా మొదలైన దూరదేశాలలోకూడా, — ఈ ఉభయదేశాల సామ్రాజ్య కాంక్షలు కోసం, ఆ దేశాలలో తమ ఉత్పత్తులను అమ్ముకొనడానికి మార్కెట్ల కోసం, నూతనైశ్వర్యంకోసం, నూతన సామ్రాజ్యం కోసం ఈ యుద్ధం జరిగింది.

రాబోయే యుద్ధంలో తమ సర్వశక్తులను వినియోగించవలసివస్తుందని, తన సామ్రాజ్యంలోని వివిధ భాగాలనుండి వీలైన సహాయమంతా సమకూర్చుకొనడం అవసరమవుతుందని కూడా ఇంగ్లండుకు ముందుగానే తెలుసు. అందువల్ల, అమెరికాలోని ఆంగ్లవలసలు తమ శక్తి లన్నిటిని సమాయత్తం చేయాలని 1754 లో ఇంగ్లండ్ హెచ్చరిక చేసింది. ఇందు నిమిత్తం న్యూయార్కులోని ఆల్బనీలోని ఒక మహా సభ జరిగింది.

నాడు అమెరికాలోని బుద్ధిమంతులలో చాలామంది ఆ సభకు హాజరయ్యారు. పెన్సిల్వేనియా ప్రతినిధిగా వచ్చిన బెంజమిన్ ఫ్రాంక్లిన్ రోడ్ దీవినుంచి వచ్చిన థామస్ హాచిన్సన్‌లు ఆ సమావేశంలో ముఖ్యులు. అత్యంత వివేకవంతులు, నిష్పాక్షబుద్ధిగల భావుకులూ అయిన వీరంతా సమావిష్టులయి, ఫ్రెంచివారివలన ఎర్రఇండియనుల వలన తమ వలసలకు నిరంతరంగా కలుగుతూన్న ప్రమాదాన్ని వారించడానికి ఉపాయాన్వేషణ ప్రారంభించారు. క్రమంగా ఆ సభలోనే వారు అమెరికాలో ఆంగ్లవలసల భవిష్యత్ స్వరూపం ఎలా ఉండవలసి నదీకూడా చర్చించారు.

ఫ్రాంక్లిన్ మహాశయుడు ఆంగ్లవలసల సమిష్టి శ్రేయస్సాధనకొరకు చక్కని సమాఖ్యా విధానాన్ని సూచించాడు. వలస లన్నిటి నుండి ఎన్నిక అయివచ్చే నలభైమంది సభ్యులతో కూడిన ఒక సమిష్టి మంత్రాంగసభ (Council ఉండాలనీ; వలసల ఐశ్వర్యాన్నిబట్టి ఈ సభకు ఏవలసనుండి ఎందరు ప్రతినిధులను ఎన్నుకోనవలసింది నిశ్చయించాలనీ వలస సైన్య మొకదాన్ని ఏర్పాటుచెయ్యడం, పన్నులు విధించి వసూలుచేయడం ప్రభుత్వవ్యవహారాలను నడపడం ఈ సభ కర్తవ్యాలయి ఉండాలనీ ఆయన సూచించాడు. ఆ సభకు ఒక అధ్యక్షుడు ఉంటాడు. అతన్ని ఇంగ్లండ్ చక్రవర్తి నియమిస్తాడు. మంత్రాంగసభ సలహాలప్రకారం శాసనాలను గురించి తీర్పుచెప్పడం సైన్యాధిపతులను నియమించడం మొదలైన అధికారాలు అధ్యక్షునికి ఉంటవి.

ఈ ప్రణాళిక యెంత ఆచరణ యోగ్యంగా ఉండినప్పటికీ, ఆ మహాసభవారు దీనిని ఆమోదించలేదు. స్థానిక ప్రభుత్వాధికారాలన్నిటికీ, స్వస్తిచెప్పి అధికారమంతటినీ కేంద్రీకృతం చేస్తున్నదని వలసల శాసనసభ్యులు, గవర్నరులు దానిని ఆమోదించలేదు. దీని ప్రకారం, వలసలకు మొత్తంమీద ఎక్కువ అధికారం దత్తం చేయవలసి వస్తుందనీ, అప్పటి పరిస్థితులలో అది వాంఛనీయం కాదనీ ఆంగ్లేయులు నిరాకరించారు. ఈ ఆల్బనీప్రణాళిక విఫలమయి నప్పటికీ అమెరికా చరిత్రలో దానికి గొప్పప్రాముఖ్యత ఉన్నది. తదనంతరం స్వాతంత్ర్యం

పొందిన తొలిరోజులలో అమెరికాను పరిపాలించిన కాంటినెంటల్ కాంగ్రెసు సంస్థ స్థాపనకు ఈ ప్రణాళికే ఒక బీజంగా ఉపకరించింది.

ఆ విధంగా వేరువేరుగా ఏ వలసకు ఆ వలసే యుద్ధంలో ఇంగ్లండుతో సహకరించాలని తేలింది. ఓహియో లోయలో ఎలీఘెనీ పర్వతాలకు పశ్చిమంగా యుద్ధం అనధికారికంగా అప్పుడే ప్రారంభమయి సాగుతూనే ఉంది.

ఈ ప్రాంతంపైన తమకు ఆధిపత్యం ఉండడం చాలా ముఖ్యమని బ్రిటను ఫ్రాన్సు కూడా గాఢంగా వాంఛిస్తున్నవి. ఇది ఇంగ్లండు చేతులలో వుంటే, దినదినాభివృద్ధి చెందుతున్న ఆంగ్లవలసలు ఏనాటికైనా ఎలీఘెనీ పర్వతాలు దాటి పశ్చిమంగా ఖండ మధ్యభాగానికి విస్తరిల్లే అవకాశం ఉంది. ఫ్రెంచివారి చేతులలో ఉంటే ఇంగ్లీషువారిని ఆ తూర్పుతీరపు పీలికలోనించి ఖండంలోపలికి చొరనీయకుండా అటకాయించి ఉంచి క్రమంగా తమకు అవసరమైన బలంచేకూరి నప్పుడు నూతన ప్రపంచంలోనుండి వారికి పూర్తిగా ఉద్వాసన చెప్పడానికి వీలవుతుంది.

ఫ్రెంచివారు ఓహియోనది పొడుగునా, దాని ఉపనదుల మీద కోటలు కట్టడం ప్రారంభించేసరికి, వర్జినియా గవర్నరు డిన్విడ్డీ తన స్థానిక సైన్యంలోని ఇరవైయొక్క ఏళ్ళ యువకుడు మేజర్ జార్జి వాషింగ్టన్‌ను ఫ్రెంచివారి వద్దకుపోయి "బ్రిటన్ చక్రవర్తికి చెందినదని స్పష్టంగా తెలిసికొన్న ప్రాంతం" నుండి వెంటనే వైదొలగవలసినదిగా హెచ్చరించి రమ్మని రాయబారం పంపాడు. వాషింగ్టన్ పేరు చరిత్రలోకి ఎక్కడానికి ఇదే మొదలు. ఫ్రెంచివారు తమపట్టు వదలనందున వాషింగ్టన్ "నెసిసిటీ" అనే కోటను నిర్మించి బ్రిటిషువారి హక్కును నిలబెట్టడానికిగాను దానిలో తగిన సాధన సామగ్రి అంతా సన్నద్ధం చేశాడు. కాని ఈ కోటను రక్షించుకొంటూ నిలబడడానికి అవసరమైనంత సైన్యం అతనివద్ద లేదు. అందువల్ల ఫ్రెంచివారు ప్రబలమైన దాడి ప్రారంభించేసరికి అతడు లొంగిపోవలసి వచ్చింది.

ఈ పరాజయంతో ఆగ్రహావేశాలు రగుల్కొన్న ఆంగ్లేయులు 1755 లో జెనరల్ బ్రాడాక్ నాయకత్వాన రెండు రెజిమెంట్ల సైన్యాన్ని సన్నద్ధంచేసి, కీలకస్థానమైన "డ్యుక్వెన్సీ" కోటనుండి

ఫ్రెంచివారిని తరిమివేయాలని కలసికట్టుగా ఆలోచించిన సలహాను — వాషింగ్టన్ సలహా పాటించకుండా బ్రాడ్డాక్ ఐరోపాలోని యుద్ధపద్ధతిలో తన సైన్యమంతటినీ ఒకే గుంపుగా పంపాడు. ఫ్రెంచివారు, ఎర్రఇండియనులు చెట్లచాటున, గుట్టలమాటున రహస్యంగా దాగియుండి తుపాకులతోను, పదునైన బాణాలతోను ఆంగ్లసైనికులను హత మార్చారు. వారిని ఎలాగైనా కాపాడాలని వాషింగ్టన్ వీరోచితమైన ప్రబల ప్రయత్నాలు చేశాడు. కాని, ఆయన కూడా తుపాకి దెబ్బలు తిన్నాడు. ఆయన ఎక్కి ఉండగా రెండుగుర్రాలు ఒకదాని వెంట ఒకటి తుపాకి దెబ్బలకు గురియై చనిపోయినవి. బ్రాడ్డాక్ పూర్తిగా పరాజయం పొందాడు.

దీనికి వెనువెంటనే ఫ్రెంచివారికి మరికొన్ని విజయాలు కూడా కలిగాయి. ఇందులో చాలావరకు ఆంగ్లేయులకు, ఆంగ్ల వలసదారులకు నడుమ సరియైన సహకారభావం లేకపోవడంవల్ల జరిగినవి. దాదాపు వలస శాసనసభలన్నీ తమ తమ శక్తికొలది సైన్యాలను తయారుచేసి పంపినవి. కాని తమ సైన్యాలు ఎవరి నాయకత్వంక్రింద ఎక్కడ యుద్ధం చేయవలసినదీ నిర్ణయించే అధికారం తమకే ఉండాలని పట్టు పట్టినవి. పైగా ఆ బ్రిటిష్‌సేనాధిపతులు వలససైనికులను తమవారికన్న తక్కువగా, నీచభావంతో చూచేవారు.

1757 లో అంధకారబంధురమైన సమయంలో ఇంగ్లండు చరిత్రలో అతి సమర్థులైన యుద్ధమంత్రులలో ఒకడైన విలియం పిట్ అధికారంలో ఉన్నాడు. శక్తి సామర్థ్యాలు, పట్టుదల, సాహసం పుష్కలంగా ఉండిన పిట్ బ్రిటిష్ సైన్యాలకు నూతనోత్సాహం పురికొల్పి వారిని ఉత్తరంగా మహాసరస్సులవైపు కెనడా సరిహద్దుమీద దెబ్బ తీయడానికి పంపాడు. ఫ్రెంచివారి బలమైన దుర్గాలనేకం వీరు పట్టుకున్నారు వీరిలో ఒకరైన డ్యూక్వెస్నీ కోటను పట్టుకుని దానికి పేరు మార్చి, తమ మహామంత్రి గౌరవార్థం పిట్స్‌బర్గ్ అని క్రొత్తపేరు పెట్టారు.

చివరకు కెనడా లేక న్యూఫ్రాన్సుపైన దండయాత్ర జరిగింది. 1759 లో క్విబెక్‌వద్ద జరిగిన పోరాటంతో ఈయుద్ధం విజయవంతంగా అంతమయింది. జెనరల్ వుల్ఫ్ తెల్లవారకపూర్వమే దాడిప్రారంభించి,

ఫ్రెంచిసేనాని మార్క్విస్ మాంట్ కామ్‌ని నిర్విణ్ణునిచేశాడు. ఆశ్చర్య కరమైన ఈ విజయానికి వెనువెంటనే, కెనడాలో నాలుగు సంవత్స రాలపాటు సాగిన శత్రునిర్మూలన కలాపం ప్రారంభమయింది.

ప్రపంచమంతట కూడా బ్రిటిష్‌వారి ఆయుధాలు ఫ్రెంచివారిని లొంగదీసినవి. స్పెయిన్ దేశం ఫ్రాన్సుకి సహాయం వచ్చినప్పుడు, బ్రిటను పశ్చిమఇండియా దీవులలోని స్పెయిను దేశపు వలసలను పట్టు కొన్నది. హవానా, క్యూబా, ఫిలిప్పీన్లలోని మానిల్లా బ్రిటిష్‌వారి వశ మైనవి. ఇండియాలో ఫ్రెంచివారిపై బ్రిటిష్‌వారికి సంపూర్ణ విజయం సిద్ధించింది.

పిమ్మట 1763 లో పారిస్‌లో చేసుకున్న సంధి ప్రకారం ఫ్రాన్సు పూర్తిగా కెనడా అంతటనీ, న్యూఆర్లియన్స్ మినహా మిసిసిపీ నదికి తూర్పున ఉన్న విశాల ప్రాంతాన్ని బ్రిటనుకు వదలివేసింది. న్యూఆర్లి యన్సుని మాత్రం స్పెయినుకి దత్తం చేసింది. మిసిసిపీనదికి పశ్చిమాన ఉన్న ప్రాంతంపైన తనకు గల హక్కులను కూడా ఫ్రాన్సు, స్పెయిన్ లకు ధారాదత్తం చేసింది. న్యూఫౌండ్‌లాండ్ తీరంలోని రెండుదీవులు మాత్రమే చేపలు పట్టుకొనే ఓడలకు ఆశ్రయంగా ఫ్రెంచివారికి వదల బడినవి. ఈ రెండుదీవులూ ఇప్పటికీ వారి అధీనంలోనే ఉన్నవి.

సప్తసంవత్సర సంగ్రామం నూతన ప్రపంచంలో ఫ్రెంచి వారి ఆధిపత్యానికి పూర్తిగా ఉద్వాసన చెప్పడంవల్ల ఇక అక్కడ ఆంగ్లే యులతో పోటీపడ గలిగిన అగ్రరాజ్యం స్పెయిను ఒక్కటే అయింది. కాని, వాస్తవానికి స్పెయిన్ దేశస్థులకు నేటి సంయుక్తరాష్ట్రాలలో ఏ ప్రాంతం మీదనూ ఎన్నడూ దృఢమైన పట్టులేదు. వారిదృష్టి సదా మెక్సికో మీదను దక్షిణ అమెరికాఖండం మీదను కేంద్రీకృతమై ఉండేది.

అమెరికాలోని వలసదారుల దృష్ట్యా ఫ్రాన్స్‌పై లభించిన విజయం అనేక విధాలుగా చాలా ముఖ్యమైనది. ఆ యుద్ధంలో పాల్గొనడంవల్ల ఆ వలసలన్నీ పరస్పర సహకార పద్ధతిలో ప్రాథమిక పాఠాలు నేర్చు కొన్నవి. ఎవరికి చేతనైనంతలో వారు సైన్యాలను సమకూర్చడం, సమిష్టి శ్రేయస్సుకు సంబంధించిన ఆ యుద్ధానికి ఎవరి శక్త్యానుసారం వారు వివిధ సామగ్రులు సరఫరాచేయడం వారికి అలవాటయింది.

అయితే దేనికది వేరువేరుగా పరిపాలింప బడుతూన్న పదమూడు రాష్ట్రాలకు పూర్తిగా ఏకమత్యం ఏర్పడడానికి ఆపైన మరికొంత కాలం పట్టింది. ఇది ఆ లక్ష్యసాధనకు ఉపకరించే ప్రముఖ ప్రాథమిక సంఘటన అయింది.

ఈ యుద్ధంతాలూకు మరొక ఫలితం :- ఈ వలసలన్నీ క్రమంగా వృద్ధి చెందుతూన్న తమ శక్తిసామర్థ్యాలను తాము గ్రహింప గలగడం సుశిక్షితులైన బ్రిటిష్ సైనిక ప్రముఖులు తలాతోకలులేని అమెరికా సైన్యాలనుచూచి చీదరించు కొన్నప్పటికీ ఆ వలససైన్యాలు ప్రతి యుద్ధంలోను బ్రిటిష్ సైనికులతో పాటుగా సమర్థంగా పోరాడారన్నది మాత్రం నిర్వివాదాంశం. అలాగే జార్జి వాషింగ్టన్ బ్రిటిషువారు అమెరికాకు పంపిన సైనికోద్యోగులందరి కన్న గొప్పవీరుడన్న సంగతి కూడా వ్యక్తమయింది.

చివరకు ఈ యుద్ధంవల్ల ఈవలసదారులు ఎలీఘెని పర్వతాలు దాటి ఖండమధ్య భాగానికికూడా వ్యాపించడానికి మార్గం నిష్కంటకమయింది. వందలకొలది మైళ్ళ నూతన ప్రదేశం, నూతనావకాశాలు ప్రజలందరికీ సమానావకాశాలు కలిగించాలనే అమెరికా స్వాతంత్ర్య లక్ష్యాన్ని సాధించడానికి తగిన అవకాశం చిక్కింది.

---

# తృతీయ అధ్యాయము

## అమెరికా విప్లవం

అమెరికా విప్లవానికి కారణాలంటూ చరిత్రకారులు ఏవేవో చాలా వ్రాశారు :- బ్రిటను పార్లమెంటూ, మూడవజార్జిరాజూ ఈ వలసల స్వాతంత్ర్యాలను హరించారనీ. ప్రభుత్వంలో వలసలకు ప్రాతినిధ్యం ఈయకుండా వాటిపైన పన్నులుమాత్రం విధించేవారనీ, వారి సైన్యాలను తీసుకొని వచ్చి వలసదార్ల ఇళ్ళల్లో పెట్టారనీ,- ఈవిధంగా వలసదార్లు తిరుగుబాటు చేయక తప్పనిస్థితి కల్పించారని, సాధారణంగా

చరిత్రకారులు వ్రాస్తుంటారు. నిజానికి ఇవన్నీ అంతరంగికంగా ఉన్న మూలకారణాలకు బాహ్యచిహ్నాలు, బ్రిటిష్‌సామ్రాజ్య స్వభావాన్ని గురించి, ఈ వలసలకు దానితో గల సంబంధాన్ని గురించిన పరస్పర భిన్నభావాల సంఘర్షణే ఈ మూలకారణాలలోకెల్ల ముఖ్యమైనదని చెప్పవచ్చు.

అమెరికనుల దృష్టిలో ఈ పదమూడు వలసలు బ్రిటిష్‌సామ్రాజ్యాంతర్గతమైన వేరువేరు స్వపరిపాలక ప్రాంతాలు; అనగా నేటి ఆస్ట్రేలియా, కెనడా వంటి అధినివేశాలు. ఈ వలసలలో నివసిస్తూన్న ప్రజలు ఆంగ్లేయులు అవటంవల్ల, మాగ్నకార్టా స్వాతంత్ర్యపత్రం నాటినుండి ఇంగ్లండులోని ప్రజలు కోరుతూన్న సర్వస్వాతంత్ర్యాలూ, హక్కులూ, తమకుకూడా లభించవలసి ఉన్నవని వీరి వాదం. తమ శాసనసభలకు అధ్యక్షత వహించడానికి ఇంగ్లండురాజు గవర్నర్లను పంపుతున్నందుకు అమెరికనులు ఎన్నడూ అభ్యంతర పెట్టలేదు. కాని, ఆ ఉద్యోగులు తమ శాసనసభల అభిప్రాయాలను గౌరవించాలని మాత్రమే వారు కోరారు. ఆ గవర్నర్ల జీతాలు వలసల ధనంలోంచే చెల్లింపబడుతూన్నందున వారి కోరిక సహజంగానే ఉంది. పైగా స్థానికంగా వివాదాలు ఏర్పడినప్పుడు ఈ గవర్నర్లు ఇంగ్లండు రాజుదగ్గరనుండి సహాయం కోసం ఎదురుచూస్తూ కూచోడం అసంభవంగదా! — అందువల్ల వారు శాసనసభలతో సామాన్యంగా కలుపుగోలుతనంతోనే వ్యవహరించేవారు.

జేమ్స్‌టౌన్ వలస స్థాపించబడిన నాటినుండి బ్రిటిషు ప్రభుత్వానికి ఈ వలసలను గురించిన భావం క్రమంగా మార్పు చెందింది. ఈ వలసదారులు సంపూర్ణ స్వయం పరిపాలనకు అర్హులు కానట్టూ, బ్రిటిషు దీవులలో నివసిస్తూన్న ప్రభుశక్తి పరాయణులైన ఆంగ్లేయులతో వీరు సమానులు కానట్టూ, బ్రిటన్ పారిశ్రామికోత్పత్తులను కొంటూ ఆ పరిశ్రమలకు అవసరమైన ముడిసరుకులు సరఫరాచేస్తూ ఇంగ్లండుకి సేవ చేయడమే సదా ఈ వలసదార్ల కర్తవ్యమైనట్టూ — బ్రిటిషుప్రభుత్వం వ్యవహరించటం మొదలుపెట్టింది. అయినప్పటికీ, సుమారు 150 సంవత్సరాలపాటు ఎడతెరిపిలేకుండా సాగుతూ వచ్చిన సంగ్రామాలవల్ల, ఇతర ఇబ్బందులవల్లనూ, బ్రిటిషుప్రభుత్వానికి ఈ వలసలపై కట్టుదిట్ట

మైన పరిపాలన సాగించడంగాని, వారి సంపదను కాపాడడంగాని సాధ్యంకాలేదు. కాని ఇప్పుడు 1763 లో ఫ్రాన్స్, స్పెయిన్ దేశాలతో స్పర్ధలు తీరిపోయిన తరువాత బ్రిటిషు ప్రభుత్వం కార్యక్రమానికి ఉపక్రమించింది.

నౌకాయాన శాసనాలను తీవ్రతరం చేసి, వాణిజ్యంలో అమెరికా శ్రేయస్సుకన్న మాతృదేశ శ్రేయస్సుకి అధిక ప్రాముఖ్యం ఇవ్వవలసిన సమయం వచ్చిందనీ, యుద్ధంవల్ల పూర్తిగా ఖాళీ అయిపోయిన ప్రభుత్వ ధనాగారాన్ని తిరిగి నింపడంకోసం పన్నులు పెంచవలసిన అగత్యం ఏర్పడిందనీ, బ్రిటన్‌లోని ప్రభుత్వాధినేతలు నిశ్చయించారు.

ఈ కారణాలన్నింటి పర్యవసానంగా ఇంగ్లండుకీ, అమెరికాకు మధ్యజరిగిన యుద్ధంలో ఎవరిది "ధర్మం?" ఎవరిది "అధర్మం?" ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పడానికి వీలులేదు. ఆంగ్ల ప్రభుభక్తిగల వలసలన్నీ స్వాతంత్ర్య ప్రతిపత్తి కలిగి కేంద్రంలో ఒక సమాఖ్య (Federation) ను ఏర్పరచుకొని, దానిలో భాగస్వాములుగా ఉండాలని అమెరికనులు కోరారు; బలమైన కేంద్రప్రభుత్వం అవసరమని బ్రిటను భావించింది. ఏ పక్షానికా పక్షం తన శ్రేయస్సును దృష్టిలో నుంచుకొని వ్యవహరించింది. ఉభయ పక్షాలకు పరస్పరాభిప్రాయాల పర్యవసానాలను గురించి గాఢమైన అనుమానాలు ఉన్నవి. సామాన్యంగా సర్వత్ర జరిగే విధంగానే, ఉభయ పక్షాలలోని తీవ్రవాదుల వల్ల చివరికి పోరాటం తప్పనిసరి అయింది.

అమెరికనులు స్వాతంత్ర్యం సంపాదించుకొన్న నాటినుండీ, బ్రిటనుకూడా అమెరికావాదాన్నే బలపరచింది. స్వాతంత్ర్యంగల అధినివేశాలతో కూడిన బ్రిటిషు కామన్వెల్తు ఏర్పాటు, ఇంచుమించు బెంజామిన్ ఫ్రాంక్లిన్ అభిప్రాయానుసారంగానే ఉన్నది. 1760 ప్రాంతంలో వలసదార్ల అసంతృప్తిని బ్రిటిషుప్రభుత్వానికి నివేదించడానికి ఫ్రాంక్లిన్ అమెరికా ప్రతినిధిగా ఇంగ్లండు వెళ్ళినప్పుడు, ఆయన ఈ పద్ధతినే సూచించినప్పటికీ బ్రిటిషు ప్రభుత్వానికి ఆనాడది నచ్చలేదు.

బ్రిటిషు సామ్రాజ్యమంతా చక్రవర్తికి లోబడిన ఒకే పరిపాలక వ్యవస్థ అని, భిన్నభిన్న స్వపరిపాలక సంస్థల సమాఖ్యకాదని, ఇంగ్లండు

ఎంత తీవ్రంగా భావిస్తున్నదీ తెలుసుకొనడానికి పంచదార శాసన మొక ప్రబల నిదర్శనం. ఈ శాసనంవల్ల అమెరికా వాణిజ్యానికి బాగా దెబ్బతగిలింది. ముఖ్యంగా, న్యూఇంగ్లండు ఫ్రెంచివారికిచెందిన పశ్చిమ ఇండియా దీవులతో మంచి లాభసాటి వర్తకంసాగిస్తూ ఉండేది. ఈ వ్యాపారంలో న్యూ ఇంగ్లండ్ వాసులు ఆంగ్లేయులకు చెందిన పశ్చిమ ఇండియా దీవులకు అవకాశం ఇవ్వలేదు. వారు తగినంత ధర పెట్టలేక పోవడమే దీనికికారణం. బ్రిటిషు పశ్చిమ ఇండియా దీవుల రైతులు ఈ విధంగా తమకు చాలా నష్టం వస్తున్నదని ఫిర్యాదు చెయ్యగానే, పార్ల మెంటు "ఆ వ్యాపారాన్ని తమ కుటుంబంలోనివారి"తోనే సాగించాలని న్యూ ఇంగ్లండును బలవంతపెట్టింది. ఫ్రెంచి ఇండియాదీవులనుండి వచ్చే దిగుమతులపైన దారుణమైన సుంకం విధించడంద్వారా ఈ వత్తిడి సమర్థంగా అమలు జరుపబడింది.

పశ్చిమ ప్రాంతముకూడా లభించడంతో బ్రిటిష్‌వారు మరొక సమస్యను ఎదుర్కొనవలసి వచ్చింది. దీనివలనకూడా వారు అమెరికా మీద ఇంకా ఎక్కువ అధికారం చెలాయించడం, అది సంఘర్షణకు దారితీయడం జరిగింది; ఈ నూతన ప్రాంతంలో ఓడిపోయిన ఫ్రెంచి వారు, వారి మిత్రులైన ఎర్ర ఇండియనులు మాత్రమే ఉన్నారు. వీ రెవ్వరికీ తమను జయించిన వారిపై ఏ విధమైన సద్భావం ఉండదు గదా! బ్రిటిష్‌వారు ఎర్ర ఇండియన్‌ల నందరినీ తరిమివేస్తారంటూ, ఫ్రెంచివారు చల్లగా ఎర్ర ఇండియనులను ప్రేరేపించేసరికి వారు పాంటియాక్ అనే సమర్థుడైన నాయకుని ఆధిపత్యంక్రింద తిరుగుబాటు చేసి చాలా బ్రిటిష్ దుర్గాలను పట్టుకొన్నారు.

నిజానికి, ఈ పరిస్థితులలో తూర్పుతీరపు వలసలలోవలె పడమటి వలసలలోకూడాకూ స్వపరిపాలనవిధానం ఏర్పరచడానికి అవకాశం లేకపోయింది. ఆనాడు ముఖ్యంగా కావలసినవి సైన్యం, మందుగుండు సామగ్రి, ఎలిఘెనీ పర్వతాలకు పశ్చిమాన ఉన్న శత్రుసంఘాలపై దృఢమైన అధికారం సంపాదించడం.

ఆ ప్రకారం, మూడవజార్జి, ఆయనమంత్రులు పాశ్చాత్య ప్రాంతాల పరిపాలనబాధ్యతను తామే స్వీకరించి, వలసదారులు ఆ ప్రాంతానికివెళ్ళి ఆక్రమించుకొనడానికి వీలులేదని కూడా శాసిం

చారు. అప్పటికే ఎలీఘెనీ పర్వతాలు దాటిపోయి అక్కడ నివాసాలు ఏర్పరచుకొన్న వారి నందరినీ వెనుదిరిగి తమ యథాస్థానాలకు పోవలసిందని ఆజ్ఞాపించారు. ఎర్ర ఇండియనులు తమ భూములను అమ్మదలచుకుంటే బ్రిటిష్ ప్రభుత్వానికే అమ్మాలిగాని, విడిగా వలసదార్లకు అమ్మరాదని ఆంక్ష విధించారు. బాగా లాభసాటిగా సాగుతూన్న ఉన్ని వ్యాపారాన్ని నిర్వహించడానికి, బ్రిటిష్ ప్రభుత్వమే కొందరు ఏజెంట్లను నియోగించింది. ఈ విధంగా అనేక విధాల అసంతృప్తులైన అమెరికనులు అమితాగ్రహంతో పళ్ళు కొరకడం మొదలుపెట్టారు.

నిజానికి నిష్పాక్షికదృష్టితో చూచే యడల, ఆంగ్లచక్రవర్తి తీసుకున్న ఈ చర్యలు కొంతవరకు హేతువాద బద్ధమైనవిగాను, అవసరమైనవిగాను కూడా కనిపిస్తాయి. ఆయన వలసదార్లను యథేచ్ఛగా పశ్చిమదిశకు పోనిచ్చిఉంటే, వారు వెళ్ళి అక్కడ భూమిని, ఆదివాసులను కొల్లగొట్టడం ప్రారంభించగానే అరాచకస్థితి ఏర్పడి ఉండేది. మరొక విధంగా, పశ్చిమదిశకు వెళ్ళడానికి వీలులేదన్న ఆంక్ష అమెరికనులమీద మాత్రమే విధింపబడడం పాక్షికంగా ఉన్నదనీ, ఫ్రెంచివారిని ఓడించడంలో వలసదార్ల సైన్యాలుకూడా సహాయపడినందున, ఆ విజయఫలితాలలో తమకు భాగం ఉండాలని వారు కోరడం సబబే అని కూడా వాదించవచ్చు.

మొత్తంమీద ఈ నూతనసంపద ఆంగ్లచక్రవర్తికేగాని, అమెరికావలసలకు దానితో ఏమీ సంబంధంలేదన్నట్టు అయింది. పైగా, నూతన ప్రపంచంలో క్రొత్తగా సంపాదించిన ప్రాంతాలను కట్టుదిట్టం చేసుకొనడానికిగాను బ్రిటను కొన్ని వేలమంది "ఎర్రకోట్ల" సైనికులను ఆ ప్రాంతానికి పంపి, వారి పోషణకయే ఖర్చులో కొంతభాగం అమెరికనులు భరించాలనడం వారికి మరింత కోపకారణమయింది. అంతేకాదు. సైనికవసతి శాసనాన్ని అనుసరించి ఈ సైన్యమంతటికీ భోజన భోజనాది సౌకర్యాలు కలిగించడంలో వలస ప్రభుత్వాలు విరివిగా సహాయం చేయాలని ఇంగ్లండు ఆదేశించింది.

ఈ వలసలపైన బ్రిటన్ అధికారం చెలాయింపగోరుతున్నదని నిరూపించే ఈ చర్యలు ఒక్కొక్కటి జరిగినప్పుడల్లా అమెరికనులలో

చెలరేగుచుండిన ఆందోళనను గమనించి అయినా ఆంగ్లచక్రవర్తి, పార్లమెంటూ, నిగ్రహంతో వ్యవహరించలేదు. అమెరికనులు మొదటినుంచీ స్వతంత్రులుగా తమ హక్కులను నిలబెట్టుకోవాలనే పట్టుదలగలవారు. అందువల్ల బ్రిటను అధికారం చెలాయింపజూచిన, స్వల్పవిషయాలను గురించికూడా వీరు పెద్దగా ఆందోళన ప్రారంభించారు.

బ్రిటిష్ ప్రధానమంత్రి జార్జ్ గ్రెన్విల్‌కి 1764 లో అమెరికాను గురించి ఇంచుమించు ఏమీ తెలియదు. కొద్దోగొప్పో విన్నదేమైనా ఉంటే, దానివల్ల అతనికి కలిగింది అమెరికాపట్ల ఏవగింపు మాత్రమే. ఇతడు అమెరికాకు రేవు సుంకపు ఉద్యోగులను, గస్తీ నౌకాదళాలను పంపి, నౌకాశాసన నిబంధనలను కట్టుదిట్టంగా అమలు జరిపారు; వార్తాపత్రికలకు, కరపత్రాలకు, దస్తావేజులు మొదలైన వాటికి స్టాంపుపన్ను వేయడానికి నిశ్చయించాడు. వీటివల్ల లభించే ఆదాయం బ్రిటిష్ సైన్యానికయే ఖర్చుకొరకు ఉపయోగపడాలని ఆయన సంకల్పం. స్టాంపులచట్టాన్ని పార్లమెంటు ఆమోదించినప్పుడు, దానిపైన బ్రహ్మాండమైన ఆందోళన చెలరేగగలదని అట్లాంటిక్ సముద్రానికి అద్దరిని ఇద్దరినీ కూడా ఎవ్వరూ ఊహించలేదు. ఉదాహరణకు బెంజమిన్ ఫ్రాంక్లిన్‌కికూడా ఇలాంటిదేదో జరుగుతుందని ఎంతమాత్రం తెలియదు. సరికదా స్టాంపులు అమ్మే ఉద్యోగాలకు దగ ఖాస్తులు పెట్టవలసిందిగా ఆయన తన స్నేహితులిదరికి సలహా ఇచ్చాడు.

కాని, వలసలలో సర్వత్ర ఈ శాసనంపట్ల వెంటనే తీవ్రప్రతిఘటనోద్యమం బయలుదేరింది. వర్జీనియా వాసులపై పన్నువిధించే హక్కు వర్జీనియా శాసనసభకు మాత్రమే ఉన్నదని, ఆశాసనసభా సమావేశంలో పాట్రిక్ హెన్రీ గర్జించాడు. "ఆ హక్కు ఇతరులకు ఉన్నట్టు సూచించే చర్యలన్నీ న్యాయశాస్త్రానికి, రాజ్యాంగానికి, ధర్మానికి విరుద్ధమైనవీ, బ్రిటిషువారియొక్కయు, స్వాతంత్ర్యాన్ని నాశనం చేసేవి" అని, ఆ సమావేశంలోనే అతడు ఘాటైన తీర్మానాన్ని ప్రతిపాదించి, ఆమోదింపజేశాడు.

ఈ స్టాంపుల శాసన ప్రతిఘటనోద్యమజ్వాల వెనువెంటనే మసాచూసెట్సులోకూడా అంటుకున్నది. జేమ్స్ ఓటిస్ శామ్యూల్ ఏడమ్స్ ఆ మంటను ఎగసన్రోసి పెద్దది చేశారు. తన వక్తృత్వశక్తితో

ప్రజాసామాన్యంలో పలుకుబడి సంపాదింపగలిగిన ఏడమ్స్ బ్రిటిషు నౌకావ్యాపార విధానాన్ని ఖండించే ఉద్యమంలో అప్పటికే సుప్రసిద్ధుడు. "న్యాయశాస్త్రబద్ధమైన ప్రాతినిధ్యంలేకుండా, పన్నులు విధింపబూనుకొనడం ప్రజలను బానిసలుగా చెయ్యడానికి ఒక సాధనం" అంటూ ఆయన "బ్రిటిషు సింహం" పైన మండిపడ్డాడు.

న్యూఇంగ్లండు, న్యూయార్క్, పెన్సిల్వేనియాలలో దొమ్మీలు జరిగినవి. స్టాంపులు అమ్మేవారు ప్రజాభిప్రాయానికి వెరచి తమ ఉద్యోగాలకు రాజీనామాలిచ్చారు. "స్వాతంత్ర్యపుత్రులు" (Sons of Liberty) మొదలైన తీవ్రవాద సంఘాలు సర్వత్ర బయలుదేరి దౌర్జన్య చర్యలను ప్రోత్సహించినవి.

స్టాంపుల నిరసన మహాసభ (Stamp Act Congress) జరిగింది. తొమ్మిది వలసల ప్రతినిధులు ఈ సభలో పాల్గొన్నారు. వలస శాసనసభలే వలసలలో చెల్లదగిన శాసనాలు చేయగలవని వర్జీనియా శాసనసభ చేసిన తీర్మానం ధోరణిలోనే ఈ మహాసభకూడా ఒక తీర్మానం చేసింది.

విదేశాలలో ఉన్న ఆంగ్ల ప్రజాసామాన్యానికి ఈ వలసలలో జరిగే ఆందోళన యావత్తు, నమ్మదగనదిగాను, అసందర్భంగాను కనిపించింది. పార్లమెంటు బ్రిటిషు సామ్రాజ్యానికంతటికీ శాసననిర్మాణసంస్థగా వ్యవహరిస్తూ సామ్రాజ్యంలోని అందరి యోగక్షేమాలకూ కృషిచేస్తుంది గదా! నిజానికి ఇంగ్లండులోనే చాలా ప్రాంతాల ప్రజలకు పార్లమెంటుకు ప్రతినిధులను పంపే అధికారం లేదుగదా! అయినా వాణిజ్య వ్యవసాయ, వృత్తి ఉద్యోగాలకు చెందిన పలుకుబడిగల వర్గాలన్నిటికీ సామాన్య ప్రజాసభలో (House of Commons) ప్రాతినిధ్యం ప్రాతినిధ్యం ఉన్నదికనుక, పౌరుల ప్రజాస్వామ్యపు హక్కులన్నీ పరిరక్షింపబడతాయనడానికి ఇంతకన్న పెద్దహామీ ఏమికావాలి ?—" అని ఆంగ్ల ప్రజాసామాన్యం భావించేది.

18 వ శతాబ్ది మొదలు 20 వ శతాబ్దివరకు సాగిన అనేక వాదోపవాదాల ఫలితంగా రూపొందిన వయోజన నియోజనాధికార పద్ధతి (Adult Franchise) అప్పటికి ఎవ్వరికీ తెలియదు. ఒక ప్రభుత్వంలోకి ప్రతినిధులనుపంపే అధికారం ఒకప్రాంతానికి లేనప్పుడు ఆ

సాధ్యంకాలేదు.

స్టాంపుల శాసనం ఒక సంవత్సరం అమలులోవున్న మీదట రద్దు చేయబడింది. దానితో అమెరికా వలసదారుల ఆనందానికి మేర లేదు. కాని, అచిరకాలంలోనే అంత అసహ్యంగానూ ఉన్న మరికొన్ని శాసనాలను వారు ఎదుర్కొనవలసి వచ్చింది. టౌన్ షెండ్ శాసనాల వల్ల వలసలోకి దిగుమతి అయే గాజుసామగ్రి, సీసం, రంగులు, కాగితం, తేయాకుల పైన కొత్తపన్నులు విధించబడినవి. ఈపన్నులవలన లభించే ఆదాయాన్ని ఆంగ్లగవర్నర్ల జీతాలకు వినియోగించాలి అని కూడా ఆ శాసనాల్లో నిర్వచించారు. ఈ విధంగా వలసల గవర్నర్లపై, ఆ వలసల శాసనసభలకు గల రవంత అధికారం కూడా కున్న చుట్టబడింది: అమెరికా వ్యవహారాల్లో పార్లమెంటు విశేషాధికారాలను చెలాయింప గోరుతున్నట్టు అనేకవిధాల స్పష్టమయినది.

అమెరికాలో మళ్ళీ పెద్ద ఆందోళన చెలరేగింది. అమెరికా వాణిజ్యానికి అనర్థదాయకములైన టౌన్ షెండ్ శాసనాలకూ నౌకాశాసనాలకూ నిరసన తెల్పడానికి తీసుకొనదగిన చర్యలను సూచిస్తూ శామ్యూల్ ఏడమ్స్ ఒక లేఖవ్రాసి వలసలన్నిటికీ పంపాడు. బ్రిటిషువస్తువులను బహిష్కరించాలనే ఉద్యమ మొకటి బయలుదేరి నానాటికీ వృద్ధి కాజొచ్చింది. బ్రిటన్‌కి ఇది అమితాగ్రహం కలిగించింది. మసాచూసెట్స్ శాసనసభ రద్దు చేయబడింది. రెండు బ్రిటిషుదళాలు బోస్టన్‌కి పంపబడినవి.

1770 వ సంవత్సరం మార్చిలో తేయాకుపైన విధించిన కొద్దిపాటి పన్నుతప్ప మిగిలిన పన్నులన్నీ ఇంగ్లండు రద్దుచేసింది. కాని సరిగా ఆ రోజునే అమెరికా పౌరులకు బ్రిటిషు సైనికులకు మధ్య "బోస్టన్ హత్యాకాండ" (Boston Massacre) అని అమెరికా

దేశభక్తులచే అభివర్ణింపబడిన దారుణ సంఘటన జరిగింది. కొంతమంది బాలురు ఒక గస్తీ సైనికునిపైన మంచు పెళ్లలు విసిరేసరికి, అతడు తోడి సైనికులను సహాయానికి పిలుచుకొనడంతో ఈ సంఘర్షణ ప్రారంభమయింది. అనంతరం జరిగిన పోరాటంలో వాడబడిన ఆయుధాలు మొదట మంచుపెళ్లలు, తరువాత పిడికిళ్ళు. కాని చివరకు కంగారుపడిపోయిన ఆ ఎర్రకోట్ల సైనికులు ఒక్కసారిగా చాలా తుపాకిగుళ్ళుకూడా ఉపయోగించారు. ఈ "హత్యాకాండ" లో ఐదుగురు పౌరులు మరణించారు. తత్ఫలితంగా శామ్యూల్ ఏడమ్స్ కోరిన ప్రకారం ఆ నగరంలోని బ్రిటిషుదళాలన్నీ ఉపసంహరింప బడినవి.

అమెరికా విప్లవానికి పూర్వదశాబ్దిలో ఇంగ్లండు ఎన్నోసార్లుబిర్ర బిగవడం, అనంతరం మళ్ళీ మెల్లిగా తన పద్ధతి మార్చుకొని సమాధాన విధానం అవలంబించడం గమనిస్తే, అమెరికాలో అనుసరించదగిన విధానాన్నిగురించి బ్రిటిషు విధాన నిర్ణాయకులలోనే భిన్నాభిప్రాయాలున్నవని బోధపడుతుంది. విలియంపిట్, లార్డునార్తువంటి నాయకులు సామరస్య విధానాన్ని సమర్థిస్తూ, తమకు పూర్వం గ్రెన్విల్లీ, టౌన్‌షెండ్ మున్నగుమంత్రులు కనికొద్దీ వేసిన పన్నులలో కొన్నింటిని తగ్గించడం, మరికొన్నింటిని రద్దుచేయటం జరుగుతూ ఉండేది. ఇంగ్లండులో విగ్గుల రాజకీయపక్షంలో ప్రాతినిధ్యంగల ఆంగ్ల వర్తకులలో అమెరికా అనుకూలురుకూడా చాలామంది ఉన్నారు. అమెరికనులు కొంచెం పచ్చపచ్చగా ఉంటేనే తాము వారితో వ్యాపారం చేసుకొనవచ్చునని, అమెరికా తమపైన కోపంతో తమ వస్తువులను బహిష్కరించే యెడల అట్టి అవకాశంఉండదని ఈవ్యాపారస్థులయోచన.

ఇలాగే అమెరికనులలోకూడా, బ్రిటిషు ప్రభుత్వానుకూలురు కొందరు ఉండేవారు. ఇలాంటివారు ముఖ్యంగా ధనవంతులలో ఉండేవారు. అరాచకత్వం వ్యాపారానికి నష్టదాయకం అయినందువలన తీవ్రవాదులు లేవదీసే బహిష్కరణోద్యమాలకు, దొమ్మీలకు వారు విముఖులు.

మొత్తంమీద అమెరికాలో అధికసంఖ్యాకులు విప్లవానికి పూర్వం ఇంగ్లండు కొత్తశాసనాలు చేసినప్పుడల్లా ఆగ్రహావేశ పరవశులవుతూ

ఉండడం మళ్ళీ వాటిని గద్దుచేసి నప్పుడు కృతజ్ఞభావంతో సంతో షించడం జరుగుతూ ఉండేది. వలసదారులలో సామాన్యుడు (లేక సగటు పౌరుడు) అమెరికా ఇంగ్లాండుతో సంబంధంలేకుండా పూర్తిగా స్వాతంత్ర్యం పొందాలని ఆశించేవాడు కాడు. అతడు కోరు కునేదల్లా తాను తన పొలంలోనో, లేదా దుకాణంలోనో ప్రశాం తంగా పని చేసుకోనడానికి అవకాశం మాత్రమే. కాని, సామాన్యంగా చరిత్ర పురోగతిని నిర్ణయించేవారు తీవ్రవాదులు. వారు ప్రశాంత ప్రజలలోని ప్రధాన విభేదాలను కనుగొని, వాటిని ఇంకా ఎక్కువచేసి బలాబలాల పరీక్షతో తిప్ప పరిష్కరించుకొనడానికి వీలులేని తీవ్రసమ స్యగా తయారు చేస్తారు.

బోస్టన్‌లో 1773 లో జరిగిన సుప్రసిద్ధమైన "టీ పార్టీ" ఉదంతాన్ని ఈ తీవ్రవాదులు తమ లక్ష్యసాధనకు విజయవంతంగా ఉపయోగించుకున్నారు, ఆ తేయాకు తూర్పు ఇండియా కంపెనీవారిచే సరఫరా చేయబడింది. ఆ కంపెనీ డబ్బుఇబ్బందులలోపడి పార్ల మెంటును ఆశ్రయించింది. జార్జిచక్రవర్తి పార్లమెంటులో ఆయన తాబేదార్లూ పెద్దమొత్తాల్లో నిలవ ఉండిపోయిన ఆ కంపెనీతాలూకు తేయాకును తక్కువధరకు అమెరికాలో అమ్మించడానికి నిశ్చయిం చారు. అమెరికాలో ఈతేయాకుపైన పౌనుకు మూడు పెన్నీలు చొప్పున దిగుమతి సుంకం చెల్లించినప్పటికీ ఆ తేయాకు అమెరికనులకు ఇత రత్రా లభించే తేయాకుకన్న తక్కువధరకే గిట్టేది.

కాని, అమెరికా దేశభక్తుల పట్టుదలకు తమపైన పార్లమెంటు పన్ను విధించరాదన్న సిద్ధాంతమే ముఖ్యం. ఈ తేయాకు తగ్గింపుధరకు దొరకుతున్నదనే సంగతివారు పట్టించుకోలేదు. "గుత్తవ్యాపారం నశిం చాలి!" "పార్లమెంటు పన్ను విధించరాదు!" అనే నినాదాలుచేస్తూ, ఆతేయాకును బహిష్కరించారు. బోస్టన్‌లో చాలా బహిరంగసభలు జరి గినమీదట, కొందరు పౌరులు ఎర్రఇండియనులవలె వేషాలు వేసుకొని ఆ తేయాకుతోవచ్చి రేవులలోఉన్న పడవలలోకి ఎక్కి, ఆ తేయా కంతటినీ సముద్రంలోకి నెట్టివేశారు.

ఈ దౌర్జన్యచర్యతో జార్జిచక్రవర్తి ఓరిమి కట్ట తెగిపోయింది. సహజంగా అతడు వలసదార్లపై సానుభూతి కలవాడు కాడు. అందు వల్ల ఈ సంఘటనతో ఉగ్రుడైపోయి "నేరం" జరిగిన ప్రదేశమయిన

బోస్టన్ కీ, మసాచూసెట్స్‌కు తగినశాస్తి చెయ్యడానికి నిశ్చయించాడు. అనంతరం 1774 లో పార్లమెంటు సమావేశమై, చక్రవర్తి సూచనల ప్రకారం "దుస్సహ శాసనాలు" గా నిరసింపబడిన కొన్ని చట్టాలను ఆమోదించింది. ఈ శాసనాల ప్రకారం బోస్టన్ నగరం నష్టమైన టేయాకు ఖరీదు పూర్తిగా చెల్లించాలనీ, పట్టణసభలు గవర్నరు అధికారాన్ని ఆమోదించేవరకూ బోస్టనునుండి జరిగే నౌకా వాణిజ్యమంతా బంద్ చేయబడాలనీ బ్రిటిషు ప్రభుత్వం ఉత్తరువు చేసింది. మసాచూసెట్స్ బ్రిటిషువారి ఆయుధాగారం అయింది. జెనరల్ గేజ్ ఆ ఆయుధాగారానికి అధ్యక్షుడు.

వెంటవెంటనే జరుగుతూన్న ఆ దారుణ సంఘటన లన్నింటినీ గమనిస్తూన్న ఇతర వలసలు తమ తోడిరాష్ట్రమైన మసాచూసెట్స్ వాసులపట్ల సంపూర్ణ సానుభూతి ప్రకటించడమే కాదు; వారికి అత్యవసరమైన ఆహారపదార్థాలనుకూడా ఇతరవలసలు సరఫరాచేసినవి. ఆందోళన క్రమంగా వృద్ధి అయినకొద్దీ వర్జీనియా పౌర ప్రతినిధి సభ (Virgenia House of Burgesses) ఒక సూచనచేసింది. ఈ సూచన ప్రకారం వివిధ వలసల ప్రతినిధులంతా ఫిలడెల్ఫియాలో సమావేశం కావాలి. అమెరికాఖండ మహాసభ, లేక "కాంటినెంటల్ కాంగ్రెస్" 1774 సెప్టెంబరులో సమావేశపరుపబడింది. శ్యామ్యూల్ ఏడమ్స్, జాన్‌లు మసాచూసెట్స్ ప్రతినిధులుగాను, జార్జి వాషింగ్టన్, పాట్రిక్ హెన్రీలు వర్జీనియా ప్రతినిధులుగాను, జాన్ రట్లెడ్జ్, క్రిస్టోఫర్ గాడ్స్‌డెన్‌లు దక్షిణకెరోలినా ప్రతినిధులుగాను ఈ మహాసభలో పాల్గొన్నారు.

"తమన్యాయమైన హక్కులను స్వాతంత్ర్యాలను పునరుద్ధరించుకొనేనిమిత్తం......సజ్జనులందరూ హృదయపూర్వకంగా కోరుతూన్నప్రకారంవలసలకు గ్రేట్ బ్రిటన్‌కు నడుమ ఐకమత్య సామరస్యాలను పునః ప్రతిష్ఠించేనిమిత్తం...వలసల ప్రస్తుతపరిస్థితినిగురించి సంప్రదించడం,... వివేకపూరితమైన యోగ్యమైన చర్యలనుగురించి చర్చించడం" ఆ మహాసభ లక్ష్యమని నిర్వచిస్తూ నాయకులంతా అతి జాగరూకతతో, విజ్ఞతతో వ్యవహరించారు. హక్కులపత్రమొకటి తయారుచేసి ఇంగ్లండు పంపారు. పార్లమెంటు తమ స్వాతంత్ర్యానికి ఎంతమాత్రం భంగం

కలిగింపరాదని ఆ పత్రంలో స్పష్టం చేశారు. ప్రతిపట్టణంలోను, జిల్లాలోను భద్రతా సంఘాలు ఏర్పరచి, వాటి యాజమాన్యాన బ్రిటిషు వస్తువుల బహిష్కరణోద్యమాన్ని పటిష్ఠంగా కొనసాగించాలని ఆదేశించారు. ఈ సంఘాలు ఆంగ్లవస్తు బహిష్కరణోద్యమానికి అభ్యంతరం చెప్పినవారి పేర్లన్నీ సేకరించి పంపాలి. దానిని ఇట్టి వలసల అభ్యుదయానికి అనుకూలురెవరో ప్రతికూలు రెవరో కాంగ్రెసుకు తెలియడం అవసరం అన్నారు; వలసలకు జరుగుతూన్న అన్యాయాలలో శ్రద్ధ చూపని వారిని భయపెట్టడంకోసం ఈ విధానం అవలంబించారు. చిట్టచివరికి, అప్పటికీ చిక్కులన్నీ తీరకకపోతే, 1775 మే నెలలో ఈ కాంటినెంటల్ కాంగ్రెస్ మరొక సమావేశం జరపాలనికూడా నిశ్చయించారు.

ఆ గడువులోపల ఆ చిక్కులు తీరిపోలేదు. మసాచూసెట్స్ ప్రజలలో విద్వేషభావం చిక్కబడింది, వలసదారులు "నిమిష వీరులు" (Minute Men) అనే పేరుతో ఒక పౌరసైన్యాన్ని ఏర్పాటు చేశారు. దేశభక్తిపూరితులైన ఈ పౌరులు హెచ్చరికచేసిన ఒక్క నిమిషంలోవచ్చి పోరాటానికి సిద్ధమవుతారు. కనుక వీరికి నిమిషవీరులని నామకరణం చేశారు. ఈ సైనికుల కోసం కంకార్డ్ పట్టణంలో మందుగుండు సామగ్రిని ఉత్పత్తిచేసే రహస్య కర్మాగార మొదటి స్థాపించారు. 1775 ఏప్రిల్ 19 వ తేదీని ఈ గిడ్డంగిని పట్టుకొని "దేశద్రోహులైన" జాన్ హన్‌కాక్‌ని, శామ్యూల్ ఏడమ్స్‌ను బంధించడం కోసం బోస్టన్ నుండి జెనరల్ గేజ్ ఒక బ్రిటిష్‌పటాలాన్ని పంపాడు. పాల్ రీవియర్, విలియండాజ్ అనే ఇద్దరు దేశభక్తులు ఈ సంగతి పసికట్టి ముందుగా రాత్రికిరాత్రి గుర్రాలమీద బయలుదేరి బ్రిటిష్ పటాలాల కన్న ముందుగా పోయి ఈ వార్త తెలపడంవల్ల "నిమిష వీరులు" చిన్నపటాలాన్ని పోగుచేసుకొని ఆ బ్రిటిష్ పటాలాన్ని దారిలోనే అటకాయించారు. బ్రిటిష్‌సైనికులు వారిని తొలగిపొమ్మని హెచ్చరించినా తొలగిపోనందున, కాల్చడం ప్రారంభించారు. ఆ తుపాకికాల్పే "జగద్విఖ్యాతమైన అమెరికా విప్లవానికి" నాంది అయింది. ఈపోరాటంలో ఎనమండుగురు అమెరికనులు మరణించారు.

బ్రిటిష్‌వారు స్వల్ప ప్రతిఘటనను ఎదుర్కొంటూ కంకార్డ్ వరకూ తిసుకొని వెళ్ళారు. కాని వారు బోస్టన్‌కి తిరిగివచ్చేటప్పుడు

మాత్రం, తొలిపోరాటంలో "నిమిషవీరులు" పొందిన నష్టాలకన్న ఎక్కువగా నష్టపడ్డారు. దారిపొడుగునా ఉన్న ఆపిల్ చెట్లవెనుక, రాతి స్తంభాలవెనుక నిలబడి యుద్ధసన్నద్ధులైన రైతులు ఈ "ఎర్ర కోట్ల" పటాలంమీద చాటునుండి కాల్పులు జరిపి గట్టిదెబ్బలు తీశారు. ఇదిగాక ఈ పటాలం ఎలాగో చచ్చిచెడి, తిరిగి తీరా నగరంలో సురక్షిత స్థలానికి చేరుకో బోయేసరికి, వలససైనికులు 16,000 మంది వారిని ముట్టడించారు.

ఈ తొలియుద్ధాన్ని గురించిన వార్తలు శరవేగంతో అన్ని వలసలకు తెలిసినవి. యుద్ధం ప్రారంభమైనందుకు కొంతమంది సంతోషించారు. మరికొందరు "నిమిషసైనికుల" దుందుడుకుతనాన్ని ఖండించారు. అధికసంఖ్యాకులు అప్పటికీ ప్రశాంత పరిష్కారం సాధ్యం కావచ్చునని ఆశిస్తున్నారు.

మే 10 వ తేదీన సందిగ్ధస్థితిలో ఫిలడెల్ఫియాలో రెండవ కాంటినెంటల్ కాంగ్రెస్ సమావేశం ప్రారంభమయింది. ఈ సమావేశం ఇంగ్లండుపై యుద్ధం ప్రకటించడంతోపాటుగా, శాంతిని పునరుద్ధరించవలసిందని జార్జిచక్రవర్తికి ఒక విజ్ఞాపనకూడా చేసింది. ఎటుపోయి ఎటువచ్చినా సంసిద్ధంగా ఉండటానికిగాను జార్జ్ వాషింగ్టన్ నాయకత్వంక్రింద ఒక పెద్ద సైన్యాన్ని సన్నద్ధం చేయడానికి తగిన ఏర్పాట్లుచేసింది. మసాచూసెట్స్‌లో ప్రారంభమైన యుద్ధానికి వర్జీనియా వాసిని సర్వసైన్యాధిపతిని చేయడంమాత్రే నాడు వివిధ వలసల మధ్య వృద్ధి అవుతున్న సహకార సమరసధోరణి వ్యక్తమవుతుంది.

మరొకవంక బ్రిటిష్ అధికారులు, శాంతి స్థాపనకోసం వలసదార్లు ఇచ్చకాలకు చేస్తున్న విజ్ఞప్తులను బుట్టదాఖలు చేసి, తమ సాయుధబలంతో విప్లవాన్ని పూర్తిగా అణచివేయడానికి సిద్ధమయారు. జార్జి చక్రవర్తి తన మామూలు సైన్యానికితోడు హెస్సీ, అన్‌హాల్ట్, బ్రన్‌స్విక్ రాకుమారుల వద్దనుండి రెండులక్షల జర్మన్ సైనికులను కిరాయికి పుచ్చుకున్నాడు.

ఈ లోపున దేశంలోని వివిధ ప్రాంతాల్లో అమెరికా సైనికుల సంరంభం వృద్ధి అయింది. వారు బోస్టన్ సమీపంలో నగరాన్ని ఆను

కొని ఎత్తుగా ఉన్న బంకర్ హిల్ ప్రాంతాన్ని ఆక్రమించుకొని, దాని పునరాక్రమణకై బ్రిటిషువారు చేసిన ప్రయత్నాలన్నిటిని తిరుగకొడుతో, చివరకు తమవద్దనున్న మందుగుండు సామగ్రి అయిపోయేటంత వరకు దానిని కాపాడగలిగారు. ఆ సంవత్సరంలోనే, అనంతరం కొంతకాలానికి కెనడాను జయించడానికి పంపిన ఒక దళం మాంట్రియల్ ను ఆక్రమించుకొన్న పిదప, పరాజయం పొందింది. ఈ పరాజయానికి ప్రత్యామ్నాయంగా నార్ ఫక్, వర్జినియా, ఛార్ల్స్టన్, దక్షిణ కరోలినా ప్రాంతాల్లో ఆంగ్లేయులకు అనేక పరాజయాలు కలిగినవి.

అమెరికా వలసదారులు స్వాతంత్ర్య సంపాదనకై పెద్ద ఉత్సాహంతో ఉరుకులు పరుగులు పెట్టలేరు; ఉత్సాహం లేకపోయినా బలవత్పరిస్థితులలో మందంగా ముందుకు సాగారు. 1775 లో జరిగిన పోరాటంలో వారి ఆశయం: ఆంగ్లేయులుగా - అమెరికనులుగా కాదు- తమ హక్కులను కాపాడుకొనడం. బోస్టన్ లో జెనరల్ వాషింగ్టన్ సర్వసైన్యాధిపత్యం స్వీకరించేటప్పుడుకూడా ఆయన స్వాతంత్ర్యమనే భావమే తనకు "అసహ్యం"గా ఉన్నది అని వెల్లడించాడు.

ఈ విప్లవం ఏ దశలోనూ, ఆయోధాలు చేపట్టగలిగినవారందరూ పాల్గొన్న "సమగ్ర" యుద్ధంగా పరిణమించలేదు. మూడులక్షల పైచిలుకుగా ఉన్న వలసదార్ల జనాభాలో, ఎక్కువలో ఎక్కువ 25,000 మంది మాత్రమే వాషింగ్టన్ సైన్యంలో చేరారు. క్లిష్టదశలో ఆయన సైనికుల మొత్తం సంఖ్య మూడువేలమంది. అమెరికా రైతులు అంతలోనూ తమ ఇళ్లు వాకిళ్ళకు ప్రమాదంవస్తూందన్నప్పుడు మాత్రం గుంపులు గుంపులుగా సైన్యంలో చేరేవారు; కాని ఆ ప్రమాదం తప్పిపోగానే మళ్ళీ ఎవరిదారిన వారు తప్పుకునేవారు.

మరొకవంక చాలామంది అమెరికనులు బ్రిటిషువారికి మద్దతు చేయడం మొదలుపెట్టారు. ఈ విధంగా ఈ విప్లవానికి అంతర్యుద్ధ లక్షణంకూడా కొంతవరకు పట్టింది. బ్రిటిష్ టోరీలకు సహాయపడిన వారు చాలావరకు పై తరగతులవారు. అమెరికాలో ప్రజాపరిపాలన లేక "మంది" పరిపాలన ఏర్పడుతూందంటే వీరికి భయం. అందువల్ల జార్జి చక్రవర్తీ, దురహంకార పూరితులైన ఆయనమంత్రులూ ఎన్ని దురాగతాలు చేసినా వారి పరిపాలననే వీరు సమర్థించేవారు.

తన మంచిచెడ్డలను తాను చూచుకోగల సర్వతంత్ర స్వతంత్రమైన అమెరికానుగురించి కలలుగంటున్న శామ్ ఏడమ్స్, హెన్రీ పాట్రిక్ లవంటి దేశభక్తులకు 1775-81 మధ్య యుద్ధ సన్నాహాలు చేయడం అతి కష్టసాధ్యమైన పని అయింది. వారు భవిష్యత్తులోనికి చూడగల భావుకులనడానికి సందేహంలేదు; అయితే మార్గంలో తాము యెదుర్కొనవలసివచ్చే కష్టాలను వారు గమనించలేదు; తమ లక్ష్య సాధనపట్ల విశ్వాసంతో ముందుకు సాగడమే వారి సంకల్పం. ఇట్టి దేశభక్తులు, ఆందోళనపరులు దేశమంతటా విప్లవసంఘాలను స్థాపించి, ఆయావలసల శాసనసభలపై వత్తిడి తెచ్చి వాటిని యుద్ధానికి ఒడపరిచారు; రాజభక్తిభావాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేశారు; తరచు ప్రజలు అనిష్టతతోనైనా తమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొనేటట్లు చేశారు.

ఈ విప్లవ నాయకాగ్రేసరులలో ఒకడు థామస్ పైనీ అనే ఆంగ్లేయుడు. ఇతడు 1774 లో ఫిలడెల్ఫియాకు వలసవచ్చి ఎంతోకాలం కాకపూర్వమే, అమెరికాకు బ్రిటన్ పెత్తనంలేని, సంపూర్ణ స్వాతంత్ర్యం అవసరమని వాదించే తీవ్రవిప్లవవాది అయినాడు. పైనీ విస్తృతంగా వ్రాసిన గొప్ప రచయిత; "రాజరిక ప్రభుత్వమంటే అతనికి అసహ్యం;" అదొక పెనుభూతమన్నంత భయం. 1776 జనవరిలో అతడు ప్రకటించిన "సామాన్య లోకజ్ఞానం" (Common sense) అనే గ్రంథంలో అమెరికనులు ఒకవంక బ్రిటిషు చక్రవర్తితో యుద్ధం చేస్తూ, మరొకవంక పరస్పర సామరస్యం కావాలని కోరడంలోని అసమంజసతను విశదీకరించాడు. "ఇంగ్లండుకు ఐరోపాతో సంబంధం, అమెరికాకు అమెరికాతోనే సంబంధం" అనీ, "ఇంగ్లండుతో మనకు గల చిట్టచివరి అనుబంధసూత్రంకూడా త్రెంచివేసుకోవాలి" అనీ, ఆయన అమెరికనులను హెచ్చరించాడు.

ఈ గ్రంథం అమితంగా అమ్ముడుపోయింది. ప్రజలను ఉద్రిక్తపరచి, కార్యోన్ముఖులను చేసింది. ఆవేశాలు పెరిగినకొద్దీ, యుద్ధం ముమ్మరమయినకొద్దీ, శాంతి సాధనావకాశాలు సన్నగిల్లిపోవడం, కాంగ్రెస్‌లో సంపూర్ణ స్వాతంత్ర్య వాదానికి బలం చిక్కడం సంభవించింది. జూన్‌లో కాంగ్రెసు అమెరికా స్వాతంత్ర్య ప్రకటన పత్రాన్ని తయారుచేయడానికి గాను బెంజామిన్ ఫ్రాంక్లిన్, థామస్

జెఫర్సన్, జాన్ ఏడమ్స్ అనే ప్రముఖులతో సహా ఐదుగురు సభ్యులతో కూడిన ఒక ఉపసంఘాన్ని నియమించింది.

మొదటి ముసాయిదాను జెఫర్సన్ తయారుచేశాడు. తరువాత ఇతర సభ్యులు దీనిలో కొన్ని సవరణలు చేశారు. పిమ్మట కాంగ్రెస్ దానిని సమగ్రంగా చర్చించి మరికొన్ని మార్పులు చేసి, చివరకు 1776 జూలై 4 వ తేదీన ఆ రాజ్యాంగాన్ని ఆమోదించింది. అదే అమెరికా స్వాతంత్ర్య జన్మదినం.

ఈ వలసలు మాతృదేశాన్నుండి విడివడిపోవడానికిగల కారణాలు ఈ స్వాతంత్ర్య ప్రకటనలో దృఢమైన అసందిగ్ధమైన భాషలో విశదీకరింపబడినది; తరువాత అమెరికా రాజకీయ విశ్వాసాలు సంగ్రహంగా వివరింపబడినవి.

"ఈ దిగువ సత్యాలు స్వయంవ్యక్తములని మా అభిప్రాయం. మానవులందరూ సమానులుగా సృష్టింపబడ్డారు; సృష్టికర్త మానవులకు కొన్ని తిరుగులేని హక్కులను ప్రసాదించాడు; జీవనానికి, స్వేచ్ఛకు, సౌఖ్యాన్వేషణకు సంబంధించిన హక్కులు వీటిలో ముఖ్యమైనవి." ప్రజలకు ఈ హక్కులను సమకూర్చడంకోసం ప్రభుత్వాలు ఏర్పడినవనీ, ప్రజల సమ్మతితోనే ప్రభుత్వాలకు ఏ అధికారమైనా లభిస్తుందనీ కూడా ఈ పత్రం విశదీకరిస్తున్నది. ప్రభుత్వం గనుక ఈ కర్తవ్యాలను విస్మరిస్తే "అట్టి ప్రభుత్వంలో తగిన మార్పులు చేయడానికీ, లేదా పూర్తిగా దానిని రద్దుచేసి, మరొక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొనడానికీ కూడా ప్రజలకు హక్కు ఉన్నది." ఐరోపాలో అంధయుగాలనాటినుండి మొలకెత్తుచుండిన ప్రజాస్వామ్య భావబీజాలన్నీ ఈ స్వాతంత్ర్య ప్రకటనలో పొందుపరుపబడి ఉన్నవి. ప్రభుత్వమనగా ప్రజలకు సేవచేయడానికి ఏర్పడిన సంస్థగాని, ప్రజలపై పెత్తనం చెలాయించడానికి ఏర్పడినదికాదని నిర్వచించడం మూలంగా ఈ పత్రం నిరంకుశ ప్రభుత్వ విధానానికి మూలచ్ఛేదం చేసింది.

ఇంగ్లండుతో తెగతెంపులు చేసుకుని, అమెరికా సంయుక్త రాష్ట్రములను స్థాపించినట్లు ప్రకటించిన ఈ నూతనజాతి నిలవదొక్కుకొని ఆత్మరక్షణ చేసుకొనడంకోసం ఎన్నో కష్టాలను ఎదుర్కొనవలసి వచ్చింది. సమర్థుడు, వీరుడు, అద్వితీయనాయకుడు అయిన జార్జి వాషిం

ప్టన్ ప్రతిభకూడా ఈ ఎదురుగాలిని నిలువరించ లేకపోయింది. జెన రల్ హోవే, ఆయన 11,000 సైనికులను, వాషింగ్టన్ బోస్టన్ నుండి తరిమివేయగలిగాడు కాని, జెనరల్ హోవే ఇంతకన్న కీలకస్థానమైన న్యూయార్కు పట్టణాన్ని స్వాధీనం చేసుకొనడానికి వచ్చి వాషింగ్టన్ సేనలను ఎదుర్కొనినపుడు ఫలితం తారుమారయింది. అధికంగా వచ్చి పడిన ఆంగ్ల జర్మను సైన్యాలు అమెరికన్ సైన్యాలపైన అడుగడుగునా దెబ్బతీసినవి. బాగా నష్టపడిన అమెరికా సైన్యాలు దక్షిణదిశగా న్యూజెర్సీ వంకకు ఉపసంహరింపబడినవి.

కాంటినెంటల్ కాంగ్రెసు సభ, యుద్ధంలో తన సైన్యానికి తగిన మద్దతు చేయలేదు. వలసరాష్ట్రాలు పదమూడింటి మధ్యను దృఢమైన ఐకమత్యం ఏర్పడలేదు. కొత్తపన్నులు వేస్తే ప్రజలు బ్రిటను మీద తిరుగబడినట్టే తమపైనకూడా ఎదురు తిరుగుతారేమోనని కాంగ్రెసు ప్రతినిధులు భయపడుతుండేవారు. అందువలన సైన్యాలకు తగినంత మందుగుండు సామగ్రిగాని, ఆహారంగాని, సరఫరా అయ్యేది కాదు. దానితో, సైనికుల మనోధైర్యంకూడా సడలిపోవడం, సైన్యం లోనుండి పారిపోయేవారి సంఖ్య పెరిగిపోవడంకూడా సంభవించింది.

డెలావేర్ నది మీదుగా దక్షిణంగా పెన్సిల్వేనియాకు తరిమి వేయబడి, అత్యంత దుర్దశలో నున్నప్పుడు వాషింగ్టన్ అద్భుత సైన్యాధిపత్య ప్రతిభను ప్రకటించాడు. 1776 లో క్రిస్మస్ పండుగరోజు రాత్రి తన సైనికులనందరినీ కూడగట్టుకొని హఠాత్తుగా పెద్ద ఎదురు దెబ్బ తీశాడు. హిమమయమైన డెలావేర్ నదిని చిన్నచిన్న త్రోపుడు పడవలలో దాటిపోయి, ట్రెంటన్ లో పండుగ సరదాలో తప్పతాగి తందనాలాడుతూన్న జర్మన్ కూలీ సైనికులపై బడ్డాడు. వారంతా చెల్లాచెదరై పూర్తిగా దెబ్బతిన్నారు. వాషింగ్టన్ అతి సాహసంగా కొట్టిన ఈ దెబ్బకు వెనువెంటనే, ప్రిన్స్టన్ లో ఆయనకు మరొక విజయం లభించింది. ఇంచుమించు న్యూజెర్సీ అంతా తాత్కాలికంగా, తిరిగి అమెరికనుల వశమయింది.

1777 లో ప్రధానమైన పెద్దపోరాటాలు జరిగినవి. జెనరల్ హోవే సైన్యాలు న్యూయార్కు నుండి సముద్రం మీదుగా ఫిలెడెల్ఫియాకు పోయి, అమెరికా రాజధానిని పట్టుకొన్నవి. వాషింగ్టన్, తన

సైన్యాన్ని ఆ నగరం వెలుపల ఉన్న వాలీ ఫోర్జ్‌లోకి ఉపసంహరించాడు. అతి శీతలంగా ఉన్న ఆ శీతకాలంలో అక్కడ వారు తలదాచుకునేందుకు సరియైన వసతిలేక ఇతర సరఫరాలేవీ అందక యమయాతనలు పడ్డారు. బ్రిటిషువారు ఆ సమయంలో వాళ్ళను వెన్నంటి దెబ్బతీసివుంటే తమ శత్రువును పూర్తిగా హతమార్చగలిగి ఉండేవారు. కాని హోవే అంత ఓపిక కలవాడుకాడు సరికదా, అతనికి రాజకీయంగా అమెరికనులయెడ సానుభూతి ఉన్నదనడానికికూడా కొన్ని నిదర్శనాలున్నవి.

మధ్య రాష్ట్రాలలో వాషింగ్టన్ ఆంగ్లేయుల కాల్పులకు గురిఅవుతూన్న సమయంలో, అక్కడికి వందలకొలది మైళ్లు ఉత్తరంగా న్యూయార్కు రాష్ట్రంలోని శారటోగావద్ద యుద్ధ పర్యవసానాన్ని తేల్చగల ముఖ్యమైన యుద్ధం జరుగుతూంది. సేనానాయకుల అసమర్థతవల్లను, సరఫరాలు మూడువేల మైళ్ళ దూరంనుండి రావలసి ఉండడంవల్లను, బ్రిటిష్ సైన్యం ముఖ్యమైన సమయంలో ఊబిలో కూరుకొనిపోయినట్లయి పూర్తిగా తుడిచిపెట్టబడింది.

న్యూయార్క్ రాష్ట్రంలో ప్రతిఘటనను పూర్తిగా అణచివేసి, ఆ విధంగా అమెరికాను మధ్యకి రెండుగా తెగిపోయేటట్టు చేయాలని బ్రిటన్ ఒక పన్నాగం పన్నింది. ఈ పన్నాగం ప్రకారం న్యూయార్క్‌పై మూడువైపులనుండి దాడి చేయాలి. ఈ సైన్యాలన్నీ న్యూయార్క్‌కి ఉత్తరంగా నూటయాభైమైళ్ళ దూరంలో హడ్సన్ నదీ తీరాన ఉన్న ఆల్బనీవద్ద కలుసుకోవాలనికూడా వారు నిర్ణయించారు; జెనరల్ బర్గాయిన్ కెనడానుండి దిగువకు దండయాత్ర చేయాలి; జెనరల్ హోవే న్యూయార్క్ నగరంనుండి ఉత్తరానికి సైన్యాలను పంపాలి; జెనరల్ సెయింట్ లీజర్ ఆంటేరియో సరస్సునుండి రాష్ట్రం మధ్యగా తూర్పుదిశకు మరలి రావాలి.

ఈ వ్యూహమంతా పూర్తిగా విఫలమయింది. సెయింట్ లీజెర్‌ని అమెరికనులు ఒరిస్కనీవద్దనున్న అడవిలోనే అటకాయించారు. హోవే సైన్యాలు అసలు రానేలేదు. శారటోగావద్ద బర్గాయిన్ తాలూకు 6000 మంది సైనికులను 20,000 మంది అమెరికను రైతులు, పౌర సైనికులు చుట్టుముట్టి చితుక కొట్టడంతో 1777 అక్టోబరులో వారు పూర్తిగా లొంగిపోయారు.

శారటోగావద్ద సైన్యం నష్టమయినందుకు ఇంగ్లండు ఎక్కువ బాధపడలేదు; తన ప్రతిష్ఠ భగ్నమైపోయినందుకు చాలా నొచ్చుకున్నది. తన పూర్వ శత్రువులైన ఫ్రాన్స్, స్పెయిను దేశాలు సహాయం కోసం అమెరికనులుచేసే విజ్ఞప్తులపట్ల సానుభూతి ప్రకటించడం మొదలు పెట్టినవి.

విదేశాలతో, రాజకీయస్థాయిలో వ్యవహరించడం అమెరికనులకు కొత్త అయింది. అంతవరకు ఆ వ్యవహారాలన్నీ ఇంగ్లండే చూస్తూ ఉండేది. అయినప్పటికీ ఈ నూతనజాతికి బెంజామిన్ ఫ్రాంక్లిన్ ప్రజ్ఞాశాలి అయిన రాజకీయవేత్తగా తయారయాడు. ఈయన ప్రతిభ, సమయస్ఫూర్తి, అవకాశం లభించినవెంటనే ఉపయోగించుకొనగల నేర్పు పుష్కలంగా ఉన్నవాడు.

కొంతకాలం ఐరోపా అమెరికనులకు స్వల్పంగా సగఫరాలు చేస్తూ ఉండేది. ఫ్రాన్స్ దేశస్థుడైన మార్క్విస్ డలా ఫేఎట్; జర్మనీ దేశస్థులైన బేరన్‌వాన్, స్ట్యూబెన్, బేరన్ వాన్ కాల్బ్, పోలెండ్ దేశస్థుడైన కౌంట్ పులాస్కీ వంటి విదేశ సైనిక నిపుణులు, చాలామంది అమెరికా సైన్యంలోకి వచ్చి పనిచేస్తామంటూ అయాచితంగా వచ్చి అమెరికనులకు అత్యవసరమైన సైనిక శిక్షణ, తరిఫీదు నిచ్చారు. అమెరికనులకు పూర్తిగా సహాయపడేయెడల ఇంగ్లండుతో మరొక యుద్ధంలో చిక్కుకొని దెబ్బతినవలసి వస్తుందేమో అని ఐరోపా దేశాలు జంకినవి.

ఫ్రాన్స్, అమెరికా కలిస్తే ఇంగ్లండును ఓడించవచ్చునని శారటోగా యుద్ధానంతరం బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఫ్రెంచి చక్రవర్తికి నచ్చచెప్పగలిగాడు. ఈ సంగతి ఇంగ్లండు ఎలాగో పసికట్టింది. దానితో, అమెరికాలోని పూర్వపు ఆంగ్లవలసలు, ఆంగ్లసామ్రాజ్యంలో అంతర్భాగాలుగా ఉండటానికి అంగీకరిస్తే వారు కోరే షరతులన్నీ అంగీకరించి సంధి చేసుకొనడానికి ఇంగ్లండు ప్రయత్నించింది. ఈ సూచన, ఇంగ్లండు రెండు సంవత్సరాలకు పూర్వం చేసిఉంటే అమెరికనులు కృతజ్ఞతతో ఆమోదించి ఉండేవారు. ప్రస్తుతం అమెరికనులు దానిని నిరాకరించారు. 1778 ఫిబ్రవరిలో ఫ్రాన్సు, అమెరికా సంయుక్త రాష్ట్రం స్నేహసూచకంగా ఒక సంధి చేసుకొన్నవి. ఈ సంధిప్రకారం,

ఉభయదేశాలు కలిసి యుద్ధాన్ని కొనసాగించడానికీ, ఉభయులు ఒప్పుకుంటేగాని సంధి చేసుకొనరాదనీ ఏర్పాటు చేసుకున్నారు. కొంతకాలం తరువాత, లోగడ తాము ఇంగ్లండుకు వదులుకున్న ప్రాంతాలను తిరిగి సంపాదించుకొనవచ్చుననే ఆశతో స్పెయిన్, హాలెండు దేశాలు అమెరికాకు నౌకాదళం సహాయం చేసినవి.

అచిరకాలంలోనే ఫ్రాన్సునుండి అప్పుగా ధనం, సామగ్రులు, అంగబలం సరఫరా అవడం ప్రారంభమయింది. వీటి అన్నింటికన్న గొప్ప సహాయం, దాదాపు ఇంగ్లండు నౌకా దళంతో తులతూగగల ఫ్రెంచి నౌకాదళం అమెరికనులకు అండదయి నిలవడం. ఫ్రెంచి నౌకా దళం ఫిలడెల్ఫియాకు దిగ్బంధనం చేయవచ్చుననే భయంతో బ్రిటిషు వారు ఆ రాజధానినుండి తమ సైన్యాలను ఉపసంహరించుకొన్నారు. ఫ్రెంచివారు తమ నౌకాదళంలోని అనేక నౌకలను అమెరికనులకు అప్పగించారు. ఆ నౌకాదళం ఇంగ్లీషు ఛానెల్‌లో ఇంగ్లండు నౌకల మీద సాహసోపేతమైన దెబ్బలుతీసినవి. కెప్టెన్ జాన్‌పాల్‌జోన్స్ ఇంగ్లండు తీరంమీద కూడా దాడిచేసి, భూమిమీదదిగి, లోగడ ఒకప్పుడు తాను, చాలా సంవత్సరాలు జీవించిన వైట్‌హావెన్ పట్టణాన్ని కొల్లగొట్టాడు. ఇతడు బాన్ హోమీ రిచర్డు అనే తన నౌకతో, ఆంగ్లనౌక హెచ్. ఎమ్. ఎస్. సెరాపిస్ పై సాధించిన విజయం సుప్రసిద్ధమైనది. ఈ పోరాటం ఇంగ్లండులోని యార్క్‌షైర్ తీరానికి అతి సమీపంలో జరగడం వలన జనం ఆ తీరాన నిలబడే ఈ పోరాటాన్ని చూడగలిగారట.

ఈ యుద్ధంలో అమెరికా సైనికులలో వీరుడుగా గాక మరొక విధంగా చరిత్రలోకి ఎక్కినవాడు జెనరల్ బెనెడిక్ట్ ఆర్నాల్డ్. ఇతడు తనకు సైన్యంలో పెద్ద ఉద్యోగం ఇవ్వలేదనే అసంతృప్తితో ఉండగా, హడ్సన్ నదిమీద వెస్ట్‌పాయింటువద్ద నున్న ఒక కోటను సంరక్షించవలసిన ముఖ్యమైన బాధ్యతను స్వీకరించి, ఆకోటను బ్రిటిష్ వారికి అప్పగించడానికి కుట్రపన్నాడు. కాని సకాలంలో కొన్ని ఉత్తరాలవల్ల ఇతడి పన్నాగం బయటపడింది. వెంటనే ఇతడు పారిపోయి బ్రిటిషు సైన్యంలో చేరి, బ్రిగేడియర్ జెనరల్ అయి వర్జీనియా యుద్ధంలో తన స్వదేశీయులపై స్వయంగా కాల్పులు జరిపాడు.

1778 వ సంవత్సరం సమీపిస్తున్న కొలదీ యుద్ధరంగం ఉత్తరాది నుండి మారింది. న్యూయార్కును ఆక్రమించుకొని ఉన్న బ్రిటిషు దళాలు దేశం లోపలికి చొరబడకుండా నిలువరించడం కోసం వాషింగ్టన్ సైన్యం న్యూయార్కు సమీపంలో ఉన్నది. అడక్కు యుద్ధం చప్పబడి ఉంది. పశ్చిమసరిహద్దున, దక్షిణాదిన కొంతసంచలనంబయలుదేరింది.

అమెరికా వలసదారులు తమ సరిహద్దు దాటి, పశ్చిమ దిశకుపోయి వలసలు ఏర్పరచుకొనడానికి వీలులేదని బ్రిటన్ ఆంక్ష పెట్టినప్పటికీ, ఆ నిషేధాజ్ఞ సరిగా అమలు జరుగలేదు. పెన్సిల్వేనియా లగాయతు దిగువను కరోలినాల వరకు వలసదార్లు గుంపులు గుంపులుగా ఎపలేచియన్ పర్వతాలలోని శాఖలగు ఎలీఘెనీ, బ్లూరిడ్జ్, స్మోకీ పర్వతాలు దాటి మెల్లగా పశ్చిమానికి వలసవెళ్లి, అచట గల సారవంతమైన భూములలో వలసలు స్థాపించుకొన్నారు. వారందరిలో, ఇండియనులతో పోరాడటంలో దిట్టగా సుప్రసిద్ధుడైన డేనియల్ బూనీ 1769లో కెంటకీ లోనికి చొచ్చుకొని పోయాడు. తరువాత కొన్ని సంవత్సరాల పిమ్మట టెన్నెసీ వలస ఏర్పడింది.

అమెరికా సరిహద్దులలో ఉన్న ఈ కొత్త వలసదారులు విశేష దేశభక్తి గలవారవడం వల్ల విప్లవం ప్రారంభమైనప్పటినుంచి తూర్పు తీరంలోని తమ సోదరులకు చేదోడు వాదోడు అవుతూనే ఉన్నారు. వీరు గనుక సరిహద్దులలో ఉన్న బ్రిటిషువారి కీలక కేంద్రాలపై దాడిచేస్తే చాలా ఉపయోగం ఉంటుందనే సంగతి క్రమంగా తేటతెల్లమయింది. ఈ పని చేస్తే అమెరికా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొనిన తరువాత పశ్చిమ ప్రాంతం కూడా తనదేనని అమెరికా ప్రకటించవచ్చు.

ఆ ప్రకారమే, వర్జీనియా నుండి వెళ్ళి కెంటకీలో నూతన స్థావరం ఏర్పరచుకొనిన జార్జ్ రోజెర్స్ క్లార్కు అనే యువకుని నాయకత్వం క్రింద రెండు వందల మంది ఉత్తర దిశకూ, పశ్చిమాన మిసిసిపీ నది వరకు స్వాధీనం చేసుకొనడానికి పంపబడ్డారు. మిసిసిపీనది పశ్చిమాన స్పానిష్ వారు తమ వని చెప్పుకుంటూన్న ప్రాంతాలు ఉన్నవి. న్యూఇంగ్లండ్, న్యూయార్కు, పెన్సిల్వేనియా రాష్ట్రాలు మూడూ

కలిస్తే ఉన్నంత ప్రాంతాన్ని జయించడానికి రెండు వందల మందిని పంపడం చిత్రంగానే కనిపించవచ్చు. కాని, అంతకన్న ఎక్కువ మందిని పంపడం సాధ్యంకాలేదు. పైగా ఆ నాడా ఆశయాన్ని ఆ రెండు వందల మందే సాధించగలిగారు.

"పశ్చిమ ప్రాంతపు వాషింగ్టన్" అని అభినందింపబడుచుండిన క్లార్క్ మెల్లగా ఇల్లినాయిస్ జానపద ప్రాంతంలోని ఫ్రెంచివారు, ఎర్ర ఇండియనులు బ్రిటిషు వారితో సంబంధాలను తెగతెంపులు చేసుకొని, అమెరికనుల తోనే సంబంధాలను పెట్టుకొనేటట్టు చేశాడు. ఆ విధంగా వారి వైపునుండి ఇబ్బంది కలుగకుండా దారి నిష్కంటకం చేసుకున్నాడు. తరువాత మిసిసిపీ, వాబాష్ నదులపై గల బ్రిటిషు వారి కోటలను ముట్టడించడానికి వెళ్లాడు. అచిరకాలంలోనే, ఆ ప్రాంతంలో ఆంగ్లేయుల అధికారం అంతమైపోయింది. క్లార్క్ అమెరికా తూర్పు పడమరలుగా, మధ్య భాగం వరకు అమెరికనుల "చుక్కల చారల" జెండాను ప్రతిష్ఠించాడు.

ఈ లోగా దక్షిణాదిన, విప్లవం అంతిమ దశకు రంగస్థలం తయారవుతూంది. ఉత్తర దక్షిణ కెరోలినాలలోను, జార్జియాలోను ప్రభుభక్తి పరాయణత్వం ఎక్కువ ఉన్నదని గమనించి వాటిని తక్కిన రాష్ట్రాల నుండి విడదీయడం కోసం బ్రిటిష్ ప్రభుత్వం జెనరల్ క్లింటన్, జెనరల్ కార్న్‌వాలిస్‌ల నాయకత్వాన కొంత సైన్యాన్ని పంపింది. సుమారు రెండువేలమంది అమెరికన్ టోరీలు బ్రిటిష్ పతాకం "యూనియన్ జాక్" చుట్టూ మూగి అభివందనం చేశారు. వారు సవానా, చార్లెస్టన్ అనే పెద్ద నౌకాశ్రయాలను స్వాధీనం చేసుకున్నారు. అక్కడ నుంచి బ్రిటిష్ వారు లోతట్టుకి వచ్చేటప్పుడు ఉత్తరాదికన్న ఎక్కువ విజయాలను సాధించగలిగారు. ముఖ్యంగా శారటోగా వీరుడగు అమెరికా సేనాని జెనరల్ గేట్స్‌తో కామ్డన్ వద్ద జరిగిన యుద్ధంలో వీరు ఘన విజయం సాధించారు. ఈ యుద్ధంలో పరాజయం పొంది తన సైన్యమంతటినీ కోల్పోయి, తానొక్కడూ గుర్రం మీద వెనుకకు పోతూ కామ్డన్‌కు 180 మైళ్ళ అవతల కనిపించాడంటే జెనరల్ గేట్స్ శౌర్య సాహసాలను శంకింపక తప్పదు.

తత్ఫలితంగా "స్వాంప్‌ఫాక్స్" అని పేరు పొందిన ఫ్రాన్సిస్ మేరియాన్ మున్నగువారి నాయకత్వం క్రింద అమెరికా గెరిల్లా సైని

కులు బ్రిటిషువారి బలాన్ని పీల్చి పిప్పి చేయడం మొదలు పెట్టారు. కింగ్స్ మౌంటెన్ వద్ద సరిహద్దు వలసదార్లలోని నాటు గుంపొకటి సుశిక్షితులైన కార్న్‌వాలిస్ అనుచరులపై అకస్మాత్తుగా వచ్చి పడి వారిని తుడిచిపెట్టారు. తరువాత అచిరకాలంలోనే వాషింగ్టన్ తన సేనాపతులలో అత్యంత సమర్థులలో ఒకడగు నాథేనియల్ గ్రీన్‌ని కెరోలినాలకు పంపాడు. అతడు వచ్చి ఆంగ్లేయులకు మరికొన్ని దారుణ నష్టాలు కలిగించాడు. 1781 లో బ్రిటిషువారు అక్కడి నుంచి ఉత్తర దిశకు పలాయనం చిత్తగించటం తప్పనిసరి అయింది.

విప్లవంలో కట్టకడపటి పోరాటం వర్జీనియాలోని యార్క్‌టౌన్ వద్ద, సముద్రపు ముంపు ద్వీపకల్పంపైన, అమెరికాలో స్థాపింపబడిన మొట్టమొదటి ఆంగ్లవలస జేమ్స్‌టౌన్‌కి కొన్ని మైళ్ళ దూరంలో జరిగింది. కార్న్‌వాలిస్, బెనెడిక్ట్ ఏడు వేల బ్రిటిష్ సేనను అక్కడికి ఉపసంహరించుకొని, న్యూయార్కు నుండి సముద్రం మీదుగా తమకు సహాయం వస్తుందని ఎదురు చూస్తున్నారు.

అమెరికా - ఫ్రెంచి సైన్యాలకు చెందిన మూడు పటాలాలు అద్భుత సహకార, సామరస్యాలతో విద్యుద్వేగంతో వ్యవహరించి కార్న్‌వాలిస్ సైన్యాలను హతమార్చినవి.

మొదటిది : మూడు వేల ఐదు వందల మంది అమెరికను సైనికులు వర్జీనియాలోనే ఉన్నారు. వారికి నాయకుడు లాఫేయెట్. వాషింగ్టన్ పట్లను, అమెరికనుల ఆశయం పట్లను, ఈ ఫ్రెంచి యువసేనానాయకునికి గల ప్రతిపత్తుల ఫలితంగా అతడు అమెరికనులకు అత్యంత ప్రీతిపాత్రుడైనాడు.

రెండు : వాషింగ్టన్, తన వద్ద గల ఐదు వేల మంది ఫ్రెంచి సేనను, మూడు వేల అమెరికన్ సేనను భూమిపైన నాలుగు వేల మైళ్ళు ఉరికించి, లాఫేఎట్‌కి మద్దత్తు చేయడానికి రప్పించాడు.

మూడు : అడ్మిరల్ డిగ్రాసీ నాయకత్వం క్రింద ప్రబలమైన ఒక ఫ్రెంచి నౌకా దళం, మార్గంలో కారన్‌వాలిస్ సహాయార్థం అదనపు బ్రిటిష్ సేనలను, సరఫరాలను కొని వస్తూన్న ఆంగ్లనౌకలను చెల్లాచెదరు చేసి జేమ్స్‌టౌన్‌కి వచ్చి చేరింది.

వాషింగ్టన్ సైన్యం, లాఫేయట్ సైన్యం ఆంగ్లసేనలను ఆ ద్వీపకల్పంలో నుండి భూమార్గాన తప్పించుకొని పోవడానికి వీలు

లేకుండా డిగ్రాసీ అడ్డం కొట్టడమే కాకుండా మరి మూడు వేల మంది ఫ్రెంచి సైనికులను కూడా తీసుకొని వచ్చి భూమిమీద దించాడు. ఈ విధంగా నలు దిక్కుల ముట్టడింపబడి, భయంకరమైన వ్యూహంలో చిక్కుకొన్న కారన్‌వాలిస్ సాహసంగా చాలా దాడులు చేశాడు కాని, అతని సేన కన్న అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న అమెరికన్-ఫ్రెంచి సేనల ముందు అవి కేవలం హనుమంతుని యెదుట కుప్పిగంతులైనవి చివరికి చేసేది లేక, 1781 అక్టోబరు 19 వ తేదీన కారన్‌వాలిస్ లొంగిపోయాడు.

యార్క్‌టౌన్ పతనాన్ని గూర్చిన ఈ వార్త తెలియగానే "భగవంతుడా! సర్వనాశన మైపోయిందా!" అని ఆక్రోశించాడు - బ్రిటిషు ప్రధానమంత్రి నార్త్ ప్రభువు. ఈ దెబ్బ సామాన్యమైనది కాదు. అప్పటికే ఈ యుద్ధాలతో విసుగెత్తి పోయి ఉన్న ఆంగ్ల ప్రజానీకం శాంతి కోసం తహతహ లాడడం మొదలు పెట్టింది. తన "అమెరికన్ క్షేత్రాలు" అని సగర్వంగా చెప్పుకొను చుండిన జార్జి చక్రవర్తి మాత్రమే ఈ వార్త విని గంతులు చిందులు త్రొక్కాడు. తక్కిన ప్రతి ఆంగ్లేయుడు శాంతి కోసం పరితపిస్తున్నాడు. ఇంగ్లండులో మంత్రి వర్గం మారిపోయింది. బ్రిటిషువారు రాయబారాలకు సంసిద్ధులై ఉన్నట్టు, ఆ సమయంలో ఫ్రాన్స్‌లో ఉన్న బెంజమిన్ ఫ్రాంక్లిన్‌కి కబురు వచ్చింది.

కాని అంతిమ శాంతి సంధిని సాధించడానికి మార్గమధ్యంలో ఏర్పడిన అవరోధాలన్నింటినీ అధిగమించేందుకు బెంజమిన్ ఫ్రాంక్లిన్ జాన్ ఏడమ్స్, జాన్ జేల రాజకీయ చాతుర్య మంతా వినియోగించ వలసి వచ్చింది. ఫ్రెంచి ప్రభుత్వంతో అమెరికనులు చేసుకొన్న ఒడంబడిక ప్రకారం, ఈ ఉభయపక్షాలలో ఎవరూ రెండవ దారి ఒప్పందం లేకుండా ఇంగ్లండుతో సంధి చేసుకో కూడదు. అమెరికా ప్రతిపాదించే షరతుల ప్రకారం సంధికై రాయబారాలు జరపడానికి ఇంగ్లండు, అమెరికాలు సిద్ధంగా ఉన్నప్పటికీ ఫ్రాన్స్, తన మిత్రదేశమైన స్పెయిన్‌తో పాటుగా సముద్రంపైన యుద్ధం సాగిస్తూనే ఉంది. ముఖ్యంగా జిబ్రాల్టర్‌ని పట్టుకోవాలని వారి సంకల్పం. కాని అది విఫల మయింది.

ఫ్రెంచిప్రభుత్వం తన లాభంకోసమూ, తన మిత్రదేశమైన స్పెయిను లాభంకోసమూ యోచిస్తూంది. కాని, అమెరికా క్షేమాన్ని కోరడంలేదన్న సంగతి 1782 లో స్పష్టంగా వ్యక్తమయింది. అమెరికన్ రిపబ్లిక్ సరిహద్దులను తిరిగి ఏపలేచియన్ పర్వతాలవరకు వెనుకకు సర్దుకొని అమెరికా తరఫున క్లార్క్ జయించిన పశ్చిమ ప్రాంతంలో విశేషభాగంపైన ఆధిపత్యం తిరిగి విదేశీయులకు, ముఖ్యంగా స్పెయిన్‌కి అప్పగించాలని ఫ్రెంచిమంత్రి వెర్జినీస్ కోరాడు.

రాజనీతి వింత స్నేహాలను సమకూరుస్తుంది. అమెరికాలో అస్తమించిన ఫ్రెంచి - స్పానిష్ సామ్రాజ్యాలు తిరిగి తలయెత్తడం ఇంగ్లండుకీ, అమెరికాకీ కూడా యిష్టంలేదు. ఈ విచిత్ర వాతావరణంలో ఆంగ్ల, అమెరికన్ రాజనీతివేత్తలు రహస్య సమాలోచనలు ప్రారంభించారు. అమెరికా రిపబ్లిక్ అట్లాంటిక్ తీరంనుండి మిసిసిపీనదివరకు, మహాసరస్సుల ప్రాంతంనుండి ఫ్లారిడావరకు వ్యాపించి, ఉండాలని స్థూలంగా వారు అంగీకరించారు.

వెర్జినీస్ ఈ సమాలోచనల సంగతి తెలిసి మండిపడ్డాడు. కాని, బెంజమిన్ ఫ్రాంక్లిన్ ప్రజ్ఞవల్లనూ, సముద్రంపైన ఆంగ్ల నౌకాదళం సాధిస్తూన్న విజయాలవల్లనూ చివరకు అతడుకూడా ఒడంబడక తప్పలేదు. పిదప పారిస్‌లో జరిగిన యుద్ధ విరమణసంధిపై 1783 సెప్టెంబర్ 3 వ తేదీన సంతకాలు జరిగినవి.

ఈ సంధివల్ల అమెరికాకు అపారంగా లాభించింది. ఇంగ్లండుకి, ఫ్రాన్స్‌కి గల వైషమ్యాలను చక్కగా వినియోగించుకొని, వారిని ఒండొరులపైకి పురికొల్పి, అమెరికా తాను కోరినవన్నీ రాబట్టుకొన్నది. తాను కోరిన భూమికితోడు, మిసిసిపీనదిలో పడవలవర్తకం చేసుకొనడానికీ, కెనడాతీరంలో చేపలు పట్టుకొనడానికి హక్కులుకూడా ఇంగ్లండు అమెరికాకు వదలిపెట్టింది.

దీనికి ప్రతిఫలంగా, ఈ స్వాతంత్ర్య సమరంలో బ్రిటిష్ చక్రవర్తి తరఫున పోరాడిన వేలకొలది అమెరికనులను బాధించరాదన్న బ్రిటన్ కోర్కెను అమెరికన్ కాంగ్రెస్ మన్నించింది. అమెరికనుల ఆధిపత్యాన, ఇట్టి ప్రభుభక్తిపరాయణులు కొందరు అప్పటికేతమ ఆస్తిపాస్తులను పోగొట్టుకొని నానాకష్టాలూ పడుతున్నందున, అవి అన్నీ

తిరిగి వారికి అప్పగించి, తక్కినవారితోబాటు వారికికూడా అన్ని హక్కులూ లభింప జేయవలసినదని బ్రిటను కోరింది. అందుకు తగిన చర్య తీసుకొనవలసినదిగా వివిధరాష్ట్ర ప్రభుత్వాలకు సలహా ఇవ్వడానికి అమెరికా కాంగ్రెసు అంగీకరించింది. నిజానికి, నష్టపడిన ప్రభుభక్తిపరాయణులకు ఈ సలహావల్ల జరిగిన ఉపకారం అత్యల్పం.

విజయం పొందిన తరువాత కూడా "సంయుక్త" రాష్ట్రాలు నిజానికి వియుక్తంగానే ఉన్నవి. యుద్ధం ముగిసిపోవస్తూన్న సమయంలో మాత్రం సమాఖ్యా సూత్రాలు (Articles of Confederation) అనే ఒక ఒడంబడికతో బలహీనమైన ఒక సంబంధనాన్ని ఏర్పాటుచేసుకున్నారు. అయినప్పటికీ, ఆ రాష్ట్రాలు దేనిమంచి అది చూచుకునే స్వతంత్రరాష్ట్రాలుగానే వ్యవహరిస్తూన్నవి. ఆయా రాష్ట్రాలకు ప్రాతినిధ్యం వహించే కాంగ్రెస్ చాలా సంవత్సరాలవరకు దివాళాకోరు సంస్థగానే వుంటూవచ్చింది. సైన్యానికి జీతాలివ్వడానికి డబ్బు ఉండేది కాదు. అందువల్ల సైనికులంతా అసంతృప్తితో తిరుగుబాటు చేసేవరకూ కూడా వచ్చేపరిస్థితిలో, ఆ సైన్యాధిపతియైన మహావీరుడు జెనరల్ వాషింగ్టన్ సైనికులందరినీ సైన్యాన్నివదలి ప్రశాంతంగా ఇళ్ళకు పోవలసినదిగా హితబోధ చేసి పంపాడు.

విజయం, స్వాతంత్ర్యం లభించినవి; వీటితోపాటు దేశంలో అరాజక స్థితి కూడా ఏర్పడింది. ఈ పరిస్థితులను చక్కదిద్దుకొని, ఐకమత్యంతో తమ సమిష్టి ఆశయాల వంకకు పురోగమించ వలసిన బాధ్యత మాత్రం ఇక అమెరికనుల మీద వుంది!

---

# చతుర్థ అధ్యాయము

## రిపబ్లిక్ సంస్థాపన

అమెరికా విప్లవం వలసదార్ల విజయంతో అంతమై దాదాపు రెండు శతాబ్దాలు గడచిన తరువాత నేడు మన మొక ప్రశ్న వేయవచ్చు; శాంతి భద్రతలను కాపాడగల బలమైన కేంద్ర ప్రభుత్వాన్ని

స్థాపించుకొని దేశమంతటికీ సుస్థిరమయిన ద్రవ్య విధానం ఏర్పాటు చేసుకొని, అభ్యుదయకరమయిన పరిశ్రమలను, వాణిజ్యాన్ని ఏర్పరచుకొనేందుకు నాటి దేశభక్తులందరు ఏకీభవించక పోవడానికి కారణం ఏమిటి? ఏరాష్ట్రానికి ఆ రాష్ట్రం ప్రత్యేక దేశమనే అప్పటికీ వారు భావిస్తూ ఉండడమే దీనికి కారణమని ఈ ప్రశ్నకు జవాబు చెప్పవలసి ఉంటుంది. నేడు పశ్చిమ ఐరోపా దేశాలన్నీ ఏక సమాఖ్యగా ఏర్పడడం మంచిదనే సూచనను ఆమోదించడానికి ఆ దేశాలు ఎంతగా అనుమానిస్తున్నవో, అంతగానూ నాడు అమెరికా రాష్ట్రాలు అవిభాజ్యమైన ఏక జాతిగా కలిసి పోవడానికి సంశయించినవి.

ఇంగ్లండుతో ఏర్పడిన యుద్ధపు వత్తిడిలో అమెరికను కలనులు ఆ సమిష్టి శత్రువును ఎదుర్కొనడానికిగాను ఏకమయినవి. అప్పుడు కాంటినెంటల్ కాంగ్రెస్ పోరాటం సాగించడానికి విరాళాలు ఇవ్వవలసిందిగా కోరగానే ఇచ్చినవి; ఆ కాంటినెంటల్ కాంగ్రెసే ఇతర దేశాలతో సంధులు చేసుకొన్నది. అయినప్పటికీ ఆ దేశ ప్రజలందరి పక్షాన వ్యవహరించే అధికారాన్ని కాంగ్రెసుకు కలుగజేసే లిఖితపూర్వకమైన జాతీయ శాసనం గాని, రాజ్యాంగ విధానం గాని లేదు.

సమాఖ్యా సూత్రాలు కేంద్ర ప్రభుత్వానికి కొన్ని విస్పష్టమైన లక్ష్యాలను, కర్తవ్యాలను నిర్వచించి, ఈ లోపాన్ని కొంతవరకు తీర్చడానికి ప్రయత్నించినవి. ఈ సూత్రాలు మొదట 1777 లోనే ప్రతిపాదింపబడినప్పటికీ, 1781 మార్చి వరకు కాంగ్రెసు వాటిని ఆమోదించలేదు. మేరీలాండ్ రాష్ట్రం చాలా దూరదృష్టితో పట్టుదలగా వ్యవహరించడం, ఈ ఆలస్యానికి ఒక ప్రధాన కారణం. ఈ సంయుక్త రాష్ట్రాల్లో క్రొత్తగా కలిసిన పశ్చిమప్రాంతంలో భాగాలు తమకు రావాలని చాలా రాష్ట్రాలు కోరినందున, కొన్ని రాష్ట్రాలకు అట్టి అవకాశం లేనందున, మొత్తం ఎలిఘెనీ పర్వతాలకు మిసిసిపీనదికీ మధ్యగల ప్రాంతమంతా జాతీయ ప్రాంతంగా సంయుక్త రాష్ట్ర కేంద్ర ప్రభుత్వానికే చెందేటట్లు చేస్తే తప్ప తాము ఆ సమాఖ్యాసూత్రపత్రంపై చేయదలచుకొనలేదని. మేరీలాండ్ రాష్ట్రప్రతినిధులంతా భీష్మించుకొని కూర్చున్నారు. ఈ పని జరిగితే, ఈ నూతన ప్రాంతమంతా ఏవో కొన్ని

రాష్ట్రాలలో కలిపివేయబడకుండా, ప్రత్యేకంగా కేంద్రప్రభుత్వ పాలనలో ఉంటుంది; ఆ భూమిని వలసదార్లకు విడివిడిగా విక్రయించడం మూలంగా కాంగ్రెసు తనకు అత్యవసరంగా ఉన్నధనాన్ని సేకరించవచ్చు. ఈ షరతు విషయంలో గట్టిపట్టు పట్టడం మూలంగా మేరీలాండ్ రాష్ట్రం, అతిక్లిష్టసమయంలో జాతీయ ప్రభుత్వాధికారాన్ని బలపరచడానికి విశేషంగా తోడ్పడింది.

అసలు సమాఖ్యా సూత్రాలుకూడా అతిబలహీనంగాను, అసంబద్ధంగాను, ఉన్నవి. వాటి ప్రకారం జనాభాతోగాని, పరిమాణంతోగాని, నిమిత్తంలేకుండా ప్రతిరాష్ట్రానికి కాంగ్రెసులో ఒకటే వోటు ఉంటుంది. మొత్తం పదమూడు వోట్లలో తొమ్మిది వోట్లు అనుకూలమైతే తప్ప ఏ శాసనం ఆమోదించ బడదు. ఈ సూత్రాలను సవరించాలంటే పదమూడు రాష్ట్రాలూ ఏకగ్రీవంగా అంగీకరించాలి.

యుద్ధాన్ని ప్రకటించడానికీ, సంధి చేసుకొనడానికీ, ధనం అప్పుచేయడానికీ, రాయబారులను పంపడానికీ, రప్పించుకొనడానికీ, విదేశవ్యవహారాల్లోను, ఎర్రఇండియన్ వ్యవహారాలలోనూ తగిన చర్యలు తీసుకొనడానికీ కాంగ్రెసుకు అధికారం ఉంటుంది. ఇవన్నీ ఒక జాతి ప్రజలందరి శ్రేయస్సుకీ సంబంధించిన విస్తృత కర్తవ్యాలనడానికి సందేహంలేదు; కాని ఈ కాంగ్రెసు ఆమోదించిన శాసనాలను అమలు జరుపడానికి తగిన కార్యనిర్వాహకశాఖ మాత్రం కాంగ్రెసుకి లేదు.

అమెరికా పౌరుల వ్యక్తిగత జీవితాలకు సంబంధించిన వ్యవహారాలలో క్రాంగెసుకు ఏమీ అధికారంలేదు. ఆ హక్కులన్నీ రాష్ట్ర ప్రభుత్వాలవి. ఒక పన్ను కట్టవలెనని కాంగ్రెసు ఏ వ్యక్తినీకూడా నిర్బంధింపజాలదు. కట్టకపోతే, కోర్టుచేత అతనిని శిక్షింప చేయజాలదు; అన్నివిధాలా అర్హుడైన వ్యక్తిని కూడా ఎంత ప్రాణావసరం ఉన్నా, సైన్యంలో చేరమని బలవంత పెట్టజాలదు. ఈ సూత్రాల ప్రకారం రాష్ట్రాలన్నీ సర్వతంత్ర స్వాతంత్ర్యంగల ప్రత్యేక ప్రజారాజ్యాలనీ, అవి జాతీయ శ్రేయస్సుకు ఎంతవరకూ సహాయపడేదీ, ఆయా రాష్ట్రాల శాసనసభలు స్వయంగా నిర్ణయించుకోవాలని ఆ సూత్రాలలో నిర్వచించారు.

జాతీయాధిపత్యం లాంఛనంగానైనా ఉండాలని కోరిన వారందరికీ, పరిస్థితి క్రమంగా దుస్సహంగా పరిణమించింది. ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం టన్నులకు టన్నులు కాగితపునోట్లు అచ్చువేసి విలువలేని పిచ్చిడబ్బును సృష్టిస్తూ ఉన్నా, వర్తకవ్యవహారాల్లో రాష్ట్రాలు పోటీలుపడి ఒండొంటి సరుకులపై సుంకాలు విధించుకుంటున్నా, ఈ సూత్రాల ప్రకారం కాంగ్రెసు చూస్తూ ఊరుకోవలసిందేగాని, ఏమీ చేయజాలదు. ప్రజలలో, కలవారందరు ఈ పరిస్థితులవల్ల చాలా నష్టపడ్డారు. ప్రభుత్వపు బాండ్లుకొని పెట్టుకున్నవారు, చూస్తూ ఉండగానే ఆ బాండ్ల విలువ పదోవంతుకి తగ్గిపోయింది. విదేశ వర్తకుల పోటీవల్ల స్వదేశ పరిశ్రమలు దెబ్బతినకుండా వాణిజ్యపు సుంకాలను విధించే జాతీయ వ్యవస్థ లేనందువల్ల దేశంలోని పారిశ్రామికులు తమ పరిశ్రమాలయాలను మూసుకొని కూచున్నారు. సరిహద్దులలోని భూములపై ఎర్రఇండియనుల దాడులను అరికట్టేందుకు తగినంత జాతీయసైన్యం లేనందువలన, అచటి భూస్వాములు వ్యవసాయదారులకు నీళ్లు వదులుకొన్నారు.

అయితే ఈ సంక్షుభిత సమయంలోకూడా ఒక ముఖ్యమైన ఘనకార్యం సాధింపబడింది. పశ్చిమప్రాంతం జాతీయ రాజ్యంలో చేరిన తరువాత, ఓహియోనదికీ మహాసరస్సులకు మధ్యగల భూమిని "వాయవ్య రాష్ట్రం"గా పేర్కొని, దాని పరిపాలనా బాధ్యతను కాంగ్రెసు ఒక గవర్నరుకు, ముగ్గురు న్యాయాధిపులకు అప్పగించింది. ఈ ప్రాంతానికి వలసవెళ్ళిన వారందరికీ రాజకీయ, మత స్వాతంత్ర్యాలు, ప్రభుత్వ వ్యయంతో ఉచితవిద్యా, లభించగలవనీ, ఆ రాష్ట్రంలో అసలు బానిసత్వం ఉండదనీ కాంగ్రెసు ప్రకటించింది. అక్కడ జనాభా పెరిగినకొలదీ, సమాఖ్యలోని తొలిరాష్ట్రాలతో సమాన ప్రతిపత్తిగల మరికొన్ని రాష్ట్రాలుగా ఏర్పడవచ్చునని కూడా స్పష్టం చేశారు; ఈ విధంగా భవిష్యత్తులో జరుగనున్న విస్తరణ కార్యక్రమానికి ఒక ప్రణాళిక తయారయింది. ఈ ప్రణాళికవలన, తన పౌరులు ఎక్కడ ఉన్నా అమెరికనులుగా వారందరికీ సమానమైన హక్కులు ప్రసాదించవలెనన్న ప్రభుత్వ సంకల్పం వ్యక్తమయింది.

ఈ లోగా మసాచూసెట్స్‌లో అత్యంత ప్రమాదకరమైన జాతీయప్రభుత్వమంతటినీ ఒక్కసారి కూలితంచేయాలన్న ఉద్యమాన్ని బలపరచిన సంఘటన ఒకటి జరిగింది. విప్లవకాలంలో సైనికోద్యోగిగా పనిచేసిన డేనియల్ షేస్ నాయకత్వంక్రింద, ఋణభారంతో క్రుంగిపోతూన్న పౌరజన సమూహమొకటి ప్రభుత్వపు ఆర్థికవిధానాన్ని ఖండిస్తూ తిరుగుబాటుచేసి, స్ప్రింగ్‌ఫీల్డ్‌లోని అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ ఆయుధాగారంపై దాడిచేసింది. "షేస్ విప్లవం" అనబడే ఈ ఉద్యమాన్ని చివరికి జాతీయసైన్యం అణచి వేసింది. కాని, ఈ విప్లవంయొక్క అరాజకత్వం, దౌర్జన్యం ప్రజలందరినీ భయభ్రాంతులను చేసినవి.

* * * * * * *

జార్జి వాషింగ్టన్ మొదలైన పలుకుబడిగల నాయకులు బలహీనమైన కేంద్రప్రభుత్వంవల్ల కలిగే అనర్థాలను గురించి కొంతకాలంగా హెచ్చరిస్తూనే ఉన్నారు. రాష్ట్రగవర్నర్లందరికీ పంపిన ఒక లేఖలో వాషింగ్టన్ ఇలా వ్రాశాడు: "ఈ సంయుక్తరాష్ట్రాల రిపబ్లిక్ యొక్క సమష్టి వ్యవహారాలను నిర్వహించే అధికారిక వ్యవస్థ ఒకటి ఉండటం అవసరం. అది లేకుండా ఈ సమాఖ్య చిరకాలం మనగలగడం అసంభవం." జాతీయ వ్యవహారాలను తాను నిర్వహింపజాలనని, పిమ్మట కొంతకాలానికి కాంగ్రెసు విచారంతో అంగీకరించినప్పుడు, ఈ మహాసేనాని చెప్పిన ఈ జోస్యం నిజమయింది. కనీసపు సంఖ్య సభ్యులు హాజరుకాకపోవడంవలన కాంగ్రెసు సమావేశాలు జరగడమే దుర్లభమైపోయింది. ఆ రోజులలో కొంతకాలం అమెరికా సంయుక్తరాష్ట్రాలకు ప్రభుత్వమే ఉండేది కాదు.

పొటోమెక్ నదిపై వాణిజ్యం చేసుకొనే అధికారం విషయంలో మేరీలాండ్‌కీ, వర్జీనియాకీ ఏర్పడిన వివాదం, అంతర్రాష్ట్రీయ సహకారవిధానాన్ని గురించి చర్చించడానికి చక్కని అవకాశం కల్పించింది. బలవత్తర కేంద్రప్రభుత్వం అవసరమని వాదించేవారు తమఆశయ సాధనకు ఈ అవకాశాన్ని సక్రమంగా వినియోగించుకున్నారు. అనధికార చర్చలకోసం ఆ ఉభయరాష్ట్రాల ప్రతినిధులను, పొటోమెక్ నదీతీరంలో మౌంట్ వెర్నన్ వద్దనున్న జార్జివాషింగ్టన్ గృహానికి

ఆహ్వానించారు. అచిరకాలంలోనే, ఈ విషయంలో ఇతర రాష్ట్రాలకు కూడా సంబంధం ఉన్నదని వ్యక్తమయింది. చివరకు వాణిజ్య సంబంధమైన సమష్టి సమస్యలన్నింటిని గురించి చర్చించడంకోసం, ఆ పై సంవత్సరం ఎనాపొలిస్‌లో ఒక మహాసభ ఏర్పాటుచేశారు. ఈ సభకు అన్ని రాష్ట్రాలను ఆహ్వానించడానికి నిశ్చయించారు. అంతర్రాష్ట్రీయ వాణిజ్యాన్ని అదుపులో ఉంచడానికి అవసరమైన అధికారం కేంద్ర ప్రభుత్వానికి ప్రసాదించకపోవడం, సమాఖ్యాసూత్రాలలోని పెద్ద లోపం.

కాని, 1786 లో ఎనాపొలిస్ సభకు పంపబడిన ఈ ఆహ్వానాన్ని ఐదు రాష్ట్రాలుమాత్రమే అంగీకరించినవి. ప్రతినిధు లెక్కువమంది రానిలోపం, వచ్చిన ప్రతినిధులు ప్రదర్శించిన దృఢనిశ్చయంవల్లను, సమర్థతవల్లను తీరింది. ఈ సభలో ప్రధానపాత్ర నిర్వహించినవాడు న్యూయార్క్ వాసి అయిన అలెగ్జాండర్ హామిల్టన్. జన్మతః వెస్ట్ ఇండీస్ దీవులకు చెందిన ఇతడు, విప్లవం పొడుగునా వాషింగ్టన్ సైన్యంలో పని చేశాడు; ఆయనకు సన్నిహిత మిత్రుడు, ఆయనక్రింద పనిచేసిన సేనాని. బలమైన కేంద్రప్రభుత్వం అవసరమని హామిల్టన్ విశ్వాసం. ఈ సభలో తనతోడి సభ్యులు, వాణిజ్య వ్యవహారాల నే గాక, సమాఖ్యాసూత్రాలను సవరించడాన్ని గురించికూడా చర్చించడం ప్రారంభించేసరికి ఇతడు లేచి, ప్రభుత్వ స్వరూపాన్నంతటినీ గురించి చర్చించడానికి 1787 లో ఫిలడెల్ఫియాలో మరొక సమావేశం జరపడం మంచిదని సూచించాడు. తరువాత ఆ ప్రతిపాదనను కాంగ్రెసు ఆమోదించింది. మళ్ళీ ఈ సభకుకూడా మొత్తం పదమూడు రాష్ట్రాలకు ఆహ్వానాలు పంపారు.

ఈ పర్యాయం రాష్ట్రాలు చాలా ఉత్సాహం కనబరచినవి. ఒక్క రోడ్ ఐలెండ్ రాష్ట్రంతప్ప మిగిలిన రాష్ట్రాలన్నీ ఈ సభకు ప్రతినిధులను పంపినవి. ఈ సమావేశంలో పెద్ద పెద్దలంతా పాల్గొన్నారు. కాని వీరిలో చాలామంది మితవాద ధోరణి గలవారు, కొందరు వృత్తి చేసుకునేవారు. కొందరు వర్తకులు, కొందరు రైతులు, విప్లవకాలంనాటి తీవ్రవాదు లెవరూ వీరిలో లేకపోవడం చాలా చిత్రమైన విషయం; వారికి కేంద్రాధికారమంటే నే అనుమానం. మసా

చూసెట్స్ జాన్ హాన్‌కాక్‌నిగాని, శామ్యూల్ ఏడమ్స్‌నిగాని ప్రతినిధులుగా పంపలేదు. వర్జీనియానుండి పాట్రిక్ హెన్రీ ఎన్నిక అయాడుగాని ఈ సమావేశం చేయగలిగేది ఏమీ ఉండదంటూ, అతడా సభకు వెళ్ళడానికి నిరాకరించాడు.

పదకొండేళ్ళ క్రిందట కాంగ్రెసు అమెరికా స్వాతంత్ర్య ప్రకటన పత్రాన్ని ఆమోదించిన హాలులోనే సమావేశమయిన ఈ రాజ్యాంగ మహాసభ (Constitutional convention) జార్జి వాషింగ్టన్‌ని అధ్యక్షుడుగా ఎన్నుకొన్న పిదప బెంజమిన్ ఫ్రాంక్లిన్, అలెగ్జాండర్ హామిల్టన్, జేమ్సుమాడిసన్, జాన్ డికిన్సన్, గవర్నరు మారిస్ మున్నగు ప్రముఖుల అభిప్రాయాలు వినడం ప్రారంభమయింది. ప్రతినిధులలో అధికసంఖ్యాకుల అభిప్రాయం ప్రారంభంలోనే వ్యక్తమయింది. వారు ఆ అసమగ్రసూత్రాలను అక్కడక్కడ సవరించడానికి రాలేదు; వాటిని పూర్తిగా తుడుపుపెట్టి నూతన ప్రభుత్వవిధానాన్ని రూపొందించాలని వారి సంకల్పం. ఇందుకు అభ్యంతరం చెప్పిన వారికీ, జాగ్రత్తగా వ్యవహరించాలని సూచించేవారికీ వాషింగ్టన్ ఇలా హెచ్చరించాడు; "మనం సూచించే ఏ ప్రణాళికా కూడా బహుశః ఆమోదింపబడక పోవచ్చు. మరొక భయంకరమైన పోరాటం జరగడం తప్పనిసరికావచ్చు. కేవలం ప్రజలను సంతోష పెట్టడంకోసం ఇప్పుడు మనకు ఇష్టంలేని నిర్ణయాలు చేస్తే, ఆ తరువాత మనం మన ప్రవర్తనను సమర్థించుకొనడానికి అవకాశం ఉండదు. వివేకవంతులు, సచ్ఛీలురు మెచ్చేనిర్ణయాలే మనం చేద్దాం. ఆ తరువాత విషయం భగవత్సంకల్పంపై ఆధారపడి ఉంటుంది" వాషింగ్టన్ చేసిన ఈ హెచ్చరికతో ఆవేశపూరితులైన ప్రతినిధులు బలమైన కేంద్రప్రభుత్వ స్థాపనకు తమ తమ సూచనలను వివరించడం మొదలు పెట్టారు.

* * * * * * *

మొత్తంమీద, రెండు ప్రధాన ప్రణాళికలు రూపొందినవి. వీటిలో ఒకటి పెద్దరాష్ట్రాల తరఫున వర్జీనియా ప్రతినిధులు సూచించినది. రెండవది, చిన్నరాష్ట్రాల తరఫున న్యూజెర్సీ ప్రతినిధులు సూచించినది. వర్జీనియా కార్యనిర్వహణశాఖ, శాసననిర్మాణశాఖ, న్యాయపరిపాలనశాఖ అనేమూడుశాఖలపై అధికారంగల జాతీయప్రభుత్వం

ఉండాలనిసూచించింది. శాసననిర్మాణాధికారం, రెండుసభలతో కూడిన కాంగ్రెసుకి అప్పగించాలి. ఇందులో ఎగువసభ, లేక సెనేట్ లో ప్రతి రాష్ట్రానికి దానివిస్తృతిని, ఐశ్వర్యాన్ని అనుసరించి ప్రాతినిధ్యం ఉండాలి. ప్రజాప్రతినిధులసభ అనబడే దిగువసభలో సభ్యులంతా ప్రతిరాష్ట్రంలోను నేరుగా ప్రజలచేతనే ఎన్నుకొనబడతారు.

ఈ వర్జీనియా ప్రణాళికలోని ఆశ్చర్యకరమైన విషయం దాని వల్ల రాష్ట్రశాసనసభాధికారాలకు తగిలేదెబ్బ దానివలన ఏరాష్ట్రమైన తనకు ఇష్టంలేని కేంద్ర శాసనాన్ని బుట్టదాఖలుచేసి, ఒంటెత్తు తనంతో వ్యవహరించడానికి అవకాశం లేకుండా చేయబడింది. అన్ని రాష్ట్రాల పౌరులకూ సంయుక్త రాష్ట్రకాంగ్రెసులో ప్రాతినిధ్యం ఉంటుంది; ఆ కాంగ్రెసే వారిని పరిపాలిస్తుంది, - అని ఆ ప్రణాళిక సారాంశం ఉదాహరణకు: కనెక్టికట్ రాష్ట్రం ఒక వ్యాపారపు సుంకాన్ని విధించరాదని ప్రతిఘటించింది అనుకుందాం. అయినా కాంగ్రెసులో అధికసంఖ్యాకులు దానిని ఆమోదించినట్లయితే, ఆ రాష్ట్రం విధిగా తోడిరాష్ట్రాల అభిప్రాయానికి జోహారు చేసి ఆ శాసనానికి కట్టుబడి ఉండాలి.

న్యూజెర్సీ సూచించిన ప్రణాళిక ఇంకా జాగ్రత్తగా ఉన్నది. వర్జీనియా సూచించినట్లు, ప్రజలకు ప్రత్యక్ష ప్రాతినిధ్యం యేర్పాటు చేస్తే తమకు ఊరూ పేరూ లేకుండా పోతుందేమో అనే భయం చిన్న రాష్ట్రాలకు ఉంది. సమాఖ్యా ప్రభుత్వం ప్రతివిషయంలోనూ తమ అభిప్రాయాన్ని త్రోసిరాజు అంటుందనీ, పెద్దరాష్ట్రాలు కేవలం సంఖ్యాబలంతో తమమాట సాగనీయకుండా శాసనాలు చేస్తాయనీ వారి భయం. అందువల్ల సమాఖ్యాసూత్రాలలో ఉన్నట్లే, ఒకేశాసన సభ ఉండాలనీ, అందులో చిన్న పెద్ద వ్యత్యాసం లేకుండా అన్ని రాష్ట్రాలకూ సమాన ప్రాతినిధ్యం ఉండాలనీ, అయినప్పటికీ పన్నులు విధించడం, వాణిజ్యాన్ని అదుపులో పెట్టడం మూలంగా రాష్ట్రాలపై పెత్తనంచేసే అధికారం కాంగ్రెసుకి కలుగజేయాలనీ న్యూజెర్సీ సూచించింది. అప్పటికీ సర్వతంత్ర స్వతంత్రాధికారాలు రాష్ట్రప్రభుత్వాలవే అనీ, కేంద్రప్రభుత్వాన్ని ఏర్పాటుచేసేహక్కు రాష్ట్రాలలోని వ్యక్తులకుగాక, రాష్ట్రప్రభుత్వాలకే ఉండాలనీ, న్యూజెర్సీ ప్రణాళిక సారాంశం.

ఈ విధంగా వర్జీనియా, న్యూజెర్సీల ప్రణాళికలకు స్వరూప స్వభావాలలో విశేష వ్యత్యాసం ఉన్నా, ఫిలెడెల్ఫియాలో సమావిష్టు లయిన ప్రతినిధులు వారాలకొలది చర్చలు జరిపి, వరుసగా అనేక మాధ్యేమార్గ పరిష్కారాలద్వారా సమాధానాన్ని సాధించగలిగారు. ఈ సమాధాన ప్రణాళిక ప్రకారం కాంగ్రెసు రెండు సభలుగా ఉండాలన్న వర్జీనియా సూచన ఆమోదించబడింది. కాని ఎగువసభ లేక సెనేట్‌లో అన్ని రాష్ట్రాలకు సమానప్రాతినిధ్యం ఉండాలనీ, ఒక్కొక్క రాష్ట్రశాసనసభ ఇద్దరు సభ్యులచొప్పున ఈ సెనేట్ సభకు పంపాలనీ ఏర్పాటు చేశారు. ఇక, దిగువసభకు ప్రతి రాష్ట్రం తన జనాభాను అనుసరించి ప్రత్యక్షంగా ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులను పంపాలి.

ఇదే ఈ సభ్యులు ఎదుర్కొనవలసి వచ్చిన అత్యంత క్లిష్టసమస్య. దీనినిపరిష్కరించడం తేలికగా సాధ్యంకాలేదు. దక్షిణాదిరాష్ట్రాలలో నీగ్రో బానిసలు చాలమంది ఉన్నారు. వారికి ఓటింగు హక్కు లేక పోయినా ప్రతినిధులసంఖ్యను నిర్ధారణ చేసేటప్పుడు జనాభా లెక్క లలో మాత్రం ఆనీగ్రోలనుకూడా కలిపి లెక్కచూడాలని ఆరాష్ట్రాలు కోరినవి. దీనికి ఒప్పుకుంటే ఆ రాష్ట్రాలకు ఎక్కువ ప్రాతినిధ్యం లభి స్తుంది. చివరికి ఆ నీగ్రోబానిసలలో ఐదింట మూడువందలమందిని స్వతంత్రపౌరులతోపాటు జనాభాలో లెక్కకట్టడానికి ఒప్పుకొని సమాధానపడ్డారు.

ఈ రాజ్యాంగ విధానం రాష్ట్రాలకు సర్వతంత్రస్వాతంత్ర్యం ఉండాలన్న వాదానికి స్పష్టంగా స్వస్తిచెప్పి ఆ అధికారాన్ని మొత్తం ప్రజలందరికీ కలుగజేసింది. ఆ ప్రజలు కొన్ని విషయాలలో తమ జాతీయ ప్రభుత్వం ద్వారాను, మరికొన్ని విషయాల్లో తమరాష్ట్ర ప్రభు త్వాల ద్వారాను తమదేశాన్ని తామే పరిపాలించుకొంటారు. కేంద్ర ప్రభుత్వ శాసనాలే బలవత్తమ శాసనాలనీ, "వివిధరాష్ట్రాలలోని న్యాయాధిపులు కేంద్రశాసనాలను అనుసరించే తీర్పులు చెప్పాలనీ, రాష్ట్రరాజ్యాంగంగాని, శాసనాలుగాని దానికి భిన్నంగా ఉన్నప్పుడు కేంద్ర శాసనమే చెల్లదగినదిగా పరిగణించబడాలని" ఈ రాజ్యాంగ శాసనంలో స్పష్టం చేసారు. అప్పటినుంచి రాష్ట్రాలు ఒడంబడికలు,

సంధులు చేసుకోకూడదనీ, యుద్ధం చేయరాదనీ, సొంత నాణాలను నోట్లను వేయరాదనీ, ఒండొరుల ఉత్పత్తులపై పన్నులువిధించుకొన రాదనీ ఈ రాజ్యాంగం నిషేధించింది. ఈ విధంగా రాష్ట్రాల అధికారాలు కేంద్ర ప్రభుత్వానికి సంక్రమింపజేసినందుకు బదులుగా "సమాఖ్యలోని ప్రతిరాష్ట్రంలో సదా ప్రజాస్వామిక ప్రభుత్వ విధానం అమలుజరిపేటట్లు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం హామీ ఇవ్వాలనీ, ఏరాష్ట్రంపైనా పైనుండి దాడులు జరుగకుండా సంరక్షించాలనీ" రాజ్యాంగం ఆదేశించింది.

అయినప్పటికీ, ఈ మార్పులవల్ల రాష్ట్రాలు కేంద్ర ప్రభుత్వపు తాబేదార్లుగా తయారవలేదు. కారణం: మొదటిది - కాంగ్రెస్‌లో రాష్ట్రాలకు ప్రాతినిధ్యం ఉన్నది గనుక, శాసనాలను ఆమోదించడంలోను, నిరాకరించడంలోను, తమ పలుకుబడిని వినియోగించవచ్చు. రెండవది - తమ సరిహద్దుల లోపల పౌరుల వ్యక్తిగత శ్రేయస్సుకి ఆస్తిపాస్తులకి సంబంధించిన చాలా విషయాల్లోను వారికి బాగా సన్నిహితమైన విషయాల్లోను అధికారమంతా రాష్ట్ర ప్రభుత్వాలకే వదలబడింది. ఈ విధంగా పౌరుల జీవితాలను, ఆస్తిపాస్తులను, రక్షించడం, వ్యాపారాలకు రాష్ట్రపుబ్యాంకులకులై సెన్సులు ఇచ్చివాటిని అదుపులో ఉంచడం, వివాహాలకు విడాకులకు సంబంధించిన శాసనాలు చేసి అమలుజరపడం, ప్రజలకు ప్రాథమిక విద్యాబోధనకు ఏర్పాట్లు చేయడం, రోడ్లురహదార్లు నిర్మించడం, ఇంకావందలకొలది స్థానిక అవసర విషయాలను చూడడం - ఎప్పటివలెరాష్ట్ర ప్రభుత్వాల అధికారాలలోనే ఉన్నవి.

ఈసమాఖ్యారాజ్యాంగాన్ని అనుసరించి జాతీయ ప్రభుత్వం కార్యనిర్వాహకశాఖ, శాసన నిర్మాణశాఖ న్యాయపాలనశాఖ అనే - మూడు శాఖలుగా ఉంటుంది. వీటిలో ప్రతిశాఖకూ తక్కిన శాఖలపై కొన్ని నియమన నిగ్రహాధికారాలు ఉన్నవి. వీటిలో ఏశాఖగాని అధిక ప్రాబల్యం కలిగి, నియంతృత్వ ధోరణిలో వ్యవహరించకుండా నిగ్రహించడంకోసం ఈ ఏర్పాటు చేశారు. ప్రజాస్వామ్యాధికారాల రక్షణకై విజ్ఞతతో ఏర్పాటుచేయబడిన ఈ విధానానికే "నిగ్రహ సమన్వయ పద్ధతి" (System of checks and balances) అని పేరు.

శాసననిర్మాణసంస్థ అయిన కాంగ్రెసుకి సమిష్టి జాతీయ శ్రేయస్సుకీ, విదేశవ్యవహారాలకూ సంబంధించిన విషయాల్లో శాసనాలు చేసే అధికారం అప్పగించబడింది. పన్నులు విధించి వసూలుచేయడం, అప్పులు చేయడం, అంతర్రాష్ట్రీయ, విదేశవాణిజ్యాలను అదుపులో ఉంచడం, దేశమంతటికీ ఒకే ద్రవ్యవిధానాన్ని వాడుకచేయడం, సాయుధసైన్యాలను తయారుచేసి పోషిస్తూ ఉండడం, అమెరికా యాజమాన్యం క్రిందగల ప్రాంతాలను పాలించడం, సమాఖ్యలో నూతన రాష్ట్రాలను చేర్చుకొనడం ఈ కేంద్ర ప్రభుత్వంయొక్క ముఖ్యమైన ప్రధానాధికారాలని చెప్పవచ్చు. ఇంకా స్థూలంగా చెప్పాలంటే, - ఇదే కాంగ్రెసుకు నిజంగా బలంచేకూర్చే అధికారం - సంయుక్త రాష్ట్రాల సమిష్టి శ్రేయస్సుకి సంబంధించిన వివిధ విషయాలకు ధనం కేటాయించడం, తనకు దత్తంచేయబడిన విలక్షణాధికారాలను చెలాయించడానికి అవసరమైన, సమర్థమైన శాసనాలను చేయడం కాంగ్రెసు ముఖ్యబాధ్యతలు. ప్రభుత్వాదాయాన్ని వృద్ధిచేయడానికిగాను శాసనాలను ప్రతిపాదించే హక్కు ప్రజాప్రతినిధి సభకుమాత్రమే ఉన్నది. కనుక ప్రభుత్వపు ఖర్చులను అదుపులో ఉంచే అధికారం ముఖ్యంగా ప్రజాప్రతినిధి సభదే అని తేలింది.

వ్యక్తి స్వాతంత్ర్యాలను (లేక హక్కులను రక్షించడానికిగాను రాష్ట్రాలకువలెనే, కాంగ్రెసుకూడా కొన్ని అధికారాలను ఎన్నడూ చెలాయించరాదని నిషేధించారు. తిరుగుబాటులు, దండయాత్రల సందర్భంలో ప్రజాక్షేమానికి అవసరమైనప్పుడు తప్ప, హెబియస్ కార్పస్ (అనుమానంపైన అరెస్టు చేయబడినవారు తమ అరెస్టు విషయంలో పోలీసులు న్యాయస్థానం అనుమతి పొందాలని దాఖలు చేసుకునే) దరఖాస్తు పెట్టుకునే హక్కును రద్దుచేసే అధికారం కాంగ్రెసుకి లేదు. విచారణలేకుండా శిక్షవిధించే శాసనం (Bill of attainder) గాని, శాసనరీత్యా ఫలానాపని చేయరాదని నిషేధింపబడక పూర్వం, చేసిన నేరానికిగాను, శిక్షించే శాసనం (Ex post tacto law) గాని కాంగ్రెసు చేయకూడదు. వాణిజ్యం, ఆదాయాల విషయంలో కాంగ్రెసు ఏ రాష్ట్రాల రేవుల విషయంలోనూ ప్రత్యేక పక్షపాతం చూపించరాదు; పౌరులకు గౌరవపు బిరుదులు ప్రసాదించకూడదు.

కాంగ్రెసు సభ్యుల జీతాలన్నిటినీ, సమాఖ్యా ప్రభుత్వమే భరిస్తుంది. ఆ సభ్యులు ఎన్నికైన రాష్ట్రాలకు ఆఖర్చుతో నిమిత్తంలేదు. ఈ ఏర్పాటుకూడా కేంద్రప్రభుత్వాన్ని బలవత్తరం చేయడానికి ఉద్దేశించినదే. సెనేటర్లు ఆరుసంవత్సరాల కాలము, ప్రజాప్రతినిధులు రెండేళ్లూ పదవులలో ఉంటారు. రెండేళ్ళకొకసారి సెనేట్ సభ్యులలో మూడవవంతు మందికి ఎన్నిక జరుగుతుంది; ఆ విధంగా అనుభవంగల సభ్యులు సదా సెనేట్‌లో ఉంటారు.

కాంగ్రెసు చేసిన శాసనాలను ప్రభుత్వ కార్యనిర్వాహక శాఖ అమలు జరుపుతుంది. కాంగ్రెసు యేర్పాటుచేసిన సాయుధ సైన్యాలను పోషించడానికి, అది మంజూరుచేసిన ధనాన్ని నోట్లు నాణాల రూపంలో ముద్రించి చెలామణీ చేయడానికీ మొత్తంమీద కాంగ్రెసు చేసిన శాసనాలన్నిటినీ అమలుజరపడానికీ తగిన సాధన సంపత్తిని సమకూర్చడానికిగాను - కాంగ్రెసువిధించే పన్నులను ఈకార్యనిర్వాహకశాఖ వసూలు చేస్తుంది. సంయుక్తరాష్ట్రాల ప్రెసిడెంటే ఈకార్యనిర్వాహకశాఖాధ్యక్షుడు. "శాసనాలన్నీ సక్రమంగా అమలు జరిగేటట్టు చూడడం" ప్రెసిడెంట్ కర్తవ్యం. ఒకసారి ఎన్నిక అయిన ప్రెసిడెంట్ నాలుగు సంవత్సరాలు పదవిలోఉంటాడు. అతనికి తోడు ఒక వైస్‌ప్రెసిడెంట్ ఉంటాడు. ఈవైస్‌ప్రెసిడెంటే సెనేట్ సభకు అధ్యక్షత వహిస్తాడు. కాంగ్రెసు మంజూరుచేయగల ఇతర ప్రభుత్వోద్యోగులుకూడా చాలా మంది ఉంటారు. ఈ చట్టచివరి సూత్రాన్ని అనుసరించే ప్రెసిడెంట్ తన మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసుకొనడానికి వీలవుతున్నది. ఈ మంత్రివర్గంలో విదేశాంగమంత్రి, యుద్ధమంత్రి ఇతరశాఖల ప్రధానోద్యోగులు ఉంటారు. వీరందరూ ప్రధాన కార్యకర్త అయిన ప్రెసిడెంట్‌కి సహాయపడుతూ ఆయన ఆదేశాలను అనుసరించి పనిచేస్తారు.

ప్రెసిడెంటు కాంగ్రెసు చేతిలో కీలుబొమ్మగా ఉండడు. కాంగ్రెసు ఆమోదించిన ప్రతిశాసనాన్ని ప్రెసిడెంటు ఆమోదానికి పంపవలసి ఉంటుంది. అతడు ఆమోదించి దానిమీద సంతకం చేసిన మీదటనే అది శాసనం అవుతుంది. అతడు ఆమోదింపదలచుకోని శాసనాలనుగురించి పునరాలోచించవలసిందిగా వాటిని కాంగ్రెస్‌కి

త్రిప్పి పంపివేయవచ్చు. అప్పుడు కాంగ్రెసు మూడింట రెండువంతుల వోట్లతో దానిని తిరిగి ఆమోదిస్తే, ప్రెసిడెంటు సంతకం అవసరం లేకుండానే అది శాసనం అవుతుంది. ప్రభుత్వపు మూడు శాఖలలో అధికారం సమంగా పంపకమయి ఉండడంకోసం ఉద్దేశించిన ఈ "నిగ్రహ సమన్వయ పద్ధతిలో" ఈ "వీటో" అధికారమొక బలమైన ఉపకరణం.

ప్రెసిడెంటే సైన్యానికీ, నౌకాదళానికీ సర్వసైన్యాధ్యక్షుడుగా కూడా ఉంటాడు. విదేశాలతో అతడు సంధులు చేసుకోవచ్చు. కాని అనంతరం వాటికి సెనేట్ మూడింట రెండు వంతుల సభ్యుల ఆమోదం పొందాలి. అలాగే సెనేట్ ఆమోదంతో అతడు విదేశాల్లో రాయబారులను, సుప్రీంకోర్టు న్యాయాధిపులను, ఇతర సమాఖ్యో ద్యోగులను నియమించవచ్చు. అవసరమైతే ప్రెసిడెంట్ కాంగ్రెసు ప్రత్యేక సమావేశాన్ని ఏర్పాటు చేయవచ్చు; ఏటేటా ఒకసారి యూనియన్ పరిస్థితినిగూర్చి ప్రెసిడెంటు కాంగ్రెసుకి పంపే సందేశంలో కాంగ్రెసు తీసుకొనవలసిన చర్యలను సిఫారసు చేస్తాడు.

ఇక కాంగ్రెసుకి గల విశిష్టాధికారాలలో ఒకటి, - ప్రెసిడెంటు లంచగొండితనం, దేశద్రోహం, లేక "ఇతర అపరాధాలకు దుష్టప్రవ ర్తనలకు" పాల్పడినప్పుడు అతనిని ఆ పదవిలోనుండి తొలంగించ గలగడం.

ప్రెసిడెంటు కేవలం ప్రభుత్వాధికార చిహ్నమాత్రుడుగా ఉండబోడని, ప్రెసిడెంటు కర్తవ్యాలను నిర్ధారణ చేసేటప్పుడు రాజ్యాంగ రచయితలకు తెలుసు. ప్రెసిడెంటే ప్రధాన ప్రతినిధిగా వ్యవహరిస్తూ, తన నాయకత్వంతో వారి ఐకమత్యాన్ని పరిరక్షిస్తాడు.

ఈ ప్రధాన కార్యనిర్వాహకుణ్ణి ఎన్నుకొనడానికి ఒక ప్రత్యేక విధానం ఏర్పాటు చేయబడింది. ముందుగా ప్రతిరాష్ట్రం, తనశాసన సభ నిర్ణయించిన విధానాన్ని అనుసరించి కొందరు ఎన్నికదార్ల(Electors) ను ఎన్నుకోవాలి. ఈ ఎన్నికదార్ల సంఖ్య ఆ రాష్ట్రానికి ఉభయ శాసన సభలలో ఉన్న ప్రతినిధుల సంఖ్యతో సమానంగా ఉంటుంది. ఈ విధంగా అన్నిరాష్ట్రాలనుండి ఎన్నికఅయిన ఎన్నికదార్లు ప్రెసి డెంటుని ఎన్నుకుంటారు. ఏ అభ్యర్థికన్నా స్పష్టమైన మెజారిటివస్తే,

అతడు ప్రెసిడెంటుగా ఎన్నిక అయినట్టు. అతని తరువాత ఎక్కువ వోట్లు వచ్చిన అభ్యర్థి వైస్‌ప్రెసిడెంటు అవుతాడు. వోట్లు సమానంగా వచ్చినా, మెజారిటీ రాకపోయినా, ప్రజాప్రతినిధి సభే ప్రెసిడెంటుని ఎన్నుకుంటుంది. ఈ సందర్భంలో ఒక్కొక్క రాష్ట్రానికి ఒకటే వోటు ఉంటుంది.

ప్రెసిడెంటుని ఎన్నుకునే అధికారం కాంగ్రెసుకిగాని, రాష్ట్ర శాసనసభలకుగాని, అప్పగించి, అతడు వారిమీద ఆధారపడి ఉండేటట్టు చేయడం రాజ్యాంగ రచయితలకు ఇష్టంలేదు. అందువల్ల వివిధ రాష్ట్రాలలో మిక్కిలి పలుకుబడి కలిగిన వ్యక్తుల కూటమిచేతనే ప్రెసిడెంటు ఎన్నుకొనబడేటట్లు చేయడానికిగాను ఈ ఎన్నికదార్ల ఎన్నికపద్ధతి (Electoral-college)ని వారు ఏర్పాటు చేశారు. ఈ ఎన్నికదార్లు ప్రెసిడెంటుని ఎన్నుకొనడంలో తమ బుద్ధికి యోగ్యమని తోచినరీతిగా వ్యవహరిస్తారని ఆదిలో అంతా ఆశించారు. కాని,ఇంచుమించు ప్రారంభంనుండి కూడా వాళ్ళు రాజకీయవేత్తల ఆదేశాల ప్రకారం నడుచుకోవడం మొదలుపెట్టారు; వీరు ఎవరికి వోటుచేయవలసినదీ, ఆయా రాజకీయ పక్షాలనాయకులే నిర్ధారణ చేసేవారు. చివరికి, ప్రతిరాష్ట్రంలోనూ విజయం పొందనున్న పక్షానికి చెందిన ఎన్నికదార్లందరూ ప్రెసిడెంటు ఎన్నికలో, ముందుగా తమపార్టీ నిర్ధారణ చేసినఅభ్యర్థికే విధిగా వోటు చేయవలసి వచ్చేది. రాజకీయపక్షాలు ముందుగా తమ అభ్యర్థులను ఎన్నుకొనేవి; ప్రతిరాష్ట్రంలోను వోటర్లు పోలింగుస్టేషన్లకు పోయి ఆ అభ్యర్థులను గురించి తమ ఇష్టాయిష్టాలను తెలియ పరిచేవారు. పిమ్మట కొన్ని నెలలకు ఎన్నికదార్లంతా సమావిష్టులై ఆ ఎన్నిక ఫలితాన్ని ధ్రువపరచేవారు.

పోతే, ప్రభుత్వంలోని మూడవశాఖ న్యాయశాఖ. సుప్రీంకోర్టు, కాంగ్రెసు నెలకోల్పే యితర న్యాయాధిపసంస్థలు, ఈ శాఖకు అంగాలు. జాతీయ, అంతరరాష్ట్రీయ వివాదాల విషయంలో సుప్రీం కోర్టు తీర్పులు చెపుతుంది. ఆ తీర్పులు తిరుగులేని చరమ నిర్ణయాలు. మళ్ళీ ఇక్కడకూడా "నిగ్రహ సమన్వయ పద్ధతి" ని అనుసరించవలసి వచ్చింది. ఒక ప్రధాన న్యాయాధిపుణ్ణి, ఎనమండుగురు సహాయ న్యాయాధిపులను సెనేట్ అనుమతితో ప్రెసిడెంటు నియమిస్తాడు.

పీఠగాని, కిందికోర్టుల న్యాయమూర్తులుగాని అవినీతికరంగా ప్రవర్తించినప్పుడు శిక్షింపబడడానికి రాజ్యాంగంలో అవకాశం కల్పించబడింది.

సమాఖ్యా న్యాయస్థానాలు, ప్రభుత్వాధికారాలు హద్దుమీరకుండా నిరోధిస్తూ, జాతీయప్రభుత్వం కింద ప్రజలకుగల హక్కులను, బాధ్యతలనుగురించి, ప్రతిపౌరుడికి జ్ఞాపకం చేస్తూ ఉండాలి. ఒక వ్యక్తి సమాఖ్యాశాసనాన్ని ఉల్లంఘిస్తే, అతణ్ణి సమాఖ్యాన్యాయస్థానం విచారించి, అపరాధి అని తేలితే, సమాఖ్యాకారాగారంలో కొంతకాలం శిక్ష విధిస్తుంది. అయితే, రెండవపక్షాన ఆ పౌరునికనుక ఆ తీర్పు పునర్విచారింపదగినదనడానికి తగినంత కారణం చూపిస్తే అతడు సుప్రీంకోర్టుకు అపీలు చేసుకోవచ్చు. ఏతావాతా తేలిన దేమిటంటే. సమాఖ్యా శాసనోల్లంఘనం చేశాడన్న పౌరుడు, రాజ్యాంగశాసనరీత్యా అసలా శాసనమే చెల్లదగినది కాదని కూడా సవాలు చేయవచ్చు. ఈ వివాదంలో అతడు నెగ్గితే, అతణ్ణి ఏసమాఖ్యాశాసనరీత్యా,విచారించి శిక్ష విధించారో ఆ శాసనం కేంద్రప్రభుత్వ శాసనాల గ్రంథం (Statute books) లో నుండి తుడిచివేయ బడుతుంది. దీనివల్ల, ప్రజలహక్కుల రక్షణను ప్రభుత్వం ఎంత ప్రాణపదంగా భావిస్తున్నదీ వ్యక్తమవుతుంది. ఒకవ్యక్తి న్యాయవిధుల ప్రకారం, సంయుక్తరాష్ట్రకాంగ్రెసు ఆమోదము, ప్రెసిడెంటు ముద్రపొందిన శాసనాన్ని కూడా ప్రతిఘటించి, అది చెల్లదగని శాసనమని ప్రకటించవలసినదిగా సుప్రీంకోర్టును కోరవచ్చు.

సమాఖ్యా న్యాయస్థానవ్యవస్థకు జాతీయ, అంతర్జాతీయ విషయాలకు సంబంధించిన వివాదాల నెన్నింటినో పరిష్కరించడానికి అధికార మీయబడింది. సంయుక్తరాష్ట్రప్రభుత్వం విదేశాలతో చేసుకున్న సంధుల విషయంలోను, రాయబారులకు, మంత్రులకు సంబంధించిన విషయాలలోను, అంతిమ నిర్వచనం చెప్పే అధికారంకూడా ఆ న్యాయస్థానానికి ఉన్నది. రెండుగాని అంతకన్న ఎక్కువగాని రాష్ట్రాలమధ్యను, వ్యక్తులకూ రాష్ట్రాలకూ మధ్యను ఏర్పడే వివాదాలలో మధ్యవర్తి తీర్పుచెప్పే అధికారంకూడా ఈ న్యాయస్థానానికి

ఇవ్వబడింది. అయినప్పటికీ రాష్ట్ర, స్థానిక న్యాయస్థానాలకు అప్ప గించడానికి ఇంకా చాలా విషయాలు మిగిలి ఉన్నవి. దేశమంతటా సామాన్య మానవులకు సంబంధించిన న్యాయ నిర్ణయాలు చేసేబాధ్యత చాలాభాగం ఈదిగువ న్యాయస్థానాలే నిర్వహిస్తున్నవి.

కాలమాన పరిస్థితుల మార్పువలన, ఈ రాజ్యాంగపత్రాన్ని సవ రించడం అవసరమయేయెడల, అట్టి సవరణలు చేయడానికి రాజ్యాంగం చివరిభాగంలోని కొన్నిసూత్రాలు అవకాశం కల్పిస్తున్నవి. కాంగ్రెసు ఉభయసభలలోను కలిపి మూడింట రెండువంతులు సభ్యులు ఆమో దించేయెడల రాజ్యాంగానికి కాంగ్రెసు అట్టిసవరణను ప్రతిపాదించ వచ్చు. లేక రాష్ట్రశాసన సభలలో మూడింట రెండువంతులు ఆ విధంగా సవరణచేయడం అవసరమని కోరవచ్చును. అప్పుడు రాజ్యాం గాన్ని సంస్కరించే నిమిత్తం ఒక మహాసభ (Convention) ఏర్పాటు చేయబడుతుంది. ఈ రెండు సందర్భాలలోకూడా, రాష్ట్ర శాసనసభ లలో నాల్గింట మూడువంతులు సభ్యులు ఆమోదం పొందిన సవరణ రాజ్యాంగంలోకి ఎక్కుతుంది. కాని, ఈ రాజ్యాంగం ఎలా కావా లంటే అలా మలచుకొనడానికి వీలుగా రచింపబడినందువల్లను, కాం గ్రెసు న్యాయస్థానాలు దానిలోని సూత్రాలను స్థూలంగా నిర్వహించ డానికి అవకాశం ఉన్నందువల్లను దానిని ఎక్కువగా సవరించవలసిన అగత్యంలేదని క్రమంగా కాలం రుజువుచేసింది.

తీక్షణమైన ఆ వేసవికాలమంతా, ఆ "నూతన జాతికి ఛత్రం" వలె ఉపయోగపడగల, ఆచరణయోగ్యమైన రాజ్యాంగం రూపొం దించే కార్యక్రమంతో గడిచింది. చివరికి సంయుక్తరాష్ట్రాల పరిపాల నకు బలమైన, పటిష్ఠమైన సాధనాన్ని తయారుచేసిన మీదట, ఆ రాజ్యాంగ పరిషత్తు సభ్యులంతా 1787 సెప్టెంబరు 17 న ఈ కార్య కలాపాన్ని ముగింపుచేశారు. సభ్యులంతా ఆ పత్రంపైన సంతకాలు చేసే సమయంలో, ఆ హాలులో వాతావరణం ప్రసన్న గంభీరంగా ఉంది. ఆ పత్రపు ఉదాత్తతను గురించి దాదాపు ఎవ్వరికీ ఏవిధమైన సంశయమూ లేదు. అయితే, రాష్ట్రాల సర్వతంత్ర స్వాతంత్ర్యానికి స్వస్తి చెప్పడంలో వీరు కొంచె తొందరపాటుగా వ్యవహరించారా?- అమెరికా ప్రజలు ఈ నిర్ణయాలను అంగీకరిస్తారా?- చూడవలసి ఉంది.

ప్రతినిధులంతా పరస్పరం సెలవు తీసుకొంటున్న సమయంలో అమెరికా అగ్ర రాజకీయవేత్త, ప్రపంచశాస్త్రవేత్త, తత్త్వవేత్త అయిన బెంజమిన్ ఫ్రాంక్లిన్, అధ్యక్షుడు జార్జి వాషింగ్టన్ కూర్చున్న కుర్చీపైన చిత్రించి ఉన్న సూర్య విగ్రహాన్ని తేరి పారచూచి, ఇలా అన్నాడు. "ఈ సమావేశసమయంలో ఈ కృషి ఫలితాలను గురించి మనమంతా ఆశా నిరాశలమధ్య ఊగులాడుతున్నప్పుడు ఎన్నోపర్యాయాలు అధ్యక్షుని వెనుకనున్న ఆ సూర్యుని చూచాను. కాని ఈ సూర్యుడు ఉదయ సూర్యుడో. అస్తమయకాలసూర్యుడో మాత్రం నాకు అర్థం కాలేదు; చివరికి ఈ సూర్యుడు ఉదయ సూర్యుడేగాని. అస్తమయసూర్యుడు కాడన్న అత్యంత సంతోషదాయకమైన విషయం నాకు ఇప్పుడు బోధపడింది."

* * *

ఈ ప్రజాప్రతినిధులు అద్భుతమైన ఘనకార్యం సాధించారు. అసందిగ్ధమైన భాషలో, సాధ్యమైనంత తక్కువ పదాడంబరంతో ప్రజాస్వామ్య ప్రభుత్వ మార్గదర్శక సూత్రాలన్నింటినీ వారు కుదిగుచ్చారు. కాలం మారిపోయిన భిన్నయుగంలో, నేటికికూడా ఆ సూత్రాలు ఈ రాజ్యాంగ రచనా కాలంలో వలెనే అర్థవంతమూలై వెలుగొందుతున్నవి. ఈ సుదీర్ఘ రాజ్యాంగపత్ర రచనా కలాపంలో ఎందరో ప్రముఖులు తోడ్పడినప్పటికీ అమెరికా "రాజ్యాంగ శాసన పితామహుడు" అనే ప్రఖ్యాతి, జేమ్స్ మాడిసన్‌కి దక్కింది. రాజ్యాంగ రచనలో ఎక్కువపాలు అతనిది.

* * *

ఈ కలాపం పూర్తిఅయిన తరువాత ఈ రాజ్యాంగ ముసాయిదాను కాంగ్రెసుకు పంపించారు; ప్రత్యేక-మహాసభలు ఏర్పాటుచేసి ఆమోదింపజేసే నిమిత్తం కాంగ్రెసు దానిని రాష్ట్రాలకు పంపింది. కనీసం తొమ్మిది రాష్ట్రాలు ఆమోదిస్తేనేగాని ఈ రాజ్యాంగం అమలులోనికిరాదు. ఆ ఆమోదం పొందడానికి జరుగవలసిన పోరాటమంతా ముందున్నది.

హారామ్ చేసే రాష్ట్రాలన్నిటినీ అంకకు తెచ్చి, ఈ రాజ్యాంగాన్ని అమలు జరుపడానికి అవసరమైన నిష్ఠురసంఘర్షణ ప్రారంభమయింది.

ఈ రాజ్యాంగాన్ని ఆమోదించవలసిన బాధ్యత రాష్ట్ర మహాసభలదే గాని, రాష్ట్ర శాసన సభలది కాదని పేర్కొనడంలో రాజ్యాంగ రచయితలు విశేష విజ్ఞతతో ప్రవర్తించారు. రాష్ట్ర శాసన సభలే ఆమోదించవలసివస్తే ఆపని ఎన్నటికీ జరిగేదికాదు. రాజ్యాంగానుకూల వాదులు - వీరిని సమాఖ్యావాదులు (Federalists) అంగాం- ఈ రాష్ట్ర మహాసభలలో తమ పలుకుబడిని వినియోగించడానికి వీలయింది. పెన్సిల్వేనియారాష్ట్రంలోనూ ఇదే జరిగింది. రాజ్యాంగానుకూలవాదులు అవ్యవధికంగా ఒక మహాసభ ఏర్పాటుచేసి, రాజ్యాంగాన్ని ఆమోదిస్తున్నట్టు ఒక తీర్మానం ప్రతిపాదించి ఆమోదింప జేశారు. ప్రతిపక్షవాదులు తమ పక్షాన్ని కూడగట్టుకొనడానికి తగిన వ్యవధి లేకపోయింది. తత్ఫలితంగా పిమ్మట కొట్లాటలు, దౌర్జన్యాలు చెలరేగినవి.

మాసాచూసెట్స్‌లో మాత్రం సమాఖ్యాప్రతికూలురే సంఖ్యాధిక్యం సంపాదించారు, కాని చివరకు అక్కడకూడా రాజనీతి చాతుర్యమే పనిచేసింది. మసాచూసెట్స్ మహాసభ అధ్యక్షుడు జాన్ హాన్‌కాక్‌ని నూతన రిపబ్లిక్ వైస్‌ప్రెసిడెంట్ చేస్తామని అస్పష్టంగా వాగ్దానంచేసి, ఆయనను రాజ్యాంగానుకూలుడుగా తిప్పుకొన్న మీదట కొద్ది మెజారిటీతో మసాచూసెట్స్‌కూడా కొన్ని సవరణలు చేసే షరతులతో రాజ్యాంగాన్ని ఆమోదించింది.

ఈ కుటిలనీతి అన్ని రాష్ట్రాలలోను ఉపయోగపడదని రాజ్యాంగవాదులు గ్రహించారు. రాజ్యాంగాన్ని ఆమోదించకూడదని ప్రతికూలురు చేస్తున్న ప్రచారాన్ని ప్రతిఘటించడానికి ఉపన్యాసాలు, వాదోపవాద సభలు ఏర్పాటుచేయడం, పత్రికలలో ప్రచారం చేయడం అవసరమయింది. ప్రతికూలురు 'ఈ రాజ్యాంగం కేవలం పేదవారిపై ధనవంతుల నిరంకుశపాలన ఏర్పాటు చేయడానికి పన్నిన కుట్ర' అని తీవ్రంగా ప్రచారం చేస్తున్నారు. ప్రభుత్వం సామాన్యప్రజలపైన నిర్దాక్షిణ్యంగా పన్నులు విధిస్తుందనీ, అప్పులన్నీ తమకు దుర్లభమైన నగదు రూపంలో చెల్లించాలని బలాత్కరిస్తుందనీ, తమకు ఇష్టంలేని యుద్ధాలలో పాల్గొనడానికి బలవంతంగా సైన్యంలోకి లాక్కుపోతుందనీ - ప్రచారం చేస్తున్నారు. అన్నిటికన్న దారుణమైన ప్రచారం ప్రజలకు ఉండవలసిన వాక్ స్వాతంత్ర్యం, ఆరాధనా స్వాతంత్ర్యం, పత్రికా

స్వాతంత్ర్యం మొదలైన హక్కులను రాజ్యాంగంలో చేర్చనే లేదని కూడా వారు చెపుతున్నారు.

ఈ ప్రచారానికి జవాబుగా, రాజ్యాంగ వాదులు "సమాఖ్యా వాద పత్రావళి" (Federalist papers) అనే ప్రశస్తమైన వ్యాసపరంపరలు ప్రకటించి ప్రజలకు విస్తృతంగా పంచిపెట్టారు. అలెగ్జాండర్ హామిల్టన్, జేమ్సు మాడిసన్, జాన్ జే రాజ్యాంగంవల్ల ప్రజలకు కలిగే పరమ ప్రయోజనాలను ఈ వ్యాసాలలో విపులంగా వివరించారు. కేంద్రప్రభుత్వాన్ని మరిపటిష్ఠం చేయడం అనర్థదాయకమే అని అసందిగ్ధంగా అంగీకరిస్తూ సమఖ్యా సూత్రాలు (Articles of confederation) వల్ల ఏర్పడిన అరాజకస్థితిని వివరించి, శాంతి భద్రతలను కాపాడే ప్రజాస్వామ్య విధానంవల్ల కలిగే ప్రయోజనాలను కూడా వీరు ఏకరువుపెట్టారు. రాష్ట్ర ప్రభుత్వాలలో వలెనే ఈ నూతన ప్రభుత్వంలోకూడా నిరంకుశ విధానాలకు అవకాశం ఉండదని హామీ ఇచ్చారు. నిజానికి రాష్ట్రాలలోనే ప్రబలరాజకీయ పక్షాలు శాసనసభలను స్వాధీనం చేసుకొని యథేచ్ఛగా పరిపాలన సాగిస్తూ ఉండేవి. ఈ "సమాఖ్యావాద పత్రావళి" లోని హేతువాదం అమెరికా ప్రజలను విశేషంగా ఆకర్షించింది. సంశయాత్ములు చాలామంది సమాఖ్యానుకూల వాదులుగా మారిపోయారు.

ఈ లోపుగా డెలావేర్, న్యూజెర్సీ, జార్జియా రాష్ట్రాలు శీఘ్రంగాను, ఏకగ్రీవంగాను,రాజ్యాంగాన్ని ఆమోదించినవి. ఇతర రాష్ట్రాలు మెల్లగా 1788 ప్రారంభం నాటికి ఆమోదించినవి. ఆ సంవత్సరం జూన్ నెలలో న్యూహాంప్‌షైర్ కూడా ఆమోదించడంతో రాజ్యాంగం అమలు జరపడానికి అవసరమైన తొమ్మిది రాష్ట్రాల ఆమోదం లభించింది. అయితే వర్జీనియా, న్యూయార్క్ అనే రెండు పెద్దరాష్ట్రాలు ఇంకా ఈ విషయాన్ని గురించి తీవ్రంగా తర్జన భర్జనలు చేస్తున్నవి. ముఖ్యంగా నూతన ప్రభుత్వానికి ఆరెండు రాష్ట్రాల మద్దత్తు చాలా అవసరం.

వర్జీనియాలో, పాట్రిక్ హెన్రీ నాయకత్వాన రాజ్యాంగ ప్రతికూలోద్యమం బలంగా సాగుతూంది. రాజ్యాంగం ఉపోద్ఘాతంలో "వివిధరాష్ట్రాలకు చెందిన మనం" అని వ్రాయుడానికి బదులు సంయుక్త

రాష్ట్రాల ప్రజలమైన మనం" అని వ్రాయడం దారుణమైన మహాపరాధమని వీరు ఆందోళన ప్రారంభించారు. ఈ పోరాటంలో జార్జి వాషింగ్టన్, జేమ్స్ మాడిసన్ల పలుకుబడి యావత్తూ ఈ ఉద్యమానికి ప్రతికూలంగా ఉపయోగబడింది. చివరకు ఆ రాష్ట్రం తూర్పు భాగంలో ఉన్న ఐశ్వర్యవంతులైన రైతులు, పశ్చిమ సరిహద్దు వాసులూ ఏకమై ఎలాగో కొద్దిమెజారిటీతో రాజ్యాంగాన్ని ఆమోదించారు. బలిష్ఠమైన ప్రభుత్వము, ఒడుదుడుకులు లేని ద్రవ్యపు చెలామణీ విధానము, అవసరమని ఈ రైతులు భావించారు. వెనుక ప్రక్క అడవులలో ఉన్నవారు, సరిహద్దు పొడుగునా తమకు బలమైన సంరక్షణ, అంతర రాష్ట్రీయ వాణిజ్యాభివృద్ధి అవసరమని భావించడం వలన వారుకూడా సమాఖ్యావాదులలో చేరారు.

న్యూయార్క్ రాష్ట్రం పరిస్థితికూడా క్లిష్టంగానే పరిణమించింది. కాని, విసుగు విరామాల్లేకుండా అలెగ్జాండర్ హామిల్టన్ చేసిన అవిరళకృషివలన, చివరకు సమాఖ్యావాదులకే విజయం సంభవించింది. ఒకానొక సమయంలో న్యూయార్క్ నగరం ఆరాష్ట్రంనుండి విడివడి పోయి, తాను విడిగా యూనియన్లో చేరిపోయేటట్లు కనిపించింది. పొకిప్సీవద్ద జరిగిన మహాసభలో చివరకు వోట్లు తీసుకోనగా ముప్ఫయి వోట్లు రాజ్యాంగానికి అనుకూలంగానూ, 27 వోట్లు ప్రతికూలంగాను రావడంతో న్యూయార్క్ రాష్ట్రంకూడా ఆమోదించినట్లయింది.

ఇప్పటికి మొత్తం పదమూడు రాష్ట్రాలలో పదకొండు రాష్ట్రాలు సమాఖ్యా పతాకచ్ఛాయలోకి రావడం, ఒక ప్రభుత్వ ఏర్పడి వ్యవహారిస్తూండడంవల్ల క్రమంగా రోడ్ ఐలెండ్, ఉత్తర కెరోలినా రాష్ట్రాలుకూడా రాజీకి వచ్చినవి. రోడ్ ఐలెండ్ రాష్ట్రం, అసలు ఫిలడెల్ఫియా రాజ్యాంగ పరిషత్తు కార్యకలాపాల్లోనూ పాల్గొనలేదు; పిమ్మట రాజ్యాంగాన్ని ఆమోదించడానికి మహాసభను సమావేశపరిచే ప్రయత్నమూ చేయలేదు. కాని, తోటి రాష్ట్రాలన్నీ తనను విదేశంగా పరిగణించి, తన సరుకులపై దిగుమతి సుంకాలనుకూడా విధించబోతున్నట్లు బెదిరించడంతో, రోడ్ ఐలెండ్ రాష్ట్రంకూడా చివరకి లొంగి పోయింది. దానితో సంయుక్త రాష్ట్రాల ఏకీకరణం పూర్తి అయింది.

ఆనాడు ఏకమయిన పదమూడురాష్ట్రాలు ఇవి: 1. కనెక్టికట్, 2. డెలావేర్, 3. జార్జియా, 4. మేరీలాండ్, 5. మసాచూసెట్స్, 6. న్యూహాంప్‌షైర్, 7. న్యూజెర్సీ, 8. న్యూయార్క్, 9. ఉత్తర కరోలినా, 10. పెన్సిల్వేనియా, 11. రోడ్ ఐలెండు, 12. దక్షిణ కరోలినా, 13. వర్జీనియా.

ఈ రాష్ట్రాలలో కొన్నింటికి మొదట సమాఖ్యలో చేరడం ఎంత ఇష్టంలేకపోయినా, చివరికి రాజ్యాంగాన్ని పూర్తిగా ఆమోదించే సందర్భంలో మొత్తం దేశమంతటా గొప్ప ఆనందోత్సవాలు జరిగినవి. మసాచూసెట్స్ మొదలు దక్షిణకరోలినావరకు ప్రతిపట్టణంలో విందులు, వినోదాలు, ఉపన్యాసాలు, సైనికవిన్యాసాలు జరిగినవి. సర్వత్రా పత్రికలన్నీ అత్యానందంతో ప్రత్యేక సంచికలు ప్రకటించినవి. పూర్వపు సమాఖ్యాసూత్రాల ప్రకారం ఏర్పడిన కాంగ్రెసు తన అధికారాన్ని నూతన ప్రభుత్వానికి దత్తంచేసి తాను అస్తంగతమైపోయింది.

సమాఖ్యావాదులకు ఇది ఘనమైన, సంపూర్ణమైన విజయం. హామిల్టన్, మరికొందరు అంతకన్నకూడ పటుతర ప్రభుత్వం అవసరమని మొదట వాదించారు. ప్రెసిడెంటు, సెనేటర్లుకూడా జీవితాంతం వరకు ఆ పదవులను నిర్వహించే హక్కుతో ఒకేసారి ఎన్నుకొనబడాలని, రాష్ట్రప్రభుత్వాలకు గల అధికారాలన్నిటినీ లాగివేయాలనీ, వారు సూచించారు. కాని రాజ్యాంగం చివరకు ఆమోదింపబడిన రూపంలో వారికికూడా బాగా సంతృప్తికరంగానే ఉంది. హక్కులపత్రం విషయంలో సమాఖ్యావాదులు తమ పట్టు సడలించి, రాజ్యాంగ శాసనానికి దానినొక అనుబంధంగా చేర్చడానికి అంగీకరించవలసి వచ్చింది. ఈ పత్రాన్ని చివర చేర్చినప్పటికీ రాజ్యాంగంలోని విషయాలతో దానికి ఏవిధమైన జోక్యంలేనందున సమాఖ్యా ప్రతికూలురు చేసిన ఈ సూచనను హామిల్టన్ పక్షంవారు ప్రతిఘటించలేదు.

రాష్ట్రాలన్నీ ప్రెసిడెంట్‌ని, ఎన్నుకొనవలసిన ఎన్నికదార్లను అతివేగంగా ఎన్నుకొని, ప్రధాన కార్యకర్త (ప్రెసిడెంట్) ఎన్నికకూడా పూర్తిచేసినవి. ఈ ఎన్నిక ఫలితం విషయంలో ఎవరికీ ఏవిధమైన సందేహంలేదు. జార్జి వాషింగ్టన్ ఏకగ్రీవంగా ఎన్నిక అయాడు.

"అమెరికా జాతిపిత," జాతీయ మహావీరుడు అయిన వాషింగ్టన్‌లో ఉదాత్తతకు కావలసిన సకల సౌశీల్యాలతోపాటు, సౌమ్యతకూడా పుష్కలంగా ఉన్నది. వాషింగ్టన్ ప్రెసిడెంటు పదవి తనకు కావాలని కోరలేదు. నిజానికి వర్జినియారాష్ట్రపు రైతుగా ప్రశాంత జీవనం గడపడం ఆయనకు ఎక్కువ ఇష్టం. వైస్ ప్రెసిడెంటు పదవికి మసాచూసెట్స్‌కి చెందిన జాన్ ఏడమ్స్ ఎన్నిక అయాడు. రాజధాని, మొదట కొన్ని సంవత్సరాలవరకు న్యూయార్క్ నగరంలో ఉండాలని నిశ్చయించారు.

వాషింగ్టన్, మౌంట్ వర్నన్‌లోని తన సుందరమైన గృహాన్నించి ఉత్తరదిశకు బయలుదేరాడు. మార్గమధ్యంలోని ప్రతి పట్టణంలో ఆయన గౌరవార్థం అనేక అభినందన విన్యాసాలు, ప్రజోత్సాహ ప్రదర్శనలు ఏర్పాటు చేయబడినవి. ఆయన పాదాలపైన పూలు చల్లారు. ఆయనకు అభివందనలు తెలపడానికి భూనభోంతరాళాలు దద్దరిల్లేటట్టు ఫిరంగులు మ్రోగినవి. అఖండ ప్రేమాదర పురస్సరమైన ఈ ప్రదర్శనలకు ఆయన తన ధన్యవాదాలు తెలుపుతూంటే, కొన్ని సంవత్సరాలకు పూర్వం ఆయన నాయకత్వంక్రింద యుద్ధం చేసినవారంతా ఆనందాశ్రువులతో చెమ్మగిల్లి మందగించిన ఆర్ద్రదృష్టులతో ఆయనకు అభిషేకం చేశారు. న్యూయార్క్‌కి రాగానే ఆ మహావీరునికి అద్భుతమైన స్వాగత మీయబడింది. 1789 ఏప్రియల్ 30 వ తేదీన వాల్‌స్ట్రీటులోని ఫెడరల్ హాలులో తొలిప్రెసిడెంటుగా జార్జి వాషింగ్టన్ పదవీ స్వీకారం చేశాడు.

---

# పంచమాధ్యాయము

## వాషింగ్టన్ మొదలు పోకేవరకు

వాషింగ్టన్ రెండు పర్యాయాలు ప్రెసిడెంటుగా ఎన్నిక అయాడు. అయినప్పటికీ, చిట్టచివరకు తోడి ప్రజలకు ఆయనపట్ల గల అపార గౌరవప్రపత్తులు లవలేశమైనా మొక్కపోకుండా నిలచి ఉన్న

వన్న ఉదాత్తవిషయం ఇక్కడ పేర్కొనవలసి ఉన్నది. కాని అమెరికా రాజకీయవ్యవస్థలో ప్రధాన కార్యనిర్వాహకులు(ప్రెసిడెంట్లు)గా ఎన్నికైన వారిలో చాలా కొద్దిమంది మాత్రమే ఇంతటి అపార ప్రజారంజకతకు ప్రసిద్ధి కెక్కారు. సామాన్యంగా, అల్పసంఖ్యాకవర్గం లాంఛనకోసం అయినా ఏదోవిధంగా ప్రభుత్వంపట్ల అసంతృప్తి ప్రకటించక మానరు; సామాన్యంగా ఓటర్లలో నాలుగవవంతునుండి, సగంవరకుకూడా ప్రెసిడెంట్‌ని ప్రతిఘటించేవారు ఉండవచ్చు; మిగిలినవారు మాత్రమే సాధారణంగా ప్రెసిడెంట్‌పట్ల విశ్వాసం కలిగి ఉంటారు.

వాషింగ్టన్ రాజకీయాలకు అతీతుడై ఉండటానికే సదా తన సర్వశక్తులా ప్రయత్నించాడు; కాని, తన చేతలలో మాత్రం తాను సమాఖ్యావాది అయిన సంగతి వ్యక్తం చేశాడు. అందువల్ల కొందరు ప్రతిపక్షులు మాత్రం ఆయనను "నియంత" అని "నిరంకుశు" డనీ, విమర్శించారు. రాజ్యాంగాన్ని ఆమోదించరాదని ప్రతిఘటించిన సమాఖ్యా ప్రతికూలవాదులు అచిరకాలంలోనే సుసంఘటిత ప్రతిపక్షంగా ఏర్పడి తమపక్షానికి రిపబ్లికన్ పార్టీ అని నామకరణం చేసుకున్నారు. కాని, ఇది ప్రస్తుతం అమెరికాలో ఉన్న రిపబ్లికన్ పార్టీకి గాక, డెమొక్రాటిక్ పార్టీకి ఆదిమ రూపం అనే విషయం, కొంత కలవరపాటు కలిగించేదైనా, ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవాలి. ప్రస్తుతపు రిపబ్లికన్‌పార్టీ, నాటి సమాఖ్యావాదులు పరంపరకు సన్నిహితమైనదిగా పరిగణింపబడుతున్నది.

ఇక సమాఖ్యావాదులకు, రిపబ్లికనులకు జరిగిన సంఘర్షణలకు కారణమైన ప్రధాన రాజకీయసమస్య, రాజ్యాంగాన్ని నిర్వచించడంలో ఉభయపక్షాలకు కలిగిన విభేదాలవల్ల ఏర్పడింది. సమాఖ్యావాదులు రాజ్యాంగంలోని సూత్రాలను స్థూలంగా, - శాసనాలు చేయడంలోను అమలు జరపడంలోను జాతీయ ప్రభుత్వానికి సాధ్యమైనంత ఎక్కువ అధికారం లభించేవిధంగా - వ్యాఖ్యానించడ మారంభించారు. మరొకవంక రిపబ్లికనుల రాజ్యాంగంలోని ప్రతి సూత్రాన్ని తూ.చ. తప్పకుండా అమలు జరపాలనీ, ప్రభుత్వం తనకు రాజ్యాంగరీత్యా సంక్రమించిన అధికారాలను మించి వ్యవహరించడానికి వీలులేదనీ పట్టుపట్టారు.

ప్రెసిడెంట్ వాషింగ్టన్, నలుగురు సభ్యుల (శాఖాధిపతుల) తో కూడిన తన ప్రథమ మంత్రివర్గంలో ప్రతిపక్షవర్గాలకు చెందిన ఇరువురు ప్రముఖులకు స్థానం యిచ్చాడు. సమాఖ్యావాదియైన అలెగ్జాండర్ హామిల్టన్‌కి ఖజానాశాఖ అప్పగించాడు. స్వాతంత్ర్య ప్రకటనపత్ర రచయిత, రాజ్యాంగ రచనాసమయంలో ఫ్రాన్సులో అమెరికా రాయబారి అయిన థామస్ జెఫర్సన్ విదేశాంగమంత్రి అయినాడు. జెఫర్సన్ సమాఖ్యా ప్రతికూలవాది, ధనవంతుడు, విద్వాంసుడు; అయినప్పటికీ మనసా, కర్మణా కూడా పూర్తిగా ప్రజాస్వామ్యవాది.

క్రమంగా పరిపాలనా వ్యవహారాలలో హామిల్టన్, జెఫర్సను అడుగడుగున ఒకరినొకరు ఎదుర్కొనడం ప్రారంభించారు. వారు ఉభయుల భావనావిధానాలు ఒకేవిధమైనవి అయినప్పటికీ, అనేక ప్రధానసమస్యల విషయంలో ఇద్దరికీ తీవ్రవిభేదాలు ఏర్పడినవి. సమాఖ్యాప్రభుత్వం బలిష్ఠమైనది గాను, ఐశ్వర్యవంతుల కూటమిచే నడపబడేదిగాను, ఆస్తిపాస్తులు గలవారి శ్రేయస్సునే ప్రధానంగా ఎంచేదిగాను ఉండాలని హామిల్టన్ అభిప్రాయం. కేంద్రప్రభుత్వాధికారం సాధ్యమైనంత పరిమితంగాను, సామాన్య ప్రజానీకంచే నడపబడేదిగాను ఉండాలని జెఫర్సన్ అభిప్రాయం. సామాన్య ప్రజానీకాన్నే ఈయన ప్రధానంగా పరిగణించేవాడు. ఈ ప్రజానీకం స్థానిక, రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా తమ అభిప్రాయాలను వ్యక్తం చెయ్యాలని ఆయన సూచన.

ప్రభుత్వాదాయాన్ని వృద్ధి చేయడం, ప్రభుత్వానికి పరపతి పుట్టించడం, ఈ నూతనప్రభుత్వం ఎదుర్కొనిన ప్రధానమైన క్లిష్ట సమస్యలలో ఒకటి అయింది. పూర్వపు కాంగ్రెసు యుద్ధపు ఖర్చుల కోసం విదేశాలనుండి, అమెరికా పౌరులవద్దనుండి కూడా ఋణాలు సేకరించింది. రాష్ట్రప్రభుత్వాలు కూడా ఋణగ్రస్తాలుగానే ఉన్నవి.

ముప్ఫయిరెండేళ్ళ యువకుడైన హామిల్టన్ రెండు సంవత్సరాలలో ఈ అప్పులన్నిటినీ సర్దుబాటుచేసివేశాడు. కాని, ఇందుకొరకు ఇతడు అవలంబించిన విధానాలకు సమాఖ్యా వాదులు విశేషంగా ప్రశంసించినా, ప్రతిపక్షంవారు మాత్రం తీవ్రంగా ఖండించారు. విదేశాలలోని ఋణాలన్నీ తీర్చివేశాడు; ఈ పనిని ఎవరూ ఆక్షేపించ లేదు.

కాని, స్వదేశంలో ప్రభుత్వం లోగడ తాను జారీచేసిన ఋణపత్రా లన్నిటికీ కూడా పూర్తిగా డబ్బు చెల్లించేసరికి, పెద్ద ఆందోళన బయలుదేరింది. మొదట, దేశభక్తిగల పౌరులే ఈ ఋణపత్రాలను కొన్నారు; అయితే కొంతకాలానికి వారు అవి నిరుపయోగమని భావించారు. కొంతమంది ఆపత్రాలను వచ్చినకాడికి అమ్మివేయగా, వాటి మీద పెట్టుబడి పెట్టి లాభాలు తీద్దామనుకొన్న వ్యాపారస్థులు వాటిని కొన్నారు. అందువల్ల ప్రభుత్వం ఈ ఋణపత్రాల మొత్తాలను అసలు ఫాయిదాలతో చెల్లించివేయడం వలన లాభం పొందినవారు - వాటిని మొదట కొన్నవారు కాక, తక్కువఖరీదుకు వారివద్దనుండి వాటిని సేకరించి పెట్టుకొన్న వర్తకులయారు. ఈ ఋణపత్రాల మొత్తాలను పూర్తిగా చెల్లించివేయడంలో తన ఆశయం-ప్రజలలో ప్రభుత్వానికి పరపతి, విశ్వాసం వృద్ధిచేయడమే అనీ, దాని వలన పౌరులలో ఎవరు లాభంపొందారన్నవిషయం ముఖ్యమైనది కాదనీ హామిల్టన్ ప్రకటించాడు. ఈచర్య కొంతవరకు దురుసుగా కనిపించినప్పటికీ, దానివల్ల హామిల్టన్ కోరిన ఫలితం మాత్రం పూర్తిగా సిద్ధించింది. ప్రభుత్వపు బాండ్లకు ప్రతిష్ఠ యేర్పడింది. ప్రభుత్వం ప్రజలవద్దనుండి ఋణం చేయ దలచుకొన్నప్పడు,ఋణపత్రాలు అనాయాసంగా అమ్ముడుపోతున్నవి.

రాష్ట్రప్రభుత్వాలు చేసిన అప్పులకుకూడా కాంగ్రెసే బాధ్యత వహించి,వాటినితీర్చేటట్టు చేయడంవలనకూడా హామిల్టన్ జాతీయప్రభుత్వాన్ని బలవత్తరం చేశాడు. ఈఋణాలు కొన్నిరాష్ట్రాలకు ఎక్కువగాను కొన్నిరాష్ట్రాలకు తక్కువగాను ఉన్నప్పటికీ, హామిల్టన్ వాటిని తీర్చే బాధ్యత అన్నిరాష్ట్రాలు సమంగా పంచుకునేటట్టు చేశాడు. ఋణం తక్కువగా ఉన్న వర్జీనియా, పెద్ద పెద్ద అప్పులుగల మసాచూసెట్స్ మొదలైన రాష్ట్రాల ఋణాలు తీర్చడానికి గాను తనను పన్నులు చెల్లించమనడం యుక్తంకాదని అభ్యంతరం చెప్పింది కాని, శాశ్వతరాజధానిని దక్షిణాదిన పొటోమెక్ నదిమీద నిర్మించగలమని వాగ్దానం చేయుడం మూలంగా హామిల్టన్ వర్జీనియాను సమాధాన పరిచాడు. ఈ విధంగా కేంద్రప్రభుత్వం రాష్ట్రాల అప్పులనుకూడా తీర్చడానికి పూనుకొనడంమూలాన, సంయుక్తరాష్ట్రాల ఆర్థిక వ్యవహారాలపై సర్వాధికారం కేంద్రప్రభుత్వానిదే అనే సంగతి అమెరికాకే కాదు ప్రపంచమంతటికీ చాటినట్టయింది.

యునైటెడ్ స్టేట్స్ బ్యాంకు అనే సంస్థను స్థాపించడం, కేంద్ర ప్రభుత్వ వ్యవస్థను బలపరచడానికి హామిల్టన్ చేసిన మరొక ప్రశంస నీయమైన ఘనకార్యం. ఈ బ్యాంకుస్థాపనలో దేశం మొత్తంమీద వ్యాపారస్థులందరి సహకారం ఆయన సంపాదించాడు. "బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండు" నమూనాలో స్థాపించబడిన ఈ సంస్థకు ప్రభుత్వమూ, ప్రైవేటు వ్యాపారస్థులూ కూడా పెట్టుబడి పెట్టారు. ఆ పెట్టుబడుల నిష్పత్తిలోనే లాభాలుకూడా పంచుతారు. పన్నుల మూలంగాను, భూముల అమ్మకం మూలంగాను ప్రభుత్వానికి వచ్చే ఆదాయ మంత టినీ ఈ బ్యాంకు స్వీకరించి, అంతకుపూర్వం వివిధ రాష్ట్రాలు జారీచేసే కరెన్సీనోట్లను రద్దుచేసి, వాటిస్థానంలో అన్నిరాష్ట్రాలలో చెలా మణి అయే ఒకేవిధమైన కరెన్సీనోట్లను జారీచేస్తుంది. ఇలాంటి బ్యాంకును స్థాపించవచ్చునని రాజ్యాంగంలో ఎక్కడా వ్రాసిలేదు; కాని ఈ అధికారం కూడా ప్రభుత్వానికి ఉన్నదనే అర్థం రాజ్యాం గంలో "అంతర్గర్భితం" గా ఉన్నదని సమాఖ్యావాదులు వాదించారు. కాంగ్రెసు పన్నులు వసూలు చేయవచ్చు; అప్పు చేయువచ్చు. తీర్చ వచ్చు. గనుక ఈ పనులను చేయడానికి సాధ్యమైన నేషనల్ బ్యాంకును స్థాపించుకొనడానికి అభ్యంతరం ఎందుకు ఉండాలి?

జాతీయ ప్రభుత్వకోశంలోకి ధనం సమకూర్చేందుకు గాను విదేశాలనుండి దిగుమతి అయే సరకులపై సుంకాలు విధించడానికీ, విస్కీ, సారాలపై ఎక్సైజుపన్ను విధించడానికీ సమాఖ్యావాదుల ప్రాబల్యంగల కాంగ్రెస్ నిశ్చయించింది. ఈ పన్నులవలన కొంతవరకు మంచి ఆదాయమే రావడం మొదలయింది; కాని, ఈ పన్నులకు ప్రతి ఘటనకూడా హెచ్చుగానే బయలుదేరింది. విస్కీపై విధించిన పన్నును ప్రతిఘటించడం కోసం ఈ విస్కీ తయారుచేసే పశ్చిమ పెన్సిల్వేనియా రైతులు "విస్కీ తిరుగుబాటు" అనే దౌర్జన్య పూరిత మైన ఉద్యమం ప్రారంభించి సమాఖ్యాప్రభుత్వాధికారాన్ని ధిక్క రించేసరికి, 15,000 మంది సంయుక్తరాష్ట్ర సైనికులు వెళ్ళిబలవం తంగా ఆ తిరుగుబాటును అణచివేయవలసి వచ్చింది.

దిగుమతి సుంకాల విషయంలో ప్రజాభిప్రాయం మిశ్రమంగా ఉన్నది. యిరోపానుండి దిగుమతిఅయే పాదరక్షలపైన, దుస్తులపైన,

యంత్రాలపైన సుంకం విధించడం ఉత్తరాది రాష్ట్రాలలో మాత్రం అందరికీ సమ్మతంగానే ఉంది. ఉత్తరాదివారు అప్పటికి, అనగా 1790 ప్రాంతానికి, స్వంత పరిశ్రమలు స్థాపించడం మొదలుపెట్టారు. అందువల్ల, తమ ఉత్పత్తులకు విదేశాల పోటీభయం లేకుండా చేయడానికి ఈ సుంకాలు ఉపకరిస్తాయి గనుక, వారంతా ఈసుంకాలను ఆమోదించారు. కాని, దక్షిణాది రాష్ట్రాలుమాత్రం వ్యవసాయ రాష్ట్రాలుగానే ఉన్నవి. అందువల్ల అచ్చటి రైతులు విదేశ వ్యాపారస్థులతో లాభసాటి లావాదేవీలు ఏర్పాటు చేసుకుని, తాము పండించే ప్రత్తి వగైరా ముడిసరుకులు వారికి ఎగుమతి చేసి, వారు తిరిగి పంపే వస్త్రాలు మొదలైన తయారీ సరుకులను సబబైన ధరలకు దిగుమతి చేసుకుంటున్నారు. ఈ తయారీవస్తువులపై ఎక్కువ పన్ను విధించడంవల్ల, ఈ విదేశవాణిజ్యంవల్ల రైతులకు వచ్చే లాభాలకు దెబ్బతగుల్తుంది. ఈ దిగుమతిసుంకాల సమస్య దేశంలో వివిధవర్గాలమధ్య సంఘర్షణలకు కారణమయింది. అటుపిమ్మట డెబ్బయి సంవత్సరాలకు ఉత్తరాది వారికీ దక్షిణాదివారికీ నడుమ సంఘటిల్లిన అంతర్యుద్ధానికి ఇదికూడా ఒక ప్రధానకారణమయింది.

* * * * * * *

సమాఖ్యావాదులు, రిపబ్లికనులు దేశీయ వ్యవహారాలలోనే గాక, విదేశాంగవిధానం విషయంలోకూడా అంత తీవ్రంగాను వివాదపడుతున్నారు. ఇక్కడ వాషింగ్టన్ ప్రెసిడెంటు పదవి స్వీకరించిన సంవత్సరమే, ఐరోపాలో మరొక దారుణ సంక్షోభం ప్రారంభమయింది. సంయుక్తరాష్ట్రాలుకూడా దానిలోనికీడ్వబడడం, తత్ఫలితంగా ఆ శైశవ దశలోనే నాశనం అవడం తప్పనట్టు కనిపించింది.

ఈ సంక్షోభం ఫ్రెంచివిప్లవం, దానిలో ప్రజలు బోర్బన్ రాజవంశాన్ని పదవీభ్రష్టంచేసి, పదహారవ లూయీనీ, మేరీ ఆంట్వానెట్‌నీ ఉరితీశారు. ఈ అంతర్యుద్ధంలో రక్తపాతం, హింసాకాండ పెచ్చుపెరిగిపోతుండటం చూచి, తదుపరి తమకుకూడా అట్టి స్థితే పట్టవచ్చుననే అనుమానంతో ఇతర ఐరోపా చక్రవర్తులుకూడా ఈ యుద్ధంలో జోక్యం కలిగించుకొనడానికి ప్రయత్నించారు. అచిరకాలంలోనే, యుద్ధజ్వాలలు ఐరోపా అంతటికీ ప్రాకినవి. ఫ్రాన్సు తిరిగి తన పూర్వ

శత్రువైన ఇంగ్లండుతో మరొక చావుబ్రతుకుల పోరాటంలో తగుల్కొన్నది.

అప్పటికి, అమెరికా ఫ్రాన్సులు మిత్రరాజ్యాలు. అమెరికా స్వాతంత్ర్యం సంపాదించుకోవడానికి ఫ్రాన్సు చాలా సహాయం చేసినందున, సహజంగా తనకు ఇప్పుడు అమెరికా సహాయం చెయ్యగలదని ఆశించింది. అమెరికాలో చాలామంది, ముఖ్యంగా రిపబ్లికనులు ఫ్రెంచి విప్లవవాదులపట్ల సానుభూతి ప్రకటిస్తూ, వెంటనే అమెరికా ఇంగ్లండ్‌కి తగిన శాస్తి చెయ్యాలని కోరారు.

కాగా మితవాదు (Conservatives) లైన సమాఖ్యావాదుల అభిప్రాయం దీనికి భిన్నంగా ఉంది. ఫ్రాన్సులో జరుగుతున్న సంఘటనలను చూచి, ఐరోపాలోని మితవాద పాలకులవలెనే వీరుకూడా చాలా కంగారుపడ్డారు. పైగా, ఐరోపాకు సంబంధించిన యుద్ధంలో జోక్యం కల్పించుకుంటే, కెనడానుండి, పశ్చిమదిశనుండి, దండయాత్రలు జరిగే దారుణ ప్రమాదాన్ని కొని తెచ్చుకున్నట్టు అవుతుంది. అందువలన, ఆ యుద్ధం విషయంలో అమెరికా తటస్థంగా ఉంటుందని 1793 లో వాషింగ్టన్ ప్రకటించాడు. అమెరికా స్నేహసంధి చేసుకొన్నది ఫ్రాన్సుదేశంలోని పూర్వ ప్రభుత్వంతో తప్ప విప్లవవాదుల నూతనప్రభుత్వంతో కాదు గనుక, ఆ సంధిరీత్యా ఫ్రాన్సుకి సహాయపడవలసిన బాధ్యత అమెరికాకు లేదని, ఈ తాటస్థ్యాన్ని సమర్థించుకొన్నారు.

అమెరికనులను యుద్ధంలో పాల్గొనవలసినదిగా కోరడంకోసం, ఈలోగా ఫ్రెంచివారు సిటిజెన్ ఎడ్మాన్ జెనెట్ అనే రాయబారిని పంపారు. బ్రిటిషువారి నౌకావాణిజ్యం మీద దెబ్బతీయడానికిగాను అమెరికా రేవులను నౌకాయుద్ధ స్థావరాలుగా ఉపయోగించాలనీ, ప్రస్తుతం స్పెయిను ఇంగ్లండు పక్షాన పోరాడుతున్నందువలన అమెరికాలో పశ్చిమదిశనున్న స్పానిష్‌వలసలపైకి దండయాత్ర పంపాలనీ, ఈ రాయబారి అమెరికాకు సూచించాడు. ఇతడు ఔచిత్య మెరిగి వ్యవహరించి ఉంటే, ఫ్రాన్సుకి మద్దతు లభించి ఉండేది; కాని, ఇతడు తలబిరుసుతనంతో, అమెరికాలోని ఫ్రాన్సు అనుకూలవాదులతో గూడు పుఠాణి చేసి, వారు తాటస్థ్య ప్రకటనను ఉల్లంఘించేటట్టు చేయడానికి

ప్రయత్నించాడు. దానితో, ప్రజాభిప్రాయం, జెనెట్ కి పూర్తిగా ప్రతికూలమయింది. చివరకు అతడా ఉద్యోగంనుండి బర్తరపు చేయబడ్డాడు.

ఫ్రాన్సుతో సంబంధాలు సక్రమంగాలేకపోయినా, ఇంగ్లండుతో సంబంధాలుకూడా అంతంమాత్రంగానే ఉన్నవి. ఎగువ వాయవ్య ప్రాంతంలో కొన్నిదుర్గాలు ఇంకా బ్రిటిష్ వారి చేతుల్లోనే ఉన్నవి. తొలి వలసల కాలంనుండి, అమెరికా వర్తకులు, బ్రిటిషు పౌరులకు బాకీవున్న మొత్తాలన్నిటినీ పూర్తిగా చెల్లించేవరకు ఆ దుర్గాలను అప్పగించదలచుకొననట్టు విప్లవానంతరం బ్రిటన్ పట్టుబట్టుకొని కూర్చుంది. ఈ స్థావరాలలోనుండి ఇంగ్లండు ఎర్ర ఇండియనులను ప్రోత్సహించి వారిచే అమెరికా వలసలపై దాడులు చేయించడ మారంభించింది. ఈ విధంగా, తాను లోగడ వదులుకొన్న పశ్చిమప్రాంతాన్ని కొంత వరకు తిరిగి సంపాదించవచ్చునని ఇంగ్లండు ఆశించింది. సముద్రాలపై బ్రిటిష్ నౌకాదళంవారు అమెరికను నౌకలను పట్టుకొని, లోగడ బ్రిటిష్ నౌకాదళంలో నుండి పారిపోయి వచ్చినవారంటూ ఆ నావికులను బలవంతలగా బ్రిటిష్ నౌకలలో పనిచేయడానికి తీసికొనిపోయేవారు. వీరిలో చాలామంది వాస్తవంగా బ్రిటిష్ నౌకాదళంలోనుండి పారిపోయి వచ్చినవారే కాని, కేవలం అమెరికా పౌరులు కూడా చాలామంది ఉన్నారు.

వాషింగ్టన్ రెండవ పర్యాయం ప్రెసిడెంట్ గా ఎన్నిక అయిన తరువాత, ఐరోపా వ్యవహారాలలో అమెరికా తాటస్థ్యం వహిస్తుందని ప్రకటించి, ఇంగ్లండులోగల విభేదాల పరిష్కారానికిగాను రాయబారాలు జరిపేందుకు 1794 లో జేమ్స్ జేని లండను పంపారు. ఈ రాయబారం ఫలితంగా పశ్చిమదుర్గాలను అమెరికాకు అప్పగించడానికి బ్రిటన్ సమ్మతించింది గాని, ఇందుకోసం వాణిజ్య, నౌకా రంగాల్లో బ్రిటన్ కోరిన అవమానకర సౌకర్యాలకు జే సమ్మతించడం చాలామంది అమెరికనులకు ఆగ్రహకారణమయింది. ప్రెసిడెంట్ వాషింగ్టన్ పిమ్మట స్పెయినుతోకూడా సంధి చేసుకున్నాడు. ఈ సంధిద్వారా ఫ్లారిడా, సరిహద్దును నిర్ధారణ చేయడం, మిస్సిసిపీనది పైన ఓడలు నడుపుకునే హక్కు, న్యూ ఆర్లియన్స్ నౌకాశ్రయాన్ని ఉపయోగించుకునే హక్కు, అమెరికాకు లభించడం, – జరిగింది.

వాషింగ్టన్ పదవీకాలం 1796 తో పూర్తి అయింది. ఆయన తన జీవితంలో కడపటి మూడు సంవత్సరాలు వర్నన్‌లో విశ్రాంతి తీసుకున్నాడు. ఆయన రాజ్యాంగబద్ధమైన సక్రమప్రభుత్వాన్ని స్థాపించాడు. అమెరికా శైశవదశలో యుద్ధంలో తగుల్కొని నాశనం కాకుండా కాపాడాడు. పదవీ విరమణోపన్యాసంలో ఆయన, ఐకమత్యంతో వ్యవహరించవలసిందనీ, "విదేశాలతో శాశ్వతమైన ఒప్పందాలేవీ చేసుకొనవద్దు" అనీ తన దేశస్థులను హెచ్చరించాడు. ఆయన, తరవాత, తీవ్రసమాఖ్యావాది అయిన జాన్ ఏడమ్స్ ప్రెసిడెంటుగా ఎన్నిక అయాడు. ఆనాడు అమలులో ఉన్న చిత్రమైన వోటింగ్ పద్ధతి వలన, వోట్ల లెక్కింపులో థామస్ జెఫర్సన్‌కి ద్వితీయ స్థానం వచ్చినందువలన ఆయన ఉపాధ్యక్షుడయాడు.

ఇంగ్లండుతో సంధి చేసుకున్నందు వలన అమెరికాకు ఫ్రాన్సుతో క్రొత్తచిక్కులు, పూర్వంకన్న క్లిష్టతరమైన చిక్కులు ఏర్పడినవి. ఈవిభేదాలను సర్దుబాటు చేసుకొనడానికి ప్రెసిడెంట్ ఏడమ్స్ పారిస్‌కి కొందరు రాయబారులను పంపగా, తమ ఊరు పేరులుకూడా సరిగా తెలుపని ఫ్రెంచి ఉద్యోగులెవరో వారిని కలుసుకొని, ముందుగా తమకు అప్పులు, వ్యక్తిగత బహుమానాలు ఇస్తేగాని, తరవాత విషయం మాట్లాడమని చెప్పారు. ఈ చర్య అమెరికాకు ఆగ్రహం కలిగించింది. అమెరికా ఫ్రాన్సులమధ్య అప్రకటిత యుద్ధం ప్రారంభమయింది. పరస్పరం కాల్పులు జరుపుకొనడం, సముద్రంపైన నౌకాయుద్ధాలు కూడా ప్రారంభమయినవి. కాని, కేవలం ప్రెసిడెంట్ ఏడమ్స్ ఓర్పువలన ఆ యుద్ధం పెద్దదికాకుండా తప్పిపోయింది.

ఈ యుద్ధప్రమాదం ఇలా అంటూ ఉండగానే, ప్రతిపక్షపు ఆట కట్టించడానికీ, దేశంలో శాంతి భద్రతలను కాపాడడానికీగాను సమాఖ్యావాదులు చేసిన రెండు శాసనాలు సమాఖ్యావాదపక్షపతనానికి అంతిమకారణము అయినవి. వీటిలో, మొదటిదైన శత్రుచర్యల శాసనంవలన, సంయుక్తరాష్ట్రాల శాంతిభద్రతలకు ముప్పు కలిగించే ప్రవర్తన కలిగి ఉన్నట్టుగా కనిపించే దేశద్రోహులకు దేశాంతరవాస శిక్ష విధించే అధికారం ప్రెసిడెంటుకి లభించింది. రెండవదగు దేశద్రోహ చర్యల శాసనంవలన, సంయుక్తరాష్ట్ర ప్రభుత్వానికి వ్యతి

రేకంగా "అసత్యాలను, అవమానకర విషయాలను, అపోహలు కలిగించే విషయాలను" వ్రాసినవారికి కఠినశిక్షలు విధింపబడవచ్చు. శత్రుచర్యల శాసనం అసలు వాడుక చేయబడనే లేదు. కాని ప్రభుత్వ పరిపాలనను దారుణంగా విమర్శించడం మానుకోనని రిపబ్లికన్ వార్తాపత్రికల సంపాదకులు చాలామందికి దేశద్రోహ శాసనరీత్యా జరిమానాలు, కారాగారవాస శిక్షలు లభించినవి.

దానితో, రిపబ్లికనులు కోపోద్రిక్తులై, శత్రుచర్యల శాసనము, దేశద్రోహ శాసనము కూడా రాజ్యాంగం సవరణలో పేర్కొన్న వాక్స్వాతంత్ర్యానికి పత్రికా స్వాతంత్ర్యానికీ భంగం కలిగిస్తున్నవని తీవ్రంగా ఖండించడం ప్రారంభించారు. జెఫర్సన్, మాడిసన్‌ల ప్రోత్సాహంతో కెంటకీ, వర్జీనియా రాష్ట్ర శాసనసభలు, ఈ రెండు శాసనాలను రద్దు చేయాలని కోరుతూ తీర్మానాలు చేసినవి. కాంగ్రెసు "రాజ్యాంగ బద్ధం గాని" శాసనాలు చేసినప్పుడు వాటిని చెల్లకుండా చేయడానికి, నిరాకరించడానికి రాష్ట్రాలకు హక్కు ఉన్నదని ప్రకటించడం మూలంగా, ముఖ్యంగా కెంటకీరాష్ట్రం కేంద్రప్రభుత్వాధికారంపైన పెద్దదెబ్బతీసింది. సమాఖ్యావాదుల నిరంకుశ పాలనవలన ప్రజలకు కలిగిన అసంతృప్తి 1800 వ సంవత్సరంలో జరిగిన ఎన్నికలో వ్యక్తమయింది. థామస్ జెఫర్సన్, స్వల్పమైన మెజారిటీతో నే అయినప్పటికీ, - ప్రెసిడెంట్‌గా ఎన్నిక అయాడు.

ఈ నూతన ప్రభుత్వం, మరొక స్థానంలో, వాషింగ్టన్ అనే ఒక బురద మయంగా ఉన్న ఒక గ్రామంలో ప్రభుత్వాధికారం స్వీకారం చేసింది. ఆ విధంగా శాశ్వత రాజధానిని దక్షిణాదిరాష్ట్రలలో ఏర్పాటు చేయడానికి లోగడ చేసిన వాగ్దానం అమలు జరిగింది. కాని రాజధానిని సర్వసంకీర్ణమైన ఫిలడల్ఫియా నగరంనుండి, తలాతోక ఏర్పడని చిన్నపల్లెటూరిలో పెట్టడం న్యూ ఇంగ్లండు ప్రతినిధులైన పెద్ద పెద్దలకు ఎంతమాత్రం ఇష్టంలేదు. కాని నిరాడంబరతకు, లాంఛనపై ముఖ్యానికీ పేరుమోసిన ప్రెసిడెంటు జెఫర్సన్‌కి మాత్రం తన నూతన విధానాలను ప్రతిపాదించడానికి అదే యోగ్యమైన స్థలంగా కనిపించింది.

ప్రెసిడెంటుగా జెఫర్సన్ తీసుకున్న చర్యలు ఆయనకు, ఇతరులందరికీకూడా ఆశ్చర్యం కలిగించినవి. ప్రభుత్వపు ఖర్చులు తగ్గించడం

విస్కీసారాలమీద పన్ను తీసివేయడం, దేశద్రోహ శాసనరీత్యా కారాగారవాస శిక్ష అనుభవిస్తున్న వారిని విడుదల చేయించడం మొదలైన చర్యలు ఆయన స్వభావానికి అనుగుణమైనవి; ఆయన వీటిని చేస్తాడని అందరు అనుకుంటూన్నదే. అమెరికా నౌకలను, ఐరోపా నౌకలను కొల్లగొడుతూన్న బార్బరీ ఓడదొంగలను మందలించడానికిగాను అమెరికా నౌకాదళాన్ని మధ్యధరా సముద్రానికి తరలించడం కొంత ఆశ్చర్యం కలిగించింది. కాని, అన్నింటికన్న అత్యాశ్చర్యకరమైన పని: రాజ్యాంగాన్ని యథావిధిగా నిర్వహించే జెఫర్సన్, సమాఖ్యావాదులు కూడా సాహసించలేని ధోరణిలో రాజ్యాంగసూత్రాలను వ్యాఖ్యానించడం. ప్రెసిడెంట్ స్వభావంలో అకస్మాత్తుగ కలిగిన ఈ మార్పు మొదట ప్రజలను అమిత ఆశ్చర్యచకితుల్ని చేసింది; కాని, ఆయన చర్యలన్నీ సంపూర్ణ సద్భావంతో చేసినవి అవడంవలన ప్రజలకాయనయెడ గౌరవప్రపత్తులు వృద్ధిఅయినవి. కాలగతి ప్రాబల్యంవలన ఆయన సమాఖ్యావాదుల కార్యక్రమాలతో రాజీపడవలసి వచ్చింది.

జెఫర్సన్ తీసుకున్న సర్వోత్కృష్టమైనచర్య. అసలు రాజ్యాంగ సమ్మతిగాని, కాంగ్రెసు ఆమోదంగాని లేకుండానే ఆయన చేసేశాడు. ఈ ప్రముఖచర్య ఆయన లుయీజియానా ప్రాంతాన్ని కొనడం, మిస్సిసిపీ నది లగాయతు పశ్చిమాన రాకీ పర్వతాలవరకూ వ్యాపించియున్న ఈ సువిశాల ప్రాంతాన్ని ఫ్రాన్సు 1763 లో స్పెయిన్ దేశానికి దత్తంచేసింది. కాని, 1800 సంవత్సరములో ఈ ప్రాంతాన్ని తిరిగి ఫ్రాన్సుకి అప్పగించవలసినదిగా నెపోలియన్ స్పెయినుని బలవంతం చేశాడు. ఐరోపాలో అద్భుత విజయాలు సాధించినమీదట, ఆ రోజులలో నెపోలియన్ "ప్రపంచ మహాసామ్రాజ్యాన్ని" గురించి కలలు గంటున్నాడు.

ఈ విధంగా తిరిగి లుయీజియానాను చేజిక్కించుకొన్న ఫ్రెంచి ప్రభుత్వం, మిస్సిసిపీనదీపైన ఓడల వ్యాపారం చేసుకొనడానికి, న్యూ ఆర్లియన్స్ రేవును వాడుకొనడానికీ. లోగడ స్పెయిన్ వద్దనుండి అమెరికా పొందిన హక్కులను రద్దుచేసింది. ఓహియో నదీ తీరంలోని క్రొత్త వలసల అభివృద్ధికీ వాణిజ్యాభివృద్ధికీ ఈ సౌకర్యం అత్యవసరం. పైగా ఈ పశ్చిమసరిహద్దుప్రాంతం లోగడవలె బల

హీనమైన స్పెయిన్ క్రింద గాక, అగ్రశ్రేణి రాజ్యమైన ఫ్రాన్సుచేతులలో ఉండడంవలన పడమటి సరిహద్దుకి ముప్పు ఏర్పడింది. ఈ విషయంలో దృఢమైన విధానం అవలంబించి, కనీసం మిస్సిసిపీనదిమీద ఓడల వ్యాపారం చేసుకునే హక్కునైనా ఫ్రాన్సువద్దనుండి తిరిగి సంపాదించడానికీ, అది సాధ్యంకాకపోతే, ఫ్రాన్సుకీ ఇంగ్లండుకీ జరుగుతున్న యుద్ధంలో ఇంగ్లండుకి సహాయపడి తన ఆశయం సఫలం చేసుకొనడానికీ జెఫర్సన్ నిశ్చయించుకొన్నాడు.

అమెరికా అదృష్టవశాత్తు, 1802 లో పశ్చిమఇండియా దీవులను లొంగదీయవలెననే ప్రయత్నంలో నెపోలియన్ సైనికప్రయత్నాలు విఫలమవడంతో, అమెరికాలో ఫ్రెంచి సామ్రాజ్యాన్ని నెలకొల్పాలనుకొన్న పథకాలన్నీ తారుమారైపోయినవి. ఆ స్థితిలో జెఫర్సన్ రాయబారులు పారిస్ వెళ్ళి, న్యూ ఆర్లియన్స్, ఫ్లారిడా ప్రాంతాలను అమ్మేయెడల ఇరవైలక్షల డాలర్లు ఇస్తామని సూచించగానే, మొత్తం లూయీజియానా ప్రాంతమంతటికీ కలిపి ఎంతయిస్తారని ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధులు వెంటనే ఎదురుప్రశ్న వేశారు. కొంత బేరం ఆడినమీదట, అమెరికా ఆ ప్రాంతమంతటిని తీసుకొని 150 లక్షల డాలర్లు ఇవ్వడానికి అంగీకరించింది.

ఈ విధంగా, కేవల పరిహాసాస్పదంగా కనిపించేటంత అత్యల్పమైన ధర చెల్లించి జెఫర్సన్ సంయుక్తరాష్ట్రప్రాంతాన్ని ఇంచుమించు రెట్టింపుచేశాడు. ఈ నూతనప్రాంతమే క్రమంగా మిన్నిసోటా, మిస్సోరీ, అయోవా, కాన్సాస్, మాంటానా, ఉత్తర దక్షిణ డకోటాలు, లూయీజియానా అనే సర్వసంపన్నమైన నూతన రాష్ట్రాలుగా రూపొందినది. మిస్సిసిపీనది, ఉత్తరాన దాని జన్మస్థానం లగాయతు, దక్షిణాన సాగరసంగమస్థాన పర్యంతం అమెరికా సంయుక్త రాష్ట్రాల నది అయింది. పశ్చిమ సరిహద్దుకి విదేశదండయాత్రల భీతి తప్పిపోయింది.

ఈ సదవకాశం లభించిన వెంటనే, ఈ నూతనప్రాంతమంతటినీ సర్వే చేసి, ఆపైన ఇంకా పశ్చిమంగా పసిఫిక్ సముద్రతీరం వరకు కూడా పరిశీలించి రావడానికి ఒక పరిశోధక దళాన్ని పంపాడు. జెఫర్సన్ ఆంతరంగిక కార్యదర్శి అయిన మెరీవెదర్ ల్యూయీ, జార్జ్

రోజర్స్‌క్లార్క్, సోదరుడైన విలియం క్లార్క్ ఈ దళానికి నాయకులు. వీరికి తోడుగా మొక్కలకైనా అగగల కొందరు సైనికులనుకూడా ఈ జట్టుతో పంపారు. వీరంతా ఉత్తరాది అడవులనుదాటి ఆరెగాన్ ప్రాంతానికి పోయి, 1805 లో ఆ ప్రాంతం తమదిగా ప్రకటించారు. తూర్పుతీరపు సంయుక్తరాష్ట్రాలనుండి పశ్చిమ సముద్ర తీరానికి భూమిపై చేయబడిన మొట్టమొదటి యాత్ర ఇదే అని చెప్పవచ్చు.

లుయీజియానా ప్రాంతాన్ని కొనడం, పశ్చిమతీరాన్ని పరిశోధింప చేయడం—ఇలాంటి చర్యలు తీసుకొనడంలో జెఫర్సన్ అవలంభించిన సాహసిక విధానాలను ప్రజలంతా హర్షించారు; కాని తాను రాజ్యాంగాన్ని తెగేవరకు "సాగదీసి" నందున ఆయనలో ఆయనే కొంత బాధపడ్డాడు. అదనంగా భూమినికొనే అధికారం ప్రభుత్వానికి ఉన్నదనడానికి ఆధారం రాజ్యాంగంలో అక్కడా కనిపించదు. సెనేట్ ఆమోదంతో ప్రెసిడెంటు ఇతర దేశాలతో సంధులు చేసుకొనవచ్చునని మాత్రమే రాజ్యాంగం అధికారమిస్తున్నది. ఈ డొంకతిరుగుడు వాదంతోనే లుయీజియానా కొనుగోలు చెల్లుబడి చేయబడింది.

జెఫర్సన్ రెండవసారి ప్రెసిడెంటు అయి, ఆ పదవిని నిర్వహిస్తున్న కాలంలో ఏర్పడిన మరొక క్లిష్టపరిస్థితి, ఆయన సమాఖ్యాధికారాన్ని విశేషంగా ఉపయోగించడానికి కారణమయింది. ఫ్రాన్సు, ఇంగ్లండు యుద్ధం తీవ్రతరంచేసి, తమ నౌకాదళంతో పరస్పర దిగ్బంధనంచేసి నలిపివేయడానికి ప్రయత్నిస్తున్నవి. తటస్థరాజ్యాల నౌకలేవీ తమతీరాలకు రాకూడదని ఈ ఉభయదేశాలూ హెచ్చరించినవి. ఐరోపాతో అమెరికా వాణిజ్యం చాలావృద్ధి అయినందువల్లను, అమెరికనుల ఆర్థిక సౌష్టవానికి ఈ వాణిజ్యమే జీవగర్ర అవడం వల్లను - ఈ నౌకావ్యాపార దిగ్బంధనం మూలంగా ఈ నూతనజాతికి చాలా నష్టం కలిగింది. విదేశనౌకాశ్రయాలకు ఆహారం ఇతర ముడిపదార్థాలను కొనిపోవుచుండిన అమెరికాకు చెందిన వందలకొలది నౌకలను, పరస్పరం పోరాడుకుంటున్న ఈ రెండురాజ్యాలు పట్టుకొన్నవి. ఇంగ్లండుకి అంగబలం అత్యవసరంగా ఉండడంవలన, గత్యంతరంలేక అమె

రికా నౌకలలోని నావికులను బలవంతంగా ఎత్తుకొని పోవడం ఇంకా సాగిస్తూనే ఉంది.

యుద్ధాన్ని తప్పించవచ్చుననే భావంతో, విదేశవాణిజ్య మంత టినీ కట్టిపెట్టి, అమెరికా నౌకలు అమెరికా నౌకాశ్రయాలను విడిచి పోకూడదని జెఫర్సన్ కాంగ్రెసుచేత ఉత్తరువు చేయించాడు. 1807 లో చేయబడిన ఈ వ్యాపార నిరోధ శాసనం (Embargo Act) నిజా నికి రాజ్యాంగరీత్యా సమర్థనీయంకాదు. కాంగ్రెసు వాణిజ్యాన్ని "క్రమబద్ధంగా నడుపవచ్చు" నని మాత్రమే రాజ్యాంగంలో అధి కారమియబడింది. అసలు వాణిజ్యాన్ని ఆపివేయవచ్చుననికూడా ఈ సూత్రానికి అర్థం చెప్పవచ్చునా అనేది సందేహాస్పదమైన విషయం.

ఈ వ్యాపారనిరోధ శాసనం ఎవరికీ సంతృప్తి కలిగించలేదు. దీనివలన వర్తకులు, రైతులూకూడా సమంగా నష్టపడ్డారు. రెండు సంవ త్సరాల తర్వాత ఈ శాసనాన్ని రద్దుచేసి, ఆ స్థానంలో ఇంతకన్న తేలికైన మరొక శాసనం చేయబడింది. బ్రిటనుగాని, ఫ్రాన్సుగాని అమెరికా నౌకావ్యాపార స్వాతంత్ర్యాన్ని గౌరవించడానికి సమ్మ తించేయెడల, ఆ దేశంతో అమెరికా తన వాణిజ్యాన్ని తిరిగి యథా ప్రకారం సాగించగలదనీ, రెండవ దేశంతో వాణిజ్యాన్ని నిషేధిస్తుం దనీ ఈశాసనంలో తెలిపారు. ఫ్రాన్సు ఎగిరి గంతేసి ముందుకు వచ్చింది. అమెరికా ఫ్రాన్సుల వాణిజ్యం తిరిగి ప్రారంభమయింది.

1809 లో జెఫర్సన్ పదవినుండి విరమించాడు. జేమ్స్ మాడి సన్ ప్రెసిడెంటుగా ఎన్నిక అయాడు. అమెరికాను పెద్దయుద్ధంలో తగుల్కొనకుండా తప్పించడానికి తొలిప్రెసిడెంట్లు ముగ్గురు ఇంచు మించు మానవాతీతమైన ప్రయత్నాలుచేసి సఫలులయారు. మాడిసన్ ఆ సాంప్రదాయాన్ని నిలబెట్టలేకపోయాడు.

ఇంగ్లండు అనేకవిధాలుగా అమెరికాను కవ్విస్తూంది. పైగా, ఎవరికివారు వేరువేరు కారణాలు చెపుతూ, అమెరికా ఇంగ్లండుతో యుద్ధం చేయాలని సూచించేవారు అమెరికాలో చాలామంది బయలు దేరారు. క్రమంగా బలపడుతూన్న పశ్చిమ ప్రాంతంలో అక్క డక్కడ మిగిలిఉన్న బ్రిటన్ పలుకుబడిని తుడిచిపెట్టాలనీ, క్రమంగా కెనడానుకూడా జయించాలనీ ఆ పడమటి ప్రాంతవాసులు

కోరుతున్నారు. దక్షిణాదివారి చూపులు స్పానిష్ ఫ్లారిడామీద ఉంది. 'వార్ హాక్స్' అనబడే ఈ యుద్ధోత్సాహుల బృందానికి కెంటకీరాష్ట్రానికి చెందిన హెన్రీ క్లే, దక్షిణ కెరోలినారాష్ట్రానికి చెందిన జాన్ సి. కాహూన్ నాయకులు. వీరు 1812 నాటికి కాంగ్రెసులోని తమ అనుచరులద్వారా యుద్ధ ప్రకటనను సాధించారు.

నిజానికి, 1812 నాటి యుద్ధం కేవలం అనవసరమైనది, అసమర్థమైనది, అపరిష్కృతమైనదీ అని చెప్పాలి. కేవలం, రిపబ్లికనులు అధికారంలో ఉన్నందువల్ల న్యూ ఇంగ్లండ్ వాసులు ఈ యుద్ధాన్ని తీవ్రంగా నిరసించారు. న్యూ ఇంగ్లండ్ సమాఖ్యావాదుల చర్యలు దేశమంతటినీ ఆశ్చర్యచకితం చేసినవి. అమెరికా బలిష్ఠమైన, దృఢమైన, ఐకమత్యంగల దేశంగా ఉండాలన్న తమ తొలిఆశయానికి విరుద్ధంగా, ఈ న్యూ ఇంగ్లండ్ సమాఖ్యావాదులు అమెరికా సమాఖ్యనుండి విడివడిపోతామని కూడా బెదిరించారు. బెదిరించడమేకాదు, యుద్ధం అనుకున్నదానికన్న త్వరగా ముగిసిపోయినందువల్లగాని, లేకపోతే వారాపని చేసి ఉండేవారనికూడా చెప్పవచ్చును.

ఈ ఉద్యమాలు దూరదూరంగా, అక్కడక్కడ జరిగినవి. తగిన సాధనసామగ్రిలేని అమెరికాసైన్యం ఈరీ సరస్సుకి ఉత్తరంగా కెనడాలోనికి చొచ్చుకొనివెళ్ళి మళ్ళీ తిరుగగొట్టబడినవి. అయితే, ఈరీ షాంప్లేన్ సరస్సులపైన జరిగిన నౌకా యుద్ధాలలో అమెరికావు ఘనమైన విజయం లభించడంవల్ల అమెరికాపై తిరుగుదాడులు జరుగలేదు. ఇంకా దిగువను, వాషింగ్టన్ వద్ద 1814 లో బ్రిటిష్వారు కొంతసైన్యాన్ని తెచ్చి దించి, భయపడిపోయిన అమెరికా సైనికులవద్దనుండి దానిని సులభంగా స్వాధీనం చేసుకున్నారు. కెనడాలో అమెరికనులు కలిగించిన నష్టానికి ప్రతీకారంగా అమెరికా ప్రెసిడెంట్ భవనమైన "వైట్ హౌస్" నీ, ఇతర ప్రభుత్వ భవనాలను తగులబెట్టారు. తరువాత ఈ బ్రిటిష్ సైన్యం ఆ సమీపంలోనే ఉన్న బాల్టిమోర్ ప్రాంతంవేపు మరలేసరికి, దారిలో అమెరికాసైన్యం వారిని తీవ్రంగా అటకాయించింది. ఆ నగరాన్ని పరిరక్షిస్తున్న మెక్ హెన్రీ దుర్గంపైన జరిగిన కాల్పులు విఫలమైనవి. ఈ సన్నివేశమే అమెరికా జాతీయగీతము ("ది స్టార్ స్పాంగిల్డ్ బానర్") ను రచించడానికి ఫ్రాన్సిస్

స్కాట్‌కీకి ప్రేరకమయింది. అమెరికాకు ఈ యుద్ధమంతటిలోకీ ఘనమైన విజయం - సంధిపత్రాలపైన సంతకాలు పూర్తిఅయి, ఆ వార్త ఘెంట్ నుండి ఇంకా అట్లాంటిక్ సముద్రం దాటిరాక పూర్వం - లభించింది. చివరకు, ఐరోపాలో నెపోలియన్ ఓడిపోయాడు. బ్రిటిష్ వారు న్యూ ఆర్లియన్స్‌ని జయించడానికి బలమైన సైన్యాన్ని పంపారు. మిస్సిసిపీ నదీతీరంలోని సరిహద్దువాసుల సైన్యమొకటి టెన్నెసీవాసి అయిన ఆండ్రూ జాక్సన్ నాయకత్వంక్రింద ఆ బ్రిటిషు సైన్యాన్ని ఎదుర్కొన్నది. జాక్సన్ సైనికులు కందకాలలో దాగివుండి కాల్పులు సాగించి, ఆ దండయాత్రాపరులను పూర్తిగా ఓడించారు. వారు ధైర్యంతో తిరిగి తిరిగి పోరాడారు గాని లాభంలేకపోయింది. అమెరికాకు ఈ ఘనవిజయం సాధించిన జాక్సన్‌ను అమెరికా ప్రజలు కృతజ్ఞతతో "ఓల్డ్ హికరీ" అని గౌరవనామంతో పిలుచుకొంటారు.

ఘెంట్‌లో జరిగిన సంధివల్ల యుద్ధం విరమింపబడిందే గాని, యుద్ధానికి ముఖ్యహేతువులలో ఒకటయిన నావికుల అపహరణ విషయానికి ఆ సంధిపత్రంలో ప్రస్తావనేలేదు. కాని, ఐరోపాలో శాంతి ఏర్పడినమీదట ఈ నావికాపహరణలు తగ్గిపోవడం, అమెరికా వాణిజ్య నౌకలు పరంపరలుగాపోయి ప్రపంచమంతటా నిర్భయంగా సంచరించడం ప్రారంభించినవి.

1812 లో జరిగిన ఈ యుద్ధం తరువాత, అమెరికాలో అద్భుతమైన ఐకమత్యం ఏర్పడింది. అట్టి ఐకమత్యం అంతకు పూర్వంగాని, ఆ తరువాతగాని నేటివరకుగాని ఎన్నడు కనిపించలేదు. చరిత్రగతి ప్రాబల్యంవలన, రిపబ్లికనులుకూడా, వెనుక సమాఖ్యావాదులు అనుసరించిన ప్రబల ప్రభుత్వవిధానాలను ఇప్పుడు తాముకూడా అనుకరిస్తున్నారు. ఇంగ్లండు ఫ్రాన్సులతో లావాదేవీలు, లుయీజియానాను కొనడం, చివరకు యుద్ధం,— ఇవన్నీ ప్రబలమైన జాతీయ ప్రభుత్వావశ్యకతనే నిరూపించినవి. మధ్యలో కొంతకాలం పూర్తిగా ఎత్తివేయబడిన నేషనల్ బ్యాంకుకూడా పునరుద్ధరింపబడింది.

సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జాన్ మార్షల్ చెప్పిన తీర్పులవలన కేంద్రప్రభుత్వానికి మరింతబలం చేకూరింది. రాజకీయాల్లో సమాఖ్యావాదిఅయిన మార్షల్‌ను 1801లో జాన్ ఏడమ్స్ ఆ పదవిలో

నియమించాడు; ఆ తరువాత 34 సంవత్సరాలు మార్షల్ ఆ పదవిలో ఉండి రాజ్యాంగాధికారాన్ని ప్రతిఘటించడానికి చేసిన ప్రయత్నాలన్నిటినీ వమ్ము చేశాడు. కాంగ్రెసు చేసిన శాసనాలు రాజ్యాంగ సమ్మతములు కానప్పుడు వాటిని రద్దుచేసే అధికారం సుప్రీం కోర్టుకు ఉన్నదా? ఉన్నదని మార్షల్ మార్బరీ-మాడిసన్‌ల కేసులో చెప్పిన తీర్పులో ఆయన స్పష్టంచేశాడు. సమాఖ్యా రాజ్యాంగ సమ్మతములుగాని రాష్ట్రశాసనాలను సుప్రీంకోర్టు రద్దుచేయగలదా? కలదని కోహెన్స్ - వర్జీనియా కేసు తీర్పులో ప్రకటించాడు. నేడు సుప్రీం కోర్టుకి గల హోదా, అధికారము జాన్ మార్షల్ సాధించినవే అని నిస్సంశయంగా చెప్పవచ్చు.

రాకపోకల సాధనాలలో కలిగిన విప్లవాత్మక పరిణామంకూడా దేశీయ ఐకమత్యం దృఢపడడానికి కొంతరకు ఉపయోగపడింది. పద్దెనిమిదవ శతాబ్ది ఆరంభంలో ఆవిరిఓడను కనిపెట్టడం. అమెరికా నదులపైన, దాని ఉపనదులపైన నౌకా వాణిజ్యాభివృద్ధికి హేతువయింది. 1830 మొదలు దేశంలో రైలురోడ్డు వేయబడడం, అంతర్రాష్ట్రీయ వాణిజ్యాభివృద్ధికి మరొక గొప్ప సహకారి అయింది. రాకపోకలు సాధనాలు బాగా వృద్ధి అవడంతో కొత్తకొత్త నగరాలు, పరిశ్రమలు వెలువడం, ఐరోపానుండి ప్రజలు తండోపతండాలుగా రావడం జరిగింది.

అమెరికాలో 1816-24 సంవత్సరాల మధ్యకాలానికి "సద్భావయుగం" అని పేరు. ఆర్థికాభ్యుదయం అతివేగంగా సాగింది. సమాఖ్యావాద పక్షం అంతరించి పోయింది. రిపబ్లికనులు అప్పటికి ఇంకా రెండు చీలికలుగా విడిపోలేదు. ఈ యుగంలోనే జేమ్స్ మన్రో అనే ప్రెసిడెంటు హయాంలో అమెరికా విదేశాంగ విధానంలోకూడా దృఢంగా వ్యవహరించడం ప్రారంభించింది.

నూతన ప్రపంచంలో స్పెయిను సామ్రాజ్యం వికలమైపోయింది. నెపోలియన్ యుద్ధాలతో శక్తి ఉడిగి ఉన్న స్పెయిను, నూతన ప్రపంచంలో ఉత్తరాన మెక్సికో మొదలు దినాదినాభివృద్ధి చెందుతూన్న స్వాతంత్రేచ్ఛను అణచడానికి అవసరమైన జవసత్వాలను ప్రదర్శించలేక పోయింది. ఫ్లారిడాలో అరాచకత్వం ప్రబలిపోయింది. అచటి

సెమినోల్ ఎర్ర ఇండియనులు సంయుక్తరాష్ట్రాల సరిహద్దులపైన కూడా తరచు దాడులు చేస్తూ ఉండేవారు.

ఈ సెమినోల్‌ల దుండగాలను అరికట్టడానికిగాను ఫ్లారిడా సరిహద్దులకు ప్రెసిడెంటు మన్రో అసహాయ శూరుడైన ఆండ్రూ జాక్సన్‌ని పంపాడు. అవసరమైతే సరిహద్దు దాటికూడా వెళ్ళి ఆ సెమినోల్ ఎర్ర యిండియనులను దండించడానికి అతనికి అధికారమిచ్చాడు. కాని, చూచిరమ్మంటే కాల్చివచ్చే బాపతు వాడైన జాక్సన్ 1818లో సరిహద్దు దాటివెళ్ళడమేకాదు; ఫ్లారిడా అంతటా వీరవిహారం చేసి దానిని పూర్తిగా జయించాడు. పిమ్మట, ఈ చర్యనుకూడా కేంద్ర ప్రభుత్వం సమర్థించింది. స్పెయిను చల్లగా ఈ ప్రాంతాన్ని దాని నూతన యజమానులకు వదలిపెట్టి, దాని నిమిత్తం పరిహారంక్రింద యాభైలక్షల డాలర్లుమాత్రం పుచ్చుకొన్నది.

ఈ విధంగా సంయుక్తరాష్ట్రాలు క్రమంగా బలపడుతూన్న సంగతి ఇతర దేశాలు గమనించినవి. యిరోపాలోని సామ్రాజ్య దేశాలు నెపోలియన్ యుద్ధాలలో కోల్పోయిన ప్రాంతాలన్నిటినీ తిరిగి వారికి సంపాదించి పెట్టడానికిగాను ఫ్రాన్సు, ఆస్ట్రియా, రష్యా, ప్రష్యా దేశాలు "పవిత్ర మిత్రకూటమి" (Holy alliance) గా ఏర్పడినవి. స్పెయిను తాను అమెరికాలో తన సామ్రాజ్యాన్ని కోల్పోయిన విషాదగాథను వీరికి తెలియజేసేసరికి దానిని తిరిగి సంపాదించుకోనేందుకు సహాయపడడానికి, దానికి ప్రతిఫలంగా అందులో కొన్ని ప్రాంతాలు తాము తీసుకొనడానికీ సిద్ధమయినవి. ఫ్రాన్సుచూపు మెక్సికోమీద పడింది; అంతకు పూర్వమే అలస్కాను చేతిలో పెట్టుకొనిఉన్న రష్యా క్రమంగా పసిఫిక్ తీరంవెంట దక్షిణానికి తీసుకొని వస్తూ, ఈ లావాదేవీలలో కాలిఫోర్నియాను సంపాదించాలని చూస్తూంది.

ఈ ప్రయత్నాలన్నీ సంయుక్తరాష్ట్ర ప్రజలకు చాలా ఆందోళన కలిగించినవి. యిరోపాలోని ప్రధాన రాజ్యాలన్నీ తిరిగి ఒకసారి అన్నివైపులనుండి తమమీద దాడిచేసేట్టు కనిపించింది. ఈ పర్యాయం చాలా యుద్ధాలు, బహుశః సంయుక్తరాష్ట్రాల నడిగడ్డకు ప్రమాదకరమైనంత సమీపంలో జరుగవచ్చు.

ఈ "పవిత్ర మిత్రకూటమి" ని ఇంగ్లండు కూడా ప్రతిఘటిస్తున్నది. ఇంగ్లండు, లాటిన్, దక్షిణ అమెరికా దేశాలతో పెద్దయెత్తున వ్యాపారం చేస్తున్నది. అందువల్ల ఈ ప్రాంతాలు మళ్ళీ ఫ్రాన్సుకుగాని, స్పెయిన్‌కిగాని వశమవడం ఇంగ్లండుకి ఇష్టంలేదు. ఆ ప్రకారం, బ్రిటిషు ప్రధానమంత్రి కానింగ్ అమెరికా సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వానికి ఒక ప్రతిపాదన చేశాడు. దాని ప్రకారం, పశ్చిమార్థ గోళపు వ్యవహారాలలో ఐరోపా రాజ్యాలేవీ జోక్యం కలిగించుకోరాదని ఇంగ్లండు, అమెరికా దేశాలు సంయుక్తంగా ఒక హెచ్చరిక చెయ్యాలి; అందుకు ఒప్పుకుంటే బ్రిటన్, అమెరికాలుకూడా ఉత్తర, దక్షిణ అమెరికా ఖండాలలో ఇతోధిక ప్రాంతాలను సంపాదించబోమని వాగ్దానం చేయగలవనికూడా ఈ హెచ్చరికలో తెలపాలి.

ఈ సూచన అమెరికాకు చాలా లాభదాయకంగా కనిపించింది. చిరకాల ప్రజల శత్రుదేశం అయిన ఇంగ్లండు ఇప్పుడు మిత్రదేశం అవుతుంది. బలవత్తరమైన బ్రిటిష్ నౌకాదళం ఈ హెచ్చరికకు మరింత గౌరవం సమకూరుస్తుంది. అమెరికనులలో కొందరు ఈ ప్రతిపాదన విషయంలో ఇంగ్లండు సంకల్పాలను అనుమానించారు. వీరిలో విదేశాంగ మంత్రిజాన్ క్విన్సీ ఏడమ్స్ ఒకడు. ఇతర ఐరోపా దేశాలే కాకుండా, అమెరికా సంయుక్త రాష్ట్రాలుకూడా లాటిన్, దక్షిణ అమెరికాలతో ఏవిధమైన సంబంధం పెట్టుకోరాదని బ్రిటిష్‌వారి ఆశయమనీ, అందుకలవ దానిని అంగీకరించడం అమెరికాకు శ్రేయస్కరం కాదనీ, వీరిఅభిప్రాయం. "బ్రిటను అనే యుద్ధనౌకకు అంటిపెట్టుకున్న పిల్లపడవ" లాగ అమెరికా తయారు కారాదనీ, ఇంగ్లండును అనుసరించకుండా, తనదారి తాను చూచుకొనడమే అమెరికాకు శ్రేయస్కరమనీ ఏడమ్స్ సలహా యిచ్చాడు.

చివరకు, ప్రెసిడెంటు మన్రో తన విదేశాంగ మంత్రి సలహా ప్రకారమే 1823లో కాంగ్రెసుకి ఒకసందేశం పంపాడు. ఈ సందేశంలోనే "మన్రో సిద్ధాంత" మని ప్రసిద్ధి చెందిన భావాలు తొలుత ప్రకటింపబడినవి. ఐరోపీయులు ఆపైన పశ్చిమార్ధగోళంలో వలసలు స్థాపించడానికి ప్రయత్నించరాదని, ఆగోళంలో అప్పటికియున్న స్వతంత్రదేశాల వ్యవహారాల్లో ఐరోపాదేశాలు ఏవిధమైన జోక్యం

కలిగించుకోరాదనీ ఈ సందేశంలో మన్రో విశదంగా, దృఢంగా సూచించాడు. ఐరోపా ఆంతరంగిక వ్యవహారాలలో తాను జోక్యం కలిగించుకొనరాదనే తన పూర్వవిధానాన్నే భవిష్యత్తులో కూడా అనుసరింపదలచుకొన్నట్లు ఈసందేశంలో ప్రకటించాడు.

ఈ మన్రో సిద్ధాంతం, ఆ తరువాత ఒక శతాబ్దివరకు అమెరికా అవలంబించిన విదేశాంగ విధానానికి కీలకసూత్రమయింది. క్రమంగా, సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వానికి పశ్చిమార్ధగోళానికి నాయకత్వ బాధ్యత, లాటిన్, దక్షిణ అమెరికాల సంరక్షకత్వం సంక్రమించినవి. తరువాత కొంతకాలం వరకు అమెరికా ఖండ వ్యవహారాలలోజోక్యం కలిగించుకొన యత్నించిన ఇతర దేశాలను సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం గట్టిగా హెచ్చరించి పంపివేయగలిగింది. కాని, అమెరికా ప్రభుత్వమే తన ఇరుగుపొరుగు దేశాల వ్యవహారాలలో తరచు జోక్యం కలిగించుకుంటూ, నిర్దాక్షిణ్యమైన సామ్రాజ్యవాద విధానాన్నీ, దోపిడిదారీ విధానాన్నీ అనుసరిస్తూన్నదనీ నిందింపబడిన సందర్భాలు కూడా చాలా ఉన్నవి.

ఐరోపాతో ముడిపెట్టుకోకుండా అమెరికా తన వ్యవహారాలు తాను చక్కబెట్టుకోవాలన్న సిద్ధాంతం ఆదిలో కేవలం ఆత్మరక్షణోపాయంగానే రూపొందింది. కాని, ఈ మన్రో సిద్ధాంతంయొక్క పరమార్థము, నిర్వచనముకూడా చాలా మార్పులకు లోనైనవి. ఈ సిద్ధాంతం, తొలి అర్థం ప్రకారం అయితే, పూర్తిగా కాలదోషం పట్టిపోయినట్లే. అప్పుడనుకొన్న ప్రకారం సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం దక్షిణ అమెరికా ఖండంలోని స్వతంత్ర దేశాలకు కాపరిగాను, సంరక్షకురాలుగాను వ్యవహరించక, అఖిల అమెరికాదేశాల సమష్టిభద్రతా సహకార వ్యవస్థలలో తానుకూడా ఒక భాగస్వామినిగా మాత్రమే వ్యవహరిస్తున్నది. పైగా, ఈ (ఇరవయ్యవ) శతాబ్దిలో జరిగిన రెండు ప్రపంచ మహాయుద్ధాలలోను అమెరికా సైనికులు ఐరోపా నడిగడ్డపైకివెళ్ళి యుద్ధాలు చేశారు. నేటి అమెరికా సైనికులు ప్రపంచంలోని ప్రమాదాస్పద ప్రాంతాలన్నిటిలో సాయుధులై నిలబడి ఉన్నారు. కాని, మరొక విశాలార్థంలో మన్రోసిద్ధాంతంలోని సూత్రాలు నేటికీ సజీవంగానే ఉన్నవని చెప్పవచ్చు. ప్రస్తుతకాలంలో అమెరికా

సురక్షితస్థితికి, అమెరికనులు ప్రపంచంలో దూరదూర ప్రాంతాలకు పోయి పోరాడడం అవసరమని - నేడు వారు గ్రహించారు.

* * * * * * *

ప్రెసిడెంట్ మన్రో పదవీ విరమణంతో "సద్భావ యుగం" అంతమైపోయింది. జాతీయైకమత్యం అనే మట్టం అడుగున బుడగలు దేరుతూ, పొంగులువారుతూ ఉన్న పాక్షికవిభేదాలు 1824 లో జరిగిన ఎన్నిక సమయంలో ఒకసారిగా పైకి ఉబికి వచ్చినవి; రిపబ్లికన్ పక్షం నలుగురు అభ్యర్థులను సూచించింది. మసాచూసెట్స్ రాష్ట్రానికి చెందిన జాన్ క్విన్సీ ఏడమ్స్, జార్జియాకు చెందిన విలియం క్రాఫర్డ్, టెన్నెసీకి చెందిన ఆండ్రూ జాక్సన్, కెంటకీకి చెందిన హెన్రీ క్లే అనే ఈ అభ్యర్థులు నలుగురిలో ఎవరికీ ఎన్నికలో మొత్తంవోట్లలో సగానికన్న ఎక్కువవోట్లు (మెజారిటీ) రాలేదు. ఇతర అభ్యర్థులకన్న జాక్సన్‌కి ఎక్కువవోట్లు వచ్చినవి. కనుక ప్రజాప్రతినిధుల సభే ప్రెసిడెంటుని ఎన్నుకోనవలసి వచ్చినది. ఈ ఎన్నికలో క్లే విరమించుకొని ఏడమ్స్ అభ్యర్థిత్వాన్ని బలపరిచాడు. దాంతో ఏడమ్స్ ప్రెసిడెంటుగా ఎన్నికఅయి, తన తండ్రి అడుగుజాడలలో "వైట్ హౌస్"లో ప్రవేశించాడు. క్లే పశ్చిమప్రాంతానికి చెందినవాడైనప్పటికీ జాక్సన్ అంటే అతనికి తీవ్రమైన అయిష్టమున్నది; "సైనిక నాయకుడు" అని అతడిని ఎత్తిపొడిచేవాడు. పైగా, విశేష వాణిజ్యసుంకాల విషయంలోను, నేషనల్ బ్యాంకు, బలిష్ఠమైన కేంద్రప్రభుత్వం విషయంలోను ఏడమ్స్‌కిగల మితవాది భావాలు ఆయనకు బాగా నచ్చినవి.

దక్షిణానా, పశ్చిమ ప్రాంతంలోనూ "ఓల్డ్ హికరీ" (జాక్సన్) అనుచరులంతా తమ నాయకుని ఓటమినిగూర్చి వినగానే మండిపడ్డారు. ఏడమ్స్-క్లే వర్గం ప్రెసిడెంట్ పదవీకాలం నాలుగు సంవత్సరాలు వాషింగ్టన్‌లో నిరుత్సాహంతో బరువుగా వెళ్ళబుచ్చవలసి వచ్చింది. తరువాత 1828 లో జరిగిన ఎన్నికలో జాక్సన్ స్థాపించిన నూతన డెమొక్రాటిక్ పార్టీ అఖండవిజయం సాధించింది. జాక్సన్ ప్రెసిడెంటుగా ఎన్నిక అయాడు. కాని. అతని విధానాలేమిటో ఎవరికీ తెలియవు అయితే అతడు సామాన్య ప్రజానీకానికి చిహ్నం. మూర్తిమంతమైన ప్రజాస్వామ్యం.

జాక్సన్ తన ప్రతిష్ఠను తగినరీతిగా వ్యవహరించి, తన ప్రతిపక్షులకు పాఠం నేర్పాడు. ప్రజాస్వామ్యానికి శ్రేయస్కరమైన ఏ కార్యక్రమాన్నైనాసరే అతడు అతిశ్రద్ధగా అమిత వేగంతో కొనసాగించేవాడు. ఈ లక్షణమే అతని శత్రువులు అతనిని "మొదటి ఆంద్రూ చక్రవర్తి" అని పరిహసించడానికి కారణమయింది. ఏ రాజకీయవర్గంగాని, పక్షం గాని అతణ్ణి బలపరచలేదు. అయితే, కార్మికులు, చిన్న వ్యాపారస్థులు, కొద్ది రైతులూ అంతా దృఢంగా ఆయననే బలపరచారు. తీవ్ర జాతీయవాదంలోనూ, తూర్పు ప్రాంతపు పెట్టుబడిదారులపై విశ్వాసం లేకపోవడంలోనూ. జాక్సన్ అచ్చమైన పాశ్చాత్య ప్రతినిధి.

దక్షిణాదిన రాష్ట్రాల హక్కులను గురించి ఆందోళన చేసేవారు. "ఓల్డ్ హికరీ" తమ భావాలపట్ల సానుభూతి గలవాడని భావించారు. కాని, వారే ఆయన కోపానికి ముట్టమొదట గురిఅయ్యారు. వాణిజ్య సుంకాల విషయంలో వీరు బాగా ఆందోళన చెయ్యడం మొదలుపెట్టారు. 1830 లో జాన్ కాహూన్ తన రాష్ట్రమైన దక్షిణ కరోలినాలో 1828 నాటి వాణిజ్యపు సుంకాల శాసనాన్ని రద్దుచేయాలన్న ఉద్యమానికి నాయకత్వం వహించి నడిపాడు. జెఫర్సన్ జన్మదినోత్సవం రోజున జరిగిన ఒక విందు సందర్భంలో జాక్సన్ లేచి నిలబడి కాహూన్ కేసి చూస్తూ "మన సమాఖ్యాసౌష్ఠవాన్ని కాపాడక తప్పదు" అని హెచ్చరించాడు. పిమ్మట, దక్షిణ కరోలినా ప్రత్యక్షంగా ఆ సుంకాల శాసనాన్ని రద్దుచేయుడానికీ, సమాఖ్యలోనుండి విడిపోవడానికీ సిద్ధమయేసరికి, జాక్సన్ తాను లోగడ చేసిన హెచ్చరికకు అనుగుణంగా 40,000 ల అమెరికన్ సైన్యాన్ని ఆ రాష్ట్రంపైకి పంపదలచుకొన్నట్టు బెదరించాడు. దానితో దక్షిణ కెరోలినా లొంగిరాక తప్పలేదు. కాని, ఆ రాష్ట్రానికి కలిగిన పరాభవాన్ని కొంత తగ్గించడంకోసం లాంఛనంగా ఆ సుంకం కొంచెం తగ్గించబడింది.

ఈ విధంగా జాక్సన్ సమాఖ్యా సౌష్ఠవాన్ని కాపాడినందుకు ఈశాన్యప్రాంతీయులకు ఆయనపట్ల గౌరవం హెచ్చినప్పటికీ, నేషనల్ బ్యాంక్ విషయంలో ఆయన అభిప్రాయం వారికి నచ్చలేదు. ఈ బ్యాంకును ప్రభుత్వము, పెద్ద పెట్టుబడిదారులు కలిసి సమష్టిగా నడు

పుతున్నారు. ఈ పెట్టుబడిదారులు కాంగ్రెసు సభ్యులకు అప్పులివ్వడం మూలంగాను, ఇతరవిధాలుగా తోడ్పడడంద్వారాను కాంగ్రెసులో కూడా తమ పలుకుబడిని చెలాయించగలరు. ఎవరికీ ఈ విధమైన ప్రత్యేక సౌకర్యాలు ఉండరాదని విశ్వసించే జాక్సన్, ఈ బ్యాంకు రాజకీయకలుషిత మయిపోయిందంటూ, దాన్ని పూర్తిగా ఎత్తివేయు డానికి సిద్ధమయాడు. అందులో ఉన్న ప్రభుత్వ ధనాన్ని యావత్తూ ఉపసంహరించవలసినదిగా ఉత్తరువు నిచ్చాడు. ఈ చర్య రాజ్యాంగ విరుద్ధమని విమర్శించబడినప్పటికీ - బ్యాంకు రాజ్యాంగ సమ్మతమైనదని సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తియైన జాన్ మార్షల్ తీర్పు చెప్పి నప్పటికీ - ప్రెసిడెంట్ తన సంకల్పాన్ని మార్చుకోనలేదు. బ్యాంకు మూసివేయబడింది. జాతీయ ద్రవ్యవినియమ బాధ్యత రాష్ట్రాల బ్యాంకు లకు అప్పగించబడింది.

ఈలోగా ప్రభుత్వ భూములకు, నూతన పరిశ్రమలకు దేశమంతటా గిరాకీ ఎక్కువ అయింది. ఇదిచూచి, రాష్ట్రాల బ్యాంకులు కాగితపు కరెన్సీ నోట్లను అమితంగా అచ్చువేసి విడుదల చేయడంవల్ల ధరలు విపరీతంగా పెరిగిపోయినవి. దాంతో ప్రభుత్వవర్గం, భూములు కొను క్కునేవారు, ఆ ఖరీదును కేంద్రప్రభుత్వానికి వెండిబంగారాల రూపం లోనే చెల్లించాలని జాక్సన్ శాసించాడు.

జాక్సన్ ప్రభుత్వం కేవలం ఏకవ్యక్తి ప్రదర్శనం. అతడే ప్రభుత్వం. ఆయన "వైట్ హౌస్"ను ఖాళీచేసి, తదుపరి ప్రెసిడెం టైన మార్టిన్ వాన్ బ్యూరెన్ (న్యూయార్క్)కి అప్పగించేసరికి, దేశంలో ఆర్థిక వ్యవస్థ యావత్తూ అస్తవ్యస్తమైపోయింది. వెండిబం గారాలు కరువైనవి; కాగితపునోట్ల ధనంమాత్రం అపారంగా కనిపి స్తూంది. క్రొత్తగా పెట్టుబడి పెట్టి భూములను సాగుచేయడం పూర్తిగా నిలిచిపోయింది; బ్యాంకులు దివాలాతీసినవి; వేలమందికి వృత్తులు లేకుండా పోయినవి. ఈ దుస్థితికంతటికీ వాన్ బ్యూరెన్ నిందింప బడ్డాడు. 1840 లో జరిగిన ఎన్నికలలో, జాక్సన్ అన్నా, వాన్ బ్యూరెన్ అన్నా ఇష్టంలేని వారంతా ఏకమయి టీగ్స్‌పార్టీ అనే పేరుతో డెమొక్రాట్లను ఓడించారు, ప్రెసిడెంట్ పదవికి ఈ క్రొత్త

పార్టీ అభ్యర్థి అయిన విలియం హెన్రీహారిసన్ కూడా పశ్చిమప్రాంతానికి చెందినవాడు; ఎర్ర ఇండియనులతో పోరాడడంలో ప్రఖ్యాతి పొందినవాడు.

* * *

మన్రో, ఏడమ్స్, జాక్సన్‌ల హయాంలో పశ్చిమ ప్రాంతాల్లో కొత్తవలసలు స్థాపించే కార్యక్రమం చురుకుగా సాగింది. వాయవ్యప్రాంతంలోనూ, లూయీజియానాలోనూ ఒకటితరువాత ఒకటిగా నూతన రాష్ట్రాలు ఏర్పాటు చేయబడి, సమాఖ్యలో చేర్చుకొనబడినవి. ఈ పరిణామాలన్నీ తూర్పుప్రాంతపు తొలివలసలవారికి మనస్కరించలేదు. కాంగ్రెసులో తమ పలుకుబడి తగ్గిపోతుందనీ, అపారంగా విస్తరించి పోతూన్న అమెరికా రిపబ్లిక్‌లో తామొక సరిహద్దున తీరవాసులుగా తయారుకావలసి వస్తుందని వారిభయం. ఈ భయం వాస్తవమే అయింది; 1820 నాటికి సెనేట్‌లోని నలభైయారుగురు సభ్యులలో పదహారుమంది ఎలీఘెనీ పర్వతాలకు పశ్చిమాన్నించి వచ్చినవారు. 1803 లో ఏభైవేలలో ఉన్న ఓహియో రాష్ట్రపు జనాభా 1820 నాటికి దాదాపు ఆరులక్షలకు పెరిగిపోయింది. ఇండియానా జనాభా లక్షా నలభైవేడువేలకు పెరిగింది.

పశ్చిమ ప్రాంతాభివృద్ధి, దేశం మొత్తానికి ఎంత లాభకరమైనా, దేశంలో ఆలోచనాపరులందరికీ ఆందోళన కలిగించిన బానిసత్వసమస్యకు కారణమయింది. ప్రజాస్వామ్య విరుద్ధమైన ఈ దురాచారాన్ని నూతన రాష్ట్రాలలోనూ వలసలలోనూ ప్రవేశింపనీయవచ్చునా ? మిజరీ, ఆర్కన్సాస్, నైఋతి ప్రాంతాలలో ఉన్న మోతుబరి రైతులు తమ నీగ్రోలను కొనిపోయి నూతన బానిసరాష్ట్రాలను ఏర్పాటుచేసే హక్కు తమకు ఉన్నదని విశ్వసిస్తున్నారు. రాజ్యాంగంలో అట్టి నిషేధమేమీ కనిపించలేదు; ఆ భావంతోనే కెంటకీ, టెన్నెసీ, మిస్సిసిపీ, లుయీజియానా రాష్ట్రాలు అప్పటికే సమాఖ్యలో చేర్చుకొనబడినవి.

కాని, ఉత్తరాదిన బానిసత్వంపట్ల అసహ్యభావం వృద్ధిఅవుతూంది; దీనికి నైతిక హేతువులేకాక రాజకీయ, సాంఘిక హేతువులుకూడా ఉన్నవి. ఈ బానిస రాష్ట్రాల ప్రాబల్యం స్వతంత్రరాష్ట్రాలను మించిపోయేయెడల, దిగుమతి సుంకాలు తగ్గించడం, వ్యవసాయాభివృద్ధికి

ప్రాధాన్యం ఇవ్వడం, వ్యాపార ప్రధానమయిన ఉత్తరాదిరాష్ట్రాల మంచిచెడ్డలు వెనుకపడడం తప్పదని బౌత్తరాహుల భయం.

ప్రథమ ప్రతిష్టంభన మన్రో "సద్భావయుగం" లోనే యేర్పడింది. దానిని సామరస్యంతో తేలికగానే సర్దుబాటు చేసుకొన్నప్పటికీ, ఉభయపక్షాలలో అది చాలా ఆందోళన కలిగించింది. 1819 లో స్వతంత్రరాష్ట్రాలు, బానిసరాష్ట్రాలు సరిసమానంగా, అవి పదకొండు, ఇవి పదకొండూ ఉన్న సమయంలో బానిసత్వంగల మిజూరీరాష్ట్రం సమాఖ్యలో స్థానంకోసరం దరఖాస్తు పెట్టింది. ఈ రాష్ట్రాన్ని చేర్చుకుంటే బానిసరాష్ట్రాలకు స్వతంత్రరాష్ట్రాలకు సమత్వం భంగమవుతుందనీ, పైగా మిస్సిసిపీనదికి పశ్చిమానకూడా ఈ బానిసత్వాన్ని విస్తరింపజేయడానికి ఇది ప్రతిపాదిక అవుతుందనీ ఉత్తరాది ప్రజలు అభ్యంతరం చెప్పారు. రాజ్యాంగంరీత్యా కాంగ్రెసు నూతనరాష్ట్రాలను చేర్చుకొనవచ్చునేగాని అలా చేర్చుకొనేటప్పుడు షరతులు విధించే అవకాశంలేదని దాక్షిణాత్యులు ప్రతిఘటించారు. అలాంటి అధికారం సంయుక్తరాష్ట్ర ప్రజలకు మాత్రమే ఉన్నదని వారి అభిప్రాయం.

ఈ సమస్యను 1820 లో "మహాసంధి సంధానకర్త" గా పేరు మోసిన హెన్రీక్లే ఒకవిధంగా పరిష్కారం చేశాడు. అయితే ఈ సమస్య అనంతరం అనేక పరిణామాలకు కారణమయింది. మెయిన్‌ప్రాంతం అప్పటికి మసాచూసెట్స్ రాష్ట్రంలో ఒకభాగంగా ఉంది. ఆయన పరిష్కారం ప్రకారం ఆ రాష్ట్రం అనుమతితో దాన్ని వేరుపరచి స్వతంత్రరాష్ట్రంగా సమాఖ్యలో చేరడానికి అనుమతి ఇచ్చారు; బానిసరాష్ట్రాలుగా మిజూరీని సమాఖ్యలో చేర్చుకున్నారు. ఆవిధంగా బానిస, స్వతంత్రరాష్ట్రాల సంఖ్యాసమత్వానికి భంగం కలుగకుండా సమస్య పరిష్కారమయింది. అదే సమయంలో, మిజూరీ దక్షిణపు సరిహద్దు లగాయితు, లుయీజియానా ప్రాంతంగుండా 36°-30′ అక్షాంశరేఖ మీదుగా సరిహద్దు గీతగీసి, దానికి ఉత్తరాన ఉన్న విశాలప్రాంతంలో మాత్రం బానిసత్వం నిషేధింపబడింది. ఈ పరిష్కారం ఉభయపక్షాలకు సంతృప్తి కలిగించింది.

తరువాత జాక్సన్ కాలంవరకు మళ్ళీ బానిస, స్వతంత్రరాష్ట్రాల సమత్వాన్ని ఈ విధంగా సర్దుబాటు చేయవలసిన అగత్యం కలుగలేదు.

1836 లో మాత్రం అర్కాన్సాస్ బానిసరాష్ట్రంగా సమాఖ్యలో చేర్చు కొనబడింది; దానికి ప్రతిగా మిషిగన్ రాష్ట్రం నూతన స్వతంత్ర రాష్ట్రంగా చేర్చుకొనబడింది. తరువాత 1845-46లో ఇలాగే ఫ్లారిడా, అయోవా రాష్ట్రాలకు సమాఖ్యలో స్థానమీయబడింది.

కాని అమెరికా సంయుక్తరాష్ట్రాల రిపబ్లిక్ తొలిసంవత్సరాల్లో అంతర్నిహితంగా ఉండిన బానిసత్వ సమస్య క్రమంగా ప్రతిష్టంభనకు దారితీయడ మారంభించింది. పశ్చిమదిశను కొత్తవలసలు ఏర్పరచే టప్పుడల్లా ఈ సమస్య మరల తీవ్రతరంగా తలయెత్తడం మొదలు పెట్టింది. ఉత్తరాది గ్రామాలలోని ఉమ్మడి మైదానాలలోనూ, దక్షిణాదిన రచ్చసావడి అవరణాల్లోనూ సమావేశమైన ప్రజలు ఈ సమస్యనుగురించే మాట్లాడుకొనడం మొదలుపెట్టారు. చర్చిలలో క్రైస్తవ మతగురువులు ఈ విషయంపై ఆవేశంతో ఉపన్యసించేవారు. తీవ్రవాదులు, ఈ పాక్షిక విద్వేషాలను ఇంకా బాగుగా రగుల్కొలిపారు. 1810 అనంతరం, సంయుక్తరాష్ట్రాలలో అర్థిక రాజకీయ సమస్యలన్నిటికన్న ఈ బానిసత్వమే ప్రధానసమస్యగా పరిణమించింది. కాని ఈ బానిసత్వ సమస్యను శాశ్వతంగా పరిష్కరించిన గొప్ప అంతర్యుద్ధానికి తలపడడానికి పూర్వమే అమెరికాప్రజలు పసిఫిక్ సముద్రతీర పర్యంతం తమ విస్తరణ పూర్తిచేశారు.

— :o: —

# షష్ఠాధ్యాయం

## విభక్తజాతి

"ఆలామో అత్యాచారాన్ని మరువకండి!" "ఏతే 54°-40' అక్షాంశం, లేదా యుద్ధం!" అనే సమర నినాదాలు రెండూ సుమారు వందేళ్ళక్రిందట అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ఎక్కడపడితే అక్కడ వినిపించేవి. ఇందులో మొదటిది 1836 లో టెక్సాస్

రాష్ట్రంలోని శాన్ ఆంటోనియో పట్టణంలోని పౌరులను మెక్సికో సైన్యం చిత్రవధ చేసిన సంఘటన జ్ఞాపకం చేస్తుంది. రెండవది ఆరిగాన్ ప్రాంతం ఉత్తరపు సరిహద్దునుగూర్చిన వివాదానికి సంబంధించినది. బ్రిటన్‌కీ, సంయుక్తరాష్ట్రాలకూ మధ్య ఏర్పడిన ఈ సరిహద్దు తగాదా 1840 అనంతరం భయంకరరూపం దాల్చింది.

దాదాపు ఒకే సమయంలో, అనగా 1840 ఎన్నికలో విగ్గులపక్షం డెమొక్రాట్లను ఓడించిన తరువాత పశ్చిమదిశగా జరిగిన భారీవిస్తరణ కార్యక్రమం ఫలితంగా నైరుతిభాగంలో ఉన్న టెక్సాస్ ప్రాంతము, వాయవ్యాన పసిఫిక్ తీరంలో ఆరిగాన్ ప్రాంతము సంయుక్తరాష్ట్రాలకు సంప్రాప్తించినవి. మెక్సికో దేశస్థులు స్పెయిన్ నుండి స్వాతంత్ర్యం పొందేనాటికి టెక్సాస్ ప్రాంతం మెక్సికోలో భాగంగా ఉండేది. ఆరిగాన్ ప్రాంతాన్ని ఇంగ్లండూ, సంయుక్తరాష్ట్రాలుకూడా తొలి పరిశోధనలరీత్యాను, వలసలరీత్యాను నాకు చెందాలంటే, నాకు చెందాలని పోరాడుకుంటున్నవి. ఈ రెండు ప్రాంతాలలో సంయుక్తరాష్ట్రాల హక్కులను కాపాడలేకపోవడంవల్ల 1844 ఎన్నికలో విగ్గులపక్షం ఓడిపోయింది.

టెక్సాస్ ప్రాంతంలో 1820 ప్రాంతాల్లో అమెరికనుల జనాభాయే అధికంగా ఉండేది. మెక్సికో ప్రభుత్వమే ఈ అమెరికను వలసదార్లను ప్రోత్సహించింది. కాని క్రమంగా ఆ రాష్ట్రం తమపట్టు తప్పిపోతున్నదనే సంగతి మెక్సికో గ్రహించి, ఒక్కసారిగా తనవిధానం మార్చుకున్నది. వెంటనే సంయుక్త రాష్ట్రవాసులు వలసవెళ్ళడం ఆగిపోయింది. టెక్సాస్ ప్రజలపై నిర్బంధ పరిపాలన ఏర్పాటుచేయబడింది. తత్ఫలితంగా టెక్సాస్ స్వాతంత్ర్యం ప్రకటించింది. దానితో యుద్ధం ప్రారంభమయింది,

స్వల్పకాలం సాగిన ఈ యుద్ధంలో మెక్సికో ప్రభుత్వాధ్యక్షుడైన శాంతాఅన్నా స్వయంగా కొంత సైన్యాన్ని తీసుకొని, టెక్సాస్‌లోని తిరుగుబాటు దార్లను అణచడానికి బయలుదేరిపోయి శాన్ ఆంటోనియాలోని ఒక మత ప్రచారక భవనాన్ని ధైర్యంగా పరిరక్షించుచుండినకొద్దిపాటి సేనను పూర్తిగా తుడిచిపెట్టాడు. కాని అచిరకాలంలో నేదీనికి తగిన ప్రతీకారం జరిగింది. 1812 వ సంవత్సరపు యుద్ధంలో

పోరాడిన జెనరల్ శ్యామ్ హ్యూస్టన్ నాయకత్వంక్రింద టెక్సాస్ వాసుల సైన్యం శాన్ జాసింటోవద్ద మెక్సికో సైన్యాన్ని పూర్తిగా ఓడించి శాంతాఅన్నాను కూడా పట్టుకొని యుద్ధాన్ని ముగింపు చేశాడు. టెక్సాస్ స్వతంత్రదేశమయింది. హ్యూస్టన్ దానికి ప్రెసిడెంట్ అయాడు.

స్వయంగా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొని, గర్వితులై ఉన్నప్పటికీ, టెక్సాస్ వాసులు తమకు సంయుక్తరాష్ట్రాలతో గల సంబంధాన్ని విస్మరించక, ఆ సమాఖ్యలో చేరడానికి నిశ్చయించారు. కాని బానిసలుగల రాష్ట్రం అవడంవలన, టెక్సాస్‌ను సమాఖ్యలో చేర్చుకొనరాదని ఉత్తరాది రాష్ట్రాలవారు ప్రతిఘటించారు. పైగా, టెక్సాస్‌ను సంయుక్తరాష్ట్రాలలో చేర్చుకొంటే, తమపై యుద్ధాన్ని ప్రకటించినట్లే అని మెక్సికో చేసిన హెచ్చరికకూడా వారు మరువక అభ్యంతరంగా పేర్కొన్నారు. ఈ స్థితిలో 1844లో విగ్గులు డెమొక్రాట్లు ముమ్మరంగా ఎన్నికల ప్రచారం చేసుకొంటున్నారు.

టెన్నెసీవాసి అయిన జేమ్స్‌పోక్ నాయకత్వాన డెమొక్రాట్లు టెక్సాస్, ఆరిగాన్ రాష్ట్రాలను సమాఖ్యలో చేర్చుకొంటామని సాహసంగా ప్రకటించి, తీవ్రంగా ఎన్నికల ప్రచారం ప్రారంభించారు. అదిగాక స్వతంత్రరాష్ట్రం అవడంవలన ఉత్తరాదివారినీ, టెక్సాస్ బానిసరాష్ట్రం అవడంవలన దక్షిణాదివారినీకూడా ఈ ప్రకటన బాగా ఆకర్షించింది. విగ్గుల అభ్యర్థి అయిన "సంధిసంధాన నిపుణుడు" హెన్రీక్లే ఈ రెండు రాష్ట్రాలను చేర్చుకుంటాననడానికి సాహసించలేకపోయాడు. తత్ఫలితంగా పోక్ ప్రెసిడెంట్‌గా ఎన్నిక అయాడు.

పోక్ ఇంకా పదవీస్వీకారం చేయకపూర్వమే టెక్సాస్ రాష్ట్రం సమాఖ్యలో చేర్చుకొనబడింది. తరువాత కొత్త ప్రెసిడెంటు వచ్చి ఆరిగాన్ విషయంలో బ్రిటన్‌తో ఉన్న వివాదాన్ని సర్దుబాటు చేశాడు. మొదట సంయుక్తరాష్ట్రం ఉత్తరాన కెనడాలోంచి రష్యాకు చెందిన అలాస్కా సరిహద్దువరకు 54°-40' అక్షాంశంవరకు తన ప్రాంతమేనని ప్రకటించింది. ఇది కేవలం గొంతెమ్మకోరిక అని ఇంగ్లండు నిరాకరించింది. అందువల్ల పోక్ 54°-40' అక్షాంశం లేకపోతే యుద్ధం అన్న న ఎన్నికల నినాదాన్ని చల్లగా వదిలేసి, తుదికిగా క్రింద 49° అక్షాం

శ రేఖను, ఉత్తరపు సరిహద్దుగా చేసుకొనే పద్ధతిమీద బ్రిటన్‌తో రాజీపడ్డాడు.

వెనువెంటనే దక్షిణాదిన టెక్సాస్ రాష్ట్రం దక్షిణపు సరిహద్దు విషయంలో ఏర్పడిన వివాదం మెక్సికోతో, చిరకాలంగా అనుకుంటూనే ఉన్న యుద్ధానికి దారితీసింది. బలహీనమైన సరిహద్దుదేశంతో ఏదో ఒక తగూపెట్టుకొని మరికొంత భూభాగాన్ని సంపాదించాలనే ఆశయంతో సంయుక్తరాష్ట్రమే ఈ యుద్ధాన్ని ప్రేరేపించిందని తరచు విమర్శింపబడుతున్నది. కాని మెక్సికో రాజీకి అంగీకరించలేదు సరికదా, ముందుగా తానే రియోగ్రాండీనది దాటివచ్చి మొట్టమొదటి దెబ్బతీసింది. ఏమైనా అచిరకాలంలో జెనరల్ జెఖారీ టేలర్, జనరల్ విన్‌ఫీల్డ్ స్కాట్ అనే ఇద్దరు సేనానుల నాయకత్వాన సంయుక్తరాష్ట్ర సేనలు బాగా మెక్సికో లోపలికంటూ చొచ్చుకొనిపోయినవి. మరొకవంక, పసిఫిక్ సముద్రతీరాన ఉన్న కాలిఫోర్నియాను శత్రువుల వద్దనుండి లాగుకొనడానికి అచటి వలసదారులకు అమెరికా నౌకాదళం సహాయం చేసింది.

1848 నాటికి మెక్సికో రాజధానినగరాన్నికూడా సంయుక్త రాష్ట్ర సేనానాయకులు పట్టుకొన్నారు. సర్వత్ర, సంయుక్తరాష్ట్రాల సైన్యాలకే విజయం లభించింది. మెక్సికో ప్రభుత్వం కాలిఫోర్నియా, న్యూమెక్సికో, అరిజోనా మొదలైన విశాలప్రాంతాలను, సంయుక్త రాష్ట్రాలకు వదలివేయవలసి వచ్చింది. ఇలా వదలివేసినందుకుగాను సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం మెక్సికోకు 150 లక్షల డాలర్లను నగదు రూపంలో ఇవ్వడానికి అంగీకరించింది. ఈ సంధి షరతులు అతి ఉదారంగా ఉన్నాయనీ, అసలు మెక్సికో అంతటినీ సంయుక్తరాష్ట్ర భూభాగంలో లీనంచేసుకుని ఉండవలసిందనీ చాలామంది అమెరికనులు విమర్శించారు.

ఈ కూర్పు లన్నిటితో సంయుక్తరాష్ట్ర భూభాగం దాదాపు ప్రస్తుత పరిమాణాన్ని చేరుకొన్నది. ఇప్పుడు తూర్పు సరిహద్దు అట్లాంటిక్ సముద్రం, పడమటి సరిహద్దు పసిఫిక్ మహాసముద్రంగా ఏర్పడినవి. అయితే, ఈ రెండు సరిహద్దుల నడుమ అనేక అరణ్యాలు, పర్వతాలు, మైదానాలు, ఎడారులు ఉన్నవి.

* * *

"కాలిఫోర్నియాలో బంగారపుగని!" 1849 లో ఈ 'ఆనంద నినాదం' దశదిశల మార్మోగింది. అమెరికా ఖండంలో పశ్చిమతీరానికి జనం గుంపులుగుంపులుగా బయలుదేరారు. కాలిఫోర్నియాలోని లోయలలోను,నదీ గర్భాలలోను బంగారం ఉన్నదనేవార్త విన్నదేతడవుగా వేలకొలది వలసదార్లు పోటాపోటీలుపడి ప్రయాణం కట్టారు. గంభీరస్వభావంగల ప్రాచీన బోస్టన్‌నుండి, జనం కిటకిటలాడుతూ ఉండే న్యూయార్కునుండి, వ్యవసాయక్షేత్రాలనుండి, పల్లెలనుండి, మొత్తం తూర్పుప్రాంతమంతటినుండి ఈ వలసదార్లు పెద్ద పెద్ద పెట్టె బండ్లలో బయలుదేరపోతున్నారు. దారిలో ఎర్ర ఇండియనుల ప్రమాదం ఉంటుందనిగాని, ఎండలకు చలికి ఆకలికి దాహానికి-దేనికీ వారు జంకలేదు. వారి స్వర్ణస్వప్నమే వారి కనులముందు తాండవిస్తూ వారిని ముందుకు నడిపించుకొని పోయింది.

ఈ బంగారం సందడికి పూర్వం, కాలిఫోర్నియా దూరదూరంగా వలసలుగల ప్రశాంతమైన ప్రదేశం. అక్కడక్కడ కొన్ని స్పెయిను దేశ వాసుల తోటలు, పశువుల కొటారాలు క్రైస్తవమత ప్రచారక సంస్థలూ మాత్రమే ఉన్నవి. తీరాలవెంట చెదురువాటుగా అక్కడక్కడ కొందరు అమెరికనులు ఉండేవారు. ఇలా ఉండగా, 1849 సంవత్సరంలో ఒక్కసారిగా అచ్చటి జనాభా 6,000 నుండి, 85,000 కు పెరిగిపోయింది. ఈ పౌరులంతా,-వారిలో చాలాభాగం ఉత్తరాది వారు- స్వతంత్ర రాష్ట్రంగా కాలిఫోర్నియాకు సమాఖ్యలో ప్రవేశం సంపాదించడానికి ప్రయత్నాలు ప్రారంభించారు.

వారీపని చేయడం దేశానికి మేలే అయింది. మెక్సికోవద్దనుండి సంపాదించిన భూములను సంయుక్త రాష్ట్రాలలో ఏవిధంగా చేర్చుకోవాలా అన్న విషయంమీద తీవ్రంగా తర్జన భర్జనలు జరుగుతున్నవి. ఆ కోపాటోపంలో ఉత్తరాదివారు, దక్షిణాదివారుకూడా, మిజూరీసుహో సభలో చేసుకున్న సంధినీ, ఆ సంధిలోని విభజన రేఖాసూత్రాన్ని కూడా పూర్తిగా విస్మరించి పశ్చిమప్రాంతమంతా స్వతంత్ర ప్రాంతంగానే ఉండాలని ఉత్తరాదివారూ, కాదు ఆ ప్రాంతమంతా బానిసల పద్ధతిని అనుమతించే ప్రాంతంగానే ఉండాలని దక్షిణాదివారూ ఒకరిని మించి పట్టుదలతో ఒకరు వాదిస్తున్నారు. ఈ రెండు పక్షాలవారి

నడుమ కొందరు మితవాదులు (Moderates) ఉన్నారు. ఆయా ప్రాంతాలు బానిసత్వవిధానానికి అనుకూలంగా ఉండవలసిందీ, ప్రతికూలంగా ఉండవలసిందీ, స్వాతంత్ర్యం ప్రజలందరికీ చెందవలసిందీ, వలసల యాజమానులకు మాత్రమే చెందవలసినదీ నిర్ణయించుకొనే హక్కు ఆ ప్రాంతం ప్రజలకే వదలివేయడం మంచిదని ఈ మితవాదులు సూచించారు. "మహాసంధి సంధాత" అని ప్రఖ్యాతిచెందిన "హెన్రీక్లే" అవసరం మళ్ళా ఏర్పడింది. కాలిఫోర్నియాను స్వతంత్రరాష్ట్రంగానే చేర్చుకోవాలనీ, మెక్సికోవద్దనుండి తీసుకొన్న మిగతా భూభాగాన్ని ఉటా, న్యూమెక్సికో అనే రెండు రాష్ట్రాలుగా విభజించి ప్రజలంతా వోటుచేసే పద్ధతిలో ఈ రెండుప్రాంతాలు తమవిధానాన్ని తామే నిర్ణయించుకొనవివ్వాలనీ-క్లే సూచించాడు. క్లే ప్రతిపాదించిన బిల్లులో దాక్షిణాత్యులకు సంతృప్తి కలిగించడానికి మరొకసూచన కూడా ఉన్నది. ఉత్తరాదికి పారిపోయిన బానిసలను ప్రభుత్వం వెంటనే వెదకిపట్టుకొని తిరిగి వారిని వారి యజమానులకు అప్పగించాలి.

ఈ 1850 లో రాజీనిగురించి జరిగిన చర్చ చాలా అద్భుతమైనది. దక్షిణాది తరఫున మాట్లాడుతూ కాహూన్ ఈ పరిష్కారమార్గాన్ని ప్రతిఘటించాడు. నూతన ప్రాంతాల్లో బానిసత్వవిధానం ఉంటుందని స్పష్టంగా చెప్పకపోవడం వల్లనే తానా సూచనను ప్రతిఘటిస్తున్నట్లు ఆయన ప్రకటించాడు. బానిసలు వ్యక్తిగతాస్తులలో జేరినవారు అనీ కనుక, ఆ వ్యవహారం యావత్తూ రాష్ట్రప్రాంతీయశాసనాలకు సంబంధించిన విషయమేగాని, జాతీయప్రభుత్వానికి సంబంధించినది కాదని ఆయన వ్యాఖ్యానించాడు. అందువల్ల బానిసలను ఈ నూతన రాష్ట్రాలకు తీసుకొని పోకుండా నిరోధించే అధికారం కాంగ్రెసుకి లేదని ఆయన హెచ్చరించాడు.

ఔత్తరాహులకుకూడా ఈ రాజీ సంతృప్తి కలిగించలేదు. ముఖ్యంగా పారిపోయివచ్చిన బానిసలనుపట్టి, యజమానులకు పంపాలన్న శాసనాన్ని వారిలో చాలామంది ప్రతిఘటించారు. కాని, వారి మహావక్తఅయిన డేనియల్ వెబ్‌స్టర్ (మసాచూసెట్స్) క్లే సూచనను బలపరచడానికి వచ్చి, ఎంత నష్టమైనా సరే సమాఖ్యను కాపాడడా

నికి అందరూ సంసిద్ధులై ఉండాలని ఆవేశంతో ఉపన్యసించాడు. చివరికి, కాంగ్రెసు ఆ రాజీసూచనను ఆమోదించింది. దానితో బానిసత్వ సమస్య శాశ్వతంగా పరిష్కారమై పోయినట్టే అని దేశమంతా భావించింది.

* * *

సర్వత్ర, కాలం అభ్యుదయకరంగా ఉంది. దేశమంతటా రైలు రోడ్లు వేయబడ్డాయి. ఈశాన్య ప్రాంతపు పరిశ్రమాలయాలు యెడతెరిపిలేకుండా పనిచేస్తున్నవి. మధ్య పశ్చిమ ప్రాంతాలనుండి ధాన్యాలు అంతులేకుండా వచ్చి పడుతున్నవి. కాలిఫోర్నియా బంగారం పంటతో మహావైభవంతో తులతూగుతూంది. దక్షిణాది అంతా "ప్రత్తిరాజా" భోగభాగ్యాలతో ఓలలాడుతూంది.

దక్షిణాదిన, 1850 లో గల మొత్తం జనాభా సుమారు తొంభై లక్షలు. ఇందులో ముప్ఫయిలక్షలకు పైగా బానిసలు. తెల్లవారిలో బహుకొద్దిమంది మాత్రమే ఈ బానిసల యజమానులు. నీగ్రోలలో చాల భాగం మహైశ్వర్యవంతులైన కొన్నివేలమంది తెల్లవారికిచెందిన వ్యవసాయ క్షేత్రాలలోను తోటలలోను పనిచేస్తున్నారు. 1808 తరువాత, క్రొత్తగా బానిసలను దిగుమతి చేయరాదని రాజ్యాంగం నిషేధించింది. కాని అప్పటికే నీగ్రోలు కావలసినంతమంది దిగుమతి అయారు. వారి సంతతి పెరుగుతూ ఉండడంవల్ల క్రొత్తగా దిగుమతిచేయవలసిన అవసరంకూడా నిజానికి లేదు.

ఈ బానిసల జీవనపరిస్థితులు ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్కవిధంగా ఉండేవి. చాలచోట్ల వారు నిర్దాక్షిణ్యంగా అయితే క్రూరంగా కాదు-చూడబడేవారు. పెద్దపెద్ద వ్యవసాయ క్షేత్రాలలో ఉన్న నీగ్రోలకు విద్యాభ్యాసానికి, మతబోధనలకుకూడా అవకాశం కల్పించబడేది; ఇలాంటిచోట్ల వారు తమపనులు సక్రమంగా చేస్తున్నంతకాలం వారి రాకపోకలకు స్వేచ్ఛ ఉండేది. కొద్దిమందికి వారుచేసిన పనికి ఎప్పటికప్పుడు కొంతడబ్బు ముట్టజెప్పి, దానితో క్రమంగా కొన్నిసంవత్సరాలకు వారు తమ స్వేచ్ఛను కొనుక్కొనడానికి వీలు కల్పించబడింది.

కొన్ని చోట్లమాత్రం ఈ బానిసలకు బాగా ఎక్కువ పని చెప్పడం, వారు చెయ్యకపోతే కొట్టడం, నీచంగాచూడడం, వారి కుటుంబాలను విడదీసి వేలంపాటలో అమ్మివేయడం జరుగుతూఉండేది. ఈ బాధలు పడలేక వీరిలో చాలమంది ఉత్తరాదికిగాని కెనడాకుగాని పోతే తమకు స్వేచ్ఛ లభిస్తుందనే ఆశతో వీలు దొరికినప్పుడు పారిపోతూ ఉండేవారు. అట్టివారికి తరచు ఉత్తరాదిన ఉదారుల ఆశ్రయం లభించేది. వీరు బానిసత్వ శాసనాలనుకూడా ధిక్కరించి, ఆ నీగ్రోలను తిరిగి వారి యజమానులకు అప్పగించడానికి నిరాకరించేవారు. ఉత్తరాదిన విప్లవానంతరం మిగిలిఉన్న కొద్దిపాటి బానిసత్వంకూడా పూర్తిగా తుడిచివేయబడింది. బానిసలపై జరుగుతున్న అత్యాచారాలను గురించి వింటూన్నకొలదీ, పారిపోయివస్తున్న నీగ్రోల విషాదగాథలను తెలుసుకొంటున్న కొలదీ ఉత్తరాదివారికి ఈ బానిసత్వ పద్ధతిని గురించిన నైతిక ప్రమాణాల విషయంలో ఆందోళన హెచ్చింది. బానిసత్వ నిర్మూలన వాదులు (Abolitionists) అనే పేరుతో కొందరు, వెంటనే దేశమంతటా ఈ బానిసత్వ విధానాన్ని నిషేధించాలని ఆందోళన ప్రారంభించారు. 1852 లో 'హారియెట్ బీచర్ స్టో' రచించిన "అంకుల్ టామ్స్ కాబిన్" అనే నవలలో ఆ వ్యవసాయ క్షేత్రాలలోని పరిస్థితులను విశదంగా అభివర్ణించారు. ఈ గ్రంథం ఉత్తరాదిన అపరిమితంగా అమ్ముడుపోయి, ఈ సమస్య విషయంలో ప్రజాభిప్రాయాన్ని మరింత రెచ్చగొట్టింది.

అయితే, ఈ గ్రంథంకన్ననూ, అంతకు పూర్వం జరిగిన సర్వ సన్నివేశాలకన్ననూ ఎక్కువగా ఉత్తరాదివారిని రెచ్చగొట్టింది 1854 లో ఆమోదించబడిన "కాన్సాస్-నెబ్రాస్కా శాసనం". ఇల్లినాయ్‌నుండి ఎన్నిక అయిన డెమొక్రాట్ సెనేటర్ స్టీఫెన్ డగ్లస్ ప్రతిపాదించిన ఈ శాసనం, - లోగడ కొనబడిన లుయీజియానా భూమి ఉత్తరప్రాంతంలో బానిసత్వాన్ని పూర్తిగా నిషేధించిన మిజూరీసంధి పరిష్కారానికి స్వస్తి చెప్పింది; ఆ విధంగా సుమారు ఐదులక్షల చదరపుమైళ్ళ ప్రదేశంలో తిరిగి బానిసల వ్యాపారానికి అవకాశం కల్పించింది; ఆ ప్రాంతంలో ప్రజలందరికీ స్వాతంత్ర్యం ఉండాలని పూర్వం చేసుకొన్న పరిష్కారాన్ని రద్దుచేసింది; బానిసల

వ్యాపారసీమను నిర్ణయించ చేసుకొనడానికి దక్షిణాది వారికి మళ్ళీ అవకాశమిచ్చింది.

డగ్లస్ ఈ చర్య ఎందుకు తీసుకొన్నాడో ఇప్పటికీ గొప్ప చిదంబర రహస్యం. తాను ప్రెసిడెంట్‌గా ఎన్నిక కావాలనే వాంఛ ఉండి, ఈ విధంగా దక్షిణాదివారి సహకారం సంపాదించడానికి యత్నించి ఉండవచ్చు. వాయవ్య ప్రాంతంలో అతడికి ఆస్తిపాస్తులు ఉన్నాయి. కనుక ఆ ప్రాంతానికి రాష్ట్రహోదా కలిగేటట్టు చేసి ఆ ప్రాంతపు అభివృద్ధికై యత్నించి ఉండవచ్చు లేక ఆయనభార్య దక్షిణాదిది అవడంవల్ల, ఆమె ప్రోద్బలంవల్ల ఈ పని చేసి ఉండవచ్చు.

ఏమైనా, ఈ శాసన ఫలితంగా ఆ ప్రాంతాన్ని కాన్సాస్, నెబ్రాస్కా అనే రెండు భాగాలు చేసారు; తిరిగి ఆ ప్రాంతాలకు వలసవెళ్ళడం ప్రారంభమయింది. వెంటనే కాన్సాస్, ప్రాంతం కోసం ఉత్తరాదివారు, దాక్షిణాత్యులు వివాదపడడం ప్రారంభించారు. ఇరుపక్షాలలో, మొరటువారు, దుండగులు పరస్పరం అధికారం చెలాయించాలని ప్రయత్నించడంతో అంతర్యుద్ధం ప్రారంభమయింది. "సర్వప్రజా స్వాతంత్ర్యం" అనే నినాదం ఎంత మనోరంజకంగా కనిపించినప్పటికీ, కాన్సాస్‌లో ఎక్కువ ఫలించక, కేవలం రక్తపాతానికి మాత్రమే కారణమయింది.

తరువాత మూడుసంవత్సరాలకు బానిసత్వాన్ని సమర్థించే వారికి మరొకవిజయం లభించింది. డ్రెడ్‌స్కాటు కేసులో సుప్రీంకోర్టు తీర్పు వారికే అనుకూలమయింది. స్కాట్ అనే నీగ్రో తన యజమాని తనను ఒకసారి స్వతంత్ర ప్రాంతానికి తీసుకువెళ్ళినందున తనకు స్వాతంత్ర్యం లభించాలని ఈ దావా వేశాడు. ప్రధాన న్యాయమూర్తి టానీ, అమెరికాలో స్వతంత్ర ప్రాంతాలనేవి ఎక్కడా లేవంటూ, స్కాట్ కేసును కొట్టివేశాడు, రాజ్యాంగ శాసన రీత్యా బానిసలు కూడా ఆస్తిలోనేలెక్క. అందువల్ల, ఏప్రాంతంలోగాని బానిసత్వాన్ని నిషేధించేహక్కు కాంగ్రెస్‌కి లేదు. అని ఈ తీర్పులో వ్రాయబడింది. ఆపైన, నూతనరాష్ట్రాలన్నింటిలో ఈ బానిసత్వపద్ధతిని ప్రవేశపెట్టడానికి ఈ తీర్పు అవకాశం కల్పించింది.

* * *

ఈ లోగా ఉత్తరాదివారు రిపబ్లికన్ అనే పార్టీ పేరుతో నూతన రాజకీయ శక్తి నొకదానిని ఏర్పాటు చేసుకున్నారు. నూతన ప్రాంతాల్లో బానిసత్వ పద్ధతిని ప్రవేశపెట్టే యత్నాలన్నింటినీ వెంటనే ఆపివేయాలని ఈ పార్టీ హెచ్చరించింది. నేటివరకు నిలిచి ఉన్న ఈ పార్టీని స్థాపించిన నాటి ప్రముఖ నాయకులలో ఒకడు అబ్రహాం లింకన్. ఇతడు ఇల్లినాయ్స్‌లోని స్ప్రింగ్ ఫీల్డుకి చెందిన రాజకీయవేత్త, లాయరు.

1809 లో కెంటకీ సరిహద్దు ప్రాంతాల్లోని ఒక కర్రదుంగల యింట్లో జన్మించిన అబ్రాహాం లింకన్ క్రమంగా "నిజాయితీపరుడయిన అబే" అనే ప్రజాదరణ నామంతో సుప్రసిద్ధుడై, చివరికి అమెరికా సంయుక్తరాష్ట్రచరిత్రలో విప్లవానంతరం అత్యంత క్లిష్టమైన సమయాలలో ప్రెసిడెంట్‌గా కూడా ఎన్నికయాడు. అతడు బాగా పొడుగైన మోటుమనిషి; అన్నివిధాలా "ప్రజలమనిషి"; స్వయంకృషివల్ల విద్యాభ్యాసం చేశాడు; ఉన్నత లక్ష్యాలు గలవాడు పెద్దవాడైన తరువాత ఇల్లినాయ్‌కి వెళ్ళి నాటు న్యాయవాదిగా కొంతవరకు పేరు సంపాదించాడు. ఒక పర్యాయం కాంగ్రెసుకు ప్రతినిధిగా ఎన్నిక అయాడు. లింకన్ స్వరాష్ట్రంలో సుప్రసిద్ధుడైనప్పటికి 1858 లో బానిసత్వ సమస్యపై డగ్లస్ స్టీవెన్‌తో తీవ్ర వాదోపవాదాలు చేసిన పిమ్మటగాని ఆయనపేరు దేశమంతటికీ తెలియలేదు. ఉభయులు ఇల్లినాయ్స్‌నుండే సంయుక్తరాష్ట్ర సెనేట్ సభ్యత్వానికి పోటీ చేశారు. లింకన్ రిపబ్లికన్ పక్షం తరఫున. డగ్లస్ డెమొక్రాటిక్ పార్టీ తరఫున నిలబడ్డారు.

డ్రెడ్‌స్కాట్ కేసుతీర్పు దృష్ట్యా - లింకన్ ఒక చర్చలో తన ప్రత్యర్థిని ఒక ప్రశ్న అడిగాడు - ఒక ప్రాంతానికి రాష్ట్రపు హోదా లభించిన తరువాత తోటి ప్రజలు తమ ప్రాంతాలలో శాసన రీత్యా బానిసత్వాన్ని నిషేధించుకొనవచ్చునా? కూడదా? నిషేధించుకొనవచ్చునని డగ్లస్ జవాబు చెప్పాడు. బానిసత్వం న్యాయసమ్మతమైనప్పటికీ, ప్రభుత్వం బలవంతంగా దాన్ని ప్రజలపై రుద్దజాలదనికూడా ఆయన అన్నాడు. ఈ జవాబుతో డగ్లస్‌కి బానిసత్వానుకూలవాదిగా దక్షిణాది రాష్ట్రాలలో కష్టపడి సంపాదించుకొన్న

పలుకుబడి కాస్తా తుడిచిపెట్టుకొని పోయింది. బానిసత్వం న్యాయసమ్మతమైనప్పటికీ, ఆ ప్రాంతాలలోని బానిసల యజమానులకు తమ ఆస్తిని బలాత్కారంగా అయినాసరే కాపాడుకొనే హక్కు తప్పకుండా ఉన్నది అని దక్షిణాదివారు డగ్లస్‌కు చెప్పారు.

ఇల్లినాయ్స్‌నుండి సెనేట్ ఎన్నికలలో లింకన్‌పైన కొద్దిమెజారిటీతో డగ్లస్ గెలిచాడు. కాని వారిద్దరికీ పెద్దపోటీ జరుగవలసి ఉన్నది. "ఈ ప్రభుత్వం సగం బానిసగా, సగం స్వతంత్రంగా వ్యవహరించే ప్రస్తుత స్థితిని శాశ్వతంగా సహించడం అసంభవం అని నా విశ్వాసం...అయితే పూర్తిగా అదైనా కావాలి, లేదా ఇదైనా కావాలి" అన్న లింకన్ గంభీరసూక్తి ఉత్తరాదివారిలో అతనిపట్ల విశేష గౌరవభావం కలగడానికి కారణమయింది.

జాన్ బ్రౌన్ అనే తీవ్రబానిసత్వ నిర్మూలనవాది నాయకత్వాన, కొందరు 1859 లో వర్జీనియాలోని హార్పర్స్ ఫెర్రీలో ఉన్న ఆయుధాగారంపై దాడిచేసేసరికి మొత్తం దేశమంతా ఆశ్చర్య చకితమయింది. ఇతడు కేవలం పందొమ్మిది మందితో వెళ్ళి అచటి ఆయుధాలన్నిటినీ వశం చేసుకొని, దక్షిణాదిన బానిసల విమోచనంకోసం తిరుగుబాటు సాగించాలని పథకం వేసుకున్నాడు. కాని, రాబర్ట్ లీ నాయకత్వాన సంయుక్తరాష్ట్రసైన్యం ఇతణ్ణి బంధించింది. పిమ్మట అతడు దౌర్జన్యచర్యలకుగాను విచారింపబడి ఉరిశిక్ష పొందాడు. బ్రౌన్ దుస్సాహసాన్ని దక్షిణాదివారు, ఉత్తరాదివారు కూడా ప్రజాసామాన్యమంతా నిరసించారు. కాని. న్యూయింగ్లండులోని బానిసత్వ నిర్మూలనవాదులలో బుద్ధిమంతులకు చెందిన ఒక ముఠావారు, అందులోకూడా ముఖ్యంగా మహాకవి, తత్త్వవేత్త అయిన రాల్ఫ్ వాల్డో ఎమర్సన్ మాత్రం బ్రౌన్ ఉత్తమాశయంకోసం ప్రాణత్యాగానికికూడా వెనుదీయని మహనీయుడని ప్రశంసిస్తూ అతణ్ణి ఏసుక్రీస్తుతో పోల్చాడు. బానిసల తిరుగుబాటులకు నిరంతరం భయపడుతూన్న దక్షిణాదివారికి ఈ సంఘటన అమితాగ్రహ కారణమయింది.

క్రమంగా 1860 లో ఎన్నికల ప్రచారం ముమ్మరమైన కొద్దీ, ఆవేశాలు, కావేషాలు పెరిగిపోజొచ్చినవి. డెమొక్రాటిక్ పార్టీకి చెందిన ప్రెసిడెంట్ బుకానన్ పరిమిత సామర్థ్యం గలవాడవడం

వలన ఈ బానిసత్వ సమస్యా ప్రతిష్టంభన విషయంలో దృఢమైన చర్య తీసుకోనలేక పోయాడు. అందువలన అతణ్ణి అభ్యర్థిగా నిలబెట్టడానికి సుముఖత కన్పించలేదు. దక్షిణ కెరోలినా రాష్ట్రంలోని చార్లెస్టన్‌లో అనగా దాక్షిణాత్యుల గడ్డపై జరిగిన పార్టీమహాసభ (Convention) లో ఉత్తర దక్షిణ డెమొక్రాట్లంతా సమాధానానికి వచ్చి స్టీవెన్ డగ్లస్‌ని పార్టీ అభ్యర్థిగా నిలబెట్టడం ఉచితమని ఒక సూచన వచ్చింది. కాని, సంయుక్తరాష్ట్రప్రభుత్వ వశంలో ఉన్న ప్రాంతాల్లో ప్రభుత్వం బానిసత్వ వ్యవస్థను రక్షణ కల్పించాలన్న దాక్షిణాత్యుల కోరికను డగ్లస్ అంగీకరించక పోవడంవలన డెమొక్రాటిక్ పార్టీలో ఉత్తర దక్షిణ వర్గాలకు రాజీ కుదరక పార్టీచీలి పోయింది. దక్షిణ డెమొక్రాట్లు కెంటకీవాసైన జాన్ బ్రెకిన్‌రిడ్జ్‌ని తమ అభ్యర్థిగా పేర్కొన్నారు. అనంతరం ఉత్తరాది డెమొక్రాట్లు మరొక సమావేశం జరుపుకొని డగ్లస్‌నే అభ్యర్థిగా పేర్కొన్నారు.

రిపబ్లికన్ పార్టీవారు షికాగోలో సమావేశమై న్యూయార్కుకి చెందిన సెనెటర్ విలియం సివార్డ్‌ను అభ్యర్థిగా పేర్కొనడానికి యత్నించారు. కాని, లింకన్ అభిమానుల సందడి ప్రబలమై చివరకు మూడవ బాలట్‌లో అతడే అభ్యర్థిగా ఎన్నుకోనబడ్డాడు. బానిసత్వ విస్తరణను నిలిపివేయడం కాన్సాస్ ప్రాంతాన్ని స్వతంత్ర రాష్ట్రంగా సమాఖ్యలో చేసుకోవడం తన విధానాలని ఈ పార్టీ తన ఎన్నికల ప్రణాళికలో ప్రకటించింది. జాతీయపరిశ్రముల రక్షణకోసం విదేశపు సరుకులపై దిగుమతి సుంకాలను హెచ్చించాలనీ, కేంద్రప్రభుత్వం విస్తృతమైన "దేశీయాభివృద్ధి కార్యక్రమం" అమలు జరపాలనీకూడా ఈ పార్టీ సూచించడంవల్ల దక్షిణాది ప్రజలకు మరింత ఆగ్రహం కలిగింది.

మరొక పార్టీ:—నాల్గవపార్టీ—కూడా బయలుదేరింది. రాజ్యాంగ సమాఖ్యావాదులు లేక 'కాన్‌స్టిట్యూషనల్ యూనియనిస్టులు' అనే పార్టీ టెన్నెసీవాసియయిన జాన్ బెల్‌ని తన అభ్యర్థిగా నిలబెట్టింది. సరిహద్దు రాష్ట్రాలలో వోట్లు సంపాదించడానికి ప్రయత్నిస్తూన్న ఈ పార్టీ బానిసత్వ సమస్యను గురించి వివాదాలను చల్లగా దాటవేసి,

రాజ్యాంగానికి విధేయులమై ఉండాలని మాత్రమే ప్రకటించి ఊరుకుంది.

వోటర్లంతా 1860 నవంబరు ఎన్నికలలో ఓటు చేశారు. విజయం రిపబ్లికన్ పార్టీని వరించింది. ప్రెసిడెంట్‌గా ఎన్నిక అయిన లింకన్‌కి, పోలయిన వోట్లలో నూటికి నలభై మాత్రమే లభించినవి. దక్షిణాది రాష్ట్రాలలోను సరిహద్దు రాష్ట్రాలలోను ఒక్కరుకూడా లింకన్‌కు వోటు చేయులేదు. అయినప్పటికీ మిగిలిన అభ్యర్థులలో విడివిడిగా అందరికన్న లింకన్‌కే ఎక్కువ వోట్లు లభించడంవల్ల ఆయన ఎన్నిక అయాడు. ఎన్నికదార్ల వోట్లలోకూడా లింకన్‌కే మెజారిటీ లభించింది. లింకన్ తరువాత ఎక్కువవోట్లు సంపాదించినవాడు డగ్లస్. ఇతణ్ణి ఉత్తరాదివారు బలపరిచారు. పోతే, బ్రెకిన్‌రిడ్జ్‌కి, బెల్‌కీ సరిహద్దు రాష్ట్రాల్లోను దక్షిణాది రాష్ట్రాలలోను మాత్రమే వోట్లు పడినవి.

లింకన్ ఎన్నిక అవగానే, దక్షిణాదివారు వెంటనే ఎదురుదెబ్బ తీశారు. 1860 డిసెంబరులోనే దక్షిణ కెరోలినా సంయుక్త రాష్ట్రాలలోనుండి విడిపోయింది దక్షిణాది దిగువ రాష్ట్రాలు చాలాభాగం, దక్షిణ కెరోలినాను అనుసరించినవి. ఈ విధంగా విడిపోయినరాష్ట్రాల నాయకులంతా 1861 ఫిబ్రవరిలో ఎలబామా రాష్ట్రంలోని మాంట్‌గమరీ పట్టణంలో సమావిష్టులయి అమెరికారాష్ట్ర సమాఖ్య (Confederate State of America) అనే పేరుతో వేరే ఒక సమష్టి ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి తీర్మానించుకొని, జెఫర్‌సన్ డేవిస్‌ని తమ ప్రెసిడెంటుగా ఎన్నుకొన్నారు. మెక్సికోలో జరిగిన యుద్ధంలో పాల్గొన్న వీరుడూ వెస్ట్‌పాయింట్ వద్ద గల సైనిక శిక్షణాలయానికి చెందినవాడూ అయిన డేవిస్ లోగడ సంయుక్తరాష్ట్రాల సెనేటర్‌గానూకూడా పనిచేశాడు.

ఈ విధంగా, జాతీయైకమత్యం విచ్ఛిన్నమై పోవడంతో, దక్షిణాదివారికి ఏవేవో ఆశలు చూపి వారి మనస్సులు మార్చుకొని తిరిగివచ్చేటట్లు చెయ్యడానికి, సమాఖ్యలో మిగిలి ఉన్న దక్షిణాదిరాష్ట్రాలు సంయుక్తరాష్ట్రాల సమాఖ్యలోనే ఉండేటట్లు చేయడానికి కాంగ్రెసు చాలా ప్రయత్నాలు చేసింది. కాని ఫలించలేదు. లింకన్ అన్నా రిపబ్లికన్ పార్టీ అన్నా తమ హృదయాన్ని భగ్నంచేసే ఉద్యమానికి

చిహ్నాలని వారు భావిస్తున్నారు. బానిసత్వ విధానం విస్తరిల్లితేతప్ప, క్రమంగా పెరిగిపోతున్న ఉత్తరాదివారి పలుకుబడి దేశమంతటికీ విస్తరిల్లి, రాజకీయంగాను ఆర్థికంగాను దక్షిణాదివారిపై పెత్తనంచేయడం తప్పదని వారిభావన. తమయెడల వైరభావంగల మెజారిటీతో కూడిన సమాఖ్యా ప్రభుత్వాధికారాన్ని, రాష్ట్రాల హక్కులకు ప్రాధాన్యం ఇచ్చే ప్రభుత్వం ఉండాలని మొదటినుంచీ వాదించిన దక్షిణాది రాష్ట్రాలు ఆమోదించడం దుస్సహమైపోయింది. ఈ రెండుప్రాంతాల్లో ఒకటి పారిశ్రామిక ప్రాధాన్యతగలది. రెండవది వ్యవసాయ ప్రాధాన్యత కలది అవడంవల్ల ఈ రెండుప్రాంతాలకు పొత్తుకలవడం అసంభవమని దాక్షిణాత్యులు నిశ్చయించుకొన్నారు.

ప్రెసిడెంట్ లింకన్ 1861 మార్చిలో పదవీస్వీకారోత్సవ సందర్భంలో చేసిన ఉపన్యాసంలో దక్షిణాదిపట్ల సామరస్య ధోరణిలో ఇంచుమించు సానునయ పద్ధతిలో ప్రసంగించాడు. తాను బానిసత్వ వ్యాప్తిమాత్రమే పనికిరాదంటున్నాననీ, అప్పటికి వాడుకలో ఉన్న బానిసత్వ వ్యవస్థనే నిర్మూలించాలని తాను కోరడంలేదనీ ఆయన వివరించాడు. ఆదినుండీ ఏకంగా, ఏకచరిత్ర సంస్కృతులు గలిగి ఉన్న తమజాతి అఖండమనీ; భౌతికంగాను, ఆధ్యాత్మికంగానూ, రాజకీయంగానూకూడా ఈ జాతిరెండుగా విడిపోవడం అసంభవమని దక్షిణాది వారికి నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. ఏమైనా అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వంమీద ముందుగా దౌర్జన్యం జరిగితే తప్ప దాక్షిణాత్యులపై తన ప్రభుత్వం బలప్రయోగానికి తలపడదనికూడా ఆయన వారికి హామీ యిచ్చాడు.

ఈ విజ్ఞప్తికి దాక్షిణాత్యుల జవాబు ఒక నెలకు తరువాత ఛార్లెస్టన్ నౌకాశ్రయంలో ప్రకటితమయింది. అచటి సమ్టర్ దుర్గంలో సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం తాలూకు కొద్దిపాటి సైన్యం ఉన్నది. ఆ సైన్యానికి ఆహారపదార్థాలు అయిపోతూ ఉండడంవలన, వారికి అవసరమైన ఆహారపదార్థాలు సముద్రమార్గాన పంపడమో, లేక ఆ దుర్గాన్ని దాక్షిణాత్య సమాఖ్యాప్రభుత్వానికి అప్పగించడమో ప్రెసిడెంట్ లింకన్ వెంటనే నిశ్చయించవలసి వచ్చింది. ఆహార

పదార్థాలు పంపడానికే ఆయన నిశ్చయించాడు. అయితే అందులో సైనిక సామగ్రి సరఫరాలేమీ పంపడంలేదనికూడా ఆయన ముందుగానే ప్రకటించాడు. కాని, దాక్షిణాత్యులు దీనిని శత్రుచర్యగానే భావించారు. 1861 ఏప్రిల్ 12-వ తేదీన దాక్షిణాత్య సమాఖ్య తాలూకు ఫిరంగిదళాలు, ఆ దుర్గంపైన కాల్పులు ప్రారంభించినవి. రెండురోజులతర్వాత అక్కడ ఉన్నసేన లొంగిపోయింది. ఆ దుర్గంపైన ఉన్న చుక్కలచారల జెండా దించివేయబడింది. దానిస్థానంలో దాక్షిణాత్య సమాఖ్యతాలూకు చుక్కలు - నిలువుగీతల - జెండా ప్రతిష్ఠించారు. అంతర్యుద్ధానికి అంకురార్పణ జరిగింది.

సమ్టర్ దుర్గాన్ని గురించిన ఈ వార్త తెలియగానే దక్షిణాదివారిలో విజయోత్సాహం, ఉత్తరాదివారిలో కోపాటోపం మిన్నుముట్టినవి. కేంద్రప్రభుత్వాధికారాన్ని మొత్తం దేశమంతటా తిరిగి సుప్రతిష్ఠితం చేయడానికిగాను 75,000 స్వచ్ఛంద సైనికులు కావాలని లింకన్ ప్రకటించాడు. వర్జీనియా, ఉత్తర కెరోలీనా, ఆర్కాన్సాస్, టెన్నెస్సీ అనే మరినాలుగు రాష్ట్రాలుకూడా, కేంద్రప్రభుత్వంతో తెగతెంపులు చేసుకున్నవి సరిహద్దు రాష్ట్రాలలో కొన్ని కేంద్రప్రభుత్వం వంకకు, మరికొన్ని దాక్షిణాత్యుల నూతన సమాఖ్య వంకకు మొగ్గు చూపినవి. అయితే, కెంటకీ, మిజూరీ, మేరీలాండ్ రాష్ట్రాలను కేంద్రప్రభుత్వం బలవంతంగా నిలిపి ఉంచింది. పశ్చిమ వర్జీనియాలో కొంతభాగంకూడా కేంద్రప్రభుత్వంపట్ల విధేయత ప్రకటించింది. అనంతరం ఈ ప్రాంతం పశ్చిమవర్జీనియా అనే పేరుతో ప్రత్యేక రాష్ట్రంగా గుర్తించబడింది.

జనాభా, పరిశ్రమలూ హెచ్చుగా ఉండడంవలన ఉత్తరాదివారు, దాక్షిణాత్యులకన్న మంచిస్థితిలో ఉన్నారు. కేంద్రప్రభుత్వానికి విధేయంగాఉన్న ఇరవైమూడు రాష్ట్రాలలో దాదాపు రెండుకోట్ల జనాభా ఉన్నది. విడిపోయిన పదకొండు రాష్ట్రాలలో సుమారు ఒక కోటి జనాభా ఉన్నది. ఈ కోటిమందిలో ముప్పైయ్యైదు లక్షలమంది బానిసలు.

ఆ విధంగా తెల్లవారి జనాభాలో దక్షిణ ఉత్తర ప్రాంతాలు రెండుపాళ్ళ మూడుపాళ్ళ నిష్పత్తిలో ఉన్నవి. పైగా, ఉత్తరప్రాం

తానికి ఉత్తర ఐరోపానుండి కొత్తవలసదారులు ఎడతెగకుండా వస్తూనే ఉన్నారు.

పారిశ్రామికంగా ఉత్తరాదివారికి, బలము విధేయతా కలిగిన మధ్యమ పశ్చిమరాష్ట్రాల అండతోపాటు, యుద్ధసామగ్రి ఉత్పత్తిచేసే కర్మాగారాలు, వాటిని రవాణా చెయ్యడానికి రైలుమార్గాలు కావలసినన్ని ఉన్నవి. దక్షిణాదికి ఇట్టి సౌకర్యాలు లేవు. యుద్ధపరిశ్రమలు కొత్తగా ఏర్పాటుచేసుకోవాలి. కొన్ని ఆయుధాలుమాత్రం దొంగతనంగా ఐరోపానుండి తెప్పించుకొన్నారు.

అయితే దక్షిణాదివారికి కొన్ని సౌకర్యాలు లేకపోలేదు. మొదటిది: ఇది వారు తమ ప్రాణాలను, ఆస్తులను కాపాడుకొనడానికిచేసే ఆత్మరక్షణయుద్ధం అవడంవలన, వారి సైన్యాలకు దూరప్రదేశాలకు సరఫరాలు పంపవలసిన అవసరంలేదు. పైగా, దాక్షిణాత్యులకు వేట అలవాటు ఉండడంవలన, ఉత్తరాది కార్మికులకంటెను, వ్యాపారస్థులకంటెను వారు యుద్ధానికి బాగా పనికివస్తారు. పైగా దక్షిణాది మోతుబరులలోకూడా వ్యాపారంకన్న సైన్యంలో పనిచేసినవారెక్కువమంది ఉన్నారు. వెస్ట్‌పాయింట్ వద్దనున్న సైనికశిక్షణ కళాశాలలో ఉత్తీర్ణులైన పట్టభద్రులలో ప్రముఖులూ, అధికసంఖ్యాకులూ రాబర్ట్‌లీ, టి. జె. జాక్సన్ మొదలైన దాక్షిణాత్యులు. కనుక దక్షిణాది సైన్యాలకు వీరి సమర్థ నాయకత్వం లభించింది. చివరకు దక్షిణాదివారికి అంగబలం తక్కువైనా వారికి బానిసలు ఉన్నందువలన తమ ఇంటిపనులు వారికి అప్పగించి, తెల్లవారంతా యుద్ధంలో పాల్గొనడానికి వీలయింది

అంతర్యుద్ధంలో మొదటి సగం ప్రధానంగా తూర్పున వర్జీనియాలోను, పశ్చిమాన మిస్సిసిపీ నదీతీరం వెంబడినీ జరిగింది. వర్జీనియా విడిపోగానే వాషింగ్టన్‌కి దక్షిణాన నూరుమైళ్ళ దూరంలో ఉన్న రిచ్‌మండ్ పట్టణం దక్షిణాత్య సమాఖ్యకు రాజధాని అయింది. "రిచ్‌మండ్ చలో!" అనే ఉత్సాహపూరిత నినాదంతో ఉత్తరాది వారు 30,000 వేల సైన్యాన్ని వర్జీనియాలోకి పంపారు. వీరికి, ఇంచుమించు ఇంతే ఉన్న తిరుగుబాటుదార్ల సైన్యానికీ 1861 జూలై 21 వ తేదీన బుల్‌రన్ వద్ద మొట్టమొదటి పెద్దయుద్ధం జరిగింది.

ఈ దండయాత్ర సైనికపరోగమనంగాగాక దక్షిణాదికి వినోద యాత్ర అనే ధోరణిలో సమాఖ్యావాదులు వ్యవహరించారు. కాంగ్రెసు ప్రతినిధులు తమభార్యలతో సహా వనభోజనాలకు పోతున్నట్లు ఈ దండయాత్రపరులవెంట వెళ్లారు. కాని, అచిరకాలంలోనే ఈ విందు ధోరణి భయంకరాందోళనగా పరిణమించింది. హోరాహోరీ పోరాటం జరిగి ఉత్తరాదివారికి ఘోర పరాజయం సంభవించింది. పోగా మిగిలిన వారు కాంగ్రెసు సభ్యులతోసహా చెల్లాచెదరై 'బ్రతుకు జీవుడా' అని వాషింగ్టన్‌కి పారిపోయారు.

కాని, ఉత్తరాదివారు మళ్ళీ దృఢదీక్షతో ఇంకా ఎక్కువ సైన్యాన్ని సమకూర్చారు. ప్రెసిడెంట్ లింకన్ ప్రతిభాశాలిగా కనిపించిన వెస్ట్‌పాయింట్ సైనిక నిపుణుడు జార్జిమక్లెల్లానును సేనాపతిగా నియమించాడు. ఇతడు పాటోమెక్ సైన్యంతో మరొకసారి రిచ్‌మండ్‌పై దండయాత్రకు బయలుదేరాడు. గొప్ప సంధాననిపుణుడైన మక్లెల్లాన్ తన అనుచరుల నందరికీ అత్యంతగౌరవాస్పదుడేగాని అతిభయస్థుడు. 1862 వసంత ఋతువులలో లక్షసేనను సముద్రం మీదుగా రిచ్‌మండ్‌కి తూర్పుగా దించుకొని దాక్షిణాత్యుల రాజధాని పొలిమేరలకు నడుపుకొనివెళ్లి తనసైన్యంలో సగం మాత్రమే ఉన్న లీ, జాక్సన్ సేనలను ఎదుర్కొన్నాడు. కాని, తీరా విజయం హస్తగతమవుతున్న సమయంలో అతడు ధైర్యం చెడి తనసేనను ఉపసంహరించుకొని వాషింగ్టన్‌కి తిరిగివెళ్ళిపోయాడు. పైగా, తనసైన్యంకన్న శత్రుసైన్యం హెచ్చుగా ఉండటమే ఈ పలాయనానికి కారణమని చెప్పాడు.

వైట్ హౌస్‌లో ప్రెసిడెంట్ లింకన్ తన ప్రధాన సేనాపతి చర్యకు నివ్వెరపోయాడు. మక్లెల్లాన్ నిర్లక్ష్యంతో ప్రెసిడెంట్‌పట్ల నిరసనభావంకూడా ప్రదర్శించాడు, పైగా, అతడు తీవ్రమైన డెమొక్రాట్ అవడంవల్ల దాక్షిణాత్యులపట్ల సానుభూతితో వ్యవహరిస్తున్నాడనే అనుమానంకూడా ఉన్నది. మరొక సమర్థుడైన సేనాపతి దొరికితే యితణ్ణి ఆ స్థానంలోంచి తప్పించడానికి లింకన్ వేచియున్నాడు.

రాజనైతిక వ్యవహారాలుకూడా లింకన్ చాలా చిరాకుకలిగిస్తున్నవి. బ్రిటిష్ ప్రభుత్వం అగ్రవర్గాలవారు తమతో సన్నిహిత

సాంస్కృతిక వాణిజ్యసంబంధాలుగల దాక్షిణాత్యులపట్ల సానుభూతి ప్రకటిస్తున్నారు. దాక్షిణాది నౌకాశ్రయాలనుండి ఇంగ్లండుకు పంపబడవలసిన ప్రత్తి మొదలయిన సరఫరాలు వెళ్ళకుండా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం సముద్రమార్గాన్ని సమర్థంగా బంధించి వేయడంవల్ల బ్రిటన్‌కీ సంయుక్తరాష్ట్రాలకుమధ్య వైమనస్యం మరింత వృద్ధిఅయింది. సంయుక్తరాష్ట్రాలకు చెందిన ఒక యుద్ధనౌక ఇద్దరు దాక్షిణాత్య సమాఖ్యా రాయబారులతో సహా పోతున్న ఒక బ్రిటిషు స్టీమర్‌ను అటకాయించి ఆ రాయబారులను అందులోనుండి దించి తీసుకొనివచ్చి బోస్టన్‌లో బంధించేసరికి, పరిస్థితి మరీ విషమించింది. సముద్రాలపైన తనహక్కులకు భంగం కలిగించినందుకు బ్రిటను తీవ్ర నిరసనతెచ్చి యుద్ధంచేస్తానని కూడా బెదిరించింది.

విదేశాల్లో ప్రముఖదేశమేదైనా శత్రువులకు మద్దత్తుచేస్తే పరిస్థితి విషమించగలదని సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం గ్రహించింది. వెంటనే లింకన్ ఆ రాయబారు లిద్దరినీ విడుదలచేసి బ్రిటన్‌కి క్షమాపణ తెలిపాడు. నిజానికి, ఈ చర్యకూడా బ్రిటన్‌కి సంతృప్తికలిగించి ఉండేదికాదు. కాని, ఆంగ్లకార్మికులంతా బానిసత్వపద్ధతిపై యుద్ధం చేస్తున్న ఉత్తరాదిపట్లనే సానుభూతి ప్రకటించడంవల్ల బ్రిటను సద్దుకొని ఊరుకొన్నది.

సముద్రంమీద ఉత్తరాదివారి బలాధిక్యం పూర్వమైనే ఉన్నది కాని ఇనుప కవచంగల "మెర్రిమాక్" అనే నౌకతో తాత్కాలింగా కొంతకాలం మాత్రం దాక్షిణాత్యులు తమ నౌకాదళప్రాబల్యం ప్రకటించారు. కాని ఉత్తరాది సమాఖ్యావాదులు వెంటనే, గిరగిరతిరిగే, ఫిరంగులమర్చిన గోపురంకూడా ఉన్న ఇనుప కవచంగల "మానిటార్" అనే నౌకతో దాని ఆట కట్టించి, న్యూఆర్లియన్స్ పైనదాడిచేసి దానిని పట్టుకొనడానికిగాను ఒక నౌకాదళాన్ని పంపారు.

ఈలోగా, పశ్చిమయుద్ధరంగంలో సమాఖ్యావాదుల ఫిరంగిపడవలతోసహా, యులిసెస్ గ్రాంటు అనే సేనాని మిస్సిసిపీనదిమీదుగా దక్షిణాదిప్రాంతం లోపలికంటా చొచ్చుకొనిపోతున్నాడు. షైలో వద్ద చాలానష్టపడి సంపాదించిన విజయానంతరం ఇతడు ఇంకా ముం

దుకు సాగిపోయి విక్స్‌బర్గ్‌ని ముట్టడించారు. అప్పటికి ఇంచుమించు మిస్సిసిపీనది యావత్తు సమాఖ్యావాదుల వశంలోకి వచ్చింది. అనంతరం గ్రాంటు సైనిక జీవితం త్రాగుబోతుతనంవల్ల భగ్నమైపోయినప్పటికీ అతడు జాతీయవీరుడైనాడు.

ఈ విధంగా పశ్చిమరంగంలో గ్రాంటువిజయంపైన విజయం సాధిస్తూఉండగా, తూర్పున ఉత్తరాది సేనానులు పరాజయాలవెంట పరాజయాలు పొందారు. సమాఖ్యావాదుల పరిస్థితిని బలపరచగలిగే ఒక ప్రకటన చేయాలనీ ఒక ముఖ్యమైన విజయం లభించగానే దాన్ని విడుదలచేయాలనీ ఎదురుచూస్తున్న లింకన్‌కి ఈ పరిస్థితులు మరింత చిరాకు కలిగించినవి.

ఈ అంతర్యుద్ధలక్ష్యం కేవలం సంయుక్తరాష్ట్ర సమాఖ్యను కాపాడడమే కాదనీ, దక్షిణాది బానిసలందరికీ విమోచనం కలిగించకుండా అనీ స్పష్టంగా ప్రకటించాలంటూ ఉత్తరాది బానిసత్వనిర్మూలనవాదులు చేసే హెచ్చరికను గుర్తించవలసిన సమయం వచ్చింది. సమాఖ్యను కాపాడడమే లోగడ లింకన్ లక్ష్యం; అందువలన, "ఒక్క బానిసకుకూడా విముక్తి కలిగించకుండా నేను సమాఖ్యను కాపాడగలిగితే, ఆ పనే చేస్తాను; బానిసలందరికీ విముక్తి కలిగించి సమాఖ్యను కాపాడగలిగితే ఆ పనేచేస్తాను," అని ఆయన లోగడ ప్రకటించాడు. కాని ఇప్పుడు, 1862 లో బానిసలందరికీ విముక్తి కలిగించడమే సమాఖ్యకు సర్వవిధాలా శ్రేయస్కరం. దానివల్ల ఉత్తరాదివారిలో ఐకమత్యం సిద్ధిస్తుంది. ప్రపంచప్రజలందరి సానుభూతి లభిస్తుంది. విదేశాల సహాయం సంపాదించాలనే దాక్షిణాత్యుల ఆశలు అడుగంటిపోతవి.

తూర్పున ఒకవంక దక్షిణాదిసేనలు విజయం వెంట విజయం సాధిస్తూ ఉండగా, దక్షిణాదినగల బానిసలంతా స్వతంత్రులని ప్రకటించడం కేవలం ప్రయోజనంలేని పని అవుతుంది. అందుచేత, జెనరల్ మక్లెల్లాన్ ఆంటిటమ్ యుద్ధంలో దక్షిణాదివారి భారీదాడిని తిరుగకొట్టేవరకు, లింకన్ కనిపెట్టుకొని కూర్చున్నాడు. 1863 జనవరి 1వ తేదీన "బానిసవిమోచన ప్రకటన" చేశాడు. నాటినుండి సమాఖ్యపై తిరుగుబాటుచేసిన రాష్ట్రాలలోని "బానిసలందరూ విముక్తిపొంది స్వతంత్రులైనట్లు" ఆ ప్రకటనలో వివరించాడు.

నిజానికి ఈ "విమోచన ప్రకటన" భవిష్యత్తులో అమలుజరుగ తగిన వాగ్దానంమాత్రమే. అసలు దాక్షిణాత్యులు ఇంకా ఓడిపోలేదు. పైగా, ఆ ప్రకటన రాజ్యాంగసమ్మతమైనది కాదు. విజయం సాధించిన తరువాత బానిసత్వాన్ని రద్దుచేస్తూ రాజ్యాంగంలో దానికి అవసరమైన సవరణలు చేయాలి. కాని బానిసలుగా బ్రతుకుతున్న ఐదులక్షల మంది అమెరికనులకు దాస్యవిమోచనం కలిగిస్తామనే ఉదాత్తాశయాన్ని ఈ ప్రకటనలో విశదీకరించడంవల్ల, లింకన్ ఆశించిన ఫలితం పుష్కలంగా సిద్ధించింది. అమెరికా సంయుక్తరాష్ట్ర సమాఖ్య చేస్తూన్న యుద్ధం ఉదాత్తమయిన ధర్మయుద్ధమయింది.

కాని, అచిరకాలంలోనే ఈ ఆనందానికి, అంతరాయం కలిగింది, ఆంటీటమ్ యుద్ధానంతరం, మక్లెల్లాన్ తిరిగి వెనుకంజవేయడం మొదలు పెట్టాడు. ప్రెసిడెంట్ లింకన్‌కి ప్రాణం విసిగి అతన్ని తొలగించి సాహసోపేతులైన ఇతర సేనాపతులకు ఆ బాధ్యతలు అప్పగించాడు. సమాఖ్యా సైన్యం మళ్ళీ వర్జీనియాపై దాడిచేసింది. కాని ఫ్రెడెరిక్స్ బర్గ, ఛాన్సెలర్స్ విల్లీలవద్ద ఘోరవినాశానికి గురి కావలసివచ్చింది. ఆ పలాయితులనుకూడా జెనరల్ లీ వెంటపడి తరిమికొడుతూ ఉండగా సమాఖ్యాసైన్యం తిరిగి పెన్సిల్వేనియాలోని గెట్టిస్‌బర్గవద్ద లీ సేనలను ఎదిరించినవి. ఉత్తరాదివారు తమ బ్రతుకులకోసం పోరాడవలసి వచ్చింది. శత్రువులు తమగడ్డమీద కేవచ్చి పోరాడుతున్నారు. ఇక్కడ మరొక పరాజయంపొందితే యుద్ధం ముగిసిపోవడం దక్షిణాదిరాష్ట్రాల స్వాతంత్ర్యం సుస్థాపితమవడం తప్పదనే స్థితికి వచ్చింది.

గెట్టిస్‌బర్గ్‌వద్ద జెనరల్ లీ నాయకత్వాన తెల్లని స్వదేశపు వదులునూలు యూనిఫారములలో 75,000 మంది సుశిక్షితవీరులు, జెనరల్ జార్జిమీడ్ నాయకత్వాన సమీకృతమయిన సుమారు 90,000 మంది నీలపు యూనిఫారం వీరులను ఎదుర్కొన్నారు. 1863 జూలై ఒకటి, రెండు తేదీలలో దాక్షిణాత్యునిసేనదే పైచేయిగా ఉంది; రెండుప్రక్కల సమాఖ్యాసైన్యాన్ని వెనుకకు తరిమి కొట్టాడు. జూలై 3 వ తేదీన జెనరల్ లీ సునిశ్చితమైన విజయం సాధించాలనే ఆదుర్దాలో సిమెటరీరిడ్జ్‌వద్ద కందకాలు త్రవ్వుకొని బలంగాఉన్న సమాఖ్యాసైన్యశ్రేణి మధ్యభాగాన్నే ఎదుర్కోవలసినదిగా ఆయిజ్ఞచ్చాడు.

యుద్ధచరిత్రలో అత్యంత సాహసోపేతమైన, విచిత్రమైన ఒక దండయాత్రలో జెనరల్ జార్జి పికెట్ దక్షిణాదిసైన్య మంతటిలోకీ శ్రేష్ఠమైన కుమారాఖ్యా సైనికశ్రేణిపైన "విజయమో వీరస్వర్గమో" అనే ధోరణిలో తీవ్రమైన దాడిచేశాడు. మొదట లెక్క ప్రకారం ముందుకు నడిచి, తరువాత వేగంగా శత్రువులు దారుణంగా కాలుస్తున్నా లెక్క చేయకుండా వారి శ్రేణులను దాటి కొండపైకిపోయి కొంతసేపు కొండపైన "చుక్కలు చారలు" జెండాప్రక్కన తమ "చుక్కలు-నిలువుగీతల" జెండాకూడా ఎగురవేశారు. కాని యుద్ధం తీవ్రతమ రూపం దాల్చేసరికి తెల్ల యూనిఫారాలు, నీలియూనిఫారాల సైనికు లంతా కలసిపోయి; కత్తివ్రేటులతో, తుపాకికొసకత్తుల పోట్లతో బాహాబాహియుద్ధం ప్రారంభమయింది. ఉత్తరాదివారికి అదనపు సైన్యాలుకూడా సాయంవచ్చిపడినవి, చివరికి, భీకరనష్టాలపాలయిన తరువాత దాక్షిణాత్యులు వెనుకంజవేసి మెల్లగా కొండదిగువకు ఉప సంహరించుకొన్నారు. గెట్టిస్‌బర్గ్‌యుద్ధం పూర్తి అయిపోయింది. దాక్షిణాత్యులవలన యుద్ధభయం అంతమైపోయింది.

జూలై 4వ తేదీన, ఉత్తరాది అంతట స్వాతంత్ర్యదినోత్సవం మహావైభవముతో జరుపబడింది. దీనికి కారణం: ఒక్క గెట్టిస్‌బర్గ్ విజయవార్తేకాదు. దీనికితోడు, పశ్చిమయుద్ధరంగాలనుండికూడా వేరొకగొప్ప విజయవార్త వచ్చింది. జెనరల్ గ్రాంట్ ముట్టడిలో విక్స్‌బర్గ్ పౌరులు ఆహారపదార్థాలకొరతకు బాధపడి, చివరకు లొంగి పోయారు. మిస్సిసిపీనది యావత్తూ ఉత్తరాదివారివశమయింది ఆ నదికి పశ్చిమానఉన్న దక్షిణాది రాష్ట్రాలకు తూర్పురాష్ట్రాలతో సంబంధం తెగిపోయింది ఆపైన, గ్రాంట్ తనవద్దగల పెద్దపెద్ద దళాలను తూర్పుప్రాంతాలలో దాడులలో పాల్గొనడానికి పంపగలిగాడు.

ఈ అంతర్యుద్ధానికి గెట్టిస్‌బర్గ్ యుద్ధమే కీలకమయింది. తరువాత రెండుసంవత్సరాలకు తీవ్రసంఘర్షణలు జరుగుతూనే ఉన్నప్పటికీ, ఈ యుద్ధమే అంతిమఫలితానికి సూచిక అయింది 1863 ఆకురాలుకాలంలో గెట్టిస్‌బర్గ్ యుద్ధరంగం జాతీయశ్మశానంగా ప్రకటించబడింది. ప్రెసి డెంట్ లింకన్ స్వయంగా ఆ ప్రదేశానికివెళ్ళి చేసిన సుప్రసిద్ధమైన ఉపన్యాసంలో ఈ ప్రకటనచేశాడు. అమెరికా వాఙ్మయంలో అమర

స్థానం కలిగిన ఈ గెట్టిస్‌బర్గ్ ప్రసంగంలో లింకన్ మరణించినవారి త్యాగాలకు యోగ్యమైన సత్కారం జరుగగలదని ఉత్తరాదివారి పక్షాన హామీయిస్తూ ప్రసంగాన్ని యిలా ముగించాడు :- "ఈ మరణించినవారి త్యాగాలను వ్యర్థంకానీయమనీ, భగవంతుని పర్యవేక్షణలో ఈ జాతి స్వతంత్రజాతిగా పునర్జన్మ ఎత్తుతున్నదనీ, ప్రజలకొరకు-ప్రజలు ఏర్పరచుకొన్న ప్రజాప్రభుత్వం అనేది ఈ భూలోకంలో శాశ్వతంగా నిలిచి ఉండగలదనీ,- ఇక్కడ మనమందరం ఎలుగెత్తి తీర్మానిస్తున్నాము."

* * *

ఇక ఈ అంతర్యుద్ధ ద్వితీయభాగం, పరాజయాన్ని ఒప్పుకొనడానికి సమ్మతింపని శత్రువును పూర్తిగా తుడిచిపెట్టడానికి ఉత్తరాదివారు దీక్షతో చేసిన ప్రయత్నాలగాథ. సమాఖ్యాప్రభుత్వ సైనిక ప్రణాళిక చాలా ముఖ్యమైనది. పాటోమెక్ సైన్యం వర్జినియాగుండా ఇంకా దక్షిణాదికి చొచ్చుకొనిపోయి రిచ్‌మండ్‌ని పట్టుకొనడం, గ్రాంట్ తన సేనలతో దాక్షిణాత్య సేనలపై పశ్చిమదిశనుండి దాడిచేసి తూర్పు టెన్నెసీ, జార్జియాలను పట్టుకొనడం ప్రధాన కార్యక్రమాలు.

జెనరల్ గ్రాంటే తాను కోరుకుంటూన్న రకం సర్వసైన్యాధిపతి అన్న సంగతి, చివరకు లింకన్ గ్రహించాడు. సాహసం, దృఢదీక్ష, ఉత్తరాదివారికి అధికంగా ఉన్న అంగబలాన్ని సాధనసంపత్తిని సక్రమంగా వాడుకొనగల నైపుణ్యం గ్రాంట్‌లో ఉన్నవి. గ్రాంట్ చట్టనూగావద్ద సాధించిన ఘనవిజయంతో తూర్పు టెన్నెసీపై ఆధిపత్యం సంపాదించిన వెంటనే లింకన్ అతన్ని ఉత్తరాది సైన్యాలన్నిటికీ సేనాపతిగా నియమించి, వెంటనే అపహాయకూయడగు లీని ఎదుర్కొనడానికి అతణ్ణి వర్జినియాకు బదిలీ చేసాడు. యుద్ధం ప్రారంభంనుండీ గ్రాంట్‌కి సహాయంగా పనిచేయుచుండిన విలియం టికంసే షర్మన్, టెన్నెసీ సైన్యాధిపతియై అట్లాంటా, జార్జియాపైకి దండయాత్ర సాగించాడు.

జనరల్ గ్రాంట్ 1864 లో రిచ్‌మండ్‌పై గట్టిదెబ్బ తీయ డానికై బయలుదేరాడుగాని, సఫలుడు కాకపోగా, చాలా నష్టాలకు గురి అయ్యాడు. లీ అతణ్ని అద్భుతంగా అరికట్టి, విల్డర్నెస్, స్పాట్సీ ల్వేనియా, కోల్డ్‌హార్బర్ల వద్దను, పిమ్మట గ్రాంటు దక్షిణంగా రిచ్ మండ్‌ని చుట్టవేసి నప్పుడు పిటర్స్‌బర్గువద్దనూ, అతడికి చాలానష్టాలు కలుగజేశాడు. అయితే, గ్రాంటు విజయం సంపాదించకపోయినా వెనుకంజ వేయలేదు. లీకి అదనపుసైన్యాలు సాయంవచ్చే అవకాశం లేకపోవడంవల్ల క్రమంగా గ్రాంటుసైన్యం ధాటికి తట్టుకోలేక పోతున్నాడు.

ఈ స్థితిలో 1864 లో ఉత్తరాదిన ప్రెసిడెంటు ఎన్నికజరిగింది. రిపబ్లికన్‌లు తిరిగి లింకన్ నే తమ అభ్యర్థిగా నియమించారు. డెమొక్రాట్లు లోగడ ప్రెసిడెంటుతో పోరాడిన పూర్వసర్వసేనాపతి అయిన జెనరల్ జార్జి మక్లెలాన్‌ను తమ అభ్యర్థిగా పేర్కొన్నారు. లింకన్ చెపుతున్నట్లు ఎన్నికష్టనష్టాలకైనా సహించి చివరవరకు యుద్ధం సాగించడమా, డెమొక్రాట్లు కోరుతున్నట్లు సంధికై రాయ బారాలు జరిపి యుద్ధాన్ని ముగించడమా అనేదే ఈ ఎన్నికలలో ప్రధానసమస్య అయినది. గ్రాంట్ ఎంతకీ లీని ఓడించలేకపోతూన్నం దువల్ల ఈ ఎన్నిక ఫలితాన్నిగురించి ఆదిలో లింకన్ కొంత ఆందోళన పడినప్పటికీ, సులభంగా తిరిగి ఎన్నిక అయాడు.

ఇక ఈ దారుణసంగ్రామం పూర్తికావస్తూంది. "యుద్ధమే నరకం" అన్న సూక్తిని రచించిన జెనరల్ షర్మన్ తన సూక్తికి వ్యాఖ్యానంగా జార్జియాలో విశేష పరశురామప్రీతి చేశాడు. పిమ్మట అడ్డంవచ్చిన శత్రువులను హతమారుస్తూ అట్లాంటాకు చేరుకొని అచటి నుండి దిగువను మూడువందలమైళ్ళ దూరాన ఉన్న సావన్నాకుబయలు దేరాడు. దారిలో అతడిని ప్రతిఘటించినవారు లేరు. తనకు అడ్డం వచ్చిన సర్వాన్నీ అతడు దహించి నాశనం చేసుకుంటూ పోయాడు. సావన్నానుండి అతడు ఉత్తరదక్షిణ కెరోలినా రాష్ట్రాలగుండా పోతూ అనిర్దాక్షిణ్య విధానాలనే అనుసరిస్తూ వర్జినియాలో గ్రాంట్‌ని కలుసుకొనడానికి పోతూ ఉండగా, రిచ్‌మండ్ పూర్తిగా లొంగి పోయింది. తన పట్టుదలవలన ప్రయోజనం లేదనే సంగతి గ్రహించిన

లీ, తన ఉత్తర వర్జీనియా సేనను ఎపోమెటక్స్‌వద్ద 1865 ఏప్రిల్ 9వ తేదీన గ్రాంట్‌కి అప్పగించాడు. దాంతో యుద్ధం ముగిసిపోయింది.

నాలుగేళ్ళపాటు జరిగిన ఈ దారుణయుద్ధంవలన అమెరికనులకు అపారమైన నష్టాలు కలిగినవి. యువకులెందరో యుద్ధాగ్ని గుండంలో ఆహుతి అయిపోయారు. ఆస్తిపాస్తులకు అపారమైన నష్టం కలిగింది. ఉత్తరసమాఖ్యావాదుల పక్షాన 3,60,000 మందికి (దాదాపు ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామంలో సంయుక్తరాష్ట్రాలకు కలిగినంత) ప్రాణ నష్టం కలిగింది. ఇక దక్షిణాదివారికి ప్రాణనష్టమే కాదు. వారి ఇళ్ళూ వాకిళ్ళూ, పశుపక్ష్యాదులూ, రవాణాసౌకర్యాలు - సర్వం నాశనమైనవి. సుమారు నూరుకోట్ల డాలర్ల ఖరీదుచేసే దక్షిణాది బానిసలు వారి యజమానులకు పరిహారమేమీ ఇవ్వకుండా విడుదల చేయబడ్డారు.

ఆ పైన, తాను ఎదుర్కొనవలసిన సమస్యలన్నిటినీ సక్రమంగా గ్రహించిన ప్రెసిడెంటు లింకన్ రెండవసారి ప్రెసిడెంటుగా ఎన్నిక అయినపుడు పదవీస్వీకరణోత్సవ ప్రసంగంలో ఇలా చెప్పాడు. "ఎవరి పట్లను ఏవిధమైన ద్వేషం లేకుండా అందరిపట్లను ఉదారభావంతో- మనం తలపెట్టిన కార్యక్రమాన్ని కడకంటా నిర్వహిద్దాం; ఈ యుద్ధంలో మన జాతికి తగిలిన గాయాలను సాధ్యమైనంత త్వరలో మాన్పుకొనడానికి యత్నిద్దాం." సులభతమమైన పునర్నిర్మాణ కార్యక్రమమేదైనా అనుసరించడానికి ప్రెసిడెంటు సంసిద్ధుడై ఉన్నాడు. ఉత్తరాది రిపబ్లికనులు చాలామంది దక్షిణాదిని జయింపబడిన దేశంగా పరిగణించి తగువిధంగా శిక్షించాలని ఆ రాష్ట్రాలు సమాఖ్యనుండి విడిపోవడం వలన సమాఖ్యలో లోగడ వాటికి ఉండిన హక్కులన్నిటినీ కోల్పోయినవనీ వాదించడం మొదలుపెట్టారు. ఈ వాదానికి లింకన్ ఒప్పుకోలేదు. ఏ రాష్ట్రంగాని సమాఖ్యలోనుండి విడిపోవడం అసంభవమని ఆయన తన ప్రథమ పదవీ స్వీకారోత్సవ సందేశంలో వెల్లడించిన అభిప్రాయాన్నే ఇప్పటికీ చెపుతున్నాడు. సమాఖ్యాధికారాన్ని ధిక్కరించినది దక్షిణాది రాష్ట్రాలు కావనీ ఎవరో కొందరు వ్యక్తులు మాత్రమే అనీ ఆయన నిర్వచనం. ఈ రాష్ట్రాలు తిరిగి సమాఖ్యలో భాగస్వాములుగా సహకరించడానికి ఇష్టపడేవారి చేతులలో ఉన్నప్పుడు వారిని మనం సంతోషంతో ఆహ్వానిస్తాం.

ఈ విధానానికి అనుగుణంగానే ప్రెసిడెంటు "నూటికి పదిపాళ్ళ పద్ధతి" ఏర్పాటుచేశాడు. దక్షిణాదినగల ఏరాష్ట్రంలోనైనా నూటికి పదివంతులవోటర్లు సమాఖ్యా ప్రభుత్వానికి, విధేయతతో మెలిగే ప్రభుత్వాని ఏర్పరచ గోరినట్లయితే, అట్టి రాష్ట్రాన్ని తిరిగి సమాఖ్యలో చేర్చుకొని, ఆ రాష్ట్ర ప్రతినిధులకు కాంగ్రెసులో ప్రాతినిధ్యం లభింపజేయాలని దీని అర్థం. సమాఖ్యాసైన్యాలచే ఆక్రమించుకొనబడిన టెన్నెసీ, ఆర్కన్సాస్, లుయీజియానా రాష్ట్రాలు ఈ విధంగా యుద్ధం పూర్తికాక పూర్వమే తిరిగి సమాఖ్యలో చేర్చుకొనబడినవి. లింకన్ తన స్నేహభావాన్ని ఇంకా విశదంగా వ్యక్తం చేయడానికిగాను, 1864 లో జరిగిన ఎన్నికలలో తనతోపాటు వైస్-ప్రెసిడెంటు పదవికి, టెన్నెసీ పూర్వగవర్నరు, సెనేటరూ అయిన ఆండ్రూ జాన్సన్‌ని అభ్యర్థిగా నిలిపి, తనతోపాటు అతనికికూడా విజయం సాధించాడు.

లింకన్ సూచించిన "నూటికి పదిపాళ్ళ పద్ధతి," రిపబ్లికన్ ప్రాబల్యంగల కాంగ్రెసులో చాలమంది రిపబ్లికన్లకే ఇష్టంలేకపోయింది. ఒకవేళ దక్షిణాది రాష్ట్రాలన్నీ ఆ విధంగా సులభంగా తిరిగి చేర్చుకొనబడేయెడల ఆ దక్షిణాదివారు ఉత్తరాది డెమొక్రాట్లతో కలిసి, రిపబ్లికన్లను ఓడించివేస్తారని వారి అనుమానం. అందువలన, దక్షిణాదివారిని దూరంగానే ఉంచాలనీ, పునర్నిర్మాణకార్యకలాపాలను కాంగ్రెసే నడిపించాలిగాని ప్రెసిడెంటు నడిపించకూడదనీ ఈ రిపబ్లికన్లు కోరుతున్నారు. లోగడ వేరే దాక్షిణాత్య సమాఖ్యను ఏర్పరచుకొన్న రాష్ట్రాలను శత్రుప్రాంతాలుగానే కాంగ్రెసు పరిగణించాలనీ, ప్రెసిడెంటు వాటిని క్షమించి తిరిగి అన్ని హక్కులతో సమాఖ్యలో చేర్చుకొనడానికి వీలులేదని వారు పట్టుపట్టారు.

కార్య నిర్వాహక శాఖకు, శాసననిర్మాణ శాఖకు నడుమ ఏర్పడిన ఈ పోరాటంలో లింకన్ విజయం సాధించగలడా అన్న ప్రశ్న ఎన్నటికీ ప్రత్యుత్తరంరాని ప్రశ్న అయిపోయింది. అంతర్యుద్ధం అంతమైపోయిన ఐదురోజులకు, ప్రెసిడెంట్ లింకన్, ఆయన భార్య ఫోర్డ్స్ నాటకశాలలో బాక్సులో కూర్చుని నాటకం చూస్తూఉండగా జాన్ విల్క్స్ బూత్ అనే మతిచెడిన ఒక నటుడు ఆయన వెనుకకువచ్చి నిల

బడి, ఆయన తలకు సూటిగా తుపాకి కాల్చి ఏదో పిచ్చికేకలు వేసు కుంటూ పారిపోయాడు. అనంతరం బూత్‌ని ఒక ధాన్యపుకొటారంలో కనుగొని, అతడు లొంగిపోవడానికి నిరాకరించినందున కాల్చి చంపి వేశారు.

ప్రెసిడెంట్ లింకన్ ఆ గాయంతో మరునాడు ఉదయం మర ణించాడు. ఉత్తరాది యావత్తూ దుఃఖమేఘాచ్ఛాదితమై పోయింది. సౌమ్యుడైన, వివేక సంపన్నుడైన, మహానాయకుడు అస్తమించాడు. ఈ దుస్సంఘటనకు దాక్షిణాత్యులుకూడా విశేషంగా దుఃఖించారు. ఆ భయంకర పరిస్థితులలో తమకు లింకన్ చేయగలిగిన సహాయమంతా చేసి ఉండేవాడని వారు గ్రహించారు.

క్రొత్త ప్రెసిడెంట్ ఆండ్రూ జాన్‌సన్ నాయకత్వాన ఆ జాతి గాయాలతో, నొప్పులతో మెల్లగా కుంటుకుంటూ ముందరికి సాగింది. కాని, రాష్ట్ర ప్రభుత్వాలన్నిటికన్న సమాఖ్యా ప్రభుత్వాధికారం ప్రధానమన్నసూత్రం మాత్రం దృఢతరంగా ప్రతిష్ఠితమయింది.



# రెండవ భాగము

## ఉపోద్ఘాతము

అంతర్యుద్ధం ముగిసిపోవడంతో, అమెరికా చరిత్రలో తొలి సగ భాగం పూర్తి అయింది. ఈ సమయంలో అమెరికా సంయుక్తరాష్ట్రమనే ఈ జాతికి పునాదులు వేయబడడం, ప్రజాస్వామ్య వైయక్తిక వాదం (Democratic Individualism) అనే విలక్షణమైన జాతీయ శీలం రూపొందడం,- జరిగింది. అమెరికాస్థితి, పారిశ్రామికంగా బాగా వృద్ధిపొందుతూన్న ఉత్తరాదినకూడా, పంధొమ్మిదవ శతాబ్ది మధ్య భాగంలో వ్యవసాయ ప్రాముఖ్యంగలదిగానే ఉండేది. వాణిజ్యానికి ఎక్కడో కొన్ని పరిమిత ప్రాంతాలలో మాత్రమే ప్రాధాన్యం ఉండేది. అప్పటికీ, ఎర్ర ఇండియనులచే కౌలుకి చేయబడుతూన్న పడమటి మైదానాలు క్రొత్తవలసదార్లను ఆహ్వానిస్తున్నవి.

1865 తరువాత, చరిత్రగతి మారిపోతుంది. వలసదారులు తండోపతండాలుగా, మహాప్రవాహంగా వచ్చి పడతారు. గొప్పగొప్ప నగరాలు లేవడం, పరిశ్రమలు విస్తృతంగా అభివృద్ధిచెందడం; నూతన యంత్ర నిర్మాణాలూ, పరిశోధనలూ, వేగంగా పెరిగిపోతూన్న జనాభా పారిశ్రామికాభ్యుదయానికి దోహదంచేస్తాయి. గనులనుండి బొగ్గుత్రవ్వి తీయడం, ఇనుము ఉక్కు పరికరాలు ఉత్పత్తిచేయడం పెరుగుతూన్న పరిశ్రమలకు విశేషంగా సహాయపడతాయి. భూమిలోనుండి కోట్ల కొలది పీపాల నూనె పైకి తీయబడుతుంది. రైలుదారులు దేశమంతటా, ఈ తీరంనుండి ఆ తీరంవరకూ వలలు వలలుగా అల్లుకొనిపోతాయి. దీపాలకూ, యంత్రాలు నడపడానికీ, శీఘ్రప్రయాణ సాధనాలకూ విద్యుచ్ఛక్తి వాడబడుతుంది.

ఈ విధంగా, అమెరికాలోని అపార సహజసంపదలను వినియోగించుకొనగలుతున్నకొలది, తెలివైన పెట్టుబడిదార్లు, వ్యాపారస్తులు, మహైశ్వర్యవంతులయిపోతారు. పెట్టుబడిదారులకు, కార్మికులకు తీవ్రతరమైన సువ్యవస్థిత సంఘర్షణలు ప్రారంభమవుతాయి. తమ ఆస్తిని తమ ఇష్టం వచ్చినట్టు వాడుకొనడానికి తమకు హక్కు ఉన్న

దని పెట్టుబడిదారులూ, తమకు హెచ్చు వేతనాలు, ఇతర సౌకర్యాలూ కలుగజేయాలని కార్మికులూ వివాదపడతారు. చిన్నవర్తకులు, చిన్న పారిశ్రామికులుకూడా ఈ సంరంభంలో స్వేచ్ఛగా వ్యాపారాలు వృద్ధి చేసుకుంటారు.

అట్లాంటిక్ తీరంనుండి పసిఫిక్ తీరంవరకూ అమెరికా సంయుక్త రాష్ట్రమంతటా వలసలు వెలసినవి. 1900వ సంవత్సరంనాటికి జనాభా ఏడుకోట్ల, అరవై లక్షలకు పెరిగింది. ఈ సంఖ్య 1865 నాటి జనాభాకు రెట్టింపు. ఈ నూతన జాతికి అమెరికా ఖండంకూడా చాలలేదు. సముద్రాంతర ప్రాంతాలకోసం సామ్రాజ్యేచ్ఛగల ఇతర అగ్రరాజ్యాలతో పాటు పోటీకి దిగాలనే ఉబలాటంకూడా కలిగింది.

* * *

అంతర్యుద్ధం అపార కష్టనష్టాలకూ, రక్తపాతానికీ కారణమైనప్పటికీ, అమెరికా జాతిని నాశనం మాత్రం చేయలేదు. పైగా ఆ జాతిని మేల్కొల్పి జాతీయ శక్తియొక్క ప్రాధాన్యాన్ని గ్రహించేటట్టు చేసింది; వివిధ రంగాలలో అపూర్వ విజయాలను సాధించవలసినదిగా ఆ జాతిని ప్రోత్సహించింది. ఆధునికయుగం సమీపించింది.

—/—

# సప్తమ అధ్యాయం

## పునర్నిర్మాణం - స్వేచ్ఛావ్యాపారం

అల్పత్వం, భౌతికవాదం, ఆదర్శవాదం :- 1865–77 ల మధ్య అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వైరదీక్షతో సాగిన పునర్నిర్మాణ కార్యక్రమంలో ఈ మూడు స్వభావాలూ సమ్మిళితమై ఉన్నవి.

అంతర్యుద్ధానంతరం లింకన్ హత్యకారణంగా తలవనితలంపుగా దక్షిణాదివాడైన ఆండ్రూ జాన్సన్ ప్రెసిడెంటు అవడం సహజంగా తీవ్రఫలితాలకు హేతువయింది. టెన్నెసీవాసి, సమాఖ్యా ప్రభుత్వానికి విధేయుడూ అయిన ఈ అదృష్టహీనుడంటే ఉత్తరాదివారికీ, దక్షిణాదివారికీకూడా ఇష్టంలేకపోయింది. దక్షిణాది శ్వేతజాతి పేదవారిలో ఒకడైన ఇతడు స్వయంకృషివల్ల విద్యాభ్యాసంచేసి, పైకివచ్చిన బుజా

వర్తనుడు; కాని, కార్యదీక్షత గాని, నాయకుడికి అవసరమైన సామర్థ్యం గాని బొత్తిగా లేనివాడు.

జాన్సన్ హయాంలో జరిగిన రెండు సంఘటనలు మాత్రమే తీవ్ర విమర్శలకు గురికానివి. మొదటిది: సీవార్డ్ అనే ఆయన విదేశాంగ మంత్రి రష్యాదేశపు జార్ చక్రవర్తి వద్దనుండి డెబ్బయిలక్షల డాలర్లకు అలాస్కాను కొనడం; ఈ పనికి 20వ శతాబ్ది అమెరికనులు విశేష కృతజ్ఞత ప్రకటించవచ్చు. రెండవది: మన్రో సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టి, మెక్సికోలో నిర్భాగ్యుడగు మాక్సిమిలియన్ చక్రవర్తి పేరుమీదుగా కీలుబొమ్మప్రభుత్వాన్ని ఏర్పరచడానికి ప్రయత్నిస్తున్న ఫ్రెంచివారిని, వెంటనే అచటినుండి వైదొలగవలసినదిగా హెచ్చరించడం.

కాని, లింకన్ తలపెట్టిన పునర్నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరపడానికి జాన్సన్ ప్రయత్నించగానే, కాంగ్రెస్ అమితాగ్రహంతో అతనిపైకి లేచింది. క్రొత్తగా తిరిగి చేర్చుకొనబడిన దక్షిణాదిరాష్ట్రాలు పంపిన ప్రతినిధులలో చాలామంది తిరుగుబాటుదారుల ప్రభుత్వంలో పనిచేసిన "దేశద్రోహులు"గనుక వారికి ప్రవేశమీయడానికి కాంగ్రెస్ నిరాకరించింది. పైగా, ఈ రాష్ట్రాలలోని నూతన ప్రభుత్వాలు నీగ్రోల సంపూర్ణ స్వాతంత్ర్యానికి భంగకరమైన శాసనాలుచేసి, తిరిగి బానిసత్వ పద్ధతికి దారితీసే "తరిఫీదు" పద్ధతిని ప్రవేశపెట్టినవి. జాన్సన్ అభీష్టానికి భిన్నంగా, దక్షిణాది రాష్ట్రాలలోని పరిస్థితులను విచారించి, వెనక విడిపోయిన రాష్ట్రాలతో వ్యవహరింపదగిన "సక్రమ" విధానాన్ని సూచించడానికిగాను కాంగ్రెసు పదిహేనుగురు సభ్యులతో ఒక ఉపసంఘాన్ని నియమించింది.

సంయుక్తరాష్ట్రాలలోను, సంయుక్తరాష్ట్ర ప్రాంతాల్లోను, బానిసత్వాన్ని పూర్తిగా నిషేధిస్తూ రాజ్యాంగానికి చేయుబడిన 13వ సవరణ 1865 డిసెంబర్‌లో ఆమోదం పొందింది. దక్షిణాదిరాష్ట్రాలలోకూడా చాలాభాగం ఈ సవరణకు అనుకూలంగా వోటు చేసినవి. నీగ్రోలకు నాటినుండి శాసనరీత్యా విమోచనం లభించింది. కాని వారికి సంపూర్ణ పౌరసత్వం, వోటింగ్ హక్కు లభింపజేయవలసి ఉంది.

ఈ హక్కులు రాజ్యాంగానికి చేయుబడిన 14వ, 15వ సవరణలలో పేర్కొనబడినవి. పూర్వం బానిసలుగా ఉండిన వారందరికీ

సంపూర్ణ సమానత్వం ప్రసాదించబడింది; కాని, తిరుగుబాటులో పాల్గొన్న చాలామంది దాక్షిణాత్య సమాఖ్యా నాయకులకుమాత్రం వోటింగ్ హక్కు రద్దుచేయబడింది. ఈ 14వ సవరణ దక్షిణాదిరాష్ట్రాల ఆమోదానికి ప్రతిపాదింపబడినప్పుడు టెన్నెసీ తప్ప తక్కిన రాష్ట్రాలన్నీ దానిని నిరాకరించినవి. బలవంతంగా వాటిచే ఆమోదింపజేయడానికిగాను, కాంగ్రెసు 1867 లో నిష్ఠురమైన పునర్నిర్మాణ శాసనం చేసింది. దీనిప్రకారం, టెన్నెసీ మినహా, మిగిలిన తిరుగుబాటు చేసిన రాష్ట్రాలన్నీ మొత్తం ఐదు మిలిటరీ జిల్లాలుగా ఏర్పరచబడినవి. శాంతి భద్రతలను కాపాడడానికిగాను ప్రతిజిల్లాలో సమాఖ్యా సైన్యానికి చెందిన ఒక మేజర్ జెనరలూ, కొన్ని దళాలు పంపబడినవి. ప్రతి రాష్ట్రంలోనూ తెల్లవారు, నీగ్రోలుకలిసి నూతన ప్రభుత్వం ఏర్పరచాలి. ఈ 14వ సవరణ ఆమోదింపబడిన తరువాత ఈ రాష్ట్రాలకు సమాఖ్యలో స్థానం కల్గింప బడుతుంది.

ఈ పరిస్థితులలో ఏర్పడిన ప్రభుత్వాలకు, పూర్వపు ప్రభుత్వాలకు ఎక్కడా పోలికే లేదు. పూర్వపు రైతులను, వృత్తి తరగతులను చాలావరకు బహిష్కరించడంవలన రాష్ట్రశాసనసభలు సామాన్యంగా చదవడం వ్రాయడంకూడా రాని నీగ్రోలతోను, పల్లెటి దిక్కుల పేద రైతులతోనూ నింపబడినవి. వివిధ సమస్యలను పరిష్కరించడానికి వీరు దీక్షగా కృషిచేసినప్పటికీ, ఒక్కసారిగా తాము అధికారంలోకి రావడంవల్ల వారికి అంతా గందరగోళంగా ఉంది. ప్రభుత్వార్థిక వ్యవహారాలసంగతి ఏమీ తెలియని శాసనసభ్యులు ప్రభుత్వ కార్యక్రమాల కోసం, జీతాలకు, వ్యక్తిగత సౌకర్యాలకు పెద్ద పెద్ద మొత్తాలను మంజూరుచేయడం ప్రారంభించారు. ప్రభుత్వ ధనం ఈ విధంగా దుబారా అవుతుండడంతో దేశంలోని తెలివైన రాజకీయవేత్తలకు, అవినీతిపరులకు కన్ను పట్టింది. అమాయకులగు ఈ శాసనసభ్యులకు రాజకీయాలలో సలహాదారులుగా తయారయి తాము విత్తము వచ్చినట్టు సంపాదించుకొనవచ్చునని ఆశతో దూర రాష్ట్రాలనుండికూడా అలాంటివారు వచ్చారు. ఉత్తరాదినుండి వచ్చిన ఇట్టివారికి "తివాచి సంచులవారు" (Carpet baggers) అని పేరువచ్చింది. ఆతురతతో

వీరు తమకుగల ధనమంతటినీ పాత తివాచీ గుడ్డలతో తయారుచేసిన పెట్టెలలో నింపుకొని, దళారీవ్యాపారాలు చేయుడానికిగాను దక్షిణాదికి పరుగెత్తడంవలన వీరికా పేరు వచ్చింది. దక్షిణాదిలోనే ఉండిన ఇట్టి మోసకారులకు "స్కాలవాగ్స్" అని పేరు వచ్చింది.

అయితే, దక్షిణాదిన నీగ్రో స్వాతంత్రోద్యమంతో సంబంధంగల వారంతా దొంగలు, మోసకారులు కారు. విముక్తిపొందిన బానిసలకు చదువు సంధ్యలు చెప్పి, అమెరికా పౌరులుగా వారు తమ విద్యుక్తాలను సక్రమంగా నిర్వహించగలగడానికి సహాయపడేందుకు ఉపాధ్యాయులు తమంత తాముగా ముందుకువచ్చి మానవసేవాభావంతో కృషి చేస్తున్నారు. కాంగ్రెసు "ఫ్రీడ్ మెన్స్ బ్యూరో" (Freedmans Bureau) అనే విముక్తి పొందిన బానిసల సహాయసంస్థను నెలకొల్పింది. నీగ్రోలకు గృహవసతి ఏర్పాటుచేయడంలోను, వృత్తి, ఉద్యోగాలు సంపాదించిపెట్టి, వారి బ్రతుకులు వారు గడుపుకునేందుకు ఉపయోగపడే పనులను ప్రశంసనీయంగా నిర్వహించింది.

తిరిగి 1870 నాటికి దక్షిణాది రాష్ట్రాలన్నీ సమాఖ్యలో చేరినవి గాని, ఆ రాష్ట్రాలలో ఉంచబడిన సైన్యాలు, వైమనస్యాలూ మాత్రం యథాతథంగానే ఉన్నవి. ఈలోగా, రాజకీయాలలో నీగ్రోల బెడద తప్పించుకొనడానికి, ఎన్నికల సమయంలో వారిని వోటుచేయకుండా చేయుడానికీ, దక్షిణాదివారాపద్ధతి కనిపెట్టారు. శ్వేత జాత్యాధిక్యాన్ని సంరంక్షింప గోరినవారు, 'కుక్లక్స్‌క్లాన్' అనే రహస్యదౌర్జన్య సంస్థనొకదానిని ఏర్పాటుచేసి, పూర్వపు నీగ్రోబానిసలను చిత్రహింసలు, చిత్రవధలుచేసి, వారికి రాజకీయాల్లో పాల్గొనే ధైర్యంలేకుండా చేశారు. పరిస్థితులను మరింత ఘోరంచేయుడానికి", "స్కాలవాగ్స్" కూ కూడా ఇలాంటిశిక్షలే లభించినవి. అటుపిమ్మట తరతరాలుగా దక్షిణాది యావత్తూ ఉత్తరాదివారి పునర్నిర్మాణ విధానాలపట్ల నిరసనగా డెమక్రాటిక్ పార్టీకే మద్దతు చేసింది.

మరొకవంక, కాంగ్రెసులోని తీవ్రవాది రిపబ్లికనులు, దక్షిణాదిని తమ కార్యక్రమాలను పూర్తిగా అమలు జరుగనీయకుండా అడ్డు తగులుతున్నాడంటూ ప్రెసిడెంట్ జాన్సన్‌పైన శిక్షణ చర్యతీసుకోవాలని ప్రతిపాదించారు. ఇకడికి పూర్వంగాని, పిమ్మటగాని, ఏ ప్రెసి

డెంట్‌కి ఈ విధంగా "మహాపరాధాలకు, దుశ్చర్యలకు" గాను విచారింపబడే దుర్గతి పట్టలేదు. ప్రెసిడెంటు బలం తగ్గించి వేయడానికిగాను, ప్రెసిడెంటుకి తనమంత్రివర్గంలో తరుచు మార్పులుచేసే అధికారం కాంగ్రెసు రద్దుచేసింది. మంత్రివర్గంలో తన శత్రువైన యుద్ధమంత్రి స్టాంటన్‌ను తొలగించడానికి జాన్సన్ ప్రయత్నిస్తున్నందున కాంగ్రెసు ఈ పనిచేసింది. అయినప్పటికీ జాన్సన్ తన యుద్ధమంత్రిని బర్తరఫ్ చేసివేశాడు. ప్రధాన న్యాయమూర్తి చేస్ అధ్యక్షతక్రింద సెనేట్ సభ ప్రెసిడెంటు జాన్సన్‌ను విచారించింది. అవసరమైన మూడింట రెండు వంతులు వోట్లలో ఒక్కటి తక్కువ అయినందువలన ఈ అభియోగం వీగిపోయింది. మితవాదధోరణిలో లింకన్ పునర్నిర్మాణ విధానాలను అనుసరించిన ఈ ప్రెసిడెంటు తన పదవీకాలం పొడుగునా విద్వేషానికీ, విమర్శలకూ గురి అవుతూ గడపవలసి వచ్చింది.

నీగ్రో పౌరసత్వాల విషయంలో రిపబ్లికనుల ధోరణి ముఖ్యంగా రెండు అభిప్రాయాలపై ఆధారపడి ఉంది. మొదటిది: అందరికీ స్వాతంత్ర్యం ఉండాలన్న ఆశయం గలదనుకున్న జాతిలో బానిసత్వం, జాతీయ అసమానత్వం ఉండటం ప్రజాస్వామ్యంలోవిశ్వాసం గల సహృదయులు చాలామందికి ఏవగింపుగా ఉన్నది. కాబట్టి తాత్కాలికంగా కష్టాలు, ఇబ్బందులు ఎదుర్కొన్నప్పటికీ పూర్వపు బానిసలందరికీ వెంటనే పౌరసత్వపు హక్కులు కలిగించాలని వారు దృఢంగా కోరుతున్నారు. రెండవభావం రాజకీయ ఆర్థిక వ్యవహారాలకు సంబంధించినది: నీగ్రోలకు వోటింగ్ హక్కు కలిగిస్తే, ఉత్తరాదినా, దక్షిణాదినా కూడా శాశ్వతంగా రిపబ్లికనులకు అధిక సంఖ్యాబలం ఏర్పడి, డెమొక్రాట్ల ఆట పూర్తిగా కట్టుబడుతుంది. రిపబ్లికన్ పార్టీలో బానిసత్వవిమోచన వాదులకు, సంస్కరణవాదులకే కాదు, ఉత్తరాది పారిశ్రామికులకూ కూడా ప్రాధాన్యత ఉన్నది. యుద్ధాన్ని కొనసాగించడం కోసం ఈ పార్టీ పారిశ్రామికులతో చేతులు కలిపింది; ఈ పెట్టుబడి దారులకు వ్యవసాయదారులయెడ పక్షపాతం కలిగి, దిగుమతి సుంకాలు తగ్గింపదలచుకొన్న డెమొక్రాటు అధికారంలోకి రావడం సుతరామూ ఇష్టంలేదు.

ఆ పైన పదహారు సంవత్సరాలకు ప్రభుత్వాధికారం రిపబ్లికనుల చేతులలోనే ఉండిపోయింది. ఉత్తరాదివారి ప్రముఖ యుద్ధవీరుడు

జెనరల్ గ్రాంట్ రెండుటరములూ రిపబ్లికన్ ప్రెశిడెంట్‌గా పని చేశాడు. తరువాత వరుసగా రూథర్‌ఫర్డ్ హేజ్, జేమ్స్ గార్ ఫీల్డులు ప్రెశిడెంట్లయారు. గార్‌ఫీల్డ్ హత్యచేయబడినప్పుడు ఆచారానుసారం వైస్‌ప్రెసిడెంట్ చెస్టర్ ఆర్థర్ ప్రెసిడెం టయాడు.

* * *

అది అద్భుతమైన పారిశ్రామికాభ్యుదయకాలం. నూనె, ఉక్కు, రైలురోడ్లు ఈ అభ్యుదయ విస్తృతికి చిహ్నాలు. పారిశ్రామిక సంస్థలు వ్యాపార ప్రాబల్యంకోసం హోరాహోరీగా పోరాడుతుంటున్నవి. ఈ పోటీలలో గెలిచినవారు ఓడిపోయినవారి వ్యాపారాలనుకూడా స్వాయత్తం చేసుకొని "ట్రస్టు" అనే పేరిట పోటీలేని భారీ పారిశ్రామిక సంస్థలను స్థాపించుకొనేవారు. ఈ సంస్థలలో వాటాలు ప్రజలకు అమ్మడం మూలంగా, కొంతిపెట్టుబడి వసూలుచేసి లాభాలలో కొంతభాగం వారందరికీ పంచిపెట్టేవారు. అయితే, ఆ పరిశ్రమల మీద అధిపత్యం మాత్రం డైరెక్టర్లలో కొందరు వ్యాపారాన్ని న్యాయబుద్ధితో, ప్రజోపయోగకరంగా ఉండాలనే సదాశయంతో సాగించేవారు; మరికొందరు దానికి భిన్నంగా వ్యవహరించేవారు.

జెనరల్ గ్రాంటు శక్తిసామర్థ్యాలు యుద్ధరంగంలో మాత్రమే రాణించగలవనే సంగతి అచిరకాలంలోనే వ్యక్తమయింది. అతనికి వ్యాపార విషయాలతోగాని, రాజకీయాలతోగాని బొత్తిగా పరిచయం లేదు. అందువలన, ప్రెశిడెంటుగా, అతడు అమితమైన కలవరపాటు నెదుర్కొనవలసివచ్చింది. వ్యక్తిగతంగా ఋజువర్తనుడైన ఇతణ్ణి "తివాచి సంచులవాళ్ళూ" కుటిలవర్తనులైన రాజకీయ వేత్తలూ, ప్రముఖ ప్రభుత్వోద్యోగులకూ కాంగ్రెసువాదులకూ లంచాలు పెట్టి తమ పనులు చక్కబెట్టుకొనగల పెట్టుబడివార్లూ, కేవలం కీలుబొమ్మనిచేసి ఆడించేవారు.

ముఖ్యంగా, పశ్చిమ రైల్‌రోడ్ కంపెనీలు బాగా వృద్ధిలోకి వచ్చినవి. వారికి కాంగ్రెసు భారీగా ధనము స్థలముకూడా మంజూరు చేసింది. ఒక సందర్భంలో ఈ విధంగా రైలుదారి ప్రక్కన 470 లక్షల ఎకరాలస్థలం కాంగ్రెసు మంజూరు చేసింది. ఈ రైలురోడ్ కంపెనీలు ఈ స్థలాన్ని కొత్తవలసదార్లకు అమ్మడం, వారివద్ద డబ్బు

తీసుకొని కొలుకి ఇవ్వడం, ఇళ్ళూ పట్టణాలు కట్టించడం, ఆ విధంగా తమ రైళ్ళకు యాత్రికులను ఆకర్షించి వ్యాపారాన్ని, రాబడినీ వృద్ధి చేసుకొనడం జరుగుతూ ఉండేది. అంతేగాక, జేమ్సు హిల్, ఇ. హెచ్. హారిమన్ మొదలైన రైలుదారి ఆసాములు అట్టి భూము లలో స్వయంగా పెద్ద పెద్ద వ్యవసాయక్షేత్రాలను, గనులను, పరి శ్రమలను నెలకొల్పి దక్షిణాదిరాష్ట్రాల గవర్నర్లకంటె కూడ ఎక్కువ పలుకుబడిగల మోతుబరులుగా తయారయారు.

అమెరికా ఖండంలో ఈ తీరంనుండి ఆ తీరం వరకూ వేయబడిన మొట్టమొదటి రైలుదారి, 1869 లో యూటా రాష్ట్రంలోని అగ్డన్ వద్ద యూనియన్ పసిఫిక్ రైలుదారిని బంగారు సీలతో కలిపివేయ డంతో పూర్తి అయింది. నెబ్రాస్కా రాష్ట్రంలోని ఓ మహాపట్టణం నుండి పశ్చిమాన కాలిఫోర్నియా రాష్ట్ర రాజధాని; శాక్రమెంటో దాకా ఈ రైలుదారిని క్రొత్తగా నిర్మించడంతో తూరుపు తీరాన న్యూయార్కు నుండి పశ్చిమతీరాన శాన్‌ఫ్రాన్‌సిస్కోవరకూ రైలుమీద ప్రయాణం చెయ్యడానికీ, సరుకులను రవాణా చెయ్యడానికీ సౌకర్యం ఏర్పడింది. ఈ రైలుదారి వేయడంలో అనేక నిర్జనారణ్యాలలో, ఎడారులలో, పర్వతాలలో, నెలలు, సంవత్సరాలకొలది పనిచేయవలసి రావడంవల్ల ఇది వాస్తవంగా మహాఘనకార్యమని చెప్పక తప్పదు.

ఈ కార్యక్రమం చాలా ప్రశంసనీయమే అయినప్పటికీ, ఒక పెద్ద అపవాదుకి కారణమయింది. ఈ రైలుదారి నిర్మించినవారు "క్రెడిట్ మోబిలియర్" ( Credit Mobilier ) అనే ఒక కంపెనీని స్థాపించి, సామాన్యపు వాటాదార్లను మోసగించి, అక్రమ లాభాలను పంచుకొన్నారని అల్లరయింది. ఈ విషయం కాంగ్రెసు విచారిస్తుం దేమో అన్న భయంతో ఈ కంపెనీ డైరక్టర్లు కాంగ్రెసువాదులకు, నాడు సంయుక్తరాష్ట్రాల వైస్‌ప్రెసిడెంట్ అయిన స్కైలర్ కోల్ ఫాక్స్‌కీకూడా ఉచితంగా కొన్ని వాటాలు ముట్టజెప్పారు. ఈ లంచ గొండితనాన్ని గురించిన వ్యవహారం వెల్లడి అయేసరికి, రాజకీయంగా పలుకుబడిగలవారెందరో అప్రతిష్ఠ పాలయ్యారు. ప్రభుత్వంలో లంచ గొండితనం అంతదారుణంగా ప్రబలిపోయి ఋజువర్తనులందరినీ ఆశ్చర్యచకితులను చేసింది.

అంతర్యుద్ధానంతర కాలంలో భారీపారిశ్రామికుల కొందరిలో సామర్థ్యం, నిర్దాక్షిణ్యభావం,- అవినీతి కాదు,- ప్రధాన లక్షణాలుగా కన్పిస్తాయి. జన్మతః స్కాట్లెండువాడైన ఆండ్రూకార్నెగీ భారీ ఉక్కుపరిశ్రమ ప్రాముఖ్యాన్ని ప్రథమతః గ్రహించి "ఉక్కు చక్రవర్తి" ( Steel King ) అయాడు. తెలివైన వ్యాపారాలుచేసి కూడబెట్టిన పెట్టుబడితో పిట్స్‌బర్గ్‌లో కార్నెగీ ఒక ఉక్కు ఉత్పత్తి కర్మాగారాన్ని స్థాపించాడు. అమెరికాలో బొగ్గు దొరికే ప్రదేశానికి మధ్యగా ఉండబట్టి, ఉక్కు-పరిశ్రమకు బొగ్గు అత్యవసరం కాబట్టి, అదే ఈ పరిశ్రమకు అనువైన స్థలమనీ అతడు నిర్ణయించాడు. సుపీరియర్ సరస్సు పశ్చిమకొస సమీపంలో ఉన్న మెసాబీ ప్రాంతంనుండి లోహఖనిజం కార్నెగీ సొంతఓడలలో వచ్చేది. ఉత్పత్తిచేయబడిన ఉక్కు కార్నెగీకి చెందిన రైలురోడ్లమీదనే అమెరికాలోని ఉక్కును వాడకం చేసేవారికి పంపబడేది. ఈ పరిశ్రమ భారీఎత్తున సాగుతూ ఉండడం వలన ఇతరులెవ్వరూ కార్నెగీతో పోటీకి నిల్వలేక పోయారు. 1901 లో కార్నెగీసంస్థ యునైటెడ్ స్టేట్ స్టీల్ కార్పొరేషన్ అనే సంస్థకు 150 కోట్ల డాలర్లకు (నూరేళ్ళ క్రిందట అమెరికా సంయుక్తరాష్ట్రం అంతటినీ కొనడానికి చాలినంత మొత్తానికి) అమ్మివేయబడి ఆ సంస్థలో భాగం అయింది.

ఓహియోరాష్ట్రంలోని క్లీవ్లెండువాసి అయిన జాన్ రాక్‌ఫెల్లర్ అనే మరొక సాహసోపేతుడైన యువకుడు నేలనూనె వ్యాపారంలో విశేష అవకాశాలు ఉన్నాయని కనిపెట్టాడు. 1859 లో పెన్సిల్వేనియాలో మొదటి నేలనూనె బావి త్రవ్వకంతో ఈ వ్యాపారం ప్రారంభమయింది. కష్టపడి పనిచేయడంవల్లను, స్వశక్తి సామర్థ్యాలవల్లను రాక్‌ఫెల్లర్ ఇతరులతోడి పోటీలో పైచేయి అయాడు. తరువాత, అసలు తనకు పోటీయేలేకుండా చేసుకున్నాడు. మెల్లగా రైలుకంపెనీ వారివద్దకు వెళ్ళి, బేరమాడి, వారు తన స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ నూనె రవాణాకు, ఇతరులవద్దకన్నా తక్కువ బాడుగ వసూలుచేసేటట్టు మాట్లాడుకున్నాడు. ఇతని కంపెనీ తక్కువ కంపెనీలకన్న అప్పటికే బాగా వ్యాపారంచేస్తూఉండడంవలన వారితని బేరం వదలుకొనలేక మామూలుగా అంతా చెల్లించే బాడుగలో ప్రత్యేకం ఇతనికి

కొంత ముదరా ఇస్తూ ఉండడానికి సమ్మతించారు. ఇతడి పోటీదార్లు ఈ పద్ధతి పనికిరాదని అభ్యంతరం చెప్పారుగాని, ప్రయోజనం లేకపోయింది. నాటికి ముప్ఫయిమూడేళ్ళ వయస్సుగల ఈ నేలనూనె మోతుబరి వర్తకుడు, ఈ విధంగా రవాణాసౌకర్యాలను గుత్తకొనడంవల్ల, తక్కిన పోటీదార్లు నిరాశచేసుకొని, తమ కంపెనీలనుకూడా విధిలేక అతడికి అమ్మివేశారు. దీనితో అతడి "నేలనూనె సామ్రాజ్యం" అమితంగా పెరిగిపోయింది.

ఇతర వ్యాపారస్తులు ఇంచుమించు ఇలాంటి ఉపాయాలనే ఇతర పరిశ్రమలలో అనుసరించారు. ప్రతి పరిశ్రమలో భారీసంస్థలకుమాత్రమే అభివృద్ధి సిద్ధించడం పరిపాటిగా జరుగుతూ ఉండేది. రైళ్ళలో రెఫ్రిజెరేటర్ పెట్టెలుకూడా ఏర్పాటుచేసినమీదట, క్రొత్తగా బయలుదేరిన మాంసాన్ని నిల్వచేసి రవాణాచేసే పరిశ్రమ పూర్తిగా గస్టేవస్ స్విఫ్టుకీ, పి. డి. ఆర్మర్ కీ కైవశమయింది. ఇలాగే పొగాకు ట్రస్టు. పంచదార ట్రస్టు. విస్కీ సారా ట్రస్టు, రబ్బరు ట్రస్టు, రాగి ట్రస్టు అనే పారిశ్రామిక సమష్టిసంస్థలు ఏర్పడినవి. న్యూయార్కు వాల్ స్ట్రీట్ లోని జె. పి. మార్గన్ అనే గొప్ప బాంకింగ్ సంస్థ నాయకత్వాన ఏర్పడిన సమర్థమైన ఆర్థికట్రస్టు సంస్థ, ఈ పరిశ్రమలలో చాలావాటికి పెట్టుబడి పెడుతూండేది.

ఈ వ్యాపారసంస్థలు తమతమ అదృష్టానుసారం లాభాలు సంపాదించుకొంటూండగా, నూతనయంత్ర పరిశోధకులు మానవోపయోగకరములైన కొత్తకొత్త వస్తువులను కనిపెట్టి, మార్కెట్లలో విడుదలచేసి తాముకూడా ఐశ్వర్యవంతులవుతున్నారు. ఆవిరి సహాయంతో నడిచే పడవ, రైలుఇంజను, టెలిగ్రాఫ్, వ్యవసాయోత్పత్తులను విశేషంగా వృద్ధిచేసిన నూర్పిడియంత్రం, పందొమ్మిదవ శతాబ్ది ప్రథమభాగంలోనే కనిపెట్టబడినవి. ఇప్పుడా పట్టికలో స్కాట్లెండ్ నుండి వలసవచ్చిన అలెగ్జాండర్ గ్రహాం బెల్ 1876 లో కనిపెట్టిన టెలిఫోను 1882 లో థామస్ ఎడిసన్ వాడుకలోనికి తెచ్చిన ఎలక్ట్రిక్ బల్బు, విద్యుచ్ఛక్తి యంత్రముకూడ క్రొత్తగా వచ్చి చేరినవి. గృహాలలో, నగరాలలో దీపాలు వెలిగించుకొనడానికి, యంత్రాలను నడపడానికీ, దూరాలను దగ్గరచేసే టెలిఫోనూ గొప్పగొప్ప పరిశ్రమలకు దారిచూపి, జాతీయ ఆర్థిక జీవనస్థాయిని విశేషంగా వృద్ధిచేసినవి.

ఈ పారిశ్రామిక విప్లవంవలన అమెరికా ప్రజలలో కలిగిన పరిణామాలు చాలా ముఖ్యమైనవి. పారిశ్రామికులు చాలామంది అత్యాశాపరులయినప్పటికీ దూరదృష్టికలవారు, సమర్థులు అవడంవలన దుకాణాలలో సరుకులన్నీ సమృద్ధిగా దొరకడం మొదలుపెట్టినవి. పూర్వంవలె గ్రామీణ కుటుంబాలు తమ వస్త్రాలు, ఇంటి సామాన్లు తామే తయారు చేసుకోనవలసిన అవస్థతప్పిపోయింది. ఏరకం సామగ్రికావలన్నా రైలుమీద ఒక్కరోజులో ఇంటికివచ్చి పడుతూంది. భారీ ఉత్పత్తులయుగం ప్రారంభమయింది.

పరిశ్రమలు పెరిగిపోతూ ఉండడం, పారిశ్రామిక కార్మికుల సంఖ్య కూడా ఎప్పటి కప్పుడు అవసరమైనంతగా పెరుగుతూండడంతో, ఎడతెగని అభ్యుదయయుగం అవతరించినట్టు కనిపించింది. కాని, జాక్సన్, హాయాంలోవలె, దేశం తనకు అవసరమైనదానికన్నా ఎక్కువ ఉత్పత్తి చేసి మార్కెట్లను నింపివేస్తూంది. రైలుకంపెనీలు దేశంలోను, విదేశాలనుండికూడా పుట్టినంతవరకూ అప్పు చేసినప్పటికీ, వాటి విస్తృత ప్రణాళికలకు ఇంకా ధనం అవసరమయింది. కాని, అప్పులిచ్చేవారు ఆపైన ఇవ్వడానికి నిరాకరించేసరికి, 1873 లో జాతీయ ఆర్థిక వ్యవస్థ యావత్తూ తారుమారైపోయింది. ఐదు సంవత్సరాలపాటు ఆర్థిక మాంద్యం, విస్తృత నిరుద్యోగం ఏర్పడింది. తరువాత తిరిగి కొంత కాలం మళ్ళీ దేశం అభ్యుదయమార్గంలో నడిచిందిగాని, తిరిగి 1890 లో మరొక పెద్దదెబ్బ తగిలింది.

* * *

ప్రెసిడెంట్ గ్రాంట్ రెండవటరము ప్రారంభమయే సమయంలో ఈ 1873 నాటి ఆర్థికమాంద్యం ఏర్పడింది. మొదటి టరములో ఉన్నతోద్యోగులవరకు ప్రాకిన లంచగొండితనాన్ని అరికట్టలేకపోయినందున గ్రాంట్ స్వపక్షమువారిలోకూడా చాలామంది ఆయనకు ఎదురుతిరిగి, లిబరల్ రిపబ్లికన్లు (Liberal Republicans) అనే నూతన పక్షాన్ని ఏర్పాటుచేసుకున్నారు. డెమొక్రాట్లలో ఒక పెద్ద వర్గంతో కలిసి ఈ పార్టీవారు న్యూయార్క్ ట్రిబ్యూన్ పత్రికా సంపాదకుడైన హొరేస్ గ్రీలీని తమ అభ్యర్థిగా నిలబెట్టారు. వీరు ప్రభుత్వాన్ని సంస్కరిస్తామని ప్రచారం చేసినప్పటికీ, గ్రీలీ ప్రజాకర్షణశక్తి లేని

వాడు అవడంవల్ల తిరిగి గ్రాంటు సులభంగా ఎన్నిక అయాడు. ఒక వంక అవినీతిని గురించిన నిందలు బాగా ప్రాకిపోతూ ఉండడంతో పాటు, ఆర్థికమాంద్యంకూడా ఏర్పడడంతో 1876 లో జరిగిన ఎన్నికలలో రిపబ్లికనులు పరాజయంపొందే స్థితి ఏర్పడింది. ప్రజాభిప్రాయ ప్రాబల్యానికి లొంగి నీతిమంతుడని ప్రసిద్ధిచెందిన ఓహియో గవర్నరు జెనరల్ రూథర్ ఫర్డ్ హేజ్ ని, రిపబ్లికనుపార్టీ తన అభ్యర్థిగా పేర్కొన్నది. డెమొక్రాట్లుకూడా అట్టి అభ్యర్థినే నియమించగోరి న్యూయార్కు గవర్నరు శామ్యూల్ టిల్డెన్ ని తమ అభ్యర్థిగా నిలబెట్టారు. టిల్డెన్ న్యూయార్కు రాష్ట్రంలో ప్రభుత్వయంత్రాంగ సంస్కర్తగా ప్రఖ్యాతి సంపాదించాడు; తను ఎన్నిక అయితే సమాఖ్యా ప్రభుత్వాన్నికూడా పూర్తిగా క్షాళనం చేయగలనని ఆయన ప్రకటించాడు.

ఈ ఎన్నికలో అత్యాశ్చర్యకరమైన సంఘటన ఎన్నిక పర్యవసానం యెవరూ భావించనివిధంగా పరిణమించడం. టిల్డెన్ కి ఆయన ప్రత్యర్థికన్న 2,50,000 వోట్లు ఎక్కువ వచ్చినవి. ఎన్నికదార్ల వోట్లలోకూడా ఆయనకే యెక్కువ వస్తున్నవి. అయితే దక్షిణ కరోలినా, ఫ్లారిడా, లుయీజియానా అనే మూడు దక్షిణరాష్ట్రాలు 'తివాచీ గుడ్డ సంచీ' ప్రభుత్వాల వివాదాల ఫలితంగా, రెండురకాల వోట్లలెక్కలు పంపినవి. చివరకు, ఆ మూడురాష్ట్రాలలో ఎక్కువవోట్లు హేజ్ కే లభించినట్టు లెక్క తేల్చడంతో; పదవీస్వీకరణోత్సవ ముహూర్తానికి ఒక్కరోజుముందు హేజ్ ఎన్నిక అయినట్టు ప్రకటింపబడింది. ప్రెసిడెంట్ గ్రాంట్ టరము పూర్తిఅయిన తరువాత దేశానికి అసలు ప్రెసిడెంటే ఉండదేమో అనికూడా అమధ్యలో కొంతకాలం అనిపించింది.

హేజ్ పరిపాలన అమెరికాచరిత్రలో అత్యంత పరిశుద్ధమైన, న్యాయమైన పరిపాలనల్లో ఒకటిగా పేరుపడ్డది. కాని, ఆ కాలంలో మాత్రం ఆయనకు తగినంత మెప్పు రాలేదు. ఆయన దక్షిణాదిని మిగిలి ఉన్న కడపటి ఆక్రమణసేనలను ఉపసంహరించడం, మరికొన్ని రాష్ట్రాలను డెమొక్రాట్లకు అప్పగించినట్టయిందని స్వపక్షంవారే మొందటినుండి ఆయనకు ఎదురుతిరగడం ప్రారంభించారు. పైగా, ఆయన అవినీతిపరులైన పాక్షిక రాజకీయవేత్తలతో నిండిఉన్న ప్రభుత్వ

కార్యాలయాల క్షాళన కార్యక్రమం దీక్షతో ప్రారంభించాడు. వీరిలో చాలామంది ఎన్నికరోజున రహస్యంగా వోట్లు తెచ్చి ఇచ్చినందుకు ఉద్యోగాలు సంపాదించినవాళ్లు. ఎర్రఇండియనుల వ్యవహారాలను కూడా చూచే దేశీయశాఖ కొంతమంది దురాశాపరులైన దుర్మార్గుల చేతులలో ఉన్నట్లు తేలింది. వీరు అమాయకులైన ఎర్రఇండియనులను ప్రభుత్వం పేరుమీద మోసగించి వారిభూములను, ఆస్తులను అపహరిస్తున్నారు. హేజ్ ఈ శాఖను పూర్తిగా క్షాళనంచేసినందుకు, అతను తనపార్టీపట్ల విధేయతతో ప్రవర్తించడములేదని స్వపక్షమువారి కోపానికి గురిఅయాడు. తత్ఫలితంగా రిపబ్లికన్ పార్టీ మరొకసారి అతణ్ణి అభ్యర్థిగా నిలపడానికి నిరాకరించింది.

అలాగే రిపబ్లికన్ పార్టీకూడా సంస్కరణకు లోనవుతూంది. 1880లో జరిగిన పార్టీమహాసభలో ఆ పార్టీ రెండుగా చీలిపోయింది. ఇందులో ఒకపక్షం తిరిగి "తివాచీ సంచీ" వ్యాపారానికీ, రాజకీయపు గూడుపుఠాణీలకు పుట్టినిల్లయిన "బడా భాయీలు" (Stalwarts) అంతా ఒక ముఠాగానూ, ప్రభుత్వకార్యాలయాల్లో అవినీతిని క్షాళనం చెయ్యాలని వాదించే "మిశ్రమజాతి" ('Half breeds') వారొక వర్గంగానూ ఏర్పడ్డారు. చివరకు "మిశ్రమజాతి" వర్గం నిలబెట్టిన జేమ్స్ గార్ఫీల్డ్‌కి ప్రెసిడెంట్ పదవికి పార్టీ అభ్యర్థిత్వం లభించడం, అతడు డెమొక్రాటిక్ అభ్యర్థి జెనరల్ విన్‌ఫీల్డుహాన్‌కాక్‌ని ఓడించడం జరిగింది.

కాని, గార్ఫీల్డు ప్రెసిడెంట్ పదవి స్వీకరించిన వెంటనే, నిరాశోపహతుడైన ఒక ఉద్యోగార్థిచే హత్యచేయబడడంవలన, వైస్‌ప్రెసిడెంటు చెస్టర్ ఆర్థరు ప్రెసిడెంటయాడు. మొదట్లో "బడాభాయీల" ముఠాకు చెందిన ఆర్థరు, ప్రభుత్వోద్యోగాలన్నిటినీ యోగ్యతల ననుసరించి సర్దుబాటుచేసే ఒక విధానాన్ని అమలుజరిపి, ప్రశస్తమైన పరిపాలనా దక్షతను ప్రదర్శించాడు. కాని హేజ్ వలెనే ఇతనికికూడా పార్టీనాయకులు "కుట్రదారుడని" నిరసించి, ఇతడుకూడా రెండవ తడవ ప్రెసిడెంటుకాకుండా చేశారు.

లోగడ ప్రజాప్రతినిధులసభకు స్పీకరుగాను, విదేశాంగ మంత్రిగాను పనిచేసిన జేమ్స్‌బ్లేన్ 1884లో జరిగిన ఎన్నికలలో రిపబ్లికన్

పార్టీ అభ్యర్థిగా ప్రెసిడెంటుపదవికి పోటీచేశాడు. ఉదాత్తత, నానాముఖప్రతిభ గలిగిన బ్లేన్ రిపబ్లికన్ పార్టీలోని ప్రముఖ నాయకులలో ఒకడు. కాని, గ్రాంట్ హయాంలోని తీవ్రమైన అపవాదులలో కొన్నింటిలో ఇతని పేరుకూడా బయటికివచ్చింది. ఈ కారణంవల్లనే, రిపబ్లికన్ పార్టీ ఇంతకు పూర్వమే బ్లేన్‌ని తన అభ్యర్థిగా పెట్టడానికి భయపడింది. డెమొక్రాటిక్ పార్టీవారు, లోగడ టిల్డెన్‌వలెనే నిజాయితీ, నిర్భర రాజనీతి కౌశలంగలవాడని ప్రసిద్ధిచెందిన న్యూయార్కు గవర్నరు గ్రోవర్ క్లీవ్లెండుని బ్లేన్‌కి పోటీగా నిలబెట్టారు.

తిరిగి రిపబ్లికన్ పార్టీలోని సంస్కరణవాదులు తమపార్టీ అభ్యర్థిని త్రోసిపుచ్చి డెమొక్రాట్లతో లాలూచీ అయారు వారితోడ్పాటు ఫలితంగా డెమొక్రాట్లు అంతర్యుద్ధానంతరం, మొట్టమొదటిసారిగా అధికారంలోకి వచ్చారు. ఇంచుమించు సమానబలంగల అభ్యర్థుల మధ్య జరిగిన ఈ పోటీలో డెమొక్రాట్లు విజయం పొందడానికి బ్లేన్ పక్షానికి చెందిన ఒక క్రైస్తవ మతగురువు అధిక ప్రసంగం కారణమయింది. ఔచిత్యమెరుగని ఈ మతగురువు డెమొక్రాట్లంటే "రమ్ సారా, రోమన్ మతోన్మాదం, రాడీతనం" తో కూడినపార్టీ అని అభివర్ణించేసరికి, కాథలిక్కు మతవర్గం వారందరికీ కోపంవచ్చి, ఈ అభివర్ణనను ఖండించవలసినదని బ్లేన్‌ని కోరినప్పటికీ, అతను ఏమీ మాట్లాడనందున, వారంతా బ్లేన్‌కి వ్యతిరేకంగా వోటుచేయడంతో క్లీవ్లెండు ప్రెసిడెంటుగా ఎన్నిక అయాడు.

* * *

ఇంతవరకు అభివర్ణించిన రిపబ్లికన్ పరిపాలనలోను, ఇటుపైనచాలా కాలం వరకుకూడా భారీవ్యాపారాలు వ్యాప్తి చెందుతూ, జాతీయైశ్వర్యాభివృద్ధికి దోహదంచేస్తూ, అన్ని తరగతులకూ స్థాయిలకు చెందిన సమర్థులగు వ్యాపారస్థులు సుసంపన్నులయేందుకు అపారావకాశాలను సమకూరుస్తూ, దేశాన్ని తలతిరిగిపోయేటంత అభ్యుదయం వంకకు నడిపించుకొనిపోతూ, మధ్యమధ్య భయంకరమైన ఆర్థికమాంద్యాన్ని సృష్టిస్తూ ముందుకు సాగుతున్నవి. 1870-1880 లకు మధ్యకాలంలో ఈ భారీవ్యాపారం అడ్డమాకలేక అభివృద్ధిచెందినది. మొదటినుంచీ దానికి దోహదంచేసిన సంయుక్తరాష్ట్ర ప్రభుత్వంతోసహా, ఎవ్వరూ

దానికి ఏవిధమైన అంతరాయం కలిగించలేక పోయారు. దానివలన వచ్చిన మార్పులు మాత్రం అనుకూలంగానో, ప్రతికూలంగానో తీవ్రమైన సందడి కలిగించినవి.

కొన్నిసంవత్సరాలవరకు అమెరికా కార్మికులు, స్వసంరక్షణ సంఘాలను, యూనియన్లను ఏర్పాటుచేసుకొని, యజమానులతో బేరమాడి పనిలో తమ సౌకర్యాలను, వేతనాలను వృద్ధిచేసుకొనడానికి ప్రయత్నిస్తున్నారు. మొత్తముమీద కార్మికులంతా సామాన్యంగా జనసమ్మర్దంగల గాలి వెలుగులేని ఫ్యాక్టరీలలోనూ, వేతనాలకోసం దీర్ఘకాలం, చాలా శ్రమపడి పనిచేయవలసి వచ్చేది. ఆ స్థితిలో తమ జీవన పరిస్థితులను మెరుగు పరచుకొనడంకోసం పోరాడడం కేవలం సహజం.

"కార్మిక వీరుల సంఘం" (Knights of Labour) అనే సంస్థ జాతీయ ప్రాముఖ్యం సంపాదించిన కార్మికసంస్థలో మొట్టమొదటిది. 1869 లో స్థాపించబడిన ఈ సంస్థలో అన్నిపరిశ్రమలలో, వ్యాపారాలలో పనిచేసే కార్మికులందరికీ ప్రవేశమీయబడింది. కార్మికులచే రోజుకి ఎనిమిదిగంటలకన్న ఎక్కువపని చేయించరాదని, చిన్నపిల్లలచే పని చేయించరాదని, ప్రజోపయోగ పరిశ్రమలన్నీ ప్రభుత్వవశంలో ఉండాలనీ ఈ సంస్థ ప్రకటించింది. 1880 ప్రాంతాల్లో ఈ సంస్థ అత్యున్నత దశలో ఉన్నప్పుడు దానిలో 7,00,000 మంది సభ్యులు ఉండేవారు. కాని, విజయవంతంగా సమ్మెలు సాగించ లేకపోవడం, చాలామంది కార్మికులకుకూడా అతిగా కనిపించే కోరికలను కోరడం, మొదలైన ఈ సంస్థలో ఉన్న లోపాలన్నీ ఏకమయి క్రమంగా ఈ సంస్థ పతనానికి కారణమయాయి.

ఇంగ్లండునుంచి వచ్చిన శామ్యూల్ గోంపర్స్ అనే చుట్టలకార్మికుడు ఈ రంగంలో అద్భుతమైన విజయం సాధించాడు. చేతిపనులకు చెందిన వివిధపరిశ్రమలలో కొత్తగా ఏర్పడుతూన్న కార్మికసంఘాలన్నిటినీ ఏకంచేసి, ఒక గొప్ప కార్మికసంఘ సమాఖ్యను ఏర్పాటు చేయడంద్వారా ఇతడు కార్మికుల కోరికలకు కలుగజేసిన విలువ, అమెరికా కార్మిక సమాఖ్య (American Federation of Labour) ద్వారా నేటికీ తిరుగులేకుండా చెలామణీ అవుతూంది. ఈ సంస్థ లక్ష్యాలు

కార్మికవీరుల సంస్థవలె కాక ఆచరణ సాధ్యమైనవిగా, మితవాదధోరణిలో, ట్రేడ్ యూనియన్ సూత్రాలను అనుసరించి ఏర్పరచబడినవి. అతివాదుల సూచనలను ఈ సంస్థ ఆమోదించలేదు. పెట్టుబడిదారీ విధానానికి ఆమోదం తెలిపింది; కేవలం వేతనాల అభివృద్ధికోసం, పని గంటల తగ్గింపుకోసం, యజమానులతో సమష్టిగా బేరమాడుకొనడానికి కార్మికులకుగల హక్కులకోసంమాత్రమే ఈ సంస్థ కృషిచేస్తోంది.

అమెరికా సమాజంలో భారీ పారిశ్రామిక సంస్థలను ఎదుర్కొనడానికి సాహసించినవారు కేవలం కార్మికులేకాదు. పశ్చిమ సరిహద్దులలోని ప్రజలుకూడా ఈ వ్యాపారస్థుల అత్యాచారాలవల్ల తమకు నష్టం కలుగుతూన్నదని ఆందోళన ప్రారంభించారు.

1862 లో చేయబడిన భూ ప్రదాన (Home stead) శాసనంరీత్యా మొట్టమొదటిగా భూమికోరే ఒక్కొక్క వలసదారుడికి నూటఅరవై ఎకరాల బంజరుభూమిని మంజూరుచేసి ఐదు సంవత్సరాలపాటు అతడా భూమిని సాగుచేస్తే అది అతిడికి దఖలుపడిపోతుందని ప్రకటించడంమూలంగా ప్రభుత్వం కొత్త రైతులను ప్రోత్సహించి పశ్చిమదిశకు పంపింది. రైలుదారులుపడి, భారీ పారిశ్రామిక సంస్థలు రంగంలో ప్రవేశించేవరకు, ఈ భూ ప్రదానవిధానం ఆత్యాకర్షకంగానే కనిపించింది. అటుపిమ్మట, ఈ నూతన పాశ్చాత్యకర్షకులు తమ సరకులను ఈ రైలుదారులమీదుగా రవాణా చేయాలనుకుంటే, రైలురోడ్ల కంపెనీలను వత్తిడిచేసి తమకుమాత్రం తక్కువరేట్లు సంపాదించుకొన్న మోతుబరి ఉత్పత్తిదారులతో వీరు సార్థకంలేని పోటీలోకి దిగవలసివచ్చింది. ఇప్పుడీ తొలివలసదార్లు ఎదుర్కొనవలసివస్తున్న ప్రమాదాలు, పూర్వంవలె వర్తక తృష్ణగల ఎర్రఇండియనులు కలిగించేవి కావు ; తమ వలెనే కోట్లూ హాట్లూ ధరించే స్వజనంనుండే ఇప్పుడు వీరికి ప్రమాదాలు కలుగుతున్నవి.

1870-'80 లకు మధ్య గ్రేంజ్ అనే కర్షకసంస్థ ఒకటి బయలుదేరి చాలా హెచ్చుగాఉన్న రైళ్ళరవాణా బాడుగలు తగ్గించడానికీ, మోతుబరి సంస్థలకు ఈ బాడుగుల మొత్తాలలో కొంతభాగం తిరిగి ఇచ్చివేసే పద్ధతిని, పక్షపాత విధానాలను మానిపించడానికి రైలు కంపెనీలతో హోరాహోరీ పోరాటం సాగించింది. దాదాపు ఇరవై

లక్షలమంది సభ్యులుగల ఈ గ్రేంజర్సుసంఘ రాష్ట్ర శాసనసభలపై ఒత్తిడితెచ్చి, కొన్ని నిషేధశాసనాలు చేయించింది. అయితే స్థానికంగా తన సరిహద్దులమధ్య జరిగే వాణిజ్యాన్నిమాత్రమే రాష్ట్ర శాసనసభలు అమలులో పెట్టగలవు. అందువల్ల ఈ శాసనాలు ఈ రైతులకు ఎక్కువ ఉపకరించలేదు. అంతర్రాష్ట్రీయ వాణిజ్యంపై అధికారం సమాఖ్యా ప్రభుత్వానిది అయినప్పటికీ అంతవరకు కేంద్రప్రభుత్వం ఏమీచెయ్యలేదు; 1887 లో మాత్రం అంతరరాష్ట్రీయ వాణిజ్యశాసనం చేసి, రైలుకంపెనీల దురాచారాలను కొంతవరకు అరికట్టింది.

పశ్చిమ ప్రాంతీయులకు ఏర్పడిన మరొక ఇరకాటం ద్రవ్యమాంద్యం (money deflation) కర్రెన్సీపద్ధతి "సుష్ఠు"గా, బంగారపు నిల్వలపై ఆధారపడినదిగా, 'జాతీయ పరపతిని ఉన్నతస్థాయిలో నిలిపి ఉంచేదిగా ఉండాలనీ తూర్పు పెట్టుబడిదారులూ, ప్రజలూ కోరుతున్నారు. అందుకోసం, అంతర్యుద్ధకాలంలో హెచ్చుగా విడుదలచేసిన నోట్లను ఉపసంహరించి తగులపెట్టాలనికూడా వారు ఆందోళన చేస్తున్నారు.

పడమటి రైతులు ఆదిలో తమ వ్యవసాయపు పెట్టుబడులకుగాను ఆర్థిక మాంద్యకాలంలో తూర్పువారి వద్దనుండి అప్పులు తెచ్చుకున్నారు. ద్రవ్యోల్బణకాలంలో హెచ్చుగాలభించే నోట్లతో వారా అప్పులు తీర్చివేయగలుగుతారు. అలాకాక, బంగారపు నిల్వలమీద ఆధారపడిన విలువ పెరిగిన డబ్బుతో ఈ బాకీలు తీర్చాలంటే, ఆర్థికంగా చాలా ఇబ్బంది పడవలసి వస్తుంది.

ధనం "చౌక"గా నిలిచిఉండే ఉపాయంకోసం అన్వేషిస్తూన్న పాశ్చాత్యులు చివరకు చక్కని పరిష్కారమార్గంఅంటూ ఒక సూచన చేశారు. లోగడ సంయుక్తరాష్ట్రాల కర్రెన్సీకి వెండీ, బంగారమూ కూడా ఆధారంగా ఉండేవి. పదహారు ఔన్సుల వెండి, ఒక ఔన్సు బంగారం విలువకు సమానమని అప్పుడు లెక్కగట్టేవారు. అయినప్పటికీ, ఈ లోహాల విలువలు తరచు మారిపోతూండడంవలన వాటివిలువల నిష్పత్తిని ఒకేస్థాయిగా నిలిపి ఉంచడం, ఒక లోహాన్ని మరొక లోహంతో మారకంవేయడం చాలాకష్టం. ఒక లోహంధర పెరిగితే వెంటనే దానిని పంపకంలోనుండి ఉపసంహరించి, గవర్నమెంటు

దానిని కొనేదానికంటే ఎక్కువధరకు వర్తకులకు అమ్మడం జరుగుతూ ఉండేది. 1873 లో ఈపనే జరిగింది. వెండి చాలా తక్కువగా ఉండడంవలన వ్యాపారరీత్యా దాని విలువ హెచ్చిపోయి, అది పంపకంలో లేకుండా అదృశ్యమైపోయింది. కోశాధిపతులు నాణాలను ముద్రించడానికి వెండిని ఉపయోగించడం మానివేసి, పూర్తిగా బంగారాన్నే ఉపయోగించారు.

తరువాత కొంతకాలానికి, హఠాత్తుగా పశ్చిమ ప్రాంతంలో పెద్దపెద్ద వెండిగనులు బయటపడడంతో ఆ లోహం ధర బాగా తగ్గిపోయింది. మళ్ళీ వెండి బంగారులకు 16 : 1 నిష్పత్తిని పరిగణించి వెండినాణాలు ముద్రించవలసిందిగా ఆ గనుల యజమానులు ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపారు. ఆ పని జరిగితే తాము తమకు చవుకగా లభించిన వెండినంతటినీ విలువైన బంగారం రూపంలోనికి మార్చుకోవచ్చునని వారు ఆశించారు. పాశ్చాత్య కర్షకులుకూడా ఈ ఆందోళనలో పాల్గొన్నారు; వెండిని తిరిగి నాణాలుగామార్చేదాని ఆధారం మీద చౌకగా హెచ్చుగా కాగితపు నోట్లుకూడా ముద్రిస్తే, తాము అప్పులు సులభం తీర్చుకొనడానికి ఉపయోగపడగలదని వీరి ఆశ. హేజ్ పరిపాలనలో కాంగ్రెసు వెండి నాణాలుకోరే వారి విజ్ఞప్తిని పాటించి, ఏడాదికి 20 లక్షలు మొదలు 40 లక్షల డాలర్ల ఖరీదుచేసే వెండిని కొనడానికి ప్రభుత్వానికి అధికారమిచ్చింది. తిరిగి 1890 లో, షర్మన్ వెండి కొనుగోలు చట్టంరీత్యా, వెండినాణాలను ఇంకా హెచ్చుగా ముద్రించాలన్న పడమటివారి కోరిక సఫలమయింది. కాని నిపుణులు సూచించినట్లే బంగారంమాత్రం పంపకంలోనుండి మాయమైపోయింది. యెవరికి వీలైనంత వారు బంగారంరూపంలోనే తమ ఐశ్వర్యాన్ని కూడబెట్టుకున్నారు. అందువల్ల కాంగ్రెసు షర్మన్ చట్టాన్ని రద్దుచేసి, బంగారం అసలు అంతర్ధానం కాకుండా కాపాడింది.

1890—1900 మధ్యకాలంలో, వెండినాణాల సమస్య, చాలా ప్రధానమైనదిగా తయారయింది. అంతకు పూర్వం బానిసత్వ సమస్య విషయంలో ఉత్తర దక్షిణ విభేదాలు ఏర్పడినట్లు, ఈ సమస్య తూర్పు పడమరల విభేదానికి కారణమయింది. పైగా, ఈవిభేదాలు ప్రాంతీయ

విభేదాలుగానే కాక, రైతులకు పారిశ్రామికులకు మధ్య; అప్పుతెచ్చుకొన్న వాడికీ, ఇచ్చినవాడికీ, మధ్య; కొద్దివారికి, మోతుబరి వ్యాపారస్థులకుమధ్య కూడా చావు బ్రతుకుల పోరాటంగా పరిణమించినవి. ఈ వెండి వాడకం సమస్య ఏతావతా, అమెరికా విస్తృతపారిశ్రామికాభ్యుదయానికి - వాస్తవమో, భ్రాంతియో - దాని వలన నష్టపడుతున్నామని భావించే లక్షలూ కోట్లకొలదీ సామాన్య ప్రజల ప్రతిఘటనగా పరిణమించింది.

* * *

దేశంలో డెమొక్రాటిక్ పార్టీపాలన 1884 - '88 ల మధ్యను, మరల 1892 - '96 ల మధ్యను మాత్రమే తటస్థించింది. ఈ రెండు టరములలోనుకూడా గ్రోవర్ క్లీవ్లెండే డెమొక్రాటిక్ ప్రెసిడెంటుగా ఎన్నిక అయాడు. ఒక టరము ప్రెసిడెంటయి, రెండవసారి ప్రతిపక్షం చేత ఓడింపబడి, తిరిగి పిమ్మట నాలుగేళ్ళకు మూడోసారి ఎన్నికలో మళ్ళీగెలుపొంది ప్రసిడెంట్ అయినవాడు చరిత్రలో క్లీవ్లెండ్ ఒక్కడే.

క్లీవ్లెండ్ సమర్థుడైన, పట్టుదలగల ప్రెసిడెంటు. తనకు ఉచితమని తోచినపనే అతడు చేసేవాడు. ఇతరుల ముఖప్రీతి కొరకు ఏమీ చేసేవాడుకాడు. తన మంత్రివర్గంలో సమర్థులగు ఇద్దరు దాక్షిణాత్యులను నియమించడం, యుద్ధంలో పట్టుకొనిన దాక్షిణాత్య సమాఖ్యతాలూకు కొన్ని యుద్ధపతాకాలను తిరిగి దక్షిణాదికి పంపివేయడం ఉచితమని ఆయన భావించాడు. సమర్థుడైన ఒక రిపబ్లికనును సివిల్ సర్వీసులో పెద్దజీతం ముట్టే ఒక ఉన్నతోద్యోగంలో నియమించడంతో ఆయన డెమొక్రాట్ల కోపానికి గురి అయాడు. అంతర్యుద్ధంలో పోరాడినవారిలో అర్హులైనవారికి తప్ప మిగిలిన వారికి పింఛనులు ఇవ్వరాదని పట్టుపట్టడంవలన, రాజకీయంగా శక్తివంతమైన పూర్వ యుద్ధవీరుల సంస్థకు విరోధి అయాడు. ప్రభుత్వం వెండినికొనడం ఆపివేయాలని పట్టుపట్టడం మూలంగా తన పార్టీ ఎన్నికల ప్రణాళికలోని వాగ్దానాన్ని నిరాకరించాడు.

క్లీవ్లెండ్ మొదటి టరములో, అభ్యుదయ తరంగం ఫలితంగా, ప్రభుత్వాదాయం పెరగడంవల్ల కోశంలో ధనంబాగా నిల్వ ఉండి

పోయింది; దీనిని ఏవిధంగా వినియోగించడమా అన్నదే ఆయన ఎదుర్కొనవలసిన ప్రధాన సమస్య అయింది. దానిని వినియోగించడానికి ఒకమార్గం జాతీయఋణం తీర్చివేయడం. కాని, వాడుకలో ఉన్న కరెన్సీనోట్లలో చాలభాగం ప్రభుత్వపు బాండ్లు ఆధారంగా వేసినవి; కనుక ఆ బాండ్లను ఎత్తివేస్తే దానితోపాటు అంతవిలువగల కరెన్సీ నోట్లనుకూడా చెలామణిలో నుండి ఉపసంహరించాలి. ఈ విధంగా ఆర్థికమాంద్యం కలిగించడం ఆ సమయంలో వివేకవంతమైన పని కాదు. ఆ ధనం వెచ్చించడానికి మరొకపద్ధతి దేశీయాభివృద్ధి కార్యక్రమం అమలు జరపడం. సంప్రదాయ సిద్ధంగా డెమొక్రాట్ అయిన క్లీవ్లెండ్‌కి ఇది ఇష్టంలేదు. కాబట్టి ఈఅదనపు నిల్వలను తగ్గించివేయడానికి ఉత్తమోపాయం హెచ్చుగా ఉన్న రక్షణ సుంకాలను తగ్గించివేయడం - అని ఆయన నిశ్చయించాడు; పారిశ్రామికులకు ఈ చర్య చాలా అనుకూలమైనది.

కాని, క్లీవ్లెండ్ ఎన్ని ప్రయత్నాలు చేసినా ఈ సుంకాలను తగ్గించడానికి సాధ్యంకాలేదు. అతడు 1888 లో ప్రెసిడెంట్ ఎన్నికలలో ఓడిపోవడానికి ఈ సమస్యే కారణమయింది. ఈ హెచ్చు సుంకాల వలన ప్రజానీకానికి రోజువారీ వాడుకకు అవసరమయిన పారిశ్రామికోత్పత్తుల ధరలు హెచ్చుగా ఉండడంచేత హెచ్చు సుంకాలు ప్రజలకు నష్టదాయకమని ఆయన వాదం. కాని, ఆ సుంకాలు హెచ్చుగా ఉండడంవల్ల అమెరికా పరిశ్రమలకు విదేశాలపోటీ తప్పిపోయి, ప్రజలకు ఎక్కువ వేతనాలు, ఉద్యోగాలు లభిస్తున్నాయంటూ రిపబ్లికనులు ఈ వాదాన్ని ఖండించారు. 1888 లో ప్రజల వోట్లలో క్లీవ్లెండ్‌కే మెజారిటీ లభించింది. కాని అంతకన్న ముఖ్యమైన ఎన్నికదార్ల వోట్లలో మెజారిటీ రిపబ్లికన్ అభ్యర్థిఅయిన బెంజమిన్ హారిసన్‌కి లభించింది. ఇతడు ప్రెసిడెంట్ విలియం హెన్రీ హారిసన్ మనుమడు.

తిరిగి అధికారంలోకి రాగానే రిపబ్లికనులు వాణిజ్య సుంకాలను మరికొంతకూడా హెచ్చించి, ఆ విధంగా లభించిన ఆదాయాన్ని యుద్ధ వీరులకు పెన్షనులు ఇవ్వడానికి, ప్రజోపయోగకర నిర్మాణాలకు, బలవత్తర నౌకాదళ నిర్మాణానికీ వినియోగించారు. కాని, దేశంలో ఈ

ద్రవ్య పుష్కలతకు ఆధారమైన బంగారం సరఫరా తగ్గిపోవడంవలన క్రమంగా ఏర్పడుతూన్న ఆర్థికమాంద్యాన్ని ఈ చర్యలేవీ అరికట్ట జాలక పోయినవి. బ్యాంకులు దివాలాతీయడం, పారిశ్రామిక సంస్థల వాటాల ఖరీదులు తగ్గిపోవడం, తాకట్లు వాకట్లయిపోవడం జరగ డంతో మరల 1892 లో ప్రజలంతా గ్రోవర్ క్లీవ్లెండుకే వోటుచేశారు.

ఈ ఎన్నికలో ఒక పెద్ద విశేషం:— మూడవపార్టీ ఒకటి బయలుదేరి, పదిలక్షల వోట్లకుపైగా సంపాదించి, రిపబ్లికనులకు, డెమొ క్రాట్లకుకూడా ఆందోళన కలిగించడం. పాప్యులర్ పార్టీ లేక "పాప్యు లిస్టు" లు అనబడే ఈ కొత్తపార్టీలో సభ్యులు అసంతృప్తిచెందిన పడ మటి రైతులు, ఋణగ్రస్తులు మొదలైనవారు. వీరు అయోవారాష్ట్రానికి చెందిన జెనరల్ జేమ్స్ వీవర్ ని తమ అభ్యర్థిగా నిలిపారు. వెండి నాణాలవిడుదల, నేషనల్ బ్యాంకుపద్ధతిని పూర్తిగా సంస్కరించడం, రైలురోడ్లను, ఇతర ప్రజోపయోగకర పరిశ్రమలను ప్రభుత్వయాజమా న్యంలో నడపడం మొదలైనవి తమ ప్రధాన విధానాలని ఎన్నికల ప్రణాళికలో ప్రకటించారు. కాన్సాస్, ఇడాహో, కొలరాడో, నెవడా రాష్ట్రాలు ఈ కొత్తపార్టీకే ఓటుచేసినవి. పెద్దపార్టీలు రెండూ ప్రజాభిమతాన్ని పాటించడంలేదని ఈ పాపులర్ పార్టీ విమర్శించింది.

ప్రెసిడెంట్ క్లీవ్లెండు 1892-96 ల మధ్య జాతీయ ఆర్థికపరిస్థితిని తిరిగి చక్కబరచడానికి ధైర్యంగా తీవ్రకృషిచేశాడు. వాస్తవానికి అతడు వాల్ స్ట్రీట్ ధనస్వాములకు మిత్రుడు కాకపోయినప్పటికీ, ప్రభుత్వపు బాండ్లు కొంత తక్కువఖరీదుకు తీసికొని కోశానికి బంగారం సరఫరా చేయవలసినదిగా జె. పి. మార్గన్ మొదలైన (వాల్ స్ట్రీట్) బ్యాంకర్లను కోరాడు. ఈ చర్యవలన పాప్యులర్ పార్టీవారికి, డెమొ క్రాట్లలోకూడా చాలామందికి అతడిపైన ఆగ్రహం కలిగింది. ఆయన వాల్ స్ట్రీట్ బ్యాంకర్ల బానిసఅని వారు వాదించడం ప్రారంభించారు.

ఇప్పటికి పూర్తిగా జాగరితులైన రైతులకూ, కార్మికులకూ ప్రభు త్వం చేస్తూన్న ప్రతిపనీ, సామాన్య ప్రజానీకానికి నష్టదాయకంగా భారీవ్యాపార సంస్థలకూ, పారిశ్రామికసంస్థల సమ్మేళనాలకూ సహాయం చేయడానికి ఉద్దేశించబడినట్టు కనిపిస్తూంది. సుప్రీమ్కోర్టు తీర్పులు కూడా ఆ సంస్థలపట్లనే పక్షపాతం చూపుతూన్నట్టు నిర్ధారణ చేసుకు

న్నారు. ఉదాహరణకు, రాజ్యాంగం 14 వ సవరణలో, "న్యాయపద్ధతిలో తప్ప, ఒకవ్యక్తియొక్క ప్రాణానికిగాని, స్వేచ్ఛకుగాని, ఆస్తిపాస్తులకుగాని, ఏ రాష్ట్రమూ నష్టం కలిగించరాదు"-అని ఉంటే, "వ్యక్తి" అనే పదం పారిశ్రామిక సంస్థలకుకూడా వర్తిస్తుందని సుప్రీంకోర్టు తీర్పుచెప్పింది. అందువల్ల, కేంద్ర ప్రభుత్వాదేశం, ఆమోదంలేనిదే ఏ రాష్ట్రప్రభుత్వమూ భారీ వ్యాపారసంస్థల విషయంలో ఏ విధమైన జోక్యం కల్పించుకొనరాదనికూడా సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. ఈ సంస్థలను అదుపులోపెట్టాలనే సంకల్పం కేంద్రప్రభుత్వానికి వాస్తవంగా ఏకోశానా కనిపించనందున, ఈ తీర్పుతో పారిశ్రామిక సంస్థలకు అపరిమిత స్వాతంత్ర్యం లభించింది.

1896 లో జరిగిన ఎన్నిక సమయానికి పరిస్థితి పూర్తిగా విషమించింది. క్లీవ్లెండ్, మితవాది డెమొక్రాట్లు దేశాన్ని ఆర్థికవిపత్తునుండి కాపాడలేకపోయారు. రిపబ్లికన్లు సెయింట్ లూయీవద్ద సమావేశమయి తమ ప్రతిపక్షంవారి అసమర్థ పరిపాలనను సంతోషంగా అభివర్ణించి ఓహియో రాష్ట్ర గవర్నరు విలియం మెక్లీని ప్రెసిడెంట్ పదవికి తమ అభ్యర్థిగా పేర్కొన్నారు. కనీసం, పరిస్థితులు మారేవరకైనా బంగారపు నిల్వలమీద ఆధారపడిన సుకరమయిన కరెన్సీ ఏర్పాటుచేస్తామని ఎన్నికల ప్రణాళికలో ప్రకటించారు. వెండి చాకదనమే దేశంలోను, దేశాంతరాల్లోనుకూడా కరెన్సీకి పరపతికి భంగం కలిగించి, వ్యాపారం ఇంచుమించు స్తంభించిపోయేటట్టు చేసిందని వారు విమర్శించారు. పరిస్థితిని ఒక్కసారి చక్కబరిస్తే, తిరిగి దేశం అభ్యుదయ మార్గాన పురోగమించగలదనికూడా తమ ఎన్నిక ప్రణాళికలో హామీ యిచ్చారు.

డెమొక్రాట్లు షికాగోలో సమావేశమయి, ఆత్యావేశ పూరిత వాతావరణంలో క్లీవ్లెండ్ పరిపాలనను, సువర్ణ ప్రమాణస్థాయిని నిలిపి ఉంచడానికి ఆయనచేసిన ప్రయత్నాలను తీవ్రంగా విమర్శించారు. వెండి బంగారుల విలువలను పదహారుపాళ్లు, ఒకపాలు నిష్పత్తిలో నిర్ధారణచేసి, వెండినాణాలను అసంఖ్యాకంగా విడుదలచేయాలని తీర్మానించారు. సమావేశానికి వచ్చిన ప్రతినిధులంతా వాల్ స్ట్రీట్ మోతుబరి వ్యాపారస్తులపైన, పారిశ్రామిక సంస్థలవారిపైన దుమ్మెత్తి

పోస్తూ ఉపన్యాసాలు చేశారు. వారు సామాన్యులను, చిన్నవ్యాపారస్థులను రైతులను, ఫ్యాక్టరీ కార్మికులను నలిపివేస్తూన్నారని విమర్శించారు. ఈ ఉద్యమానికి నాయకుడు ముప్ఫయ్యారేళ్ల యువకుడు విలియం జన్నింగ్స్ బ్రయాన్. నెబ్రాస్కా రాష్ట్రంనుండి ప్రజాప్రతినిధి సభకు ఎన్నిక అయిన ఇతడు చిన్నవాడు, అనుభవంలేనివాడూ అయినప్పటికీ, అతని అపారోత్సాహమూ, అద్భుత వక్తృత్వప్రజ్ఞా ఈ లోపాలను కనిపించనీయలేదు. ఈ సమావేశంలో అత్యావేశంతో ఉపన్యసిస్తూ బ్రయాన్ తన రిపబ్లికన్ ప్రతిపక్షంవారిని ఇలా హెచ్చరించాడు. "కార్మికుల శిరస్సుపైన బలవంతంగా మీరు కంటకకిరీటాన్ని పెట్టి అదుమలేరు. మానవులను మీరు బంగారు శిలువపైన చిత్రవధ చేయడానికి ప్రయత్నించి లాభంలేదు." ఈ ఉపన్యాసానంతరం ప్రెసిడెంట్ పదవికి ఇతడే డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా ఎన్నిక అయాడు.

అనంతరం జరిగిన ఎన్నికలప్రచారం, బహుశః అమెరికాచరిత్రలో అత్యద్భుతమైనది. పాపులర్ పార్టీకూడా డెమొక్రాటిక్ పార్టీతో ఏకమయింది. దక్షిణాది రాష్ట్రాలన్నీ డెమొక్రాట్లను బలపరిచినవి. బ్రయాన్ తన మనోహర ఉపన్యాసాలతో, తాను బలపరుస్తూన్న రజితవాదంతో, దేశమంతటా వెండిమలామా చేశాడు.

ఈ "బ్రయాన్ తుపాను"ను ఎదుర్కొనడానికి రిపబ్లికనులు లక్షలకొలది డాలర్లు ఖర్చుచేసి ప్రచారం చేసుకోవలసి వచ్చింది. ఈ ఎన్నిక వారి చావుబ్రతుకుల పోరాటమయింది. చివరివారంలో మార్కు హాన్నా అనే వ్యాపారస్థుడు దేశమంతట ప్రచారం చేయడానికి 18,000 మంది వక్తలను నియమించాడు.

ఎన్నికరోజున, కోటీ ముప్ఫయిలక్షలమంది వోటుచేశారు. ఇందులో బ్రయాన్‌కి ఆరువంతులు, మెకిన్లీకి ఏడువంతులు వోట్లు రావడంవల్ల మెకిన్లీ గెలుపొందాడు. కాని ఈ ఎన్నికమాత్రం చరిత్రాత్మకమైనది. తూర్పువారు, ఎన్నికఫలితం విని సంతృప్తిగా నిట్టూర్చి, తమ తమ దుకాణాలకు, ఫ్యాక్టరీలకు, తరలిపోయారు. కాని, 1896 ఎన్నిక ప్రచారం మాత్రం విస్మరింపబడలేదు. ప్రజాసామాన్యం ఈ ఎన్నికలో వ్యక్తంచేసిన దృఢమైన భావాలను విజేతలుకూడా నిర్లక్ష్యం చేయులేక పోయారు. "బడుగు మానవుడి" నోరు, ఈ ఎన్నిక ఫలితంతో కట్టు

బడలేదు సరికదా, అమెరికా ప్రజాస్వామ్య విధానంగా అనంతరం, భవిష్యత్తులోకూడా, పదేపదే వినిపిస్తూనేఉంది.

---

# అష్టమ అధ్యాయం

## అగ్రశ్రేణి రాజ్యాంగా అవతరణ

అమెరికా వీథులలో, 1890 ప్రాంతాలలో ఒక రోజున, "గుర్రాల్లేని పెట్టెబళ్లు" వాటంతట అవే పెద్ద ధ్వనిచేస్తూ దొర్లిపోతూండడం చూచి, గుర్రాలన్నీ భయంతో సకిలించినవి; ప్రజలు ఆశ్చర్యంతో తెల్లబోయి చూచారు. ఆ బళ్లు మెల్లగా నడుస్తూండడంవల్లను, వాటి స్వరూపం చూడ ముచ్చటగా లేకపోవడంవల్లనూ అవి కేవలం వాటిని భరించగల భాగ్యవంతులకు ఆటవస్తువులుగామాత్రమే ఉపయోగపడగలవని ఆ నాడు ప్రజలనుకొన్నారు. అయితే తరువాత అచిరకాలంలోనే అద్దాల కిటికీలుగల అందమైన కార్లు ఏటేటా లక్షలాదిగా అమెరికా ఫ్యాక్టరీలలోనుండి బయటికి వస్తాయనిగాని, అమెరికా పౌరులలో ప్రతినలుగురిలో ఒకడు సొంతకారులో తిరుగుతూ ఉంటాడనిగాని, అమెరికా ఖండమంతటా వలలు వలలుగా రోడ్లు నిర్మింపబడతాయనిగాని, నగరాలు పెరిగి పెరిగి చుట్టుప్రక్కల దూరాన ఉన్న శివార్లన్నిటినీ తమలో లీనంచేసుకుంటాయనిగాని, మారుమూల ఉంటున్నాననుకొనే రైతుకూడా తనకారులో ఎక్కి మూడు, నాలుగు గంటల్లోనే దగ్గిర ఉన్న పట్టణానికి రాగలుగుతాడని గాని, అమెరికా "చక్రాలమీద పరుగులెత్తే" జాతి అనిపించుకుంటుందనిగాని, ఆనాడు ఎవ్వరూ ఊహించలేదు. పంధొమ్మిదవ శతాబ్దంలో అత్యాశ్చర్యకరమైన మరికొన్ని పరిణామాలుకూడా సంఘటిల్లినవి. ఉత్తర కెరోలినా రాష్ట్రంలో కిట్టిహాక్ వద్ద రైట్ సోదరులు, మానవుడు అతి ప్రాచీనకాలంనుంచీ కంటున్న స్వప్నాన్ని సఫలంచేసి, గాలిలో ఎగరటానికి తగిన సాధనం కనిపెట్టారు. ఈ సాధనమే పిమ్మట విమానమని పిలువబడుతూంది. ఆ తరువాత కొన్ని సంవత్సరాలకు మానవుడు, యుద్ధ

వికలమైన ఐరోపా ఆకాశంలో విమానాల్లో పోరాడుకొనడం, పిమ్మట అచిరకాలంలోనే విమానాలలో ప్రయాణీకులు మహాసముద్రాలను దాటిపోతూ, అచిరకాలంలో ప్రపంచమంతటా పర్యటించ గలగడం సంభవించింది.

గుగ్లీల్మో మార్కొనీ అనే ఇటలీదేశపు యువకుడు ఐరోపా నుండి అట్లాంటిక్ సముద్రంమీదుగా అమెరికాకు వైర్లెస్ సందేశాలు పంపాడు; దానితో రేడియో ఉద్భవించింది. థామస్ ఎడిసన్ చలనచ్ఛాయా చిత్రవిధానాన్ని సమగ్రంగా రూపొందించి, దేశంలోను ప్రపంచంలోను చలనచిత్ర యుగానికి అంకురార్పణచేశాడు. విద్యుచ్ఛక్తి యంత్రసహాయంతో, మెట్లు ఎక్కనక్కరలేకుండా మేడల మీదికి పోవడానికి వీలైన 'లిఫ్టులు' లేక 'ఎలివేటర్లు' కనిపెట్టబడడంతో నగరాల్లో ఆకాశనికంటే మహోన్నత సౌధాలు లేచినవి. ఇవీ, ఇంకా అనేక నూతన పరిశోధనలూ ఇరవయ్యవశతాబ్ది ప్రారంభం నుండి అమెరికా సంయుక్తరాష్ట్రాలకు ఆధునిక స్వరూపం కల్పించినవి. అమెరికా ప్రపంచంలోని ప్రబల రాజ్యాలలో ఒకటిగా రూపొందడం ఎంత ఆకస్మికమో అంత స్వాభావికంగా జరిగిన సంఘటన కూడాను. అమెరికనులు విశ్రాంతి యెరుగని శక్తిసామార్థ్యాలు గలవారు. కనుకనే వారు ఉత్తర అమెరికాఖండంలోని అధికభాగాన్ని ఆక్రమించుకొనడం, దానిని గొప్ప పారిశ్రామిక జాతిగా రూపొందించ గలగడం సాధ్యమయింది. 1890 ప్రాంతంలో పశ్చిమదిశా విస్తరణ పూర్తి అయిపోయిన తరువాత, వీరు తమ సరిహద్దులకు వెలుపలి వ్యవహారాలలో క్రమక్రమంగా జోక్యం కలిగించుకొనడానికికూడా వీరి ఈ అపరిమిత ఉత్సాహమే కారణం. 1853 లో వీరు జపాన్‌కి ప్రపంచ వాణిజ్యరంగంలో ప్రవేశం కలిగించడం, మన్రోసిద్ధాంతాన్ని అనుసరించి పశ్చిమార్ధగోళంలోని తమ ఇరుగుపొరుగు దేశాల రక్షణకు పూనుకొనడం ఈ ఉత్సాహప్రేరిత చర్యలకు ఉదాహరణలుగా పేర్కొనదగినవి.

కడచిన శతాబ్దిచివర, ప్రపంచ విపణులలోను వాణిజ్యరంగంలోను తీవ్రమైన పోటీ బయలుదేరింది. ఐరోపా దేశాలలో ప్రారంభమైన ఈ పోటీలో అమెరికాకూడా ప్రవేశించింది. అయితే, ఐరోపా

దేశాలవలె వలసలను సంపాదించడానికి ప్రయత్నించక, ఆసియా, ఆస్ట్రేలియా మొదలైన దూరభూములకు పోయి వచ్చే తమ వాణిజ్య నౌకలు దారిలో బొగ్గు, నీరు నింపుకోడానికి మార్గమధ్యంలోని దీవులలో కొన్ని నౌకాశ్రయాలను సంపాదించడానికి మాత్రమే అమెరికా ప్రయత్నించింది. ఈ సమయంలోనే, కరీబియన్ సముద్రంలో విదేశ ప్రాబల్యం ఎక్కువ అవడం, పెనామా భూసంధివద్ద కాలువ త్రవ్వి, అట్లాంటిక్, పసిఫిక్ మహాసముద్రాలను కలపడానికి ఫ్రాన్సు ప్రయత్నిస్తూండడంవల్లా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వానికి ఆందోళన కలిగించింది.

ప్రపంచంలో తమ దేశానికిగల స్థానాన్ని గ్రహించిన అమెరికనులు "ఐరోపా దేశాలు మన పశ్చిమార్ధగోళంలోకి వచ్చి సామ్రాజ్యాలను విస్తరింప చేసుకుంటూంటే, మనం ఆ విషయాన్ని పట్టించుకొనకుండా చూస్తూ కూర్చోవలసిన అవసరమేమిటి?" అని ప్రశ్నించడమారంభించారు. "సముద్రాధిపత్యాన్ని సైనిక ప్రాబల్యంగల దేశాలకు వదిలిపెట్టి ఊరుకుంటే, ఒకనాడు వారు మనశత్రువులుగా పరిణమించే ప్రమాదం లేదా?" అని అడగడం ఆరంభించారు.

వార్ధక్యదశలో తప్పటడుగులు వేస్తూన్న స్పెయిన్ సామ్రాజ్యం ఈ ప్రశ్నలకు మరింత ప్రాముఖ్యం కల్పించింది. పశ్చిమ ఇండియా దీవులలో కెల్ల పెద్దది, సంపన్నమైనదీ అయిన క్యూబా ఫ్లోరిడా అగ్రానికి తొంభయ్యైదుమైళ్ళ దూరంలో ఉన్నది. ఈ ప్రాంతంలో 1895 లో ప్రారంభమైన కొన్ని సంఘటనల పరంపరవలన సంయుక్తరాష్ట్రం కూడా తలవని తలంపుగా ప్రపంచ "సామ్రాజ్య" దేశమయింది.

క్యూబాలో స్పానిష్ పరిపాలన కఠోరంగా ఉండేది. అచటి ఆదిమవాసులకు కూడా అది దుర్భరమైపోవడంతో వారంతా తిరుగుబాటు చేశారు. వారిని అణచడంకోసం రెండులక్షల స్పానిష్ సేన క్యూబాలో వచ్చిపడింది. ఉభయత్రా అతిక్రూరమైన దారుణయుద్ధం ప్రారంభమయింది. క్యూబాలోని అమెరికన్ రైతులుకూడా ఈ మారణహోమంలో ఆహుతి అవుతున్నారు. నైతిక, ఆర్థిక హేతుప్రేరితుడైన ప్రెసిడెంట్ మెకిన్లీ, ఈ రక్తపాతాన్ని అరికట్టడానికి ప్రయత్నించాడు. కాని స్పెయిన్ ప్రభుత్వం, "నీ పని నీవు చూచుకో"మ్మని

ఆయనను నిష్ఠురంగా హెచ్చరించింది. ఈ లోగా నీతి నియమాలు లేకుండా ఆందోళనకరవార్తలు ప్రచారంచేసే పత్రికల వలన అమెరికనుల ఆవేశం మిన్నుముట్టింది. 'మైనీ' అనే అమెరికా యుద్ధనౌక హవానా నౌకాశ్రయంలో, రెండువందల అరవైమంది అమెరికన్ నావికులతో సహా ముంచివేయబడిందని ఈ పత్రికలు పెద్దపెద్ద శీర్షికలతో ప్రకటించేసరికి, దేశమంతా కోపోద్రిక్తమై యుద్ధం ప్రకటించవలసినదిగా ఆందోళనచేసింది. ఆ నౌకను ఎవరు నాశనం చేశారు? ఎలా నాశనం చేశారు? లేక దైవికంగా, ఆనౌకలోనే జరిగిన ప్రేలుడు ఫలితంగా అది నాశనమయిందా? – అన్న ప్రశ్నలకు; నిజానికి నేటికీ జవాబులేదు. స్పెయిన్, క్యూబాలో యుద్ధం విరమించాలన్న అమెరికా సూచనను చివరిక్షణంలో సమ్మతించి, యుద్ధాన్ని వారించాలని ప్రయత్నించింది. కాని, ఆ సమ్మతిని లెక్కచేయకుండా "మైనీ విషాధగాధను మరువకండి" అనే నినాదాంతో క్యూబా ప్రజలకు వారి నిర్దాక్షిణ్య నిరంకుశ పాలకులనుండి విముక్తి కలిగించి, స్వాతంత్ర్యం ప్రసాదించడానికి గాను అమెరికా ధర్మయుద్ధం ప్రారంభించింది.

1898 లో జరగిన ఈ స్పానిష్–అమెరికన్ యుద్ధం అతివేగంగా ఏకముఖంగా జరిగింది. చైనాలో హాంకాంగ్ రేవులోనున్న ఒక అమెరికన్ నౌకాదళం అడ్మిరల్ జార్జిడ్యూయీ నాయకత్వంక్రింద వెంటనే బయలుదేరి, స్పెయినువారి వశంలోఉన్న ఫిలిప్పీన్ దీవులమీద దాడిచేసి, మానిలావద్ద స్పానిష్ నౌకాదళాన్ని విధ్వంసంచేయడం, ఈ యుద్ధంలో జరిగిన ప్రథమ సంఘటన. ఇందులో అమెరికా నౌకాదళంలో ఒక్క ప్రాణంకూడా నష్టం కాలేదు. ఫిలిప్పీన్ దీవులు అమెరికా శతఘ్నుల కెదురుగా, నిస్సహాయ, నిరాశ్రయస్థితిలో అమెరికా నుండి ఆక్రమణదళాల రాకకోసం ఎదురుచూస్తూ ఉండిపోయినవి.

పశ్చిమార్ధగోళంలో, అమెరికాసైన్యాలు క్యూబాలో ప్రవేశించి చురుకుగా వెంటవెంటనే జరిగిన అనేక యుద్ధాలలో స్పానిష్ సేనను ఓడించినవి. శాన్ జువాన్ కొండవద్ద, న్యూయార్కుకి చెందిన కర్నల్ థియొడోర్ రూజ్వెల్టు, అనే వర్ధిష్ణువైన యువరాజకీయవేత్త నాయకత్వాన జరిగిన సుప్రసిద్ధమైన "రఫ్ రైడర్సు" దాడి పూర్తిగా విజయవంతంగా ముగిసింది. అనంతరం కొన్నివారాలకు, క్యూబాలోని శాంతి

యూగో తీరానికి సమీపంలో మరొక స్పానిష్ నౌకాదళం అమెరికనులచే నాశనం చేయబడడంతో, స్పెయిన్ సైన్య ప్రతిఘటన అంతమైపోయింది. మొత్తంమీద ఈ యుద్ధం మూడు నెలలపాటు మాత్రమే సాగింది. కరేబియన్ సముద్రంలోని స్పానిష్‌దీవులు అమెరికాకు వశమైనవి. దూరంగా పసిఫిక్ మహాసముద్రంలోఉన్న మానిలాపైన కూడా "చుక్కలు-చారల" పతాకం ఎగురవేయబడింది. శాంతిసమాలోచనల సందర్భంలో సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమొక క్లిష్టసమస్యను ఎదుర్కొనవలసి వచ్చింది. తాను క్యూబాకు స్వాతంత్ర్యం లభింపజేసి, స్పెయిన్‌కి చెందిన ఇతరదీవులన్నింటినీ తిరిగి స్పెయిన్‌కి అప్పగించివేయడమా ? లేక సామ్రాజ్యవాదధోరణిలో తన స్వాధీనంలోనే ఉండే వలసలుగా ఉంచుకొనడమా ? ఈ వివాదం తీవ్రంగానే సాగింది. ఏనాటికీ స్వతంత్రంగా మన్నడంగాని, సంయుక్తరాష్ట్రంలో చేరడంగాని, సాధ్యంకాదని దూరభూములను స్వాధీనం చేసుకొనడం అమెరికా రాజ్యాంగంలోని ప్రాతిపదిక సూత్రాలకే విరుద్ధమని చాలమంది అమెరికనులు వాదించారు. ప్రపంచ ప్రముఖదేశాలలో ఒకటిగానున్న అమెరికా "విస్పష్టలక్ష్య" సాధనకు జాతీయ విస్తరణ, వలసల సంపాదన తప్పనిసరిగా అవసరమనీ, ఆ దీవులలోని అమాయకులైన ఆదిమవాసులను తిరిగి స్పానిష్ యజమానులకు అప్పగించడం క్రూరమనీ మరికొందరు వాదించారు. ఈ వలసలను తిరిగి స్పెయిన్‌కి అప్పగించరాదనే ప్రెసిడెంట్ మెకిన్లీ నిశ్చయించాడు.

తత్ఫలితంగా, స్పెయిన్ దేశం 1901 లో బలవంతంగా పోర్టోరీకో, గ్వామ్, ఫిలిప్పీనులను సంయుక్తరాష్ట్రాలకు వదిలివేసింది. క్యూబా, అమెరికా సంరక్షణలోఉండే రిపబ్లిక్‌గా ప్రకటించబడింది.

వీటికతోడు చాలా సంవత్సరాల క్రిందట అమెరికన్ మిషనరీల చేతను, వర్తకులచేతను వలసలు ఏర్పరచబడిన హవాయీని కూడా సంయుక్తరాష్ట్రప్రభుత్వం స్వాధీనంచేసుకొని 1900 సంవత్సరంలో దానిని తన పాలనలోని ప్రాంతాలలో ఒకటిగా ప్రకటించింది.

ఈ విధంగా అమెరికా సంపాదించిన నూతన సామ్రాజ్యంలో బాగా ప్రాముఖ్యమైన ప్రాంతం డెబ్బయ్యైదు లక్షల జనాభాగలిగిన ఫిలిప్పైన్ దీవులు. ఈ ఫిలిప్పైన్ దీవుల ప్రజలు ఎమిలియో ఆగినాల్డో అనే

తమ నాయకుడి క్రింద స్వాతంత్ర్యంకోసం స్పెయిన్‌తో పోరాడారు ఇప్పుడు వారు తమ నూతన యజమానులతో పోరాడవలసి వచ్చింది. అడవులలో, పర్వతాలలో దీర్ఘకాలం గెరిల్లాయుద్ధాలు జరిగినవి. ఫిలిప్పీన్ తిరుగుబాటు పూర్తిగా అంతమయేలోగా యాభైవేల అమెరికన్ సైన్యాన్ని అక్కడికి పంపవలసి వచ్చింది.

పైగా సంయుక్తరాష్ట్రానికి అచిరకాలంలోనే చైనాలో పెద్ద చిక్కొకటి సంభవించింది. ఐరోపా దేశాలవారు తమ వాణిజ్యం కొనసాగించుకొనడంలో పేచీలు రాకుండా పాపమా దురదృష్టదేశాన్ని వివిధ వాణిజ్య ప్రాంతాలుగా విభజించుకొన్నారు. ఈ విధంగా పాశ్చాత్యదేశాలచే కొల్లగొట్టబడుతూండడం సహించలేక, బాక్సర్లు అనే పేరుతో చైనా దేశస్థులు ఒక విప్లవసంస్థను ఏర్పాటుచేసుకొని, పాశ్చాత్యులను తిరిగి చైనానుండి తరిమివేయుడానికి, లేదా హత్యచేయుడానికి నిశ్చయించుకొన్నారు. 1900 లో జరిగిన ఈ బాక్సర్ విప్లవంలో ఈ చైనావారు పెకింగ్‌లోని బ్రిటిష్ సైనికస్థావరాన్ని ముట్టడించారు; కాని, చివరికి అంతర్జాతీయ సైన్యంవచ్చి వారిని తరిమివేసింది. ఈ సైన్యంలో ఫిలిప్పీన్‌లనుండి వచ్చిన అమెరికా సంయుక్తరాష్ట్ర సేనకూడా ఉన్నది. అయితే తక్కిన దేశాలకన్న సంయుక్తరాష్ట్రమే చైనాకు సన్నిహిత మిత్రదేశమయింది. ఈ బాక్సర్ల తిరుగుబాటుకు అవకాశమిచ్చినందుకుగాను చైనాప్రభుత్వం దానివలన నష్టపడిన దేశాలకు పరిహారం ఇవ్వడానికి అంగీకరించినప్పుడు, సంయుక్తరాష్ట్రం తన వాటాకువచ్చిన ధనాన్ని అమెరికా కళాశాలల్లో చైనా విద్యార్థులకు విద్యాసౌకర్యాలు కల్గించడానికి వినియోగించింది. పైగా, సంయుక్తరాష్ట్రం "బహిరంగ విధానాన్ని" ప్రోత్సహించడానికి తన పలుకుబడిని వినియోగించింది. చైనాను విదేశ వాణిజ్య ప్రాంతాలుగా విడదీయడం మానివేయాలని, చైనాదేశపు సరిహద్దులను, ప్రభుత్వాన్నీ విదేశీయులంతా గౌరవించాలనీకూడా అమెరికా పట్టుపట్టింది.

* * *

స్వదేశంలో, సంయుక్తరాష్ట్రాలు 1900 నాటికి అభ్యుదయంతో, ఐశ్వర్యాభివృద్ధితో పొంగి పొరలుతూన్నవి. నేలబొగ్గు, ఇనుము, ఉక్కు, ఆహారధాన్యాలు అమితంగా ఉత్పత్తి అవుతున్నవి. దిగుమతులకన్న

ఎగుమతులు చాలా ఎక్కువ అయినవి. అలాస్కాలో పెద్దపెద్ద బంగారుగనులు కనుగొనబడడంతో కరెన్సీకి స్థాయి యేర్పడింది. ఈ పరిస్థితులలో మెకిన్లీ తిరిగి రెండవసారి ప్రెసిడెంట్‌గా ఎన్నిక అవడానికి ఎక్కువ కష్టపడవలసిన అవసరం లేకపోయింది. ఈ సారికూడా డెమొక్రాట్లు విలియం జెన్నింగ్స్ బ్రయాన్ని తమ అభ్యర్థిగా నిలబెట్టారు. భారీపరిశ్రమలు దేశానికి అంతులేని అభ్యుదయాన్ని సమకూరుస్తున్నవి.

1900 సంవత్సరంలో మెకిన్లీతోపాటు, వైస్ ప్రెసిడెంటుగా శాన్‌జువాన్‌హిల్ యుద్ధవీరుడు, అమెరికా చరిత్రలో అత్యంతాకర్షణీయ వ్యక్తి అయిన థియోడోర్ రోజ్వెల్ట్ ఎన్నికయాడు. ఐశ్వర్యవంతుల బిడ్డ అయిన "టెడ్డీ" రోజ్వెల్ట్, హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడై ఆరోగ్యంకోసం కొన్ని సంవత్సరాలపాటు పడమటికిపోయి పసులకాపరిగా పనిచేశాడు. పిమ్మట న్యూయార్క్ గవర్నర్‌గా ఎన్నిక అయి బుజువర్తనుడుగాను 'సంస్కర్త'గాను ప్రతిష్ట సంపాదించడంతో అచటి రిపబ్లికన్ రాజనీతివేత్తలు ఎలాగైనా ఇతడిని వదల్చుకోదలచి, స్వతంత్రించి ఏమీ చేయడానికి వీలుండని వైస్ ప్రెసిడెంట్ పదవికి అభ్యర్థిగా పంపారు.

కాని, అచిరకాలంలోనే వారి కౌటిల్యం విఫలమయింది. ఆరు నెలలు గడవకముందే ప్రెసిడెంటు మెకిన్లీ హత్యచేయబడడంతో, నాటికి నలభై మూడేళ్ళ వయస్సు మాత్రమేగల రోజ్వెల్ట్ జాతీయ ప్రభుత్వ రథసారథి అయాడు. కర్మవీరుడైన రోజ్వెల్ట్ వెంటనే భారీ పరిశ్రమలను అదుపులో పెట్టడానికి, సమర్థమైన విదేశాంగ విధానం అమలు జరపడానికీ, చెడిపోయే స్థితిలోఉన్న పశ్చిమప్రాంత భూములను బాగుచేసి, సాగుచేయించడానికి ఒక ప్రణాళిక తయారుచేశాడు. అన్ని తరగతులవారికీ ఉపయోగపడే ఈ కార్యక్రమానికి "స్క్వేర్ డీల్" ( Spuare Deal ) అని పేరు పెట్టాడు.

రోజ్వెల్ట్‌కి పారిశ్రామిక సంస్థలన్నా, సమ్మేళనాలన్నా ప్రత్యేకం ద్వేషమేమీ లేదు. అమెరికా పెట్టుబడిదారీ విధానంలో అవి సహజమైన, అవసరమైన భాగాలని ఆయన విశ్వాసం. శాసనాలను ఉల్లంఘించే వారికీ, దుర్మార్గులైన భాగ్యవంతులకూ, లంచాలుపెట్టి మోసగించి, ప్రజాశ్రేయస్సుకి భంగంకలిగించే అవినీతిపరులైన ఐశ్వర్యవంతులకూ మాత్రమే అతడు శత్రువు.

రోజ్వెల్టు ప్రెసిడెంటు అయినపిమ్మట, అచిరకాలంలోనే అతని కార్యదీక్ష వ్యక్తమయింది. 1890 లో వ్యాపారస్థులను అదుపులో ఉంచడానికి కాంగ్రెసు షర్మన్ అంటీట్రస్టు శాసనాన్ని ఆమోదించించి. కాని ఈ శాసనం వ్యాపారస్థులకు ఏమీ ఇబ్బంది కలిగించలేదు సరికాదా, కార్మికులకు సమ్మెచేసే హక్కులేదని ఆ శాసనానికి వ్యాఖ్యానం చెప్పబడడం వలన, వారికి చాలా ఇబ్బంది కలిగింది. కాని రోజ్వెల్టు అభిప్రాయం మాత్రం వేరుగా ఉంది.

నార్దరన్ పసిఫిక్, గ్రేట్ నార్దరన్ రైలురోడ్ కంపెనీలు ఒక సమ్మేళనంగా ఏర్పడి పశ్చిమప్రాంతాలలోని రైలురోడ్లను చాలా భాగం ఒకే యాజమాన్యం క్రిందకు తీసుకు వచ్చేసరికి రోజ్వెల్టు షర్మన్ శాసనాన్ని పురస్కరించుకొని ఆ విధమైన గుత్తవ్యాపారం రద్దుచేయబడాలని కోర్టులో దావా చేశాడు. ఈ దావాలో ప్రభుత్వమే గెలిచింది. ప్రజలు విశేషంగా ఆనందిచారు. తాత్కాలికంగా షర్మన్ శాసనం శక్తిమంతమైనదిగా కనిపించింది.

1902 వేసవిలో దేశంలోని నేలబొగ్గుగని పనివాళ్ళంతా కార్మిక సౌకర్యాలకోసం సమ్మెచేశారు. గనుల యజమానులు మధ్యవర్తిత్వానికి అంగీకరించలేదు. శీతకాలం సమీపించిన కొలది, బొగ్గుకరువు ప్రారంభమయింది. ధర విపరీతంగా పెరిగిపోవడంవల్ల చలితోను, జలుబులతోను ప్రజలు నానాబాధలు పడుతున్నారు. నిష్పాక్షిక విచారణ సంఘం మధ్యవర్తిత్వానికి యజమానులు అంగీకరించకపోతే, కేంద్ర ప్రభుత్వసైన్యసహాయంతో గనులలో పని సాగిస్తుందని రోజ్వెల్టు యజమానులను మందలించాడు. చివరికి, యజమానులు అమితాగ్రహంతో లొంగివచ్చారు. మళ్ళీగనులలో పని ప్రారంభమయింది. కార్మికుల వేతనాలు నూటికి పదిపాళ్లు హెచ్చు చేయాలని మధ్యవర్తుల సంఘం తీర్పు చెప్పింది.

దేశంలోని సహజసంపదను పరిరక్షించడంకోసం రూజ్వెల్టు పశ్చిమ ప్రాంతంలోని భూములను అమ్మడం మానివేసి, కేంద్రప్రభుత్వ రక్షణలో ఉంచడానికి నిశ్చయించడం ఆ ప్రాంతాల కలపవర్తకులకు పశువుల మందలుగల మోతుబరులకు ఆగ్రహం కలిగించింది. వీరు అప్పటికే చాలా అడవులను నరికివేసి, గడ్డిమైదానాలను మేపి పాడు

చేసి, మళ్ళీ వాటిముఖం చూడకుండా పాడుపెట్టారు. మరొక ప్రక్క నుంచి ఆ పత్రలను పంటభూములుగా చేయడానికి నీటిపారుదల నిర్మాణాలు, ఆనకట్టలు డాములు నిర్మించడానికి ఏర్పాట్లు చేశాడు.

ఈ విధంగా దేశీయ వ్యవహారాలలో చూపుతున్న దీక్షాసామర్థ్యాలను, రోజ్వెల్ట్ విదేశాంగ వ్యవహారాలలో కూడా సమంగా, సమృద్ధిగా ప్రదర్శించాడు. అయితే, సామ్రాజ్యవాద వ్యతిరేకులు ఆయనచర్యలు తొందరపాటు చర్యలనీ, రాజనీతి విరుద్ధములనీ, "మెత్తగా మాట్లాడుతూ, చల్లగా తోక తెగగోసే" ఆయనపద్ధతి ఆయన మోసకారితనానికి ప్రబల నిదర్శనమనీ విమర్శిస్తున్నారు. అయినప్పటికీ రోజ్వెల్టు ప్రముఖ ప్రపంచనాయకుడయాడు. ఆయన ప్రతిష్ఠ, పలుకుబడి అపారంగా పెరిగిపోయినవి.

అమెరికాకు ఇప్పుడు పసిఫిక్ మహాసముద్రం అవతలకూడా ఆస్తిపాస్తులు ఏర్పడడంవలన పెనామా భూసంధివద్ద కాలువ చాలా అవసరమయింది. ఆ కాలువ త్రవ్వడానికి లోగడ ఫ్రెంచివారు చేసిన ప్రయత్నం విఫలమయింది. ఐరోపానుండి, అమెరికా అట్లాంటిక్ తీరంనుండి పసిఫిక్ సముద్రంలోకి వెళ్ళగోరిన నౌకలు దక్షిణ అమెరికాఖండ దక్షిణాగ్రాన్ని చుట్టిపోవలసి వస్తూంది. వీలైతే కొలంబియారాష్ట్రమైన పెనామాగుండాను, కాకపోతే నికరాగ్వాగుండాను కాలువ త్రవ్వడానికి 1902 లో కాంగ్రెసు ఆమోదం తెలిపింది. పెనామాగుండా కాలువ త్రవ్వడానికి కొలంబియా అనుమతిస్తే ఫ్రెంచివారు తాము మూసివేసిన కంపెనీ తాలూకు పరికరాలను సాధనసంపత్తిని అమెరికాకు అమ్మివేయదలచుకున్నట్లు రోజ్వెల్టుకి తెలియపరిచారు.

యాభైమైళ్ళ వెడల్పుగల పెనామా భూసంధివద్ద ఒక చిన్న చీలికను తనకు కాలుకి ఇచ్చేయెడల అమెరికా సంవత్సరాని కొక కోటి డాలర్లు బాడుగ చెల్లించగలదని రోజ్వెల్టు పంపిన సందేశం కొలంబియాను సంతృప్తిపరచలేదు. అంతటి విలువైన హక్కుకు ఈ బాడుగ చాలా తక్కువ అని కొలంబియా రిపబ్లిక్ భావించింది. కాని, ఈ బేరానికి ఒప్పుకొనకపోవడంవలన, అటుపిమ్మట కొలంబియా పెనామాను పూర్తిగా కోల్పోయింది. పెనామా రాష్ట్రంలో శ్రద్ధగా సన్నద్ధం చేయబడిన విప్లవం బయలుదేరింది. ఆ సమయంలో అమెరికా

యుద్ధనౌకలు ఆ దరిదాపులనే ఉండడం తటస్థించినందున కొలంబియా ప్రభుత్వం ఆ విప్లవాన్ని అణచివేయలేదు. ఈ విధంగా, అతివిస్మయాస్పదస్థితిలో సంయుక్తరాష్ట్రప్రభుత్వం పెనామా రిపబ్లిక్‌తోనే ఒప్పందం చేసుకొని కొలంబియాకు ఇస్తానన్న డబ్బును పెనామాకే ఇచ్చి, కాలువ త్రవ్వకం ప్రారంభించింది. పెనామాకాలువ ప్రపంచచరిత్రలో ఇంజనీర్లు సాధించిన అద్భుత విజయాలలో ఒకటిగా పేర్కొనదగినది.

సాంప్రదాయ విరుద్ధమైన ఇలాంటి ఉపాయాలు అనుచితమైనవి కావచ్చును; ఉత్తమ లక్ష్యాన్ని సాధించడానికి అభ్యంతరాలు కలిగినప్పుడు వాటిని అధిగమించడానికి ఇట్టివిధానాలు అవలంబించినా తప్పు లేదని వాదించవచ్చును. ఈ చర్య మంచిదైనా కాకపోయినా, దక్షిణ అమెరికాలోని చిన్నదేశాలకు సంయుక్తరాష్ట్రాల అధికార విస్తరణను చూచి, తీవ్రమైన అవిశ్వాసం మాత్రం ఏర్పడింది. ప్రెసిడెంట్ రూజ్వెల్టు మన్రో సిద్ధాంతానికి తన వార్తికాలు ప్రకటించడంతో ఈ అనుమానం ధృఢపడింది.

చాలా లాటిన్, దక్షిణ అమెరికాదేశాలు జాతీయాభ్యుదయ కార్యక్రమాలు కొనసాగించుకొనడంకోసం ఐరోపానుండి అప్పులు చేసి, వివిధ కారణాలవలన తీర్చలేకపోయినవి. అప్పులను వసూలు చేయడంకోసం విదేశ నౌకాదళాలువచ్చి ఆయాదేశాల రేవులలో తిష్ఠ వేసినవి. ఇట్టి సంఘటనలను వారించడానికే, దివాలాతీసిన దేశాలను విదేశాలు ఆక్రమించుకొనకుండా చేయడానికిగాను, అట్టి ఋణాలను సంయుక్తరాష్ట్రమే వసూలుచేసి పెడుతుందనీ, అప్పుతీర్చలేని దేశాలలో ఆర్థికసౌష్ఠవం ఏర్పడేవరకు సంయుక్తరాష్ట్రప్రభుత్వమే ఆదేశవ్యవహారాలను సరిదిద్దుతుందని రూజ్వెల్ట్ ప్రకటించాడు. ఈ విధంగా మన్రో సిద్ధాంతాన్ని తీవ్రతరం చేయడంవల్ల లాటిన్ అమెరికా దేశాలకు చాలా సంతాపం కలిగినా, దానివలన పశ్చిమార్థగోళానికి శాంతి స్థైర్యాలు మాత్రం సిద్ధించినవి.

తిరిగి 1904 లో ప్రెసిడెంట్ ఎన్నిక వచ్చేసరికి, "టెడ్డీ" రూజ్వెల్టు ప్రజానురంజకత మహోన్నతస్థాయిలో ఉన్నది. అందువల్ల అతడు మితవాది అయిన తన డెమొక్రాటిక్ ప్రత్యర్థి ఆల్టన్ పార్కర్

పైన సులభంగా విజయం సాధించాడు. రష్యా-జపాను యుద్ధాన్ని ముగింపు చేసి పోర్ట్స్‌మత్ (న్యూహాంప్‌షైర్) వద్ద సంధి జరిపించడం, మొరాకోను గురించి జర్మనీ-ఫ్రాన్సులు యుద్ధానికి దిగబోతుండగా వారించడానికి సహాయపడడం - రెండవ టరములో అంతర్జాతీయ వ్యవహారాల్లో రూజ్వెల్టు సాధించిన ఘనకార్యాలకు ఉదాహరణలు. దేశీయ వ్యవహారాలలో రైలురోడ్ కంపెనీల దురాచారాలను అరికట్టడానికి మరికొన్ని శాసనాలు చేయించాడు,

ఎటుచూచినా సంస్కరణ వాతావరణమే కనిపిస్తుంది. "మక్రాకర్స్" (muckrakers) అనే పేరుతో కొందరు రచయితలు మాంసపు బంగీలలోను, ఇతర ఆహార పరిశ్రమలలోను అమలులోఉన్న అనారోగ్యకర ఆచారాలను బయటపెట్టేసరికి, వాటిని అరికట్టడానికి శాసనాలు చేయబడినవి. స్త్రీలకు వోటుహక్కు ఇవ్వాలనీ, సెనేట్ సభ్యులను మోతుబరి వ్యాపారస్తుల పలుకుబడిలోనైన రాష్ట్ర శాసనసభలుకాక, ప్రజలే ఎన్నుకోవాలని దక్షిణాదిని బయలుదేరిన ఉద్యమం బలపడింది. ఈ వాదాన్ని బలపరచిన థియొడోర్ రూజ్వెల్ట్ తిరిగి 1908 లో కూడా ఎన్నిక అయేవాడే గాని, దానికతడు ఇష్టపడక విలియం హావార్డ్ టాఫ్టును తన వారసుడుగా పేర్కొనగా అతడు మరల విలియం జెన్నింగ్స్ బ్రయాన్‌ని ఓడించాడు.

* * *

అత్యంత సమర్థుడైన రూజ్వెల్ట్ తరువాత ఎవరు ప్రెసిడెంట్ అయినా, బలహీనుడుగానే కనిపించడం సహజం. సౌమ్యంగా స్థూలంగా ఉండే టాఫ్టుకీ అదేస్థితి ఏర్పడింది. ఇతడు న్యాయవాదిగా, రాజకీయ వేత్తగా సమర్థుడని పేరొందినా, ప్రజలకు తనను తాను "అమ్ముకోన" లేకపోయాడు. వ్యాపారసంస్థల దురాచారాలను అరికడుతూ ఇతడు రూజ్వెల్టు విధానాలనే అనుసరిస్తూండగా అకస్మాత్తుగా ఇతడికి తలకు మించిన సమస్యలు ఎదురైనవి. రిపబ్లికన్ పార్టీ రెండుగా విడిపోతూంది. ఒకవర్గం రూజ్వెల్టు విధానాలను ఇంకా చురుకుగా అములుజరపాలనీ, వ్యాపారసుంకాలను వెంటనే తగ్గించాలనీ, ఐశ్వర్యవంతులపైన ఆదాయపుపన్ను విధించాలనీ కోరిన ఉదారవాదులతో కూడినది. రెండవది రూజ్వెల్టు విధానాలకు సమ్మతించక, మోతుబరి వ్యాపారస్థుల ప్రభుత్వమే సాగాలని కోరిన సంప్రదాయవాదుల వర్గం.

ప్రెసింటుగా టాఫ్ట్ నిదానంగా వ్యవహరిస్తూ ఉండడంతో రిపబ్లికన్ పార్టీ ఉదారవాదులకు విసుగుపుట్టి అతడు అభివృద్ధి నిరోధకుడని వారు నిందించడం మొదలుపెట్టారు. దీనికితోడు ఇతడు సుంకాలను తగ్గించలేకపోవడమేకాక, రోజ్వెల్టు తాబేదార్లుఉన్న కీలకస్థానాలలో కొందరు "అభివృద్ధి నిరోధకులను" నియమించేసరికి, ఉదారవాదులంతా ప్రభుత్వానికి ఎదురుతిరిగి, జాతీయరిపబ్లికన్ అభ్యుదయపక్షాన్ని ఏర్పాటుచేశారు. సెనేటర్ రాబర్ట్ లా ఫాలెట్టీ ఈ నూతనపక్షానికి నాయకుడు.

విస్కాన్సిన్ రాష్ట్ర గవర్నరుగా లా ఫాలెట్టీ అభ్యుదయసూత్రాలను నిర్వచించి వాటిని అమలు జరిపాడు. సాధ్యమయినంతవరకు ప్రజాశ్రేయస్సుదృష్ట్యా రైలురోడ్ కంపెనీలను, భారీవ్యాపారస్థులను అదుపులో పెట్టాడు. కార్మికుల హక్కులను కాపాడాడు; రాష్ట్రప్రభుత్వపు ఆదాయపుపన్ను విధించాడు. రాష్ట్రశాసనసభలపై ప్రజలకు ఎక్కువ అధికారం కలుగజేసి, కొందరు పౌరులు సమష్టిగా ఒక శాసనం చేయవలసిందిగా రాష్ట్ర శాసనసభను కోరడానికి, రిఫరెండంద్వారా ప్రజలు శాసనసభ ఆమోదించిన అంశాలను సమర్థించడానికీ లేక నిరాకరించడానికీ, చాలినంతమంది ప్రజలు సంతకాలుచేసి విజ్ఞప్తిచేస్తే రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు బర్తరఫ్ చేయుబడాలనీ; ఎన్నికలముందు జరిగేపార్టీ మహాసభలకు ప్రతినిధులను ఆయాపక్షాల పెద్దలుగాక, తొలిఎన్నికలలో ప్రజలే ఎన్నుకోవాలనీ-కూడా అభ్యుదయవిధాన ప్రధాన లక్ష్యాలు. ఈ ప్రజాపరిపాలనా విస్తరణ పద్ధతులన్ని రిపబ్లికన్ పార్టీ విధానాలలో చేర్చబడాలనీ ఈ అభ్యుదయవర్గం కోరింది. థియొడోర్ రోజ్వెల్టు ఆఫ్రికాలోను, ఐరోపాలోను సంచారంచేసి ఈ అభ్యుదయోద్యమం బలపడుతూన్న సమయంలో స్వదేశానికి తిరిగివచ్చి, తనదికూడా అభ్యుదయవాదుల పక్షమే అని ప్రకటించాడు. రోజ్వెల్టుకూడా టాఫ్టవంటివాడే అని భావించిన లాఫాలెట్టీకి కలిగిన విస్మయానికి అంతులేదు. పైగా, ఈ ప్రకటనతో అభ్యుదయవాదులంతా రోజ్వెల్టువెంట 1912 లో జరిగిన రిపబ్లికన్ పార్టీ మహాసభకు హాజరయి తిరిగి మూడోసారి రోజ్వెల్టునే ప్రెసిడెంట్ పదవికి తమ అభ్యర్థిగా ప్రతిపాదించారు.

ఒకప్పుడు సన్నిహిత మిత్రులైన రోజ్వెల్టు - టాఫ్టులు ఇప్పుడు ప్రబల శత్రువులవలె అభ్యర్థిత్వకోసం పోటీచేశారు. రోజ్వెల్టు పేరుప్రతిష్టలకు ప్రతిగా టాఫ్ట్ పార్టీ యంత్రాంగాన్ని కూడగట్టుకొని మొదటి వోటింగులోనే అభ్యర్థిగా ఎన్నిక అయాడు. దాంతో అగ్రహావేశ పరవశుడైన రోజ్వెల్టు తన అనుచరులతోపాటు సభనుండి నిష్క్రమించి మూడవపార్టీ ఏర్పరచడానికి నిశ్చయించాడు. ఈ విధంగా 1860 లో డెమొక్రాట్లవలె, నేడు రిపబ్లికన్ పార్టీ రెండుగా చీలిపోయింది.

రెండు నెలల తరువాత రోజ్వెల్టు అనుచరుల ఉత్సాహంతో మరొక సమావేశం జరుపుకొని రోజ్వెల్టుని తమ ప్రోగ్రెసివ్ పార్టీ లేక ("బుల్ మూస్" పార్టీ) అభ్యర్థిగా పేర్కొన్నారు. మూడవసారి ప్రెసిడెంట్ అయి సంప్రదాయాన్ని భంగించడం తనకు ఇష్టంలేదని లోగడ రోజ్వెల్టు అన్నమాటను జ్ఞాపకం చేసినవారికి, "వరుసగా మూడుసారులు ఎన్నిక కారాదని మాత్రమే అప్పుడు నేనన్నది" - అని ఆయన సంజాయిషీ చెప్పాడు. విస్కాన్సిన్ రాష్ట్రంలో లాఫాలెట్టీ అమలుజరిపిన ప్రజాపరిపాలన విస్తరణ విధానాలు, సెనేటర్లను ప్రత్యక్షంగా ప్రజలే ఎన్నుకొనడం, భారీ వ్యాపారసంస్థలను అదుపులో పెట్టడం, విస్తృత భూసారరక్షణ కార్యక్రమం ఈ ప్రోగ్రెసివ్ పార్టీ ఎన్నికల ప్రణాళికలో ప్రధానాశయాలుగా ప్రకటించబడినవి.

రిపబ్లికనులలో చీలిక ఏర్పడడం దేశంలోని డెమొక్రాట్లందరికీ పెద్ద పండగ అయింది. ఇరవై సంవత్సరాల తరువాత తిరిగి తాము అధికారంలోకి రావడానికి గొప్ప అవకాశం లభించింది. బ్రయాన్ ఎంత గొప్ప వక్త అయినా అప్పటికే చాలాసార్లు ఓడిపోవడం వలన డెమొక్రాట్లు ఈ పర్యాయం బాల్టిమోర్లో జరిగిన పార్టీ మహాసభలో న్యూజెర్సీ గవర్నర్ వుడ్రోవ్ విల్సన్ని అభ్యర్థిగా ఎన్నుకొన్నారు. ప్రజాప్రతినిధిసభ స్పీకరు చాంప్ క్లార్క్తో తీవ్రంగా జరిగిన ఈ పోటీలో 45 సార్లు వోటింగ్ జరిగినపిమ్మట బ్రయాన్ తోడ్పాటుతో విల్సన్ అభ్యర్థిగా ఎన్నిక అయాడు. ఈ విల్సన్ జన్మతః వర్జీనియా వాసు; ప్రిన్స్టన్లో చదువుకొని అక్కడే కళాశాలాచార్యుడు గాను, అధ్యక్షుడు గాను, పనిచేసి, పిమ్మట న్యూజెర్సీ గవర్నరయాడు; విద్వాంసుడు;

ఆదర్శవాది. ప్రోగ్రసివ్ పార్టీవారి వలెనే భారీ వ్యాపారస్థులకు, పారిశ్రామిక సంస్థల గుత్తవ్యాపార పద్ధతికి విరోధి.

"సంయుక్త రాష్ట్రప్రభుత్వం భారీవ్యాపారస్థుల పెంపుడు బిడ్డ లాగ కనిపిస్తూన్నది. కనుక ఆ బిడ్డకు స్వతంత్ర సంకల్పాలేమీ ఉండటానికి వీలులేకుండాపోయింది;" అంటూ వారిని తీవ్రంగా విమర్శించి, ఆ పరిస్థితిని తాను పూర్తిగా సంస్కరింప దలచుకొన్నట్లు ప్రకటించాడు. అక్కడితో డెమొక్రాట్లలో ఉదారవాదులంతా తమ అభ్యర్థికే వోటు చేయగలరని భావించిన ప్రోగ్రసివ్ పార్టీ ఆశలు అడుగంటినవి. నవంబరులో ఎన్నిక జరిగింది. విల్సన్ గెలుపొందాడు. విల్సన్ కి 60 లక్షల వోట్లకు కొంచెం పైగాను, రూజ్వెల్టుకి 40 లక్షల వోట్లు, టాఫ్ట్ కి 35 లక్షల వోట్లు యూజినీ డెబ్స్ అనే సోషలిస్టుపార్టీ అభ్యర్థికి పదిలక్షల వోట్లు లభించినవి.

"కళాశాలాచార్య" పదవిలోంచి వచ్చిన తమ క్రొత్త ప్రెసిడెంటు కాంగ్రెసులోకి రాజకీయ కుంభకోణాలకు తట్టుకోలేడని భయపడినవారికి అచిరకాలంలో నేవి ల్సన్ విస్మయం కలిగించాడు. విల్సన్ "ప్రజలమనిషి" కాడు, దృఢమైన నిశ్చితాభిప్రాయాలు కలవాడు. "నూతన స్వాతంత్ర్యం" అన్నశీర్షికతో గ్రంథంగా ప్రచురింపబడిన ఎన్నిక ప్రచారోపన్యాసాలలో తాను వివరించిన కార్యక్రమాలను అక్షరాలా అమలుజరపడానికి విల్సన్ పూనుకున్నాడు.

పదవీస్వీకరణోత్సవం జరుగగానే, విల్సన్ కాంగ్రెస్ ప్రత్యేక సమావేశం ఏర్పాటుచేసి శాసన నిర్మాతలను ఇలా ప్రబోధించాడు. "దిగుమతి సుంకాలను మార్పుచేయక తప్పదు. గుత్తవ్యాపారపు చిహ్నాలు ఎక్కడ కనుపించినా మనం వాటిని తుడిచిపెట్టాలి". తత్ఫలితంగా, ప్రజాప్రతినిధిసభ, సెనేట్ కూడా, అండర్ వుడ్ సుంకాల చట్టాన్ని ఆమోదించి, ఏభైయేళ్ళకు మళ్ళీ విదేశపారిశ్రామికులు అమెరికాకు తక్కువ ధరకు సరుకులు సరఫరాచేసే అవకాశం కల్పించినవి. ఇందువలన తగ్గిన ప్రభుత్వాదాయాన్ని కూడదీసుకొనడానికిగాను ప్రెసిడెంట్ ఆదాయపుపన్ను విధించాడు. టాఫ్ట్ హయాం చివర, రాజ్యాంగానికి చేయబడిన 16 వ సవరణను అనుమతించి ఈ పన్ను విధించడానికి వీలయింది.

తరువాత మూడు నెలలకు, సెనేటర్లను ప్రజలే ఎన్నుకోవాలనే 17 వ సవరణకూడా ఆమోదించబడింది. దేశమంతటా వెల్లివిరుస్తూన్న ఈ ఉదార వాదోద్యమానికి తగినట్టుగా, ఈ చర్యవలన బడా రాజకీయవేత్తలు రాష్ట్ర శాసనసభ్యులద్వారా సెనేట్ సభ్యుల ఎన్నికను తమ యిష్టంవచ్చినట్టు సాగించే పూర్వపు పద్ధతికి స్వస్తిచెప్పబడింది.

విల్సన్ తీసుకొనిన తదుపరిచర్య, బూజుపట్టిపోయిన బ్యాంకింగ్ విధానాన్ని సంస్కరించడం. ఆ విధానంప్రకారం ప్రయివేటు వడ్డీ వ్యాపారస్థులే విశేషంగా వడ్డీవ్యాపారం సాగిస్తూ ఉండేవారు. "బ్యాంకులపై అధికారం ప్రజలకే ఉండాలిగాని వ్యక్తిగత వ్యాపారుల చేతులలో ఉండరాదు. అనగా ప్రభుత్వమే ఈ వ్యాపారంపై అజమాయిషీ చెయ్యాలి. ఆ విధంగా బ్యాంకులు వ్యక్తిగత వ్యాపారాలకు యాజమాన్యంవహించే సంస్థలుగాక, వ్యాపార సహకారులుగానే ఉండాలి" అని ప్రెసిడెంటు వివరించాడు. ఫెడరల్ రిజర్వు శాసన రీత్యా దేశం మొత్తం పన్నెండు జిల్లాలుగా విభజింపబడింది. ప్రతి జిల్లాలోను, కరెన్సీనోట్లువేసి వ్యాపార పరిస్థితులననుసరించి పంపకం చేసే అధికారంతో కూడిన ప్రధానమైన ఒక బ్యాంక్ ఉంటుంది. నేషనల్ బ్యాంకులు ఈ బ్యాంకులకు పెట్టుబడిపెట్టి, ఆ బ్యాంకులలో సభ్యత్వం కలిగి ఉంటాయి. ఈ వ్యవస్థ, అంతటిపైన అజమాయిషీ చెయ్యడానికి వాషింగ్టన్‌లో సెంట్రల్ ఫెడరల్ రిజర్వు బోర్డు ఉంటుంది. ఈ బోర్డులో కోశాంగమంత్రి, కరెన్సీ అధికారి, ప్రెసిడెంట్ చే నియమింపబడిన మరి ఆరుగురు సభ్యులూ ఉంటారు. ఈ నూతన బ్యాంకింగ్ వ్యవస్థ పర్యవసానంగా, కరెన్సీ సుకరమయి, సంయుక్త రాష్ట్రాలలోని ధనం మొత్తాన్ని, విలువను నిర్ణయించే దేశీయ యంత్రాంగంలో శాశ్వతస్థానం సంపాదించుకొన్నది.

ప్రెసిడెంట్ విల్సన్ ఆదేశానుసారం సామాన్య మానవుడికి ఉపకరించే శాసనాలు ఒకటివెంట ఒకటిగా కాంగ్రెసు తయారుచేస్తూంది. క్లేటన్ పారిశ్రామిక నియమన శాసనంలో కార్మికులకు సమ్మెచేసే హక్కు గుర్తించబడింది. ఏ పెట్టుబడిదారుగాని అనేక వ్యాపార సంస్థలలో డైరెక్టరుగా ఉండడానికి వీలులేదనికూడా ఈ శాసనం నిషేధించింది. అనుచిత వ్యాపార ధోరణులను విచారించి, వాటిని సరిదిద్దడా

నికి తగిన చర్యలను సూచించేందుకుగాను సమాఖ్యా వాణిజ్య విచారణ సంస్థ ఏర్పాటుచేయబడింది. రైతులకు తక్కువవడ్డీ అప్పులిచ్చే కేంద్ర ప్రభుత్వపు భూమితనఖా బ్యాంకులు స్థాపించబడినవి. వాణిజ్య నౌకలలో పనిచేసే నావికులకు వేతనాభివృద్ధీ, ఇతర సౌకర్యాలూ, చేయబడినవి.

* * *

"నా ప్రభుత్వమెంకక్క విదేశ వ్యవహారాలను మాత్రమే చక్క బెట్టవలసిఉంటే, అదొక విధివైపరీత్యంగా తయారై ఉండేది," అని విల్సన్ అన్నాడు. ఆయన అమెరికా రాజ్యాంగ చరిత్రలో అనుపమ పాండిత్యం కలవాడు; కాని అంతర్జాతీయ రాజకీయాలలో ఆయనకు బొత్తిగా అనుభవంలేదు. అట్టి విల్సన్ ఒక ప్రపంచ మహాసంరంభ సమయంలో తన దేశానికి మార్గదర్శకుడుగా వ్యవహరింపవలసి రావడం విచిత్ర సంఘటన.

మొదట మెక్సికోలో బయలుదేరిన ఒక విప్లవం ప్రెసిడెంట్‌ని కలవరపెట్టింది. నిరంకుశుడైన జెనరల్ హ్యూర్టా ప్రభుత్వాన్ని చేజిక్కించుకొని, అతని ప్రత్యర్థియైన జెనరల్ కరన్జా ఎక్కడా అవకాశం లేకుండా చేశాడు. మెక్సికోలో విశేషంగా పెట్టుబడులుపెట్టి ఐరోపా ప్రభుత్వాలు హ్యూర్టా ప్రభుత్వం శాంతిభద్రతలను కాపాడగలుగుతూండడంచూచి అతడి ప్రభుత్వాన్ని గుర్తించినవి; మెక్సికోకు స్థైర్యం కలగడానికి సంయుక్తరాష్ట్ర ప్రభుత్వంకూడా హ్యూర్టా ప్రభుత్వాన్ని గుర్తించాలనే అభ్యర్థన వచ్చింది.

కాని, హ్యూర్టా అవలంబించిన దుష్టవిధానాలు ఆదర్శవాదియైన విల్సన్‌కి మనస్కరించలేదు. హ్యూర్టా రాజీనామా ఇవ్వాలని విల్సన్ కోరాడు. పిమ్మట, జరిగిన అనేక సంఘటనల అనంతరం ఒక అమెరికన్ సైనికదళం వేరాక్రూజ్ నౌకాశ్రయాన్ని పట్టుకొన్నది. అప్పుడు హ్యూర్టా పదవీపరిత్యాగంచేసి కరన్జాకు అప్పగించాడు. కాని, సంయుక్తరాష్ట్ర సైన్యం వేరాక్రూజ్‌ను పట్టుకొనడం – పశ్చిమార్థగోళంలోని చిన్న దేశాలన్నింటికీ భయాందోళనలు కలిగించింది.

ఈ నూతన ప్రభుత్వం సంయుక్తరాష్ట్ర సైన్యం మద్దత్తుతో మెక్సికో విచ్ఛిన్నంకాకుండా కాపాడడానికి యత్నించడం కరన్జా

నూతన ప్రత్యర్థి పాంకోవిల్లాకు ఆగ్రహకారణమయింది. వెంటనే అతడు సాహసికులైన కొందరు దాడిదార్లను పోగుచేసి, "అమెరికనుల ఆహుతి" అనే నినాదం చేస్తూ మెక్సికో సరిహద్దు దాటి సంయుక్త రాష్ట్రసీమలో ప్రవేశించి, చాలామంది సైనికులను, పౌరులను హత్య చేశాడు. పిమ్మట సంయుక్తరాష్ట్రసైన్యం పాంకోవిల్లాకోసం కొన్ని నెలలపాటు మెక్సికోఅంతా గాలించినా అతడు దొరకలేదు. చివరకా వేట విరమింపబడినది.

మెక్సికో సమస్య క్లిష్టంగానే పరిగణించినప్పటికీ విల్సన్ ఐరోపాలో ఎదుర్కొనవలసివచ్చిన సమస్యలముందు ఇది కేవలం చిన్న గృహచ్ఛిద్రం వంటిది. శక్తిమంతమైన జర్మనీదేశం ఫ్రాన్స్, ఇంగ్లండ్ రష్యాదేశాలు ఐరోపాఖండంలో తన స్వేచ్ఛను, విదేశాలలో తన విస్తరణావకాశాలను అరికడుతున్నవంటూ, తన మిత్రదేశమైన ఆస్ట్రియా-హంగరితోపాటు ప్రాబల్య సమతౌల్యాన్ని భంగపరచేటందుకుగాను యుద్ధం ప్రారంభించింది. ఈ ప్రథమప్రపంచమహాసంగ్రామారంభానికి, ఆస్ట్రియా చక్రవర్తికి వారసుడు, ఒక సెర్బియా దేశభక్తునిచే హత్యచేయబడడం, తాత్కాలిక కారణమయింది. ఆస్ట్రియా సెర్బియాను శిక్షించింది; వెంటనే బాల్కన్ దేశాలలోని స్లావ్‌లకు మద్దత్తు చేయడానికిగాను రష్యా యుద్ధంలోకి దిగింది. జర్మనీ ఆస్ట్రియాకు మద్దత్తుచేసింది. ఇటలీ, ఇంగ్లండ్, ఫ్రాన్సు దేశాలు రష్యా పక్షాన; టర్కీ-బల్గేరియాలు జర్మనీ పక్షాన యుద్ధంలో దిగినవి. సంయుక్తరాష్ట్రం మన్రో సిద్ధాంతానుసారం తాటస్థ్యం ప్రకటించింది.

మొదట జర్మనులధాటికి ఎదురులేకపోయింది. నిస్సహాయస్థితిలో ఉన్న బెల్జియం మొదలు దాదాపు పారిస్‌నగర ముఖద్వారంవరకూ జర్మనులవశమయింది. కాని అక్కడే వారి పురోగమనం అరికట్టబడింది. కెయిజర్ విల్‌హెల్మ్ భయంకర సైనికయంత్రాన్ని ఎదిరించి ధైర్యంగా పోరాడుతూన్న మిత్రరాజ్య సైన్యాలను గురించిన వీరగాథలను పత్రికలలో చదువుకొంటూన్న అమెరికనులకు చిరకాలంనుండి తమకు సన్నిహితులయిన ఫ్రెంచివారిపట్లను, బ్రిటిష్‌వారిపట్లను సానుభూతి కలిగింది. నెపోలియన్ యుద్ధాలలోవలెనే యోధదేశాలు పరస్పర నౌకాశ్రయాలకు దిగ్బంధనం ప్రకటించి, యుద్ధప్రాంతాలను ఆయుధసామగ్రి,

ఆహారపదార్థాలు కొనిపోయే అమెరికా మున్నగు తటస్థ నౌకలనుకూడా పట్టుకొనడం ప్రారంభించినవి. సముద్రాలమీద ఆధిపత్యంగల బ్రిటిష్ నౌకాదళం తన శత్రుదేశాలకు వెళ్లే నౌకలను నాశనంచేయకుండా తన వశం చేసుకుంటూఉంటే, జర్మనీ జలాంతర్గామి యుద్ధంలో అట్టి నౌకలను సర్వనాశనంచేయడంలో ప్రారంభించింది. జరన్ యూబోట్లు సముద్రగర్భంలోంచి అకస్మాత్తుగా నీటిమట్టం పైకిలేచి అట్టి నౌకలపైన టార్పెడోలను ప్రయోగించి, వెంటనే మళ్ళీ నీటిలో మునిగి అంతర్ధానమైపోయేవి. ఆవిధంగా దెబ్బతిన్న నౌకలు ఒక్కసారిగా పగిలిపోయి నావికులందరితో పాటు మునిగిపోయేవి.

ఈ విధంగా నాశనంచేయబడిన కొద్దిపాటి అమెరికన్ నౌకలంటే కూడ ఎక్కువగా ఇంగ్లండ్ నౌక లూసిటేనియా మున్నగు విదేశ ప్రయాణ నౌకలలోని అమెరికన్ ప్రయాణీకులంతా సంహరించబడుతూండడం అమెరికనులకు ఎక్కువ కోపకారణమయింది. సాగరరాజ్ఞి అని పేరుమోసిన లూసిటేనియా దానిలో ప్రయాణంచేస్తున్న పన్నెండు వందలయాభైమంది స్త్రీ పురుష బాలబాలికలతో సహితంగా సముద్రగర్భంలో కూలిపోయింది. వీరిలో నూటపద్నాలుగురు అమెరికనులు. ఈ నౌకను టార్పెడోతో పగులగొట్టినందుకు జర్మనీ సంతాపం వెల్లడించింది; కాని లూసిటేనియా ప్రయాణీకులతో పాటు మిత్రరాజ్యాలకు మందుగుండుసామగ్రిని తీసుకొనిపోతూందనికూడా ప్రకటించింది.

ప్రెసిడెంట్ విల్సన్ జలాంతర్గామి యుద్ధాన్ని నిరసిస్తూ జర్మనీని ఎన్నోసార్లు హెచ్చరించాడు. వీటికి జవాబుగా జర్మనీనుండి, అస్పష్టమైన సంతాప ప్రకటనలు, అటుపిమ్మట మరికొన్ని అత్యాచారాలు మాత్రమే లభించినవి. అమెరికా యుద్ధ సామగ్రి, ఆహార పదార్థాలు కొనుక్కొనడానికి పెద్ద పెద్ద ఋణాలు ఇచ్చి, మిత్రరాజ్యాలకు ప్రాణం పోస్తున్నందుకు, కేంద్ర రాజ్యాలకు అత్యల్పంగా మాత్రమే సరఫరాలు చేస్తున్నందుకు జర్మనీ తీవ్రసంతాపం ప్రకటించింది. సముద్రాలపైన జర్మనీ దాడులు తీవ్రతరమైన కొలది, సంయుక్తరాష్ట్ర ప్రజలకు ఆ దేశంపట్ల వైమనస్యం ఎక్కువ కాజొచ్చింది. అయినప్పటికీ, అమెరికాను యుద్ధానికి దూరంగా ఉంచాడనే నినాదంతో

విల్సన్ తిరిగి ప్రెసిడెంటుగా ఎన్నిక అయాడు. ఛార్లెస్ ఇవాన్సె హ్యూజ్ ఓడిపోయాడు.

కాని ఆటుపిమ్మట సంయుక్త రాష్ట్రాలు దీర్ఘకాలం యుద్ధానికి దూరంగా ఉండడానికి వీలులేకపోయింది. సంయుక్తరాష్ట్రాలు యుద్ధంలో దిగేయెడల మెక్సికో జపాన్‌లను దానిపైకి ఉసికొల్ప డానికి జర్మనీ చేస్తున్న కుట్ర, సంయుక్తరాష్ట్రాలలో సాగిస్తున్న గూఢ చారి చర్యలు, యుద్ధ పరిశ్రమలను భగ్నంచేయడానికి వేస్తున్న పన్నా గాలు బయటపడినవి. ఇంగ్లండును లొంగదీయడానికి విశృంఖల జలాం తర్గామి యుద్ధం సాగింపదలచుకొన్నట్టు జర్మనీ తన నూతన విధానం ప్రకటించేసరికి, తగినచర్య తీసుకొనవలసినదిగా ప్రెసిడెంట్ విల్సన్ కాంగ్రెస్‌కి సందేశం పంపాడు. 1917 ఏప్రిల్ 6 వ తేదీన కాంగ్రెస్ యుద్ధం ప్రకటించింది.

ఈ విధంగా అమెరికా యుద్ధంలో ప్రత్యక్షంగా జోక్యం కల్పిం చుకొనడానికి ఇవి తాత్కాలిక హేతువులు. ఈ యుద్ధం కేంద్ర రాజ్యాల సైనిక నిరంకుశవాదుల దురాక్రమణనుండి ఆత్మరక్షణ చేసు కొనడానికి ప్రపంచంలోని స్వతంత్రదేశాలు సాగిస్తున్న చావుబ్రతుకుల పోరాటమనే భావం ప్రెసిడెంటు విల్సన్‌కి కలగడం, ఈ తాత్కా లిక కారణాల వెనుకగల ప్రాతిపదిక హేతువు. దండయాత్రగాని, విద్వేషంగాని లేకుండా ప్రపంచ ప్రజాస్వామ్య దేశాలు విజయం సాధించడానికి సహాయపడడం, అనంతరం విజేతలు, పరాజితులు కూడా కలిసి విశ్వమానవ సౌభ్రాతృభావంతో ఏకమై "నానాజాతి సమితి" (League of nations) ని నెలకొల్పడం - అంతర్జాతీయ వ్యవహారాలలో సంయుక్తరాష్ట్ర లక్ష్యమని విల్సన్ నిశ్చయించాడు. అట్టి ప్రపంచసమాఖ్యక్రింద యుద్ధాలకు మూలకారణమయిన జాతీయత సామ్రాజ్యవాదం, మిత్రకూటములద్వారా "ప్రాబల్య తౌల్య" రక్షణ ప్రయత్నం మొదలైనవన్నీ శాశ్వతంగా అంతరించి పోగలవని ఆయన ఆశించాడు. ఈ భావాల ప్రాతిపదికమీదనే 1918 లో శాంతి సంధి షరతులకు స్థూలంగా ఆయన పద్నాలుగు సూత్రాలను సూచించాడు.

ఈ ఉదాత్తాశయ ప్రేరితమై సంయుక్త రాష్ట్రం మిత్రరాజ్యాల పక్షాన ప్రథమ ప్రపంచ మహాసంగ్రామంలో ప్రవేశించింది. రష్యా

ఓడిపోతూ వెనుకకు తగ్గిపోతూండడంవలన ఆ సమయంలో మిత్ర రాజ్యాలస్థితి చాలా క్లిష్టంగా ఉంది. కార్మికులను, పారిశ్రామికులను సమాయత్తంచేసి సర్వవిధాలా ఉత్పత్తులను వృద్ధిచేయడానికి ప్రెసిడెంటు విల్సన్‌కి సంపూర్ణాధికారాలివ్వబడినవి. పారిశ్రామికులు ధరల కంట్రోళ్ళు మొదలైన నిబంధనలకు సమ్మతించడంద్వారాను, కార్మికులు కనీసం అనధికారంగానైనా సమ్మెచేసే తమ హక్కును వదలుకొనడం ద్వారాను ఈ కార్యక్రమానికి తోడ్పడ్డారు.

అమెరికా తన మిత్రరాజ్యాలకు వందలు - వేలు - కోట్ల డాలర్ల అప్పులు, అపరిమిత ప్రమాణంలో ఆహార ధాన్యాలు మొదలైన సామగ్రీ సరఫరా చేయగలుగుతున్నప్పటికీ, తనవంతు యుద్ధవీరులను పంపడం పెద్దసమస్య అయింది. ఉన్నసైన్యం చిన్నది; క్రొత్తసైన్యాన్ని సమీకరించి, తరిఫీదుచేసి, తగిన పరిమాణాలలో మూడు వేల మైళ్ళ దూరాన ఉన్న యుద్ధరంగాలకు పంపడం ఇంచుమించు అసాధ్యంగా కనిపించింది. అయినప్పటికీ, విశ్వసించడానికికూడా వీలులేనంత వేగంగా, శక్తిమంతంగా ఈ కార్యకూడా నిర్వహించబడింది. జర్మనీ, ఆస్ట్రియా-హంగరీ దేశీయుల సంతతికి చెందిన అమెరికనులుకూడా సోదర పౌరులతోపాటు ప్రశాంతంగా ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ఒక్క సంవత్సరంలో జెనరల్ జాన్ పెర్షింగ్ నాయకత్వం క్రింద ఫ్రాన్సులో దాదాపు ఏడులక్షల సంయుక్తరాష్ట్రసేన ఉన్నట్టు లెక్క తేలింది. పిమ్మట ఆరునెలలకు ఈ మొత్తం 20 లక్షలదాకా పెరిగింది.

ఈ విధంగా అమెరికా అతివేగంగా సైన్యాన్ని పంపగలుగుతున్నందుకు ఆశ్చర్యపడిన కేంద్రదేశాలు, యుద్ధాన్ని సాధ్యమైనంత త్వరగా ముగింపుచేసివేయాలనే ఆతుర్దాతో 1918 వసంతఋతువులో పెద్దపెట్టున దండయాత్ర ప్రారంభించినవి. మిత్రరాజ్య సర్వసైన్యాధ్యక్షుడైన ఫ్రెంచివీరుడు మార్షల్ ఫోష్ రక్షణకు అవసరమైన చోటికల్లా కొంత అమెరికా సైన్యాన్నికూడా పంపుతూ ఉండేవాడు. షాటోటయెరీ, బెలోవుడ్‌లవద్ద జరిగిన యుద్ధాలలో ఈ అమెరికన్ సైనికులు అద్భుతంగా పోరాడి తమతోటి మిత్రసేనల ప్రశంసలు పొందారు.

జర్మనీదండయాత్ర నిరోధింపబడిన తరువాత, అమెరికనులను తిరిగి ఒకే సైన్యంగాచేసి, యుద్ధరంగంలో కొంత భాగాన్ని వారికి అప్పగించారు. వెంటనే పన్నెండు లక్షలమంది అమెరికనులు భయంకర దండయాత్రచేసి జర్మనుల ప్రబలమైన సెయింట్ మిహీల్ రక్షణ శ్రేణిని చీల్చుకొని, మరఫిరంగులు బారులు తీర్చి ఉంచిన మ్యూసి ఆర్గోనీ ప్రాంతం గుండా లోపలికి చొచ్చుకొని వెళ్ళారు. జర్మనులు వెనుక ముఖంపట్టారు. 1918 నవంబర్ 11-వ తేదీన చేసుకొన్న యుద్ధవిరమణ ఒప్పందంతో యుద్ధం ముగిసిపోయింది. సంయుక్త రాష్ట్రాలు యుద్ధంలో ఆలశ్యంగా ప్రవేశించి తక్కువ నష్టంపొందినప్పటికీ — అంగబలం, అర్థబలం, ఇతర సాధన సంపత్తులతో అమెరికా మద్దత్తు ఐరోపాగడ్డమీద జరిగే యుద్ధనీతిని తారుమారుచేసి, ఆ నాడు ప్రజలు భావించినట్టు, "ప్రపంచంలో ప్రజాస్వామ్యాన్ని" సురక్షితం చేసింది.

* * *

యుద్ధ విరమణ ఒప్పందంతో ప్రపంచ మహాసంగ్రామం పూర్తికాగానే జర్మనీ తానా యుద్ధంలో ఆక్రమించుకొన్న భాగాలన్నింటి నుంచి సేనలను ఉపసంహరించు కొన్నది. ఆపైన సంధికి ఏర్పాటు జరుగవలసి ఉంది. ఆ సంధి పత్రంలో తన చతుర్దశ సూత్రాలను చేర్చడానికి విల్సన్ నిశ్చయించుకొన్నాడు. సంధి దేశాలు లోగడ చేసుకొన్న రహస్య సంధులన్నీ రద్దుచేసుకొనడం, అన్నిదేశాలు ఆయుధ విసర్జన చెయ్యడం, సముద్రాలపై సర్వదేశాలకు సమానావకాశాలు లభింపజేయడం, నానాజాతి సమితిస్థాపన - ఈ సూత్రాలలోని ముఖ్య సూచనలు. శాంతి సమాలోచనలలో స్వయంగా పాల్గొనే నిమిత్తం ప్రెసిడెంటు విల్సన్ 1919 ప్రారంభంలో పారిస్‌కి తరలి వెళ్ళాడు.

అమెరికా రాజ్యాంగ ప్రకారం సెనేట్‌లో మూడింట రెండు వంతుల సభ్యుల సమ్మతితోనే ప్రెసిడెంటు సంధులు చేసుకోవచ్చును. తనపని సులభతరం చేసేనిమిత్తం డెమొక్రాట్లనే సెనేట్ సభ్యులుగా ఎన్నుకోవలసినదని 1918 లో విల్సన్ ప్రజలకు విజ్ఞప్తి చేశాడు. బహుశః ఈ విషయంలో ఆయన తీవ్రమైన పట్టుదలకు ప్రతిక్రియగా

కాబోలు, ఫలితం మరొకవిధంగా తేలింది. సెనేట్‌లో రిపబ్లికనులది పైచేయి అయింది. పైగా, సంధిసమావేశంలో పాల్గొనే తన ప్రతినిధి వర్గంలో సెనేట్‌కి ప్రాతినిధ్యం ఇవ్వడానికి విల్సన్ నిరాకరించడంతో, ఆయనపట్ల సెనేట్‌కి గల వైరభావం తీవ్రతరమయింది.

విదేశాలలో విల్సన్, ప్రపంచ అగ్రనాయక చతుష్టయంలో మిగిలినవారిని - ఇంగ్లండ్ దేశపు లాయడ్ జార్జి, ఫ్రాన్సు దేశపు క్లమాన్సో, ఇటలీదేశపు ఆర్లెండోలను - కలుసుకున్నాడు. శత్రువుల దాడులవలన బాగా దెబ్బతిని ఉన్న దేశాల నాయకుల భావాలకు పరాజితులపట్ల అత్యుదారంగా ఉన్న విల్సన్ అభిప్రాయాలకు విశేష వ్యత్యాసం కన్పించింది. జర్మనీ తానుచేసిన ద్రోహాలకు పరిహారాలు చెల్లించుకోవాలనీ, అందుకోసం జర్మనీ తన బొగ్గుగనులను, ఇనుపగనులను తన వలసలను విజేతలకు అప్పగించాలనీ వారు సూచించారు. నానాజాతి సమితి స్థాపనకు వారిని కూడదీయడం కోసం విల్సన్ వారు సూచించిన సవరణలు చాలాభాగం ఆమోదించాడు.

వర్సేల్స్ సంధిలో చివరకు నిర్వచింపబడిన ప్రకారం రూపొందించబడిన నానారాజ్యసమితికి తొమ్మిదిమంది సభ్యులుగల కార్య నిర్వాహక వర్గం ( Executive Council ) ఏర్పాటు చేయబడింది. ఇందులో ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాసంయుక్త రాష్ట్రాలు, ఇటలీ, జపాన్ దేశాలకు శాశ్వత సభ్యత్వాలు ఏర్పాటు చేయబడినవి. ఈ కార్యవర్గ నిర్ణయాలలో చాలాభాగం పూర్తిగా తొమ్మండుగురు సభ్యుల ఆమోదం పొందాలి. దురాక్రమణ నిషేధింపబడింది. నానా రాజ్యసమితిలో సభ్యత్వంగల ఏ దేశంపైన అయినా దౌర్జన్యానికి పూనుకొన్నప్పుడు, అట్టి దేశంపైన తీసుకొనవలసిన చర్యను ఈ కార్య వర్గం సూచిస్తుంది. అట్టి సందర్భాలలో సమష్టి ఆర్థిక దిగ్బంధనం విఫలమై పోయినయెడల సైనిక చర్యకూడా తీసుకొనవచ్చును. ఈ కార్య వర్గానికి తోడుగా, మరొక సలహాసభ, అంతర్జాతీయ కార్మిక కార్యాలయం, దేశాలమధ్య వివాదాలను పరిష్కరించడానికి ఒక అంతర్జాతీయ న్యాయస్థానంకూడా ఉండేవి.

ఈ నానాజాతి సమితి ఏర్పాటుతో సహితంగా తయారైన వర్సేల్స్ సంధిపత్రంపై 1919 జూన్ నెలలో మిత్రరాజ్యాలు, జర్మనీ

సంతకాలు చేసినవి. న్యాయమైన సంధికి విల్సన్ ప్రతిపాదించిన కార్య క్రమాన్ని త్రోసిరాజన్నందుకు అసమ్మతిని తెలుపుతూ జర్మనీ ఆ పత్రం పై సంతకంచేసింది. ఆ పత్రంపై మొదటి సంతకం ప్రెసిడెంట్ విల్సన్‌ది. భవిష్యత్తులో యుద్ధాలను నివారించగల సంధిపత్రాన్ని రూపొందించడానికి తాను శక్తివంచన లేకుండా కృషిచేయగలిగినట్లు నా డాయన సంతృప్తి చెందాడు. ఆ పత్రంమీద సంతకంచేసి, దానిని ఆమోదించవలసినదిగా సెనేట్‌కి సందేశం పంపాడు.

సెనేట్ ఆయన సందేశాన్ని గౌరవించలేదు. విల్సన్ తమను చిన్న చూపు చూచి. అవమానించాడని బాధపడుతున్న చాలామంది సెనేటర్లు సిద్ధాంతరీత్యా ఆ సంధిలోని వివిధ సూత్రాలకు అభ్యంత తెలిపారు. అసలు నానాజాతి సమితి స్థాపనను పూర్తిగా ప్రతిఘటిం చినవారుకూడా వారిలో కొందరున్నారు. ఆ సంస్థాపనతో జాతీయ స్వాతంత్ర్యం పరిమితమైపోవడంలేదా? బ్రిటన్‌కి, బ్రిటన్ అధినివేశా లకూ ఆరువోట్లు ఇచ్చినప్పుడు అమెరికాకు ఒక్క వోటే ఎందుకు ఉండాలి? సంయుక్తరాష్ట్రాలు ఆ సంస్థలో చేరడంవల్ల, ప్రపంచంలో వరసగా అవసరమయే "పోలీసు చర్య" లలో చిక్కుకొనవలసి ఉంటుందా? ఈ సంధిపత్రాన్ని తాము ఆమోదించాలంటే, అందులో చాలా సవరణలు చేయవలసి ఉంటుందని సెనేట్‌లోని రిపబ్లికనులు ప్రకటించారు. వీరికి నాయకుడు మసాచూసెట్స్ సెనేటర్ హెన్రీ కాబట్ లాడ్జ్.

అయినప్పటికీ విల్సన్ లవలేశంకూడా లొంగలేదు; ఈ సంధిలో ఏమి మార్పులుచేసినా అది నీరసపడుతుందని ప్రకటించి, సెనేటర్లను ఖాతరుచేయకుండా ప్రజలకే నేరుగా తన అభిప్రాయాలను వివరించా లని పారిస్‌నుండి స్వదేశానికి తిరిగివచ్చాడు. నిరంతరం విసుగు విరా మాలు లేకుండా పనిచేయడంవల్ల, ప్రెసిడెంట్ దేశంలో ఉపన్యాస సంచారం సాగిస్తూ మధ్యలో జబ్బుపడ్డాడు. తిరిగి ఆ జబ్బునుండి ఆయన కోలుకొనడం అసంభవమయింది. రాజీకి ఒప్పుకొననందుకు సెనేటు ఆయనను నిందించి, ఆ సంధిని శాశ్వతంగా నిరాకరించింది. అప్పటికే, ఇతరమిత్ర రాజ్యాలన్నీ దాన్ని యథాతథంగా ఆమోదించి నవి. రెండుసంవత్సరాల తరువాత అమెరికా జర్మనీతో విడిగా తానొక శాంతి సంధి చేసుకుంది.

అమెరికా ప్రజలు అంతర్జాతీయ శాంతి సంధాతలుగా చిరకాలం పరిశ్రమచేసి విసిగిపోయినట్టు కనిపించారు. మరణిస్తూన్న వుడ్రోవ్ విల్సన్ "ప్రపంచనాయకత్వం సంపాదించడానికి మనకు చక్కని అవకాశం లభించింది. చేతులారా మనం దానిని జారవిడుచుకున్నాం; దీని విషాద పర్యవసానాలను అచిరకాలంలోనే మనం అనుభవింపక తప్పదు" అని చేసిన హెచ్చరికను వినిపించుకున్నవారు లేరు.

---

# నవమ అధ్యాయం

## "మరల యథాపూర్వస్థితి" : "న్యూ డీల్"

ప్రథమ ప్రపంచ మహాసంగ్రామం 1918 లో ముగిసిపోయింది. ఆ పైన యుద్ధంవలన అస్తవ్యస్తమయి ఉన్న ప్రపంచ పునర్నిర్మాణానికి సంబంధించిన సమస్యను అమెరికా ఎదుర్కొనవలసి వచ్చింది. యుద్ధాన్ని కొనసాగించడానికిగాను ధనం సేకరించడంలో, ప్రభుత్వం జాతీయ ఋణాన్ని బాగా వృద్ధిచేసి, 100 కోట్ల డాలర్లకు కొంచెం తక్కువగా ఉన్నదానిని, నమ్మశక్యం కానంతగా 2,525 కోట్లవరకు పెంచివేసింది. అయితే, ఇందులో మిత్రరాజ్యాలకు అప్పుగా ఇవ్వబడిన దాదాపు 1,000 కోట్ల డాలర్ల మొత్తం మాత్రం తిరిగి ముదరా వస్తుంది.

రష్యాలో కమ్యూనిస్టులు 1917 లో క్రెమ్లిన్ స్వాధీనపరచుకొని, క్రమంగా ఆ దేశమంతటినీ తమ పాలనలోకి తెచ్చుకొనడం, కట్టుదిట్టంగా ఏర్పరచిన రహస్య కేంద్రాలు (Cells) ద్వారా ప్రపంచమంతటికీ కమ్యూనిస్టు ఉద్యమాన్ని వ్యాపింపజేస్తూ ఉండడంతో ప్రజలకు రష్యా అంటే భయం ఎక్కువయింది. ఎవడు కమ్యూనిస్టో, ఎవడు కాడో తెలుసుకొనడం దుష్కరమైపోతున్నది; ముఖ్యంగా ప్రపంచ కార్మిక మహాసభ (Industrial Workers of the World) అనే మరొక సంస్థ ఏర్పాటుచేయబడి మంచి ఉచ్ఛదశలో ఉన్నది; కాని, అమెరికాలో పరిశ్రమలు తిరిగి శాంతికాల పరిస్థితులకు అనుగుణంగా సర్దుబాటు చేసు

కుంటున్న సంధిసమయంలో చాలామంది తీవ్రవాదులకు, ఆందోళనాపరులకు కారాగారశిక్షలు, ప్రవాస శిక్షలు విధింపబడినవి.

ఈ కార్మిక సమస్యకు కొంతవరకు కారణం యుద్ధకాలంలో ఏర్పడిన వస్తుసామగ్రి కొరతవలన ధరలు అమితంగా పెరిగిపోవడం. జీవన వ్యయం పెరిగిపోయినందువలన తమ వేతనాలను హెచ్చుచేయాలని కార్మికులు కోరారు. జాన్ ల్యూయిస్ నాయకత్వాన బొగ్గుగనుల కార్మికులు ప్రారంభించిన సమ్మె కొన్నినెలలపాటు సాగినతరువాతగాని ప్రభుత్వం రాజీ కుదర్చలేకపోయింది.

ఈ సంధిసమయంలోనే సారాయి మొదలైన పానీయాల ఉత్పత్తి విక్రయాలను నిషేధిస్తూ రాజ్యాంగానికి 18 వ సవరణ చేయబడింది. ఈ సవరణ ఆశయం ఎంత ఉదాత్తమైనదిగా ఉన్నా, అది త్రాగుడును అరికట్టలేకపోయింది. పైగా, చాటుమాటుగా త్రాగవలసివస్తూన్నందున, త్రాగుబోతులకు దానిమీద మక్కువ ఎక్కువయింది. దొంగ సారా వ్యాపారంలో పొరపులవల్ల ఈ దుండగీళ్లు పరస్పరం పోరాడుకొనడం, హత్యలు కూడా చేసుకొనడం తరుచు జరుగుతూ ఉండేది.

మొత్తం దేశమంతా, నైతికంగా పతనావస్థ అనుభవిస్తూన్నట్టు కనిపించింది. యుద్ధంలోంచి తిరిగివచ్చిన సైనికులు, తాము "గతించిన తరానికి" చెందినవారమంటూ, లోగడ తాము కాలాన్ని వ్యర్థం చేసుకున్నందుకు విచారిస్తూ, ఇప్పుడు అదంతా కూడదీసుకొనడానికి ప్రయత్నిస్తున్నారు. యుద్ధానంతరం తాత్కాలికంగా ఏర్పడిన ఆర్థిక మాంద్యం వలన ప్రజలకు కలిగిన ఆనందం ఎక్కువకాలం నిలవలేదు; అయితే దానికి పర్యవసానాలు రైతులనుమాత్రం చిరకాలం పీడించినవి.

పిమ్మట, 1920 లో జరిగిన ప్రెసిడెంట్ ఎన్నికలలో, దేశీయ విదేశీయవ్యవహారాలలో విల్సన్ విధానాలను అనుసరించాలా లేక రిపబ్లికనుల నినాదమైన 'యథాపూర్వస్థితి' కై కృషిచెయ్యాలా అనేది ప్రధాన సమస్య అయింది. ఈ రెండవ విధానానికి అర్థం మళ్ళీదేశాన్ని యుద్ధాత్పూర్వస్థితికి తీసుకొనిరావడం; అనగా, దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించడానికై దిగుమతి సుంకాలను మళ్ళీవృద్ధిచేయడం, సాధ్యమైనంతవరకు ప్రపంచ రాజకీయాలలో ఎక్కువజోక్యం కల్పించుకొనకుండా ఉండడం; మొత్తముమీద దేశీయ శ్రేయస్సునే ప్రధానంగా

పరిగణిస్తూ ఒంటెత్తువిధానం అవలంబించడం—అనీ అర్థం. 19వ రాజ్యాంగ సవరణను అనుసరించి, ఈ ఎన్నికలో స్త్రీలుకూడా పురుషులతోపాటు వోటు వేశారు.

డెమొక్రాట్ల ప్రజాస్వామ్యాదర్శవాదమన్నా, ప్రపంచ సంరక్షణోత్సాహమన్నా ప్రజలకు విసుగుపుట్టింది. రిపబ్లికన్ అభ్యర్థి సెనేటర్ (ఓహియో) వారెన్ హార్డింగ్ తన ప్రత్యర్థి అయిన జేమ్స్ కాక్స్ (ఓహియో గవర్నరు) పైన పెద్ద మెజారిటీతో విజయం పొందాడు. ఒక పట్టణ వార్తాపత్రికా సంపాదకుడు, సౌమ్యుడు, అందమైనవాడు అయిన హార్డింగ్ దేశాన్ని భద్రంగా అభ్యుదయం వంకకు నడిపింపగల-అమెరికా స్వభావం మూర్తీభవించిన నాయకుడుగా కనిపించినాడు.

రిపబ్లికనులు అధికారంలోకి రాగానే, దిగుమతి సుంకాలు వృద్ధి చేస్తామన్న వాగ్దానాన్ని వెంటనే అమలుజరిపారు. అమెరికాచుట్టూ ఆర్థికంగా బలమైన కోటగోడ కట్టినట్టు చేశారు. స్వదేశంలో దీని పర్యవసానాలు బాగానే ఉన్నట్టు కనిపించినవి. పరిశ్రమలకు లాభాలు హెచ్చినవి; పరిశ్రమాలయాలన్నీ నిర్విరామంగా పనిచేస్తూండడంవల్ల ఉద్యోగాంస్థితి బాగుపడింది. అయితే, ఐరోపాదేశాలు తమ సరుకులను తెచ్చి అమెరికాలో అమ్ముకొనడానికి వీలులేకుండా చేయబడినందున, ఆ దేశాలు అమెరికాకు తీర్చవలసి ఉన్న అప్పును తీర్చడానికి అవకాశం లేకపోతూంది. ఆ అప్పులు వసూలు చేసుకోదలచుకుంటే దిగుమతి సుంకాలను తగ్గించడం మంచిదని ప్రభుత్వానికి ఆర్థికశాస్త్రవేత్తలు పదేపదే సలహా యిచ్చారు.

వీటికితోడు వలసల నిబంధనలను తీవ్రతరం చేయడంతో వీటికి ప్రపంచంలోని ఇతర దేశాలతో సంబంధాలు చెడిపోవడానికి ఇంకొక కారణంకూడా ఏర్పడింది. క్రొత్తగా ఎక్కువమంది వలసరాకుండా అరికడితే, అమెరికనులకు ఉద్యోగాలు పుష్కలంగా లభిస్తాయనే సిద్ధాంతం బయలుదేరింది. దానితో ఈ శతాబ్ది ప్రారంభంనుండి, న్యూయార్క్ హార్బర్‌లోని "స్వాతంత్ర్య విగ్రహం" (Statue of Liberty) దర్శనం చేసుకొని క్రొత్తగా అమెరికా గడ్డపైన కాలుపెట్టే విదేశీయులసంఖ్య బాగా తగ్గిపోయింది. విదేశీయమైన ప్రతివిషయాన్ని అనుమానించడం ప్రబలమయి పోవడమే క్రొత్తగా వలస వచ్చేవారిని గూర్చిన నిబంధనలను తీవ్రతరం చేయడానికి దారితీసింది.

అలాగే, బాధ్యత ఏమాత్రం నెత్తిమీద వేసుకోనని విధంగా. ఆయుధాలను తగ్గించి, ప్రపంచశాంతికి దోహదం చేయడంకోసం అమెరికా ఇతర అగ్రరాజ్యాలతో సహకరిస్తున్నది. ప్రెసిడెంట్ హార్డింగ్ విదేశాంగమంత్రీ సమర్థుడూ అయిన ఛార్లెస్ ఇవాన్స్ హ్యూజ్ 1921-22 లో వాషింగ్టన్‌లో జరిగిన ఒక ప్రపంచ మహాసభకు విదేశాల ప్రతినిధులందరినీ ఆహ్వానించి రప్పించాడు. నానారాజ్యసమితి ప్రసక్తి లేకుండా జరిపిన ఈ సమావేశంలో నౌకాదళాల పరిమాణం ఒక నిష్పత్తిలో తగ్గించుకొనడానికి అగ్రరాజ్యాలవారంతా అంగీకరించారు. చైనాలోను, దూరప్రాచ్యంలోను ముందుముందు తమలోతమకు వివాదాలు ఏర్పడకుండా ఈ రాజ్యాలు కొన్ని సంధులు, ఒప్పందాలుకూడా చేసుకొని, ఎవరికి ఎక్కడ ఏవిధమైన హక్కులు ఉండేది నిర్వచించుకొన్నవి. యుద్ధకాలంలో వాణిజ్యనౌకలను జలాంతర్గాములతో భగ్నం చేయరాదనే నిషేధం ఏర్పాటు చేసుకున్నవి.

హార్డింగ్ హయాంలో సాధించబడిన ఘనవిజయం ఈ వాషింగ్టన్ మహాసభే అని చెప్పవచ్చు. మొత్తంమీద హార్డింగ్ హయాంలోని సత్కార్యాలకన్నా అసత్కార్యాలే ఎక్కువ ప్రసిద్ధి చెందినవి. ఇంతకన్న నికృష్టమైన పరిపాలన లేదనీ, అంతర్యుద్ధానంతరం ఏర్పడిన గ్రాంట్ హయాంకన్నకూడా, హార్డింగ్ హయామే ఎక్కువ అసంతృప్తికరమైనదనీ తేలింది. వృద్ధయోధుల సంస్థ (Bureau of Veterans) డైరెక్టరు ఆ శాఖతాలూకు ధనంలో 200,000 డాలర్లు అపహరించినందుకు సమాఖ్యా కారాగారానికి పంపబడ్డాడు. ఇలాగే, ప్రభుత్వాధికార దుర్వినియోగం చేసిన మరి ఇద్దరు ప్రభుత్వోద్యోగులు తీరా విచారింపబడనున్న సమయంలో ఆత్మహత్య చేసుకున్నారు. అన్నింటికన్నా "టీపాట్ డోమ్" కుంభకోణం అత్యంత నికృష్టమైనది. దేశీయ వ్యవహారమంత్రి ఆల్బర్ట్ ఫాల్, ఎలాగో ప్రెసిడెంటుని లోబరచుకొని నౌకాదళానికి సంబంధించిన నూనెగనులపై అధికారాన్ని దేశీయశాఖకు బదిలీ చేయించుకున్నాడు. అనంతరం టీపాట్ డోం, వ్యోమింగ్ మొదలైన ప్రాంతాలలోని నూనెదొరికే భూములను కొందరు పెట్టుబడిదారులకు కౌలుకి ఇచ్చాడు. ఈ అపారమైన ఉపకారానికి వారివద్దనుండి అతడు పెద్దమొత్తాన్ని లంచం పుచ్చుకున్నాడు. ప్రజల విశ్వాసాన్ని ఇలా

దుర్వినియోగం చేసినందుకు పిమ్మట ఫాల్‌కి ఒక సంవత్సరం కారాగారశిక్ష, లక్ష డాలర్లు జరిమానా విధించబడినవి.

ఈ స్థితిలో, 1923 లో అలాస్కానుండి తిరిగివస్తూ అకస్మాత్తుగా హార్డింగ్ మరణించాడు. క్రమంగా ఈ అవినీతికర చర్యలలో అతని పేరుకూడా జత చేయబడుతూన్నందువల్ల, ఒక విధంగా ఈ హఠాన్మరణం ఆయనను ఆ అపఖ్యాతినుండి తప్పించిందని చెప్పవచ్చు.

వెంటనే వైస్ ప్రెసిడెంటు కాల్విన్ కూలిడ్జ్ ప్రెసిడెంటు అయాడు. ఇతడు సచ్ఛీలుడుగా ప్రసిద్ధిచెందిన ప్రశాంత గంభీరమూర్తి. న్యూ ఇంగ్లండు ప్రాంతపు "యాంకీ" (బ్రిటిష్‌వారి సంతతికి చెందిన అమెరికా పౌరుడు) అయిన ఈతని విధానాలు మాత్రం మితవాదధోరణికి చెందినవి

* * *

1920 ప్రాంతంలో దేశం అభ్యుదయంతో పొంగి పొరలుతూ ఉండడంవలన ఆదాయపు పన్ను రేట్లు బాగా తగ్గించినప్పటికీ ప్రభుత్వ కోశానికి పూర్వంకన్నా పుష్కలంగా ధనం లభిస్తూంది. పూర్వం 2,500 కోట్ల డాలర్లవరకు పెరిగిన జాతీయఋణం తరిగిపోయి 1600 కోట్లు అయింది. ఈ పరిస్థితితో సంతృప్తిచెందిన ప్రెసిడెంట్ కూలిడ్జ్ ఆర్థిక వ్యవహారాలలో తానేమీ కలుగజేసుకొనకుండా "అమెరికా వ్యాపారమే వ్యాపారం" అని తన విధానాన్ని ముక్తసరిగా ప్రకటించాడు.

అది స్వర్ణయుగం. భారీఎత్తున అపరిమితంగా సరుకులు ఉత్పత్తి చేసి పోయడం ఆ స్వర్ణయుగ ప్రధాన లక్షణం. మోటారుకార్లు, శీతల యంత్ర పేటికలు (Refrigerators) బట్టలుతికే యంత్రాలు, రేడియోలు, రకరకాల చిన్న పెద్ద యాంత్రికోపకరణాలు అసంఖ్యాకంగా ఉత్పత్తి అవుతున్నవి. ఈ భారీ కర్మాగారాలలోని యంత్రాలను నడపడానికి నిపుణ కార్మికులు తయారయారు. ఈ ఉత్పత్తులన్నీ శాస్త్రీయంగా ఉత్తమస్థాయి నందుకున్నవి. ఈ యంత్రాలలో ఒక్క లక్షణంగాని, ఒక్క చలనంగాని వృథాకాదు.

ఈ ఉపకరణాలన్నిటినీ కొనవలసినవారు చాలవరకు వాటిని ఉత్పత్తిచేసే కార్మికులే. కనుక, కార్మికుల జీతాలు పెంచగలిగితే,

ఈ సరుకులు సులభంగా అమ్ముడుపోతాయనీ ఆపైన ఉత్పత్తులను ఇంకా వృద్ధిచెయడానికికూడా అవకాశం ఏర్పడుతుందనీ పారిశ్రామికులు భావించారు. సైకిళ్ళు లెక్కాపత్రంలేకుండా తయారవుతున్నవి. త్వరలోనే ఎక్కడా "పేదకొంప" అనేది కనిపించకుండా పోతుందనీ, ప్రతికారు షెడ్డులోను రెండేసికార్లు ఉండేకాలం వస్తూందనీ, అంతా ఆనందంగా చెప్పుకుంటున్నారు.

ఈ అభ్యుదయోద్యమానికి ఇంకా బలంపెట్టి దోహదం చేయడానికిగాను, పారిశ్రామికులు తమ వస్తువులనుగురించి విస్తృతంగా ప్రకటన చేస్తున్నారు. సబ్బుతునకల ఉపయోగాన్ని గురించీ, సిగరెట్లు కమ్మదనాన్నిగురించీ, రేడియోలు, పత్రికలు ఎడతెగకుండా పొగడుతూ, ప్రజలకు నోరూరేటట్టు చేయడానికి వేయివిధాల ప్రయత్నిస్తున్నవి. కుర్చీలు, బెంచీలు మొదలైన కొంచెం పెద్ద మొత్తాల సరుకులుకొనేవారు ఆ ఖరీదు అంతా ఒకేసారి చెల్లించవలసిన అవసరంలేదనీ, ఆ వస్తువును తీసుకుపోయి వాడుకుంటూ తడవకు కొంతచొప్పున ఇస్తూ, చివరికి దానిని కొనుక్కోవచ్చుననీ, ఆ విధంగా వారివద్ద తీసుకొనబడే డబ్బుకు వడ్డీ చాలా తక్కువరేటులో ఉంటుందనీ, కనుక వాడుకదార్లు సులభంగా కొనుక్కోవచ్చుననీ ప్రచురణలు చేస్తున్నారు.

కాని అమెరికా విపణి ఎంత విస్తృతమైనది అయినప్పటికీ, అమితంగా తయారవుతూన్న పారిశ్రామిక సామగ్రులన్నీ అక్కడే అమ్ముడుపోవడం అసంభవమని తేలింది. అందువలన, పారిశ్రామికులకు అదనపు అధికలాభాలు లభించాలంటే వాటిని విదేశాలకు ఎగుమతిచేయడం తప్పనిసరి అయింది. కాని, విదేశాలు ఈ సరుకులకు ఖరీదు చెల్లించడానికి మార్గమేమిటి ? ఒకపద్ధతి: విదేశాలనుండి వచ్చే సరుకులపై విధిస్తూన్న దిగుమతి సుంకాల ప్రమాణాన్ని తగ్గించి, విదేశవాణిజ్యానికి ఎక్కువ సౌకర్యాలు కల్పించి, ఆ విధంగా అమెరికా ఎగుమతిచేసే పారిశ్రామికోత్పత్తులకు మారుగా విదేశాలనుండి అమెరికాకు అవసరమయిన సరుకులు దిగుమతి చేసుకొనడం. రెండవపద్ధతి: డబ్బులేని పేద దేశాలకు ఇంకా అధికంగా అప్పులిచ్చి, ఆ ధనంతో ఆదేశాలు అమెరికా పారిశ్రామికోత్పత్తులు కొనుక్కొనడానికి అవకాశం కల్పించడం.

ఇలా చేయడంవలన ఆ పేదదేశాలు ఇంకా ఋణగ్రస్తాలయి దివాళా తీయడానికి మార్గం చూపినట్టు అవుతుంది. అయినప్పటికీ, తన పరిశ్రమలను కాపాడుకొనడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకొన్న అమెరికా సంయుక్తరాష్ట్రం, రెండవ మార్గాన్నే అవలంబించి, తన పారిశ్రామిక సామగ్రులను, వాటిని కొనుక్కొనడానికి పెట్టుబడులనుకూడా విదేశాలకు సమృద్ధిగా సరఫరా చేస్తున్నది. రిపబ్లికనులకు 1924 లో జరిగిన ఎన్నికలో పెద్ద ప్రతిఘటన ఏమీ లేకుండానే విజయం లభించింది. కాల్విన్ కూలిడ్జ్ ప్రత్యర్థి, డెమొక్రాట్ మితవాదిఅయిన జాన్ డేవీస్ను సులభంగా ఓడించి మరొక టరముకూడా ప్రెసిడెంట్ గా ఎన్నిక అయాడు. ఈ ఉభయపక్షాల ఎన్నిక ప్రణాళికలపట్లను అసంతృప్తి చెందిన మరొక ఉదారవాదివర్గం సాహసికమైన లాఫాలెట్టీ నాయకత్వం క్రింద ప్రోగ్రెసివ్ పార్టీ అనే పేరుతో తృతీయ పక్షమొకటి స్థాపించి, సోషలిస్టుల మద్దత్తుకూడా సంపాదించుకొని రంగంలో ప్రవేశించింది కాని, రైలురోడ్ కంపెనీలను ప్రభుత్వవశం చేసుకొనడం, రైతులకు కేంద్రప్రభుత్వ సహాయం మొదలైన ఈ నూతనపక్ష ప్రణాళికకూడా ప్రజలను ఎక్కువగా ఆకర్షించలేకపోయింది. ఈ పక్షానికి 50 లక్షల వోట్లు మాత్రం వచ్చాయి. కూలిడ్జ్‌కి 160 లక్షల వోట్లు డేవీస్‌కి 80 లక్షల వోట్లు వచ్చినవి.

అయినప్పటికీ, దేశంలో అసంతృప్తి సర్వత్ర పూర్వంకన్న హెచ్చు శ్రుతిలో వినిపిస్తున్నవి. రైతులు దీనస్థితిలో ఉన్నారు. యుద్ధకాలంలో పంటలు సాధ్యమైనంత ఎక్కువగా పండించవలసినదిగా వారిని ప్రభుత్వం ప్రోత్సహించింది. అందువలన నూతన యంత్రాలతో, నూతన శాస్త్రీయ విధానాలతో పంటలు బాగుగా వృద్ధి చేశారు. కాని నేడు వారి మాంసం, ఆహారధాన్యాలు అతి హీనమైన చౌకధరకు ఇస్తామన్నా ఏ దేశమూ కొనటానికి ఉత్సాహంగా ముందుకు రావడంలేదు. ఈ విధంగా నష్టపడుతూన్న రైతులపంటలకు మెక్నారీహాగెన్ బిల్లును అనుసరించి పరిహారం ఇవ్వడానికి (Subsidy) ప్రభుత్వం నిరాకరించింది. ఈ సూచనను నిరాకరిస్తూ రైతులు ఆర్థికంగా తిరిగి చేతులు కాళ్లు కూడదీసుకొనడానికి వీలుగా వారికి ప్రభుత్వం అప్పులిప్పించడానికి తనకేమీ అభ్యంతరం లేదనీ; అంతే

గాని ప్రభుత్వ ధనసహాయంతో ధరలు పడిపోకుండా నిలిపి ఉంచ డానికి యత్నించి, సరఫరా - అవసరాలకు గల సహజ సంబంధాన్ని గురించిన సిద్ధాంతాన్ని తారుమారుచేయడానికి ప్రయత్నించడం ప్రమాదకరమనికూడా ఆయన ప్రకటించాడు.

కూలిడ్జ్ హయాం చరమ సంవత్సరాలలోని చరిత్రాత్మక సంఘ టనలలో ఒకటి కర్నల్ ఛార్లెస్ లిండ్ బర్గ్ న్యూయార్క్ నుండి పారిస్‌కి ఎకాయెకీ ఒకే గంతులో విమానంలో పయనించడం. రెండ వది: యుద్ధాన్ని నిషేధిస్తూ కెల్లాగ్-బ్రియాన్డ్ ఒడంబడకపై సంతకం చేయడం. ఆత్మసంరక్షణార్థం తప్పనిసరి అయితే తప్ప ఎన్నడు ఏ దేశం పైనా యుద్ధం చేయబోము అంటూ అమెరికా - ఫ్రాన్స్ ప్రభుత్వాలు ప్రతిపాదించిన ఈ ఒడంబడికకు మొత్తం యాభై తొమ్మిది దేశాలు తమ సమ్మతి తెలిపినవి.

* * *

మరో నాలుగు సంవత్సరాలుకూడా మీరు 'వైట్ హౌస్' లోనే ఉండగోరుతున్నారా?" అని 1927 లో విలేఖరులు ప్రశ్నించగా, "అలాంటి వాంఛలే"దని జవాబు చెప్పాడు ప్రెసిడెంటు కూలిడ్జ్. రిపబ్లికను పార్టీ ఈతనికు బదులు వాణిజ్యశాఖామంత్రి, గనుల ఇంజ నీరూ అయిన హెర్బర్టు హూవరును ప్రెసిడెంటు పదవికి అభ్యర్థిగా నిలిపింది. ఈతడు చాలాకాలం విదేశాలలో ఉండి అమెరికా వాణి జ్యాభివృద్ధికై కృషి చేస్తూండడం వలన ప్రపంచ విపణులను గురించి ఆయనకు ప్రత్యక్షజ్ఞానం ఉన్నది. ముక్తసరిగా, పట్టుదలగా వ్యవహ రించే స్వభావంగల హూవర్ సమర్థుడనీ, పరిపాలనా దక్షుడనీ, దేశాన్ని అభ్యుదయమార్గంలో ఇంకా చురుకుగా ముందుకు నడుపగల డనీ ప్రజ లాశించారు.

డెమొక్రాట్లు న్యూయార్కు గవర్నరు అయిన ఆల్ ఫ్రెడ్ స్మిత్‌ని తమ అభ్యర్థిగా నిలబెట్టారు. ఇతడు ఆకర్షణశక్తిగల ఉత్సాహవంతు డైన రాజకీయవేత్త. న్యూయార్కు నగరంలో దిగువ ఈస్టుసైడ్‌లో ఒక సామాన్య కుటుంబంలో జన్మించాడు. "ఆనంద యోధుడు" (Happy warrior) అని పేరుపొందిన ఈతడు కేంద్రప్రభుత్వం జల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి కృషి చేయాలంటూ పెద్దగా ప్రచారం ప్రారం

భించాడు. కాని, ఆ ఎన్నికలో ముఖ్యంగా పరిగణింపబడిన అంశాలివి: (1) స్మిత్ రోమన్ కాథలిక్ మతాభిమానం; (2) మద్యపాననిషేధ శాసనాన్ని సవరించాలన్న అతడి సంకల్పం. అంతర్యుద్ధాన్ని, "తివాచీ సంచులవారిని" మరచిపోలేక అంతవరకు డెమొక్రాటిక్ పార్టీనే బల పరుస్తూ వచ్చిన దక్షిణాది రాష్ట్రాలకు ఈ రెండు అంశాలూ ఆందోళన కలిగించినవి. స్మిత్ గెలుపొందే యెడల, అమెరికా సంయుక్తరాష్ట్ర విధానాలను, ఇటలీలో వెటికన్ నగరంనుండి పోపే ఆదేశిస్తాడని ఎన్నికల ప్రచారంలో బహిరంగంగా విమర్శించారు. ఎన్నికలో వోటర్లు అత్యధిక సంఖ్యాకులు హూవర్‌ని బలపరిచారు. పునర్నిర్మాణ దినాల లగాయతూ ఎన్నడూ ఎరుగని విధంగా దక్షిణాదిరాష్ట్రాల్లో చాలభాగం తొలిసారిగా రిపబ్లికన్‌పార్టీ అభ్యర్థికి వోటుచేసినవి. "మనదేశ భవిష్యత్తు విషయంలో భయపడవలసిన అంశమేదీ నాకు కనిపించడంలేదు; సర్వం సముజ్వలాశాజ్యోతిర్మయంగానే నాకు కని పిస్తూంది." అంటూ క్రొత్త ప్రెసిడెంటు అచంచల విశ్వాసంతో పదవీ స్వీకరణం చేశాడు.

నిజానికి, ఈ ఆశావిశ్వాసాలే సర్వత్ర ద్యోతకమవుతున్నవి. ప్రజలు వేగంగా ధనార్జన చేయడానికి నూతన మార్గాలు కనిపెట్టారు. వివిధ పరిశ్రమల వాటాలను అమ్మిపెట్టే న్యూయార్క్ కమీషన్ దుకా ణాల్లోను, వాల్‌స్ట్రీట్‌లోని ఇతర విపణులలోను పెద్ద పెద్ద పారి శ్రామిక సంస్థల తాలూకు హామీలను సులభంగా కొనుక్కొనడానికి వీలవుతూంది. వాణిజ్యం వృద్ధి అయినకొద్దీ ఈ పత్రాల ధరలు పెరిగి పోతున్నవి. దేశంలో ఏభాగంనుండి అయినా ఒక్క టెలిఫోన్ పిలు పుతో కమీషన్ వ్యాపారస్థులద్వారా వాటాలు కొనక్కొనడానికి వీలవుతూంది. అందుచేత వాటి ధరలు దినదిన ప్రవర్ధమాన మవుతు న్నవి. బ్రోకర్లు తమ కమీషన్‌కోసం తెలివిగా కొత్తవారిని ప్రోత్సా హపరచి ఈ వాటాలు కొనిపిస్తున్నారు. స్వదేశీయులు, విదేశీయులు కూడా తండోపతండాలుగా ఎగబడి అమెరికా పారిశ్రామిక సంస్థల వాటాలను, వాటి అసలు ధరలపైన అత్యధికమైన లాభాలిచ్చి కొనడం ప్రారంభించారు.

ఈ శ్రుతిమించిన లాభకాంక్షకు పర్యవసానంగానే 1929 అక

రాలు కాలంలో హఠాత్తుగా దారుణమైన ఆర్థికమాంద్యం ఏర్పడింది. ఈ హెచ్చుధరలను గురించి ప్రజలలో అనుమానం ఏర్పడింది. ఈఅనుమానమే, దేశాన్ని అఖండాభ్యుదయంనుండి దాదాపు సర్వనాశనం దరిదాపులకు దిగలాగింది. అక్టోబరునెల 19వ తేదీన ఈ పతనం ప్రారంభమయింది. వెంటనే బ్రోకర్లంతా భయంతో తమవద్దనున్న వాటాలను మరికొంతలాభానికి తమ ఖాతాదార్లకు తోసివేయడానికి ప్రయత్నించారు. కాని, ఆ ప్రయత్నం విఫలమయేసరికి, వాటిని వచ్చిన కాడికి అమ్మివేశారు. పదిరోజులలో వాటాలధరలు అప్పటిధరల్లో ఐదోవంతుకి పడిపోయినవి. ఈ విధంగా లక్షాధికారుల ఐశ్వర్యం అకస్మాత్తుగా హరించిపోయింది.

దేశం మైకంవదలి ఒక్కసారిగా తల విదిలించి ఈ దారుణ దురవస్థకు కారణాలు అన్వేషించడ మారంభించింది. ఐశ్వర్యం హరించిపోయిన సంగతి ఎలాగూ కనిపిస్తూనే ఉంది. కాని అసలా అభ్యుదయానికి పునాది అయిన పరిశ్రమకే ముప్పుకలుగలేదు గదా? లేదు; కర్మాగారాలపై ఎటునించీ బాంబులు వచ్చి పడలేదు. యంత్రాలయాలన్నీ చెక్కుచెదరకుండా చక్కగా, ప్రజలకు సేవచేయడానికి ప్రసన్నంగానే ఉన్నవి. అయినప్పుడు, కేవలం నిల్వచేసుకున్న ధనానికి కలిగిన తాత్కాలిక నష్టానికిగాను పెద్దగా ఆందోళన చెందడ మెందుకు?

ఇది ఆశావాదుల అభిప్రాయం. అయితే, అసలు వస్తువుల పంపకం పద్ధతిలోనే ఉన్నలోపాన్నిగాని, వ్యాపారస్థులు ఈ వస్తువులను అమ్మగోయుతున్న నిపుణులలో అందుకు తగిన కొనుగోలుశక్తి లేదన్న సంగతిగాని వీరు గ్రహించలేదు. వాటాలధరలు ఒక్కసారిగా పడిపోవడంతో వాణిజ్య విపణులుకూడా తారుమారై, ధరలు చురుకుగా పడిపోవడం మొదలు పెట్టినవి. కొత్తకార్లు కొనదలచుకొన్నవారు తాము లోగడ ఇచ్చిన ఆర్డర్లను రద్దుచేసుకొన్నారు. కొత్తగాకుట్టించుకోవాలనుకున్న దుస్తులను కొనుక్కోవడం మానివేసి పాతదుస్తులతోనే పబ్బాలు గడుపుకుంటున్నారు. దీనివలన పరిశ్రమలకు కూడా కొంత చురుకు తగిలింది. ఉత్పత్తులు వేగంగా తగ్గిపోయినవి. కొన్ని పరిశ్రమాలయాలు పూర్తిగా బందయిపోయినవి. లక్షలకొలది నిరుద్యో

గులు ఉచితంగా పంచిపెట్టబడే రొట్టెలకోసం క్యూలలో బారులుతీరి నిలబడుతున్నారు. 1932 నాటికి పనిలేక నిరాశా నిస్పృహాలతో బ్రతుకుతూన్న వారిసంఖ్య కోటీ ఇరవైలక్షల దాకా పెరిగిపోయింది. బ్యాంకులు దివాలా తీస్తున్నవి. తాకట్లు, వాకట్లయి పోతున్నవి. దేశాన్ని చుట్టబెడుతూన్న ఈ ఆర్థికమాంద్య మనే అరిష్టానికి నివారణోపాయ మనేది ఎక్కడా కనుచూపు మేరలో కనిపించడంలేదు.

అతి ఉదారంగా అప్పులిచ్చే "అమెరికా మామ" (Uncle Sam) విదేశాలకు అప్పులివ్వడం కట్టిపెట్టి, స్వదేశంలో ఆర్థిక మాంద్యాన్ని అరికట్టకొనడానికి గాను విదేశవస్తువులపై దిగుమతి సుంకాలను స్మూట్ హాలీ శాసనం ప్రకారం లోగడ ఎన్నడు ఎరుగనంతగా హెచ్చుచేసేరికి, ఈ ఆర్థిక మాంద్యమనే మహామారి ప్రపంచ మంతటినీ చుట్టబెట్టింది. జర్మనీ దివాళాపరిస్థితికి వచ్చి, ఆ దుర్భరస్థితిని చక్కబరచడంకోసం ఎడోల్ఫ హిట్లర్ అనే దారుణ జాత్యుత్కర్షావాది (Fascist) ని ఆశ్రయించింది. ఇంగ్లండు తన సువర్ణ ప్రమాణాన్ని (Gold Standard) సడలించి, విదేయులకు ఒక పౌన్సు బంగారానికి ఇదివరకుకన్న ఎక్కువ బ్రిటిష్ద్రవ్యం లభించేటట్టు చేయడం ద్వారా తన ఎగుమతులను వృద్ధిచేసుకొనడానికి ప్రయత్నిస్తున్నది. ఇక పసిఫిక్ మహాసముద్ర ప్రాంతంలో, ఆరుకోట్ల ప్రజలతో అమితమైన జనాభా వత్తిడి, పారిశ్రామిక పటిష్టత కలిగిన జపాన్ దేశం ఈప్రపంచ సంక్షోభాన్ని అవకాశంగా తీసుకొని మంచూరియాపై దండయాత్ర చేసి, కెల్లాగ్ - బ్రియాన్డ్ ఒప్పందానికీ ఇతర సంధులకూ భిన్నంగా ఆ ప్రాంతాన్ని చైనానుండి బలవంతంగా స్వాధీనం చేసుకున్నది.

ఈ ఆర్థిక మాంద్యం తొలిరోజులలో, నిజంగా ఆందోళన చెందదగిన పెద్దమార్పేమీ రాలేదని, ఇలాంటి ఆర్థికమాంద్యాలు ఇదివరకు చాలా చూచామనీ ఒకటంక అప్పుడే పరిస్థితి చక్కబడి, తిరిగి అభ్యుదయ పురోగమనం ప్రారంభం అవుతున్నదనీ అమెరికా ప్రజలకు నచ్చచెప్పడానికి ప్రెసిడెంట్ హూవర్ ప్రయత్నించాడు కాని, దారిద్ర్యం బాధలు ఎక్కువ అవుతున్న కొలది, ఆర్థిక పరిస్థితులలో జోక్యం కలిగించుకొనరాదన్న రిపబ్లికనుల సంప్రదాయానికి స్వస్తిచెప్పి, నిర్మాణాత్మకమైన ఒకక్రమాన్ని అమలు జరపడానికి పూనుకొన్నాడు.

విదేశయుద్ధ ఋణాలు చెల్లించడానికి కొంత వ్యవధి యివ్వాలని కోరాడు. దివాలాతీస్తున్న బ్యాంకులకు, రైల్‌రోడ్ కంపెనీలకు, ఇతర పరిశ్రమలకు అప్పులిచ్చి కాపాడే పునర్నిర్మాణ ఆర్థిక సహాయ సంస్థను స్థాపించాలని కాంగ్రెసును ప్రోత్సహించాడు. అలాగే ఇళ్ళలోనుండి వెళ్ళగొట్టబడే దీనస్థితిలో ఉన్న గృహయజమానులకు అప్పులిచ్చే మరొక సంస్థకూడా నెలకొల్పబడింది.

అయినప్పటికీ, ఈ హూవర్ కార్యక్రమం ఆత్మవిశ్వాసం కోల్పోయి, అరాజకత్వస్థితిని సమీపిస్తున్న జాతికి సంతృప్తి కలిగించడానికి చాలినంత సమగ్రమైనదిగా కనిపించలేదు. 1932 ఎన్నికలో హూవర్ మళ్ళీ రెండవసారి ప్రెసిడెంట్ పదవికి పోటీ చేశాడు. గాని, అతడు ఓడిపోవడం తథ్యం అని ముందుగానే అందరికీ తెలుసు.

* * *

డెమొక్రాట్లు పెద్ద మెజారిటీ సంపాదించారు. న్యూయార్క్ గవర్నర్ ఫ్రాంక్లిన్ డిలానో రోజ్వెల్టు ప్రెసిడెంటుగా ఎన్నిక అయ్యాడు. థియొడోర్ రోజ్వెల్ట్‌కి దూరపుజ్ఞాతి అయిన ఇతడు ఐశ్వర్యవంతుల యింటిబిడ్డ. హార్వర్డ్ విశ్వవిద్యాలయ పట్టభద్రుడు; విల్సన్ హయాములో నౌకాశాఖ సహాయ కార్యదర్శిగా పనిచేశాడు; 1920 లో డెమొక్రాట్లితణ్ణి-వైస్ ప్రెసిడెంటుపదవికి తమ అభ్యర్థిగా నిలబెట్టారు. పిమ్మట కొంతకాలానికి పక్షవాతంవల్ల ఆయన కాళ్లు స్వాధీనం లేకుండా పోగా, చాలా కష్టంమీదగాని నడవలేకపోయేవాడు.

డెమొక్రాట్లు తమ ఎన్నికల ప్రణాళికలో విదేశాలతో పరస్పర వాణిజ్య సంధులు చేసుకోనడం, కర్షకులకూ నిరుద్యోగులకూ కేంద్ర ప్రభుత్వం సహాయం చేయడం, బ్యాంకులపైనా, వాటాల వ్యాపారంపైనా ప్రభుత్వం పెత్తనం చేయడం, మద్యనిషేధాన్ని రద్దుచేయడం, ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించడం తమ ప్రధానాశయాలుగా ప్రకటించారు. వీటిలో చిట్టచివరిది తప్ప, మిగిలిన వాగ్దానాలన్నీ ప్రజలంతా ఆశ్చర్య చకితులయేటంత వేగంగా అమలు జరుపబడినవి. ప్రబలులైన పెట్టుబడిదారులను ప్రబలతరమైన ప్రభుత్వం పూర్తిగా త్రోసిరాజన్నది. ప్రభుత్వం ప్రత్యక్షంగా ప్రజాజీవితంలో పాల్గొంటూ, వారికి ధనమిచ్చి ఆదుకుంటున్నది; పన్నులరేట్లు పెంచింది; పరిశ్రమాలయా

లలో కార్మికుల వేతనాలను, ఉత్పత్తుల ధరలను క్రమబద్ధం చేస్తోంది. ఏ రైతు ఎన్ని ఎకరాల్లో ఏమి సాగుచేయవలసినదికూడా ప్రభుత్వం సూచిస్తున్నది. ఇవన్నీ ప్రెసిడెంటు వాగ్దానంచేసిన "న్యూడీల్" లేక నూతన విధానంలోని వివిధ కార్యక్రమాలు.

"మనం భయపడవలసినది కేవలం ఒక్క భయానికే" అని రోజ్వెల్టు 1933 మార్చిలో తన పదవీస్వీకరణోపన్యాసంలో వెల్లడించాడు. ఆ ఉపన్యాసం చేయబడిన సమయంలో ఆర్థికరంగంలో మరొక ఆందోళన బయలుదేరింది. దేశమంతట బ్యాంకులు మూసివేయబడినవి. ధన వినిమయం అనిశ్చితంగా, కేవలం నగదురూపంలోనే చెలామణి అవుతుంది. ఈ సంకట స్థితిలో దృఢదీక్షతో వ్యవహరిస్తూ ప్రెసిడెంటు బ్యాంకులకు సెలవు ప్రకటించి, వాటి స్థితిగతులనుగురించి విచారణ చేయించాడు. పునరుద్ధరించడానికి వీలున్న బ్యాంకులకు అవసరమైతే అప్పులిచ్చి మళ్లీ వాటిని తెరిపించాడు; అది సాధ్యంకాని కొన్ని బ్యాంకులను మాత్రం పూర్తిగా మూసివేయించాడు.

వెనువెంటనే రోజ్వెల్టు అతివేగంగా రెండు ముఖ్యమైన చర్యలు తీసుకున్నాడు. దేశంలోఉన్న వెండి బంగారాలను విశేషంగా ప్రభుత్వంచేత కొనిపించి, దానినంతటినీ ట్రెజరీలో దాఖలుచేయించాడు. కాగితపునోట్లకు మారుగా బంగారం కావాలంటే దొరకడంలేదు. దేశంలో సువర్ణప్రమాణం భంగపడిపోయింది. అయితే, ప్రభుత్వంవద్ద బంగారం విశేషంగా ఉన్నదన్న ధైర్యమే, కరెన్సీస్థిరపడడానికి ఉపయోగపడింది. కాని, డాలరుయొక్క బంగారపు విలువ తగ్గిపోయింది. నోట్లు ఇంకా వేయబడినవి. జాగరూకతతో క్రమబద్ధంచేయబడిన ద్రవ్యోల్బణానికి అవకాశం ఈయడంవలన, ధరలు పెరిగేటట్టు చేసి, వ్యాపారానికి ప్రోత్సాహం కలిగించవచ్చునని ప్రభుత్వం ఆశించింది.

ఆర్థిక సౌష్ఠవ పునరుద్ధరణ కార్యక్రమం ప్రారంభించడానికిగాను మోతుబరి వ్యాపారస్థులకు ప్రభుత్వం సహాయం చేస్తుందనీ, వారు తిరిగి ఉదారంగా ఇతరులకు సహాయం చేయవలసిఉంటుందె అనీ; తరువాత స్వల్పాదాయాలుగల విస్తృతులైన సామాన్య పౌరుల పరిస్థితిని చక్కబరచి వారి కొనుగోలుశక్తిని వృద్ధిచేయవలసి ఉన్నదనీ ప్రెసిడెంటు

ప్రకటించాడు. అనగా, దేశాన్ని తిరిగి అభ్యుదయ పురోగమనానికి సన్నద్ధంచేయడానికి దేశీయార్థిక వ్యవస్థలో పై స్థాయిలోను, దిగువ స్థాయిలోనుకూడా ప్రభుత్వం సహాయం చేయదలచుకొన్నట్టు ఆయన వివరించాడు. విశేషంగా విస్తృతంచేయబడిన పై స్థాయిలో వ్యాపారస్థులకు, పునర్నిర్మాణ ఆర్థికసహాయ సంస్థద్వారా ఆర్థికసహాయం లభిస్తున్నది. దెబ్బతిని పడిపోబోతూన్న సంస్థలను ఆ సంస్థ ఆదుకొంటూంది. జాతీయ పారిశ్రామిక శాసనంచేసి, వ్యాపారస్థులు పోటీలుపడి కష్టకాలంలో ధరలు పడిపోయేటట్టు చేసుకోనకుండా కాపాడడం వ్యాపారసంస్థలకు చాలా ఉపయోగపడింది. 1933 లో ఈ శాసనం చేయబడినప్పుడు, పరిశ్రమల యజమానులూ, కార్మికులుకూడా దానిని ఆమోదించారు.

ఈ శాసనాన్ని అనుసరించి ప్రతి పరిశ్రమలోను యజమానులంతా సమష్టిగా తమ ఉత్పత్తులన్నిటికీ ఒకేవిధమైన ధరలు ఏర్పాటు చేసుకున్నారు. తాము అనుసరింపవలసిన ఉచితవిధానాలను నిర్వచించుకున్నారు; కార్మికుల వేతనాలను, వారిచే పనిచేయించవలసిన గంటలను నిర్ణయించుకున్నారు. ఈ విషయాలన్నిటిలో ఒడంబడికలు చేసుకున్నారు. పిమ్మట ప్రెసిడెంటు తరఫున కొందరు నిపుణులు ఈ ఒడంబడికలను పరీక్షించినమీదట, వాటిలో సంతృప్తికరంగా ఉన్నవాటిని ప్రభుత్వ జాతీయ పునరుద్ధరణశాఖ కట్టుదిట్టంగా అమలు జరిపింది. ఈ విధంగా పరిశ్రమల యజమానులుపరస్పర ప్రయోజనాలకోసం సమష్టిగా వ్యవహరించే అవకాశంకోసం కార్మికులకుకూడా వారి శ్రేయస్సుకోసం కార్మికసంఘాలద్వారా సమష్టిగా రాయబారాలు నడిపి బేరాలాడుకొనడానికి హక్కు ఉన్నదని (యజమానులు) గుర్తించవలసివచ్చింది.

మరొకవంక విస్తృత పౌరుడికి కేంద్రప్రభుత్వంచేసే ఆర్థిక సహాయం ప్రెసిడెంటు సలహాదారులైన అర్థశాస్త్ర పండితులు సూచించిన అనేకరూపాలలో ఏర్పాటుచేయబడింది. చరిత్రలో మొట్టమొదటి సారిగా పేదవారికి నేరుగా సహాయం చేయడానికిగాను ప్రభుత్వం పెద్ద మొత్తాలను కేటాయించి, కేంద్ర అత్యవసర సహాయశాఖద్వారా ఆ మొత్తాలను పంపకం చేయిస్తున్నది; సాధ్యమైనంతవరకు ప్రత్యక్షంగా

ఆర్థికసహాయంచేసే ఆచారాన్ని తప్పించి, అభ్యుదయకార్యశాఖ, పౌర భద్రతా శాఖలలో నిరుద్యోగులకు ఉద్యోగాలు కల్పిస్తున్నది. రోడ్లు వేయడం, అడవులను నాటడం, ప్రభుత్వ భవనాలను నిర్మించడం మొదలైన కార్యక్రమాల్లో పనిలేనివారికి ఉపయోగకరమైన పనులు చూపించారు. ఇక విద్యావంతులకు గుమాస్తాలుగా, రచయితలుగా, కళాకారులుగా, గాయకులుగా జీవితం గడపడానికి అవకాశం కలిగించారు.

రైతులకు సహాయం చేయడానికిగాను చేసిన వ్యవసాయ సంయోజన శాసనంవల్ల, ధరలు పడిపోవడానికి దారితీస్తూన్న అదనపు పంటను తగ్గించివేయడానికి వీలయింది. ఆహారధాన్యాలను, కోళ్ళు, గొర్రెలు, మొదలైన పెంపుడు జంతువులను అధికంగా ఉత్పత్తిచేయడానికికాక, చేయకుండా ఉండేందుకుగాను రైతులకు ప్రభుత్వం ధనసహాయం చేసింది. పొలాలు పాడుపెట్టబడినవి. అదనపు పంటలను ధ్వంసంచేసే వారు. అమెరికాలోను, ప్రపంచంలోను కోట్లకొలది ప్రజలకు ఆహార పదార్థాల అగత్యం ఉన్నది; కాని దానిని కొనుక్కొనేశక్తి వారికి లేదు. ఆ ఆహారపదార్థాలను వారికి లభింపజేయడానికి రాజకీయంగా ఇంతవరకు ఏ విధమైన అవకాశము కనిపించలేదు.

ప్రభుత్వం పెద్ద ఆశతో టెన్నెసీనదిలోయ ప్రాజెక్టుపని ప్రారంభించింది. దీనివలన, దక్షిణాదినీ మధ్యప్రాంతంలో 6,40,000 చదరపు మైళ్ళ భూమికి గొప్ప ఉపకారం జరుగుతుంది. ప్రథమ ప్రపంచ సంగ్రామం సాగుతూన్న సమయంలో అలబామా రాష్ట్రంలో మజిల్ షోల్సు అనేచోట మందుగుండుసామగ్రి కర్మాగారము, ఒక ఆనకట్ట నిర్మింపబడినవి. యుద్ధం ముగిసిపోగానే ప్రభుత్వం వీటిని అమ్మివేయడానికి ప్రయత్నించిందిగాని సాగలేదు. తరువాత, మళ్లీ ఇప్పుడు అనగా 1933 లో, ప్రభుత్వం టెన్నెసీలోయ అభివృద్ధిశాఖను ఏర్పాటుచేసి, ఈ ఉపకరణాలతో ఎరువులను, విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయడానికి పూనుకొన్నది. టెన్నెసీలోయ అభివృద్ధిశాఖ అదనంగా ఇంకాచాలా ఆనకట్టలను, జల విద్యుదుత్పత్తి కేంద్రాలనూ నిర్మించి ఆ ప్రాంతమంతటినీ బాగుచేయడానికి పూనుకొన్నది. దానివలన విద్యుచ్ఛక్తి సరఫరా అవుతున్నది; లోగడ; ఆ లోయనంతటినీ ముంచెత్తుతూ, ఆ ప్రాం

కపు అతివృద్ధిని అరికడతూ వచ్చిన వరదంపీడ పూర్తిగా నివారణ అయిపోతుంది; భూసారాన్ని కాపాడుకుంటూ, పంటలను వృద్ధిచేసు కునే ఉపాయాలను రైతులకు బోధించడంకోసం వ్యవసాయపు నిపుణులను నియోగించారు. ఆ వెనుకబడిన ప్రాంతమంతా కొలది సంవత్సరాలలో హోరువెట్టే పరిశ్రమలతో, ఫలసస్య సమృద్ధితో తులతూగడ మారంభించింది.

ఇక, ఈ న్యూడీల్‌లో భవిష్యత్తులో ఉపయోగపడేందుకుకూడా కొన్ని ఏర్పాట్లు చేయబడినవి. పౌరులకు సామాన్యంగా కలిగే చాలా రకాల ఈతి బాధలనుండి రక్షణ కల్పించడానికిగాను సాంఘిక భద్రతా శాసనం చేయబడింది. ఇప్పటికీ అమలుజరుగుతూన్న ఈ కార్యక్రమంలో కార్మికులకు నిరుద్యోగపుభీమా, వృద్ధాప్యపు పింఛనులు, బిడ్డలుగలవారికి సహాయం, పేదలకు, అంధులకు, రోగగ్రస్తులకు చేసే సహాయం మొదలైనవి ముఖ్యమైన అంశాలు. ఈ కార్యక్రమాల ఖర్చు చాలావరకు కేంద్రప్రభుత్వం మంజూరుచేసిన నిధులనుండి లభిస్తుంది. ఈ నిధులు రాష్ట్రప్రభుత్వాలద్వారా ఈ భద్రతా కార్యక్రమాలకు వినియోగింపబడతాయి. కార్మికులు, యజమానులు, రాష్ట్ర స్థానిక ప్రభుత్వాలుకూడా ఈ నిధులకు మరికొంత సొమ్మును చేరుస్తారు.

ఈ న్యూడీల్ కార్యక్రమంలో చాలాభాగం కేవలం ప్రయోగాత్మకమైనదనీ, హడావిడిగా రూపొందించబడినదనీ ఈ కార్యక్రమ మూలపురుషులే 1930 అనంతరం స్పష్టంగా అంగీకరించారు. వాషింగ్టన్ నగరంనుండి అపారంగా వెలువడిన ఈ వాత్సల్యభావాన్ని ప్రజలెవిధంగా స్వీకరించారో పరిశీలిద్దాం. ప్రజలలో అధికసంఖ్యాకులు ఈ కార్యక్రమంపట్ల అత్యంత కృతజ్ఞత ప్రకటించారు. లక్షలాది ప్రజల కష్టాలను, కనీసం తాత్కాలికంగానైనా, నివారింపగలిగిన ఫ్రాంక్లిన్ రోజ్వెల్టు, వారి పాలిటికి ఆరాధ్యుడైన మహావీరుడయాడు. ముఖ్యంగా రైతులు, కార్మికులు ఆయనకు బ్రహ్మరథం పడుతున్నారు.

మరొకవంక, అమెరికాసంయుక్తరాష్ట్ర ప్రజలలో కొంచెం పెద్ద మైనారిటీ, ఈ "న్యూడీల్" కార్యక్రమంపై తొలిమోజు తుడిచివేసుకొని, పరమాసహ్య భావంతో దానిని ప్రతిఘటించడం ప్రారంభించింది.

ఈ మైనారిటీలో ముఖ్యులు వ్యాపారస్థులు. ప్రభుత్వం పేదలను ఆదుకొంటూండడం ప్రశంసనీయమైన విషయమే. పైగా, తోడ్తో వ్యాపారస్తుల స్థితికూడా క్రమంగా చక్కబడుతూంది. కాని ఈకార్యక్రమాలన్నిటికీ ధనం ఎక్కడినించి రావాలి? పన్నులు అమితంగా పెరిగిపోయినప్పటికీ, ప్రెసిడెంటుకి సలహాలిచ్చే పండితబృందం సులభంగా తయారు చేస్తూన్న కార్యక్రమాలన్నింటినీ అమలు జరపడానికి తగినంత ధనం లభించడం అసంభవం. జాతీయ సువర్ణప్రమాణం తారుమారయింది. జాతీయ ఋణం ఏటేట, నిర్లక్ష్యంగా, దారుణంగా వందలకోట్ల డాలర్లు పెరిగిపోతూంది. ఈ పరిస్థితి చివరికి ఆర్థిక ప్రళయానికి దారితీస్తుందని కొందరు జోస్యం చెపుతున్నారు. న్యూడీల్ అంటే గిట్టనివారు, ఈ కార్యక్రమాలు సమాజవాద ధోరణిలో, అమెరికా తత్వానికి కేవలం విరుద్ధమైనవిగా ఉన్నవని తీవ్రంగా విమర్శిస్తున్నారు. టెన్నెసీలోయ అభివృద్ధిశాఖ యెన్నివిధాల ప్రయోజనకారిగా ఉన్నప్పటికీ, వ్యాపార స్వేచ్ఛకు అది గొడ్డలిపెట్టు అని వారి వాదం. దేశంలోని ఒక సువిశాల ప్రాంతానికి, ప్రభుత్వమే ప్రైవేట్ కంపెనీలేవీ సరఫరా చేయజాలనంత తక్కువధరకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తూండడానికి ప్రభుత్వానికి ఏమి హక్కు ఉన్నది? టెన్నెసీలోయ అభ్యుదయశాఖ దేశమంతటిలో పన్నులు చెల్లించే పౌరులందరిపైన అనుచితంగా మోపబడిన పెద్ద బరువు. ఈ కార్యక్రమానికి వెచ్చింపబడిన అంతులేని పెద్దమొత్తాలకు ప్రతిఫలంగా వారికి నిర్దిష్టమైన ప్రతిఫలమేమీ కనిపించలేదు.

వీరు న్యూడీల్ సిద్ధాంతాలను ఆమోదించక పోవడమే కాదు, చాలామంది వ్యాపారస్థులు తమ వ్యవహారాలలో ప్రభుత్వం జోక్యం కలిగించుకుంటూ, తమను కేవలం చిన్నచూపు చూస్తున్నదని సంతాపం వెల్లడించారు. ఉదాహరణకు, ప్రభుత్వం తమ వాటాల వ్యాపారం మీద తీవ్రంగా పెత్తనం చెలాయిస్తున్నందుకు వాల్ స్ట్రీటు కమీషన్ వ్యాపారస్తులు పెద్దగా ఆందోళన ప్రారంభించారు. జాతీయకార్మిక సంబంధాల శాసనరీత్యా కార్మికులు తమ ఆశయాలను సాధించుకొనడానికి వారికి విశేషాధికారాలు ఇవ్వబడినవని పరిశ్రమల యజమానులు బాధపడుతున్నారు. అమెరికా కార్మికసమాఖ్య, పారిశ్రామిక సంస్థల

కాంగ్రెసు అనే రెండు విస్తృత సంస్థలుగా సమీకృతులైన కార్మికు లకూ, యజమానులకూ వివాదాలు కలిగినప్పుడు ప్రభుత్వం మధ్య వర్తిత్వం నెరపిన అత్యధిక సందర్భాలల్లో కార్మికులకే లాభం చేయ బడిందని మరొక నింద.

న్యూడీల్ వ్యతిరేకవాదులు ఎంత ఆందోళన చేసినా 1936 ఎన్నిక వారికి ఏమాత్రం అనుకూలించలేదు. నాలుగేళ్ళకు పూర్వం జరిగిన ఎన్నికల రోజుల్లో ప్రభుత్వం ఉచితంగా పంచిపెట్టించిన రొట్టెకోసం సుదీర్ఘమైన క్యూలో బారులుతీరి నిలబడిన రోజులు వారు మరచిపోలేరు. ఫ్రాంక్లిన్ రోజ్వెల్టే బ్రహ్మాండమైన మెజారి టీతో తిరిగి ప్రెసిడెంటుగా ఎన్నిక అయాడు. ఆయన ప్రత్యర్థి అయిన కాన్సాస్ గవర్నర్ ఆల్ ఫ్రెడ్‌కి మైనీ, వెర్మాంట్ రాష్ట్రాలలో మాత్రమే కొంచెం ఎక్కువవోట్లు పడినవి

ఈ ప్రజాబలంతో రోజ్వెల్టు తన రెండవ టరము ప్రారంభం నుండీ సుప్రీంకోర్టుతో పోరాడడ మారంభించాడు. ఈ కోర్టులో న్యాయాధిపతులు చాలామంది మితవాది దృక్పథం గలవారు. జాతీయ పారిశ్రామిక పునరుద్ధరణ శాసనం, వ్యవసాయ సంయోజన శాసనం రాజ్యాంగ విరుద్ధమైనవని ఈ న్యాయమూర్తులు 70 సంవత్సరాలకు పదవులనుండి విరమించాలనీ, అలా చేయడానికి నిరాకరించిన ప్రతి న్యాయమూర్తికి మరొక న్యాయమూర్తి చొప్పున ప్రెసిడెంటు మొత్తం పదిహేనుగురికి మించకుండా నూతన న్యాయమూర్తులను నియమించ వలసి ఉంటుందని రోజ్వెల్టు ప్రకటించాడు.

ఈ ప్రతిపాదన విషయంలో మాత్రం ప్రజలు రోజ్వెల్టుని బల పరచలేరు. ఈ సూచనను అమలు జరుపుతే, అమెరికనులకు అత్యంత ప్రియమైన నిగ్రహానుగ్రహపద్ధతికి భంగం వాటిల్లుతుందని ప్రజలలో చాలామంది అనుమానపడ్డారు. రోజ్వెల్టు సూచించిన శాసనం చేయు డానికి సెనేట్ నిరాకరించింది. న్యాయశాఖ స్వాతంత్ర్యానికి భంగం కలిగిస్తున్నది గనుక, దానిని శాసనం చేయడానికి వీలులేదని కారణం చెప్పింది. అయితే ఒకవిధంగా ఈ పోరాటంలో ప్రెసి డెంటే విజయం సాధించాడని చెప్పవచ్చును. ప్రెసిడెంటు మళ్ళీఏమి చేస్తాడో అనే భయంతో సుప్రీంకోర్టు అప్పటినుండి "న్యూడీల్"

విధానాలకు అనుకూలంగానే వ్యాఖ్యానాలు చెప్పడం ప్రారంభించింది.

ఈ లోగా, వ్యాపారరంగంలో 1937 తొలిసగంలో ధరలు కొంచెం హెచ్చడం మొదలుపెట్టి తిరువాత ఆ వేసవిలో మళ్ళీ తగ్గిపోయి, నిరుద్యోగుల సంఖ్య పెరిగింది. సుప్రీంకోర్టు స్వరూపాన్ని మార్చివేయడానికి యత్నించడంవంటి ప్రెసిడెంటు "నియంతృత్వ విధానాల" పట్ల వ్యాపారస్థులలో కలిగిన అనుమానం ఈ విధంగా ధరలు పడిపోవడానికి కొంతవరకు కారణమయింది. "న్యూడీల్" కార్యక్రమం శాంతికాలంలోకూడా పెద్ద ఖర్చులుచేసినా దేశాన్ని స్థిరమైన అభ్యుదయపథంలో పెట్టజాలకపోయింది. కాని, ఆ కార్యక్రమానికి ప్రజానురంజకత మాత్రం ఇంకా పెరుగుతూనే ఉన్నది. "విస్మృత పౌరుడి"కి – శ్రేయస్కరమైన శాసనాలు చేయడమే ఈ ప్రజానురంజకతకు హేతువు. యుద్ధాత్పూర్వ రాజకీయపరిస్థితులలో "ఖర్చుచేసే కార్యక్రమాల" వలన ఆర్థిక మాంద్యం సమస్య పరిష్కరించడానికి ఎన్నడైనా సాధ్యమయినదీ లేనిదీ ఇదమిత్థమని చెప్పలేము. అమెరికా ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామంలో ప్రవేశించగానే, ఇంకా విస్తృత ప్రభుత్వ కార్యక్రమాలు ప్రారంభం అవడం, వాటితోపాటు దారిద్ర్యం ఒక్కసారిగా మాయమవడం జరిగింది.

న్యూడీల్ తాలూకు విదేశాంగ విధానంకూడా దాని దేశీయ కార్యక్రమాలవలెనే సమర్థంగా అమలుజరుపబడింది. లాటిన్ అమెరికా, దక్షిణ అమెరికాలపట్ల థియొడోర్ రోజ్వెల్టు "ప్రబల దండనీతి"కి ప్రెసిడెంట్ హూవర్ స్వస్తిచెప్పి, "మంచిపొరుగువిధానం" (Good Neighbour policy) అమలు జరిపాడు. దానినే ఫ్రాంక్లిన్ రోజ్వెల్టు కూడా అనుసరించాడు. అమెరికా తనతోటి స్వతంత్రరాజ్యాల వ్యవహారాలలో జోక్యం కలిగించుకొనబోయినప్పుడల్లా లోగడ పెద్ద అలజడి బయలుదేరేది. ఇప్పుడది కట్టుబడిపోయింది. సంరక్షితప్రాంతంగా ఉండిన క్యూబాకు సంపూర్ణ స్వాతంత్ర్యం కలిగించబడింది.

ఫిలిప్పీన్ దీవులకుకూడా, తమ వ్యవహారాలు తాము చక్కబెట్టుకొనగలిగిన వెంటనే స్వాతంత్ర్యం ఇవ్వబడగలదని వాగ్దానం చేయడం మొదలైన చర్యలద్వారా ఇతరత్రా కూడా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం

మంచిపేరే సంపాదించుకొంటున్నది. ఇదేసమయంలో విదేశాంగ మంత్రి కార్డెల్‌హల్ వాణిజ్య సుంకాల సమస్యకు డెమొక్రాట్ల పరిష్కారమార్గాన్ని వెల్లడించాడు. విదేశాలతో పరస్పర వాణిజ్య సంధులు చేసుకొనడానికి అతడు కాంగ్రెసునుండి అధికారం సంపాదించుకొని, విదేశాల సరకులలో కొన్నింటిపైన దిగుమతి సుంకాలను తగ్గించడానికీ, దానికి ప్రత్యామ్నాయంగా అమెరికాపంపే కొన్ని సరకులపై ఆ దేశాలు దిగుమతి సుంకాల తగ్గించేటట్టూ ఒప్పందం చేసుకున్నాడు. ప్రపంచ వాణిజ్య పునరుద్ధరణకు ఈ ప్రణాళిక బాగా తోడ్పడింది.

అప్పుడప్పుడే యుద్ధమేఘాలు వేగంగా ప్రపంచమంతటినీ చుట్టబెడుతున్నవి. ఐరోపాలో, జర్మనీ ఫాసిస్టు నియంత అడోల్ఫ్ హిట్లర్, అవసరమైతే బలప్రయోగంతోనైనా వార్సేల్స్ సంధిద్వారా జర్మనీ నష్టపడిన ప్రదేశాలన్నిటినీ తిరిగి సంపాదించగలనని ప్రతిజ్ఞ చేశాడు. ఇతడి మిత్రుడైన ఇటలీనియంత బెనిటోముసోలినీ ఇథోపియాపై దురాక్రమణ ప్రారంభించాడు. స్పెయిన్‌లో దారుణమైన అంతర్యుద్ధం జరిగి, జాత్యుత్కర్షావాదుల (Fascists) కు సంపూర్ణ విజయంతో అంతమయింది. ఆసియాలో జపాను చైనాపై దండయాత్ర సాగిస్తుంది.

ఈ సంఘటనలన్నీ అమెరికాకు చాలా మనస్తాపమే కలిగిస్తున్నవి. కాని ప్రథమ ప్రపంచ మహాసంగ్రామాన్ని గురించి గట్టిగా ఏర్పడిన భ్రాంతి ఇంకా వదలలేదు. ఆ యుద్ధం సామ్రాజ్యవాదులకు సంబంధించినదనీ, దానితో అమెరికాకు ఏమీ సంబంధంలేదనీ తటస్థవాదులు చేసిన వ్యాఖ్యనే ప్రజలు విశ్వసిస్తున్నారు. 1930 ప్రాంతంలో మందుగుండు సామగ్రి ఉత్పత్తిచేసే పెట్టుబడిదార్లు పరస్పరం చేసుకున్న రహస్యపు ఒప్పందాలు బయటపడడంతో, అమెరికాప్రజల యుద్ధవ్యతిరేకత మరింత వృద్ధి అవడంతో, అమెరికా మరొక పర్యాయం విదేశ యుద్ధాలలో చిక్కుకొనకుండా వారించడానికిగాను కాంగ్రెసు రెండు శాసనాలు చేసింది. వీటిలో మొదటిది జాన్సన్ శాసనం. అమెరికా ప్రభుత్వం లోగడ ఇచ్చిన అప్పులను చెల్లించని దేశాలకు క్రొత్త అప్పులివ్వరాదని ఈ శాసనం నిషేధించింది. రెండవది తాటస్థ్యశాసనం. భవిష్యత్తులో జరుగగల విదేశయుద్ధాలలో పాల్గొనే ఏ దేశానికీ సైనిక

సామగ్రులు సరఫరా చేయరాదని ఈ శాసనం నిషేధించి, యుద్ధాలలో పాల్గొనే విదేశాల నౌకలలో ప్రయాణం చేయరాదని అమెరికనులను హెచ్చరించింది.

ప్రెసిడెంట్ రోజ్వెల్టు ఈ శాసనాలు తయారుచేయబడినప్పుడు వాటిని తాను ఆమోదించాడు. కాని ఐరోపాలో హిట్లర్ రైన్‌లోయ అంతటినీ సైనిక కర్మాగారంగా మార్చివేస్తూండడంచూచి, 1937 లో ఆయన తన క్వారంటైన్ ఉపన్యాసంలో ఇలా హెచ్చరించాడు: "ప్రపంచంలో అరాజకత్వం నానాటికీ పెచ్చుపెరిగిపోతున్నది...అమెరికా తప్పించుకొని దూరంగాఉండగలదని భ్రమపడడం పొరపాటు" హిట్లరు యూదులజాతి విధ్వంసన విధానం, అతడి సైనిక దౌర్జన్యవాదం ప్రజాస్వామ్యంపట్ల అతడి నిరసనభావమూ జర్మనీ పూర్వశత్రువులలో తీవ్రమైన ఆలజడి కలిగిస్తున్నవి. అతడు పెద్ద ఎత్తున యుద్ధం ప్రారంభిస్తాడని వారి భయం. మ్యూనిక్ సమావేశంలో అతణ్ణి సంతృప్తిపరచడానికి చేసిన ప్రయత్నం విఫలమయింది. చివరికి, ఫ్యూరర్ పోలెండ్‌పై దాడి ప్రారంభించగానే 1939 సెప్టెంబర్‌లో ఇంగ్లండు ఫ్రాన్సు అతడిపై యుద్ధం ప్రకటించడంతో, మిత్రదేశాలకు అమెరికా సరఫరాలు పంపడానికి వీలుగా ప్రెసిడెంటు రోజ్వెల్టు తాటస్థ్యశాసనాన్ని రద్దు చేశాడు.

ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం ప్రారంభమయింది. కాల చక్రం మళ్ళీ 1914 వద్దకు తిరిగి వచ్చినట్లయింది. కాని, సంఘటనల ధోరణిలో ఈసారి కొంచెం మార్పుఉంది. మాసంగా తొమ్మిది నెలల పాటు రహస్య సన్నాహాలు చేసుకున్నమీదట జర్మన్ నాజీలు అకస్మాత్తుగా ఫ్రాన్సుమీద, నెదర్లెండు దేశాలమీద, డెన్మార్క్, నార్వేల మీద దండయాత్రచేసి ఆ దేశాలన్నీ బలవంతంగా తమకు లొంగిపోయేటట్టు చేశారు. తరువాత, డన్‌కర్క్ యుద్ధంలో ఐరోపాలోని బ్రిటిష్ వారందరు తరిమివేయబడ్డారు.

ఇటలీ, జర్మనీల ప్రబలసైనికశక్తితో ఇంగ్లండు ఒంటరిగా పోరాడవలసివచ్చింది. ఇచ్ఛికంగా లొంగిపోవడమో, లేదా భూ, నౌకా, విమానదాడులకు గురియై ఓడిపోవడమో తప్పనిసరి అయినట్టు కనిపించింది. ఇంగ్లండు కడపటి కందకంనుండి సాగిస్తూన్న పోరాటాన్ని

గురించిన వివరాలు నిరంతరంగా బాంబుదెబ్బలకు గురిఅవుతూన్న లండనునుండి రేడియో వార్తలద్వారా వింటూన్న అమెరికా ప్రజానీకం తమ కర్తవ్యం విషయంలో ఇంకా ఏకాభిప్రాయానికి రాలేదు. "ఇంగ్లండ్ పోరాటమే మన పోరాటం; ఇంగ్లండు ఓడిపోతే ఆపైన జర్మనీ జాబితాలో మనదే మొదటిపేరు," అని యుద్ధానుకూలురు వాదిస్తున్నారు. "అమెరికా తటస్థంగానే ఉండాలి; ఎవరుగెలిచినా అమెరికాకు ఒకటే" అని వారికి తాటస్థ్యానుకూలుర జవాబు.

ప్రెసిడెంట్ రోజ్వెల్టు బ్రిటనుపట్ల సంపూర్ణ సానుభూతిగలవాడు. 1940 సెప్టెంబరులో అతడు బ్రిటన్‌కి ప్రాణావసరమైన యాభై "డిస్ట్రాయర్" నౌకలను అమ్మి, వాటికి బదులుగా పశ్చిమార్థగోళంలోని కొన్ని నౌకాశ్రయాలను సంపాదించాడు. ప్రెసిడెంట్ స్వతంత్రించి తీసుకున్న ఈ చర్య తమ తాటస్థ్య విధానానోల్లంఘనమని చాలామంది అమెరికనులు నిరసించారు. అయితే, అంతకన్న దానిని ప్రశంసించినవారి సంఖ్యే హెచ్చు. ఈలోగా, ఆత్మరక్షణార్థం సైన్యాన్ని సమీకరించడానికిగాను కాంగ్రెసు ఒక శాసనాన్ని ఆమోదించింది. క్రమంగా చాలా కర్మాగారాలు యుద్ధావసరోత్పత్తులకు బదిలీ చేయబడుతున్నవి. ఎందుకోసమో ఎవరూ చెప్పలేని ఈ ప్రబల సమర సన్నాహాలమధ్య 1940 లో మళ్ళీ ప్రెసిడెంట్ ఎన్నికవచ్చింది. రెండుపర్యాయాలు ప్రెసిడెంట్ అయినవ్యక్తి మూడవసారి పోటీచేయరాదనే సంప్రదాయాన్ని రోజ్వెల్ట్ విజయవంతంగా ఉల్లంఘించాడు. సుప్రసిద్ధ ప్రజావసర పదార్థోత్పత్తిదారుడు, కొన్ని సంవత్సరాల క్రిందట టెన్నెసీలోయ అభివృద్ధిశాఖా స్థాపనను ప్రతిఘటించడంలో పేరువడినవాడు అయిన వెండల్ విల్కీ, రోజ్వెల్ట్‌తో పోటీచేసి ఓడిపోయాడు. ఈ అభ్యర్థులిద్దరూ, దేశీయవ్యవహారాల విషయంలో భిన్నాభిప్రాయాలు ప్రకటించినప్పటికీ, వారి విదేశాంగవిధానం విషయంలో మాత్రం ఉభయులూ ఏకాభిప్రాయమే ప్రకటించారు. ముఖ్యంగా, అమెరికా యుద్ధంలోకి దిగడం మినహా, తక్కిన సర్వవిధాలా బ్రిటనుకు సహాయపడాలనే వీరిద్దరూ ప్రకటించారు.

పిమ్మట 1941 వచ్చేసరికి, జర్మనీ ఇటలీలను ప్రతిఘటించవచ్చు నన్న ఆశ మందగించింది. "విశాలతర ప్రాచ్య ఆసియా సహకారాభ్యుదయ ప్రాంతం" పై పెత్తనం సంపాదించవలెననే సంకల్పంతో జపానుకూడా జర్మనీ, ఇటలీలతో చేతులు కలిపింది. ఐరోపాలో జర్మనీ సైన్యం గ్రీస్, యుగోస్లావియాలనుకూడా స్వాధీనం చేసుకొని రష్యాపై దండయాత్ర చేసి అప్పుడే చాలదూరం లోపలికి చొచ్చుకొని పోయింది. ఇంగ్లీష్ ఛానెల్ అవతలి ఒడ్డున బ్రిటిష్‌వారు మొండిగా ఆత్మరక్షణ చేసుకుంటున్నారు.

రోజ్వెల్టు మూడవసారి ప్రెసిడెంటు పదవి స్వీకరించిన వెంటనే కాంగ్రెసుకి ఇలా ఒక సందేశం పంపాడు: "ప్రపంచంలోని ప్రతి భాగంలోను నేడు ప్రజాస్వామ్య జీవన విధానం అవలంబింప బడుతూన్నదనే సంగతి వాస్తవికతావాదులందరికీ తెలుసు......మన దేశముయొక్క, మన ప్రజాస్వామ్యముయొక్క భవిష్యత్తు, భద్రత ప్రపంచంలో ఇతర భాగాల భావి భద్రతలతో ముడిపెట్టుకొని ఉన్నదన్న సంగతి మీకు విన్నవించవలసిన దుస్థితి ఏర్పడినందుకు విచారిస్తున్నాను..." తరువాత, నియంతృత్వ దేశాల విజృంభణను నిలువరించడానికిగాను సరుకులను విస్తృతంగా ఉత్పత్తి చేయాలనికూడా ప్రెసిడెంటు కోరాడు. భావప్రకటనా వాక్ స్వాతంత్ర్యం, మతస్వాతంత్ర్యం, దారిద్ర్యవిమోచనా స్వాతంత్ర్యం, దురాక్రమణ భయవిమోచనా స్వాతంత్ర్యం అనే చతుస్స్వాతంత్ర్య ప్రణాళికను ఆయన ప్రకటించాడు.

ప్రెసిడెంటు ప్రతిపాదించిన అరువు కౌలుచట్టాని కాంగ్రెసు వెంటనే ఆమోదించింది. ఈ చట్టంకింద వందలు, వేలకోట్ల డాలర్లు ఖరీదుచేసే సరుకులను ఉత్పత్తిచేసి, నియంతృత్వ దేశాలను ప్రతిఘటించడానికిగాను ఇంగ్లండుకీ, రష్యాకీ పంపడానికి వీలయింది. ఈ యుద్ధానంతరం ఇంకా ఉపయోగపడగల సామగ్రిని తిరిగి ఇచ్చివేయడంగాని, కొనుక్కోవడంగాని చేయవలసి ఉంటుందనీ, ఉపయోగపడిపోయిన సామగ్రిని పద్దులోనుండి కొట్టివేయాలనీ ఒప్పందం చేసుకున్నారు. పరాజయాన్ని వారించడానికి చాలినంత వేగంగా సరుకులను విదేశాలకు సరఫరా చేయడమే ఈ కార్యక్రమ పరమ

లక్ష్యం. అందువలన ఈ సరఫరాల విషయంలో ఈ అప్పులను తీర్చ గలశక్తి ఆ దేశాలకు ఉన్నదా లేదా అని కూడా యోచించలేదు. యుద్ధానంతరం వైషమ్యాలను కల్పించే విధంగా యుద్ధబుణాలు ఏర్ప రచరాదనీకూడా వారు నిశ్చయించుకున్నారు.

ప్రెసిడెంటు రోజ్వెల్టు 1941 ఆగస్టునెలలో ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిలును సముద్రంమీదే ఒకచోట కలుసుకొని అట్లాంటిక్ ఛార్టర్ రూపొందించాడు. అతురాజ్యాలు తామెందుకు విజయం సాధించాలనుకుంటున్నదీ, యుద్ధానంతరం తామేమి చేయబోయేది ఈ ఛార్టర్‌లో వివరింపబడింది. సమష్టి భద్రత, అంతర్జాతీయ ఆర్థిక సహకారం, ఆయుధవిసర్జన మున్నగు ఆశయాలను వెల్లడించి, ఆ ఇరు వురు నాయకులు ఆ నాడే ప్రస్తుత ఐక్యరాజ్య సమితికి అంకురార్పణ చేశారు.

అమెరికాకు,జర్మనీకి మధ్య అట్లాంటిక్ సముద్రంపైన తీవ్రసంఘ ర్షణలు తటస్థిస్తున్నప్పటికీ, అమెరికాకు యుద్ధం మరొక దిక్కునుండి వచ్చింది. ఫ్రెంచి ఇండోచైనా, థాయిలెండ్‌లపైకి విజృంభిస్తూ ఉండిన జపాను ఆశియా నడిగడ్డపై జరిపే దాడులను కట్టిపెట్టాలని అమెరికా జపానుని హెచ్చరించింది. ఈ విషయంలో రాయబారాలు జరిపి, ఒక ఒప్పందం చేసుకొనడానికిగాను, జపాన్ ఇద్దరు ప్రతినిధు లను వాషింగ్టన్‌కు పంపింది.

ఒక ప్రక్కన వాషింగ్టన్‌లో రాయబారాలు జరుగుతూ ఉండ గానే, జపాన్ నౌకలు, విమానాలు హవాయీ దీవులలోని పెరల్ హార్బర్ వద్దకువచ్చి 1941 డిసెంబరు 7-వ తేదీన అచటి అమెరికా నౌకాదళంపైన, సైనిక స్థావరాలపైనా, విమానాశ్రయాలపైనా హఠా త్తుగా దాడిచేసింది. యుద్ధనౌకవెంట యుద్ధనౌక జపాను బాంబు దెబ్బ లకు గురి అయి మునిగిపోయినవి. సుమారు రెండువేలమంది మరణిం చారు. ఈ దాడితోపాటుగానే ఫిలిప్పైన్ దీవులమీద, గ్వామ్ మున్నగు అమెరికా స్థావరాలపైకూడా జపాన్ దాడులు జరిపింది. పెరల్ హార్బర్‌ని రక్షిస్తూండిన సైనికోద్యోగులంతా అశ్రద్ధగా, నిర్లక్ష్యంగా ఉండినదీ, లేక అకస్మాత్తుగా అలాంటిదాడి జరుగవచ్చునని వాషిం గ్టన్‌నుండి ప్రభుత్వం వారిని సకాలంలో హెచ్చరింపజాలక పోయి నదీ స్పష్టంగా ఇంతవరకూ నిశ్చయం కాలేదు.

ప్రెసిడెంటు అభ్యర్థనపై 1941 డిసెంబర్ 8వ తేదీన కాంగ్రెసు జపాన్‌మీద యుద్ధం ప్రకటించింది వెంటనే ఇంగ్లండు కూడా జపానుమీద యుద్ధం ప్రకటించింది. పిమ్మట జర్మనీ, ఇటలీ దేశాలు అమెరికా సంయుక్త రాష్ట్రాలపై యుద్ధం ప్రకటించినవి. ప్రపంచం ఎన్నడూ కని విని ఎరుగనంతటి భయంకర అఖిల ప్రపంచ మహా సంగ్రామం ప్రారంభమయింది.

—0—

# దశమ అధ్యాయం

## ఆధునిక మహాయుగం

ఐక్యరాజ్యసమితి నిబంధనావళి పత్రం - లేక ఛార్టరు - ననుసరించి, ఆ సంస్థ 1945 జూన్ నాటికిగాని పూర్తిగా స్థాపింప బడక పోయినా, వాస్తవానికి అంతకు చాలాకాలం పూర్వమే దానికి బీజావాపం జరిగింది. 1942 జనవరి 1వ తేదీన వాషింగ్టన్‌లో జరిగిన ఒక సమావేశంలో అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రతినిధులు, అక్షరాజ్యాలతో పోరాడుచుండిన మరి ఇరవై ఐదు దేశాల ప్రతినిధులు యుద్ధంలో విజయసాధనకోసం, అనంతరం అట్లాంటిక్ ఛార్టర్‌లోని షరతుల ననుసరించి శాంతిని సుప్రతిష్ఠితం చెయ్యడానికి సమష్టిగా కృషిచేయగలమని ప్రతిజ్ఞలు చేశారు. ఈ ఒడంబడిక తరువాత మూడున్నర సంవత్సరాలు నిస్పృహతో తెగించి పోరాడిన పిమ్మటగాని యుద్ధం పూర్తి కాలేదు.

అమెరికాకు సంబంధించినంతవరకు ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం ముందు, ప్రథమ ప్రపంచ మహాసంగ్రామం అత్యల్పమయినది అయింది. ప్రథమ సంగ్రామంలో అమెరికా నలభైలక్షలమంది సుశిక్షిత సైనికులను తయారుచేసింది. అలాంటిది, ఈ యుద్ధంలో మొత్తం కోటీ ఇరవై లక్షల సైన్యం తయారుచేసింది. వీరిలో కొద్దిమంది స్త్రీలుకూడా ఉన్నారు. వీరు పోరాటంలో పాల్గొనని దళాలలో పనిచేస్తూ ఉండేవారు. ప్రథమ సంగ్రామంలో మొత్తం 3,64,000 మంది దెబ్బతిం టే.

ఈ యుద్ధంలో దానికి మూడురెట్లు-అనగా పదిలక్షలకుపైగా - దెబ్బ తిన్నారు. 1919 లో గల జాతీయఋణం 2700 కోట్ల డాలర్లు, 1945 నాటి జాతీయ ఋణం 27,900 కోట్ల డాలర్లు - అంటే దీనిలో మొదటిది పదకవంతుకన్నా కూడా తక్కువ.

పెరల్ హార్బర్ పతనానికిపూర్వం, అమెరికాలో యుద్ధోత్పత్తులు, సైనిక సమీకరణ ఎంత జరిగినా, అవరమైనప్పుడు ఐరోపాలోను, ఆసియాలోనుకూడా యుద్ధం చేయడానికి తగిన సన్నాహాలు చేసుకోలేదు. యుద్ధానికి సంసిద్ధంగా లేకపోవడంవల్లను, జపాను హఠాత్తుగా దెబ్బ తీసినందువల్లను, ఆదిలో అమెరికా ఫిలిప్పీలను, ఒక్క హవాయి మినహా మిగిలిన పసిఫిక్ స్థావరాలన్నింటినీ కోల్పోయింది. ఫిలిప్పీనులలోని స్థానిక సైన్యము, అమెరికా సేనాని జెనరల్ డగ్లస్ మెకార్థర్ ఆధిపత్యాన శౌర్యసాహసాలతో ప్రతిఘటించినా లాభంలేకపోయింది. జపాన్ సైన్యం అలాస్కా సమీపంలోని అల్యూషన్ దీవులవరకూ విజృంభించి, ఉత్తర అమెరికా ఖండానికే ప్రమాదకరంగా పరిణమించింది. దానితోపాటుగానే జపాన్ మలయా, సింగపూరులనుండి బ్రిటిష్ వారిని తరిమి వేసింది. డచ్చి పశ్చిమ ఇండియా దీవులను, ఇంకా పసిఫిక్ సముద్రంలోని అనేక దీవులను పట్టుకొని, ఆస్ట్రేలియానుకూడా కబళించేటట్లు తయారయింది.

1942 మధ్యలో నూతన విమానాలు, నౌకలు వచ్చినందువల్ల పసిఫిక్ సముద్రంలో అమెరికా ప్రతిఘటన తీవ్రతరమయింది. సాలోమాన్ దీవులలోని గ్వాడల్ కెనాల్ మీద అమెరికా జరిపిన దాడితో జపాన్నుండి తన ప్రాంతాలను తిరిగి వరుసగా స్వాధీనం చేసుకుని, చిట్టచివరకు జపాన్ నడిగడ్డనుకూడా స్వాధీనంచేసుకొనే దుస్సాధ్యమైన సుదీర్ఘ కార్యక్రమం ప్రారంభమయింది. ఉభయపక్షాలు అతి శౌర్యసాహసాలతో నిర్దాక్షిణ్యంగా పోరాడినవి. అడవులలోను, సముద్రతీరాలలోను పోరాడుతూ పట్టుబడినవారిలో బహుకొద్దిమంది మాత్రమే యుద్ధఖైదీలుగా తీసుకొనబడ్డారు. ఆసియా నడిగడ్డపైన, అమెరికా సహాయంతో చైనా తనశక్తివంచనలేకుండా ప్రతిఘటిస్తానే ఉన్నది. బ్రిటిష్ సేన బర్మాను కాపాడుతూంది.

ఈ విధంగా, ఆసియాలో జపాను విజయంపై విజయం సాధిస్తున్నప్పటికీ, ఐరోపాలో జరుగుతున్న యుద్ధమే ఇంతకన్న ముఖ్యమైన

దని ప్రెసిడెంట్ రోజ్వెల్టు భావించాడు. అమెరికా సైన్యంలో అధిక భాగం పరోపాకే పంపబడింది. 1942 నవంబరులో బ్రిటన్, అమెరికాల సైన్యం జెనరల్ డ్వైట్ ఐసెన్ హోవర్ నాయకత్వాన ఆఫ్రికా వాయవ్య ప్రాంతంపై దాడిచేసి స్వాధీనంచేసుకొని, భయంకరంగా పోరాడుతున్న జెనరల్ రోమెల్ ఆఫ్రికా పటలాన్ని ఆ ఖండంనుండి తరిమివేయడానికి సహాయపడింది. అచటినుండి ఈ విజేతృసైన్యం మధ్యధరాసముద్రందాటి సిసిలీదీవిమీదుగా ఇటలీలో ప్రవేశించి, ఆదేశాన్ని కూడా లొంగదీసుకున్నది. అయినప్పటికీ జర్మనులు ఇటలీని వదలక, యుద్ధం ముగిసిపోవచ్చే వరకూ ఉత్తర ఇటలీని వదలిపెట్టలేదు.

1943 లో ప్రెసిడెంటు రోజ్వెల్టు, ప్రధానమంత్రి చర్చిలు, సోవియట్ యూనియన్ ప్రధాని జోసెఫ్ స్టాలిన్, చైనా జాతీయ ప్రభుత్వాధ్యక్షుడైన చియాంగ్ కై షేక్ అనేక ప్రదేశాలలో సమావిష్టులయి యుద్ధనీతిని గురించీ, యుద్ధానంతరం ఆచరణ సాధ్యమైన ఐక్యరాజ్యసమితి స్థాపనను గురించీ సమాలోచనలు జరిపారు. రష్యాసైన్యాలు వెనుదిరిగి నిలబడి, జర్మన్ సైన్యాలపై గట్టిదెబ్బలు తీయడమారంభించినవి. జర్మనీపై మరొకదెసనుండికూడా దాడి ప్రారంభించడానికి రష్యాకు అమెరికా హామీ ఇచ్చింది.

ఆ ప్రతిజ్ఞను సఫలంచేయడానికి, 1944 జూన్ 6వ తేదీన అమెరికనులు, బ్రిటీష్‌వారు, కెనడియనులు, జర్మనులు జయించిన దేశాలనుండి తప్పించుకొని వచ్చిన దేశభక్తులతోను కూడిన సైన్యం సర్వం, జెనరల్ ఐసెన్‌హోవర్ నాయకత్వాన ఇంగ్లండునుండి ఇంగ్లీషు ఛానెల్ దాటి ఫ్రాన్సులో నార్మండీ తీరంలో దిగింది. జర్మన్లు నిష్ఫ్రంతో తీవ్రంగా ప్రతిఘటించారు. కాని వారికి సరఫరాలువచ్చే మార్గాలమీదను, నగరాలమీదను, పరిశ్రమలమీదను మిత్రరాజ్యాల విమానాలు తీవ్రంగా దాడులు చేస్తూన్నందువలన, జర్మనుల యుద్ధశక్తి క్రమంగా సన్నగిలిపోవడం, తత్కారణంగా వారు వెనుదిరిగి ఫ్రాన్సుమీదుగా రైన్‌నదివంకకు వెనుకకు తగ్గడం జరిగింది.

ఈలోగా పసిఫిక్ మహాసముద్రంలో జెనరల్ మెకార్థర్ సైన్యాలు తిరిగి ఫిలిప్పీన్ దీవుల వంకకు పురోగమిస్తున్నవి. నౌకాదళాలు గ్వామ్ మొదలైన పసిఫిక్ దుర్గాలను ఆక్రమించుకొంటున్నవి. జపాన్

వద్దనుండి న్యూగినీని, దాని పరిసర ద్వీపాలను తిరిగి వశంచేసుకున్న మీదట, మెకార్థర్ సైన్యాలు లేటే, లూజాన్‌లపై దాడిచేసినవి. మళ్లీ కూడదీసుకొని దెబ్బతీయడానికి జపాన్ చేసిన ప్రయత్నాన్ని అమెరికా నౌకాదళం విఫలంచేసింది. చైనా బర్మాలలో మాత్రమే జపాన్ సేన గట్టిగా తిష్ఠవేసి కూర్చొనగలిగింది. భయంకరమైన పోరాటాల పర్యవసానంగా ఒకినావా, ఐవోజిమాలను ఆక్రమించుకొన్న పిదప సంయుక్తరాష్ట్రం, వేలకొలది యుద్ధవిమానాలతో జపాను ముఖద్వారంవద్దకు చేరుకున్నట్టయింది.

ఐరోపాలో ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం ముగిసిపోవస్తూంది. 1944 క్రిస్మస్‌లో నాజీలు బెల్జియంలో "బల్జ్ యుద్ధం" లో అతి సాహసోపేతంగా ఎదురుదాడి చేశారుగాని ప్రయోజనం లేకపోయింది. ఈ దాడిలో తొలిసంరంభపు పొంగు తగ్గిపోయిన తరువాత పశ్చిమదిశనుండి తిరిగి వారికి పరాజయమే ప్రాప్తించింది. ప్రాచ్యరంగంలోకూడా జర్మనుల పరిస్థితి ఏమీ బాగుండలేదు. అక్కడ రష్యాసేనలు పోలెండు మీదుగా జర్మనీ సరిహద్దులలోపలికికూడా చొచ్చుకొని వచ్చినవి. చివరికి తూర్పు, పడమర దిక్కులనుండి జర్మనీలోకి చొచ్చుకొనివస్తూన్న రష్యా, అమెరికా సైన్యాలు జర్మనీ మధ్యభాగంలో కలుసుకొన్నవి. బెర్లిన్‌లో ప్రవేశించిన రష్యనులకు పట్టుబడడం ఇష్టంలేక హిట్లర్ ఆత్మహత్య చేసుకున్నాడు. ఐరోపాలో యుద్ధం అంతమైపోయింది. జర్మనీలో మిగిలిఉన్న అధికారులు 1945 మే 7 వ తేదీన బేషరతుగా లొంగిపోయారు.

కాని, ఈ విజయసాధనకు విశేషంగా కృషిచేసిన ఫ్రాంక్లిన్ రోజ్వెల్టుమాత్రం ఈ అంతిమ విజయవార్త వినకపూర్వమే కాలంచేశాడు. 1944లో ఆయన మరల నాల్గవ టరముకూడా ప్రెసిడెంటుగా ఎన్నిక అయినమీదట, యాల్టావద్ద రష్యా ప్రధాని స్టాలిన్‌ని కలుసుకున్నాడు. చైనాలో ముఖ్యమైన కొన్ని ప్రాంతాలు రష్యాకు వదిలివేయడానికీ, దానికి ప్రతిఫలంగా రష్యాకూడా జపాన్‌తో యుద్ధంలోకి దిగడానికీ, ఆ సమావేశంలో ఒప్పందాలు చేసుకున్నారు. ఈ సమావేశానంతరం స్వదేశానికి రాగానే రోజ్వెల్టు చాలా అలిసిపోయి ఉన్నందువల్ల విశ్రాంతికోసం జార్జియాలోని వారమ్ స్ప్రింగ్స్‌కి వెళ్ళి అక్కడే

మెదడులో రక్తనాళాలు చిట్లడంవలన ఏప్రిల్ 12వ తేదీన అకస్మాత్తుగా మరణించాడు. అమెరికా దుఃఖానికి మేరలేదు. ఫ్రాంక్లిన్ డిలానో రోజ్వెల్టు అనంతరం, వైస్ ప్రెసిడెంటు హారీ-ఎస్, ట్రూమన్ ప్రెసిడెంటు అయాడు. ఈయన మిజూరీ రాష్ట్రమ్నుండి ఎన్నిక అయిన సెనేటరు.

పసిఫిక్ ప్రాంతంలోకూడా బలవంతంగా యుద్ధం ముగింపు చేయబడింది. జపానుపని ఇరకాటంగానే ఉన్నది. కాని, అప్పటికీ, జపాన్ సేన చాలా బలంగా ఉన్నది. స్వదేశాన్ని రక్షించుకోవాలనే వారి దీక్ష చెక్కుచెదరలేదు. జపాన్‌పై దండయాత్ర చేయడానికి ప్రయత్నించి ఉంటే, చాలానష్టానికి సమ్మతించవలసి ఉండేది. అయినప్పటికీ, సంప్రదాయసిద్ధమైన విమానపు దాడులవల్లనే జపాన్‌ను లొంగదీయడానికి దండయాత్రాపద్ధతినాని, విమానపుదాడుల పద్ధతిగాని వినియోగించబడలేదు.

యుద్ధం తొలిరోజులనుండి, ఐక్యరాజ్యాలు, అక్షరాజ్యాలుకూడా ఏటంబాంబును ముందుగా తయారుచేయడానికి పోటీలుపడి కృషిచేస్తున్నవి. సుమారు యాభై సంవత్సరాలుగా శాస్త్రవేత్తలు మెల్లమెల్లగా పరమాణు విచ్ఛేదన రహస్యాలను కనిపెడుతూవచ్చారు. సంయుక్తరాష్ట్రాలు, బ్రిటను తమ శాస్త్ర విజ్ఞానాన్ని సమష్టిగా వినియోగించి, ఏటంబాంబును ఉత్పత్తిచేసి, మొట్టమొదటి బాంబును 1945 జూలై 6వ తేదీన న్యూమెక్సికో రాష్ట్రంలోని లాస్ ఆలమాస్ పరీక్షాస్థలంలో పేల్చి చూచారు. అది ప్రేలినవెంటనే కుక్కగొడుగు ఆకారంలో ఆకాశానికంట లేచిన పెద్దమంటను, దాని విపరీత విధ్వంసన శక్తినీ చూచిన పరిశీలకులంతా అత్యాశ్చర్య చకితులయారు.

అనంతరం పదిరోజులకు, జపాను బేషరతుగా లొంగిపోవడం మంచిదనీ, లేకపోతే విమానపు దాడులవలన సంపూర్ణ విధ్వంసనానికి గురికావలసి వస్తుందనీ ఒక హెచ్చరిక చేయబడింది. అయితే, ఆ హెచ్చరికలో ఏటంబాంబు అనే ఈ నూతనాయుధాన్ని గురించిన ప్రసక్తి ఏమీ లేదు. ఆగస్టు 6వ తేదీన ఒక అమెరికా విమానం జపాన్‌లో 3,40,000 జనాభాగల హిరోషిమా అనే నగరంపైన ఒక ఏటంబాంబును విసిరివచ్చింది. ఆ నగరం ఇంచుమించు నేలమట్టమైపోయింది.

మరణించినవారు, వికలాంగులైనవారు మొత్తం 1,80,000 మంది అని లెక్క తేలింది. ఆగస్టు 8 వ తేదీన రష్యా జపాన్‌పై యుద్ధం ప్రకటించి వెనువెంటనే మంచూరియాను, కొరియాను ఆక్రమించుకొన్నది. ఆగస్టు 9వ తేదీన అమెరికా సంయుక్తరాష్ట్ర విమానదళం మరొక ఏటంబాంబును నాగసాకీ పట్టణంమీదకూడా వేసింది. ఈసారి మొత్తం 80 వేల జనాభా నష్టపడింది. చివరికి, ఆగస్టు 14 వ తేదీన హిరోహీటో చక్రవర్తి జపాన్ లొంగిపోవడానికి సమ్మతిస్తున్నదని ఐక్యరాజ్య సమితికి తెలియపరిచాడు.

లొంగుబాటు షరతుల పత్రంపైన సంతకాలు చేయడానికి జపాన్ రాయబారులు టోకియో అఖాతంలోని మిస్సోరీ అనే యుద్ధనౌకలోనికి రావడంతో 1945 సెప్టెంబర్ 1వ తేదీన ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం ముగిసిపోయింది. జపాన్‌కిగల సముద్రాంతర సామ్రాజ్యమంతా పూర్తిగా జపాన్‌నుండి లాగివేయబడింది. జపాన్ దేశంకూడా ఆక్రమణ సేనల వశంలో ఉంచబడింది. యుద్ధం అంతమయినందుకు ప్రపంచం ఆనందించింది. కాని, ఆ ఆనందం మంచికో చెడ్డకో పరిమాణుయుగం ప్రారంభమయిందనే భయవిస్మయాలతో సమ్మిశ్రితమైనది.

* * *

యుద్ధకాలంలో ఐక్యరాజ్య నాయకులమధ్య సాధ్యమయిన సన్నిహిత సహకారభావమూ, తదనంతరం శాంతిస్థాపనకు కృషిచేయాలన్న వారి దృఢసంకల్పము వారి ప్రణాళికల నిర్వహణకుగాను నానాజాతి సమితికన్న సమర్థమైన అంతర్జాతీయ వ్యవస్థానిర్మాణానికి దారిచూపినవి. ఈ భావాన్ని అమెరికా ప్రజానీకం చాలావరకు బలపరిచింది. సెనేట్‌లోని డెమొక్రాట్లేకాక, చాలామంది రిపబ్లికన్లుకూడా ఈ విషయంలో రోజ్వెల్టును బలపరిచారు.

ప్రాథమిక సమావేశాలు కొన్ని జరిగినమీదట ఐక్యరాజ్యసమితికి నిబంధనావళి తయారుచేయడానికిగాను 1945 ఏప్రిల్‌లో కాలిఫోర్నియా రాష్ట్రంలోని శాన్‌ఫ్రాన్సిస్కోలో అగ్రరాజ్యాలపట్ల వైముఖ్యంగల యాభైదేశాల ప్రతినిధులు సమావిష్టులయారు. వీరు తయారుచేసిన నిబంధనల ప్రకారం ఐక్యరాజ్యసమితి తరఫున పనిచేయ

డానికి భద్రతాసంఘమనే పేరుతో ఒక ప్రముఖ కార్యనిర్వాహక సంఘం ఉంటుంది. శాంతి రక్షణకుగాను తగినచర్య తీసుకొనడానికి కూడా ఈ సంఘానికి అధికారం ఉన్నది. ఐక్యరాజ్యసమితి సర్వ సభ్యమహాసభ, లేక జెనరల్ ఎసెంబ్లీ అప్పుడప్పుడు సమావేశమై ముఖ్యమైన ప్రపంచసమస్యలన్నింటినిగురించి చర్చలు జరిపి, ఐక్యరాజ్య సమితి అనుసరించవలసిన విధానాలను సూచిస్తుంది. ఇక, అంతర్జాతీయ వివాదాలను విచారించి తీర్పుచెప్పడానికిగాను ఒక అంతర్జాతీయ న్యాయస్థానంకూడా ఏర్పాటుచేయబడింది. ఐక్యరాజ్యసమితి వ్యవహారాలన్నిటినీ చూడడానికి ఒక కేంద్రకార్యాలయము, అగ్రరాజ్యాల వద్దనుండి లాగుకొనబడిన ప్రాంతాల పరిపాలనను నిర్వహించడానికి ఒక ధర్మకర్తృత్వ సంఘంకూడా ఉన్నవి. ఇవిగాక అంతర్జాతీయ కార్మికసంస్థ, అంతర్జాతీయబ్యాంకు, ప్రపంచవిజ్ఞానపరిషత్తు మొదలగు సంస్థలు ఐక్యరాజ్యసమితికి అనుబంధ సంస్థలుగా ప్రపంచప్రజల శ్రేయస్సాధనకు కృషిచేస్తున్నవి.

భద్రతాసంఘంలో పదకొండుగురు సభ్యులు ఉంటారు. వీరిలో అమెరికా సంయుక్తరాష్ట్రం, బ్రిటన్, రష్యా, ఫ్రాన్సు, చైనా అనే పంచప్రపంచప్రముఖ రాజ్యాలకు మాత్రం శాశ్వత ప్రాతినిధ్యం ఉంటుంది. ఈ సంఘం ఏ నిర్ణయం చేయాలన్నా ఇందులో కనీసం ఏడుగురు సభ్యుల ఆమోదం పొందాలి. నిర్వహణకు సంబంధించిన విషయాలలో గాక, మిగతా విషయాలలో ఈ సంస్థ ఏదైనా చర్యతీసుకొనడానికి నిశ్చయించినప్పుడు, దానిని త్రోసిరాజనే హక్కు ఈ ప్రపంచప్రముఖ రాజ్యాలలో ప్రతిదానికీ ఉన్నది. తమకు ఇష్టంలేని ఏ విషయంలోనూ ఐక్యరాజ్యసమితికి లొంగడానికి గాని, తమ జాతీయ స్వాతంత్ర్యం లవలేశాన్నికూడా ఐక్యరాజ్యసమితికి అప్పగించడానికిగాని ఈ పంచ ప్రముఖ రాజ్యాలు సమ్మతించలేదనడానికి ఈ అసాధారణ మయిన "వీటో" అధికారమే ప్రబల నిదర్శనం.

సంయుక్తరాష్ట్ర సెనేట్ సభ 1945 జూలైలో ఈ ఐక్యరాజ్య సమితి ఛార్టరును ఆమోదించింది. అచిరకాలంలోనే ఇతర దేశాలు కూడా తమ సమ్మతి తెలిపినవి. 1946 జనవరిలో ఐక్యరాజ్యసమితి ఏర్పడి పనిచేయుట మారంభించింది. నార్వేదేశస్థుడైన ట్రిగ్వేలీ ఈ

సంస్థకు కార్యదర్శిగా ఎన్నుకోన బడ్డాడు. ఈ సంస్థ శాశ్వత కార్యాలయాన్ని న్యూయార్క్ నగరంలో ఏర్పాటు చేయడానికి తీర్మానించారు.

అంతర్జాతీయ శాంతి సాధింపబడినదనే ఆశలేమైనా ఉంటే, అవన్నీ ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామానంతరం ఒక్క సంవత్సరంలోనే మాయమై పోయినవి. ప్రపంచంలో రెండు ప్రబల వాదాల మధ్య సంఘర్షణ ప్రారంభ మయింది. ఇందులో ఒకటి: ప్రజాస్వామ్య పక్షం. అమెరికా సంయుక్తరాష్ట్రం, ఇతర పాశ్చాత్య రాజ్యాలు ఈ పక్షంలో ఉన్నవి. రెండవది: కమ్యూనిజం. దీనికి ప్రతినిధి సోవియట్ యూనియన్. ఐక్యరాజ్యసమితిలో చర్చకువచ్చిన ఇంచుమించు ప్రతి విషయంలోను ఈ రెండు పక్షాలు పరస్పర భిన్నభావాలను ప్రకటిస్తున్నవి. పైగా, రష్యా తన ప్రాబల్యాన్ని పోలెండ్, బాల్కన్ దేశాలపైకికూడా విజృంభింపజేసింది. బ్రిటన్ ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిల్ చెప్పినట్లు, ప్రపంచంలో ప్రజాస్వామ్య ప్రాంతానికీ, రష్యా, దాని ఉపగ్రహ రాజ్యాలకూ నడుమ ఐరోపాలో మధ్యగా ఒక 'ఉక్కు తెర' దించినట్లయింది.

ముఖ్యంగా ఈ ఉక్కు తెర జర్మనీ, ఆస్ట్రియా దేశాలపాలిట అడకత్తెరగా పరిణమించింది. ఈ రెండు దేశాలలోకూడా కొంత భాగాన్ని సంయుక్తరాష్ట్రము, బ్రిటన్, ఫ్రాన్సు దేశాలు ఆక్రమించుకొన్నవి. ఈ విధంగా విభక్తమై ఉన్న ఈ దురదృష్ట దేశాలతో సంధులు చేసుకుని వాటిని తిరిగి ఏకంచేసే పద్ధతుల విషయంలో ఈ ఆక్రమణరాజ్యాలమధ్య తరచు తగాదాలు ఏర్పడుతున్నవి. జర్మనీలో, నాజీయుద్ధనాయకులను విచారించి శిక్షలు విధించాలని ఆ దేశాన్ని నిరాయుధం చెయ్యాలనీ ఈ నాలుగు ఆక్రమణరాజ్యాలు అంగీకరించినవి. కాని, జర్మనీ కమ్యూనిస్టుదేశం అయే పద్ధతిలో తప్ప మరేవిధంగాను దాని పునర్నిర్మాణానికి రష్యా అంగీకరింప దలచుకోనట్లు, అచిరకాలములోనే మాస్కో ప్రభుత్వం వ్యవహరించడ మారంభించింది. పారిశ్రామిక ప్రాధాన్యంగల పశ్చిమ జర్మనీ, వ్యవసాయ ప్రాముఖ్యంగల తూర్పు జర్మనీ స్వేచ్ఛగా వ్యాపారం చేసుకుంటూ ఉభయతారకంగా వర్ధిల్లగలదని ప్రజాస్వామ్య రాజ్యాలు ఆశించినవి.

కాని, స్టాలిన్ ఆట్టి వాణిజ్యావకాశాన్ని పూర్తిగా నిషేధించి తన పెత్తనం క్రింద ఉన్న తూర్పు జర్మనీని ఉక్కుతెర మరుగుకి లాగి వేశాడు. ఈ విధంగా జర్మనీ చీలిపోయి రెండు ప్రపంచాల్లో చెరి సగంగా ఉంటూంది.

ఇక ఐక్యరాజ్యసమితిలో అమెరికా సంయుక్తరాష్ట్రము, రష్యా ఇంతకన్న ముఖ్యమైన అణుశక్తి నియమనం విషయంలోకూడా వివాద పడ నారంభించినవి. పటిష్ఠమైన అంతర్జాతీయ నియమన విధానం, పర్యవేక్షణావకాశం కల్పిస్తే నే, తన ఏటంబాంబుల అన్నిటినీ, నాశనం చేసి వేయగలనని అమెరికా ప్రకటించింది. చాలాదేశాలకు ఈ షరతు సబబుగానే కనిపించింది. కాని, అమెరికా ముందు తన ఏటంబాంబు అన్నిటినీ, ధ్వంసం చెయ్యాలనీ, పిమ్మట పరమాణుశక్తి నియమనం విషయం భద్రతాసంఘం చూచుకుంటుందనీ రష్యా పట్టుపట్టింది. అయితే, రష్యాకు వీటో అధికారం ఉన్నంతవరకు పరమాణుశక్తినియమనం, పర్యవేక్షణ భద్రతాసంఘం సక్యంగా జరుపజాలదని ఈ సూచనకు ఇతరులు అభ్యంతరం చెప్పారు. అమెరికా తనవద్దనున్న ఏటంబాంబులన్నిటినీ నాశనం చేసివేసి, ఆ పైన మళ్ళీ ఆ ఆయుధాలను ఉత్పత్తి చేయకుండా ఉంటే, రష్యా క్రమంగా రహస్యంగా ఈ ఆయుధాలను ఉత్పత్తిచేసి తనదే పైచేయి అయేటట్టు చేసుకుని, భద్రతాసంఘ పర్యవేక్షణను తన వీటో అధికారంతో సులభంగా త్రోసివేయవచ్చుగదా! ఇన్ని అనుమానాలు, అవిశ్వాసాలమధ్య అంతర్జాతీయ సంబంధాలు క్రమంగా దిగనాసిలి పోతూండడంవల్ల, ఒక వంక ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామంలో పోరాడిన వీరులుపూర్తిగా ఇళ్ళకు చేరుకొనక పూర్వమే, నిరాశావాదులు తృతీయ ప్రపంచ మహాసంగ్రామాన్ని గురించి జోస్యాలు చెప్పడం ప్రారంభించారు.

* * *

యుద్ధానంతరం, అమెరికా సైనికుల నందరినీ వేగంగా ఇళ్ళకు పంపివేసి, సాధ్యమైనంత శీఘ్రంగా మళ్ళీ "మామూలు వ్యాపారాన్ని" చక్కబెట్టుకొనడానికి సన్నాహాలు చేసింది. సైన్యం, 1,10,00,000 నుండి, 10,00,000 లకు తగ్గించబడింది. ప్రపంచ పరిస్థితుల దృష్ట్యా ఈ చర్య చాలా ప్రమాదకరమైనదని కొందరు విమర్శించారు. కాని,

యోధులంతా ఇళ్ళకు వెళ్ళాలని తహతహ లాడుతున్నారు. పైగా ప్రజాభిప్రాయం కూడా వారికే అనుకూలంగా ఉన్నది.

మళ్ళీ దేశంలో యుద్ధావసర ఉత్పత్తి పుష్కలంగా సాగుతూంది. అందువలన, ప్రజావసర వస్తువులకు కొరత ఏర్పడుతున్నది. ఇళ్ళకొరతకూడా తీవ్రంగానే పరిణమించింది. యుద్ధకాలంలో ధరల నియమన శాఖవారు వివిధ పదార్థాల ధరలను అదుపులో ఉంచారు.

ఈ శాఖవారి ధరల పట్టికను ఇంకా మరికొంతకాలం వాడుకలో ఉంచాలని ప్రెసిడెంటు ట్రూమన్ కోరుతున్నప్పటికీ, కార్మికులు, పరిశ్రమల యజమానులుకూడా వాటిని భంగించి, దేశంలో మళ్ళీ స్వేచ్ఛా వాణిజ్యానికి అవకాశం కలిగించాలనే కోరుతున్నారు. యుద్ధం ముగిసిపోగానే, కార్మిక వేతనాల అభివృద్ధికోసం సమ్మెల పరంపర ప్రారంభమయింది. గనికార్మికుల సమ్మేళనానికి చెందిన జాన్ ల్యూయిస్ ప్రథమ ప్రపంచ మహాసంగ్రామానంతరంలాగే, ఈ పర్యాయంకూడా ఈ సమ్మెలలో ప్రముఖపాత్ర నిర్వహించాడు. ప్రధాన పరిశ్రమలలో వేతనాలు చాలాభాగం వృద్ధిచేయబడినవి. తత్ఫలితంగా పరిశ్రమల యజమానులు తమ సరుకుల ఉత్పత్తి వ్యయం పెరిగిపోయినదనీ, అందువల్ల ప్రభుత్వం వాటికి నిర్ణయించిన ధరలనుకూడా వృద్ధిచేయాలనీ, లేకపోతే తమ పరిశ్రమలు ఆర్థికంగా పూర్తిగా దెబ్బతిని పోవడం తప్పదనీ ఆందోళన ప్రారంభించారు.

ప్రెసిడెంటు వద్దంటున్నా వినక, కాంగ్రెసు కంట్రోళ్ళను సడలించాలన్న ఈ ఆందోళన ఒత్తిడికి లొంగిపోయింది. ఈ పరిస్థితికి, సమ్మెలవలన, ఇళ్ళకొరత వలన, వస్తువుల కొరతవలన ఏర్పడిన అసంతృప్తికూడా తోడయి, 1946 లో కాంగ్రెస్ ఎన్నికలలో రిపబ్లికనుల విజయానికి కారణ మయింది. పధ్నాలుగు సంవత్సరాలకు పూర్వం "న్యూడీల్" కార్యక్రమం ప్రారంభం అయిన తరువాత మళ్ళీ ఇప్పటికీ, ప్రజాప్రతినిధుల సభలోను, సెనేట్‌లోనుకూడా రిపబ్లికనులకే అధికసంఖ్యాబలం లభించింది. కాంగ్రెస్‌కీ, ప్రెసిడెంటు ట్రూమన్‌కీ మధ్య తీవ్రమైన పోరాటం తప్పనిసరి అయింది.

ఓహియో రాష్ట్రాన్నుండి ఎన్నిక అయిన పదహారణాల రిపబ్లికన్ రాబర్ట్‌టాఫ్ట్ సెనేట్‌సభకు నాయకుడయాడు. ఇతడు పూర్వం ప్రెసి

డెంటు చేసిన హోవార్డు టాఫ్టు కుమారుడు. "న్యూడీల్" లోని అసం దర్భాలను సవరించాలనే పట్టుదలతో సెనేటర్ టాఫ్ట్, ముఖ్యంగా ఆదాయపు పన్నులను తగ్గించడానికి, కార్మికసంఘాలకు, వాటి నాయకులకు ఉద్ధతి తగ్గించే నిమిత్తం ఒక కార్మికశాసనం చేయడానికి తీవ్రంగా కృషిచేశాడు.

ప్రెసిడెంటు ట్రూమన్ వీటో చేసినప్పటికీ ఆమోదింపబడిన టాఫ్ట్ - హార్ట్లీ శాసనం కార్మికులకు, పారిశ్రామికులకు మధ్య రాయబారాలలో సమప్రాబల్యం ఏర్పరచడానికి ఉద్దేశింపబడినది. అంతకు పూర్వం "వాగ్నర్" ఏక జాతీయ కార్మికసంబంధాల శాసనం రీత్యా కార్మికుల ఉద్ధతి ఎక్కువైనందున, దానిని తగ్గించడానికి ఈ శాసనం చేయబడింది. వాగ్నర్ శాసనం యజమానుల ప్రవర్తనకే నియమాలు, నిషేధాలు విధించింది. ఈ నూతన శాసనంలో కార్మికుల ప్రవర్తనపై కూడా అట్టి నియమ నిషేధాలు విధింపబడినవి. యజమానులు తమ కర్మాగారాలను మూసివేయరాదని కూడా ఈ శాసనం నిషేధించింది. ఈ నిషేధం రీత్యా యాజమానులు కార్మికసంఘ సభ్యులనే తప్ప, ఇతరులను పనిలో పెట్టుకోకూడదు; సమ్మెచేయుడానికి పూర్వం అరవై రోజులు వ్యవధి యివ్వాలి. కార్మికసంఘ నాయకులు తాము కమ్యూనిస్టులము కామని ప్రమాణపత్రాలు వ్రాసి యివ్వాలి. టాఫ్ట్ - హార్ట్లీ "వెట్టిచాకిరీ చట్టం" పట్ల కార్మికసంఘాలు తీవ్రమైన నిరసన ప్రకటించినవి. కాని, ఈ శాసనం కార్మికులకు చేయగల పెద్ద అపకారమేమీ లేదని అనంతరం అనుభవంలో రుజువయింది. అయితే, కార్మికసంఘ నాయకులను మాత్రం ఈ శాసనం కొంత ఇబ్బంది పెట్టకపోలేదు.

పిమ్మట, ప్రెసిడెంట్ ట్రూమన్ ఎన్ని అభ్యంతరాలు చెప్పినా వీటో చేసినా, రిపబ్లికన్ ప్రాబల్యంగల కాంగ్రెసు ఆదాయపుపన్నులు తగ్గించివేసింది. జాతీయఋణం 25,000 కోట్లుదాకా పెరిగిఉన్న సమయంలో, అన్ని విధాలా ప్రభుత్వాదాయాన్ని వృద్ధిచేయడం అవసరమనీ, ప్రపంచ రాజకీయాల క్లిష్టతనుబట్టి జాతీయరక్షణకు విశేషంగా ఖర్చుచేయవలసి ఉన్నదనీ ట్రూమన్ సూచించాడు.

సైనికశక్తిని వృద్ధిచేయడానికి, ప్రజలలో శారీరకంగా అర్హతగలవారందరికీ సైనికశిక్షణ యివ్వించాలని కాంగ్రెస్ తీర్మానించింది.

కాని, ఈ నిర్ణయం సైనిక నిరంకుశత్వ చర్యగా ఉన్నదంటూ ప్రజలు ప్రతిఘటించడం వలన, - ఆచరణలో సాధ్యంకాలేదు. సైన్యాన్ని, నౌకాదళాన్ని, విమానదళాన్ని రక్షణమంత్రి అనే ఒక మంత్రివర్గ సభ్యుని అధికారంక్రింద ఉంచాలన్న సూచననుమాత్రం కాంగ్రెసు ఆమోదించింది. సైన్యంలో వివిధశాఖలమధ్య సన్నిహిత సామరస్యం, సమైక్య సామర్థ్యం సాధించడంకోసం ఈ చర్య తీసుకొనబడింది.

రిపబ్లికన్ పార్టీ 1948 లో జరుగనున్న ప్రెసిడెంటు ఎన్నికలో తమకు విజయం తప్పదన్న ధీమాతో ఉత్సాహంగా ఎదురు చూస్తూంది. చిట్టచివరకు, పదహారేళ్ళకు మళ్ళీ ఇప్పుడు "వైట్ హౌస్" లో రిపబ్లికన్ పార్టీకి ప్రవేశం కలుగగలదన్న దృఢమైన ఆశాభావం ఏర్పడింది. వ్యాపారం బాగా సాగుతూంది. సగటు మానవుడుమాత్రం ఆదాయపు పన్నులు తగ్గింపబడినప్పటికీ, ధరలు హెచ్చుగా ఉండడం వల్ల డబ్బేమీ నిల్వ చేసుకోలేకపోతున్నాడు. ప్రజలంతా అసంతృప్తితో ప్రభుత్వంలో మార్పుకోసమే ఎదురుచూస్తున్నారు.

అత్యధికమైన ఆర్థికాభ్యుదయము, అమితమైనధరలు, హెచ్చు పన్నులుగల ఈ మిశ్రస్థితికి హేతువునుకూడా సులభంగానే వివరించవచ్చు. ఐరోపాలో కమ్యూనిజం సైనిక విజృంభణ నంకట్టేందుకు ప్రభుత్వం "ప్రచ్ఛన్నయుద్ధం" లో పెద్దపెద్ద మొత్తాలు ఖర్చుచేస్తున్నది. ప్రబలమైన సోవియట్ సైన్యం రష్యా సరిహద్దులలో ఉన్న దేశాలను నానాహింసల పాలుచేస్తూంది. వీటిలో, పెట్రోలుగనులకు పెట్టినపేరయిన ఇరాన్ ఒకటి. రెండవది: కీలకస్థానంలో ఉన్న టర్కీ. చెకోస్లోవాకియాలో, రష్యాసైన్యాలు సరిహద్దులలో నిలబడి ప్రోత్సహిస్తూ ఉండగా, కమ్యూనిస్టులు ఒక కుట్రచేసి ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకున్నారు. పటిష్ఠమైన ప్రజాస్వామ్య సంప్రదాయంగల చెకోస్లోవాకియా ఈ విధంగా ఉక్కు తెర మరుగుకు ఈడ్చివేయబడింది. గ్రీసుదేశంలో కమ్యూనిస్టులకు, ప్రభుత్వసైన్యాలకుమధ్య ప్రత్యక్షంగా యుద్ధమే ప్రారంభమయింది. ఇటలీలోను, ఫ్రాన్సులోను బలమైన కమ్యూనిస్టుపార్టీలు ఏర్పడి బెదిరిస్తున్నవి. రష్యనులు, పశ్చిమ అగ్రరాజ్యాలను బెర్లిన్ నుండి తరిమివేయాలనే ప్రయత్నంలో పశ్చిమ జర్మనీనుండి పశ్చిమ బెర్లిన్ కి రవాణాసౌకర్యాలన్నీ బంద్ చేసివేశారు.

అమెరికా, బ్రిటన్ ప్రభుత్వాలు ఈ దిగ్బంధనానికి లెక్కచేయక, బెర్లిన్‌లో తమ స్వాధీనంలోఉన్న భాగాల ప్రజలకు అవసరమైన సరుకులన్నీ పశ్చిమ జర్మనీనుండి విమానాలలో రవాణాచేశారు. వీటి అన్నింటికన్న ముఖ్యమైనది రష్యనులు స్వయంగా ఏటం ఆయుధాలు తయారు చేశారన్నవార్త.

ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామకాలంలో వలెనే, తన మిత్రదేశాలలో ఏకపక్ష నిరంకుశ ప్రభుత్వాలేర్పడకుండా చూడడానికి అమెరికా సహాయపడింది. ఈ విధానం ట్రూమన్ సిద్ధాంతంలో విశదీకరింపబడింది. ఈ సిద్ధాంతరీత్యా అమెరికానుండి గ్రీస్, టర్కీదేశాలకు సైనిక ఆర్థికసహాయం పంపబడింది. ఈ విధంగా ఐక్యరాజ్యసమితి ప్రసక్తిలేకుండా వ్యవహరించినందుకు ట్రూమన్ కొంత విమర్శకు లోనయాడు. ఐక్యరాజ్యసమితి సమర్థంగా వ్యవహరించగలిగేటంతవరకు, అమెరికా తనంతటతానే వ్యవహరించక తప్పదని ఈ విమర్శకు ఆయున జవాబుచెప్పాడు.

ఐరోపాలో ఇతరదేశాల ఆర్థికదుస్థితి నివారణకు సహాయపడడానికిగాను విదేశాంగమంత్రి జార్జి సి. మార్షల్ 1947 లో "మార్షల్ ప్రణాళిక" అమలులో పెట్టాడు. దీనికే "ఐరోపా పునరుద్ధరణ ప్రణాళిక" అనికూడా పేరు, ఈ ప్రణాళిక ఏదోఒక దేశానికిగాని, సిద్ధాంతానికిగాని వ్యతిరేకంగా తయారుచేయబడింది కాదు. ఆకలి, పేదరికం, నిరాశ, అరాచకత్వాలను వారించడానికి రూపొందించబడింది." ఐరోపా పరిశ్రమలు, వాణిజ్యం, వ్యవసాయం యుద్ధంవల్ల బాగా దెబ్బతిన్నవనీ, అట్టి పరిస్థితులే కమ్యూనిజం వ్యాప్తికి బాగా దోహదంచేస్తాయనీ, కనుక ఐరోపాఖండం తిరిగి కోలుకోవాలంటే వెంటనే తగినంత సహాయం అవసరమనీమాత్రం మార్షల్ కనిపెట్టాడు. యుద్ధానంతర పునరుద్ధరణకు తమలో తామెంతవరకు సహాయపడగలిగినదీ. ఇతరదేశాలనుండి ఏవిధమైన సహాయంకోరేదీ, నిశ్చయించుకోవలసినదిగా, రష్యాతోసహా ఐరోపా రాజ్యాలన్నిటినీ హెచ్చరించాడు. ఆపైన, అమెరికా సంయుక్తరాష్ట్రం ఆ అవసరాలు తీర్చడానికి పెట్టుబడులు, ఋణాలు, వస్తుసహాయం చేస్తుందనికూడా ఆయన వివరించాడు.

మార్షల్ ప్రణాళిక సామ్రాజ్యవాదుల ప్రణాళిక అనీ, రష్యా ఆ సమావేశంలో పాల్గొనదనీ స్టాలిన్ ప్రకటించాడు. రష్యా ఉపగ్రహ

రాజ్యాలుకూడా ఆ సమావేశానికి వెళ్ళరాదని నిషేధించబడ్డవి. అయినా పశ్చిమ జర్మనీతో సహా, మొత్తం పదహారు దేశాలు పారిస్‌లో సమావేశమయి ఒక పునరుద్ధరణ ప్రణాళికను తయారుచేసినవి. ఆ ప్రణాళికను అమలుజరపడానికి అమెరికా 1,700 కోట్ల డాలర్లు సహాయంచేయడానికి అంగీకరించింది. అమెరికా పారిశ్రామికుడైన పాల్‌హాఫ్మన్ నాయకత్వాన, మార్షల్ ప్రణాళిక మొత్తముమీద విజయవంతంగా అమలు జరిగింది. యుద్ధంలో అస్తవ్యస్తమయిన తమ ఆర్థికవ్యవస్థలను చక్కదిద్దుకొనడానికిగాను పశ్చిమ ఐరోపా దేశాలు పరస్పరము, అమెరికనులతోను సహకరించి కృషిచేసినవి. ఈ దేశాలు ఆర్థికంగా కోలుకొంటూ ఉండడంతో అచటి కమ్యూనిస్టుపార్టీల పలుకుబడి సన్నగిలిపోయింది.

కొత్తగా లభించిన ప్రపంచ నాయకత్వపు హోదాలో అమెరికా సంయుక్తరాష్ట్రంకూడా, ఉత్తర అట్లాంటిక్ సంధి అనే సైనికరక్షణ సంధిలో చేరింది. పశ్చిమ ఐరోపారాజ్యాలన్నీ ఒకటిగా చేరాలన్న భావం మొదట ఐరోపాఖండంలోనే బయలుదేరి, అనంతరం అమెరికా ప్రోత్సాహంకూడా సంపాదించుకొన్నది. బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ, కెనడా, గ్రీస్, టర్కీలతోసహా మొత్తం పధ్నాలుగు దేశాలు, తమలో ఏ దేశంమీదనైనా దండయాత్ర జరిగితే, తక్కిన దేశాలన్నీ కలిసి ఆ దండయాత్రను తిరుగకొట్టాలని ఒడంబడిక చేసుకొన్నవి. ఇలాగే లాటిన్ అమెరికా దేశాలుకూడా మరొక పరస్పర రక్షణసంధి చేసుకొన్నవి. ఆ సంధిపైనకూడా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం సంతకం చేసింది.

1949 లో ఉత్తరఅట్లాంటిక్ సంధిసంస్థ ఏర్పడినప్పుడు ఆ సంస్థకు ప్రథమాధ్యక్షుడుగా, జెనరల్ ఐసెన్‌హోవర్ ఎన్నిక అయాడు. ఆ సంస్థ సైనిక కేంద్రకార్యాలయం పారిస్‌లో ఏర్పాటుచేయబడింది. ఈ విధంగా, ఐక్యరాజ్యసమితిలోనే కొన్ని సాధికార సైనిక కూటములు అవతరించాయి. వీటిలో ఒకటి స్వతంత్రదేశాల కూటమి, రెండవది రష్యా - దాని ఉపగ్రహరాజ్యాలకూటమి.

* * *

యుద్ధానంతర సంక్షుభితసమయంలో ప్రెసిడెంట్ ట్రూమన్ విదేశాంగవిధానాన్ని చాలావరకు అమెరికనులు అందరూ బలపరిచారు.

1948 లో జరిగిన ప్రెసిడెంటు ఎన్నికలలో రిపబ్లికనులుకూడా తమ అభ్యర్థిఅయిన న్యూయార్కు గవర్నర్ థామస్‌డ్యూయీ విజయం పొందితే, ఆవిదేశాంగ విధానాన్నే అనుసరింపదలచుకొన్నట్టు ప్రకటించారు. అద్భుతమైన వక్తగా, ప్రభుత్వ కార్యకర్తగా పేరుమోసినవాడు. సుప్రసిద్ధ లాయరు అయిన డ్యూయీ లోగడ 1944 లో ప్రెసిడెంటు రోజ్వెల్టుతో పోటీచేసి వోడిపోయాడు. 1948 లో ఇతడితో పాటు రిపబ్లికన్ పార్టీ టిక్కెట్టుమీద కాలిఫోర్నియా గవర్నరు ఎరల్ వారెన్‌కూడా పోటీచేశాడు. డెమొక్రాట్లు పట్టుదలగా ప్రచారం చేశారు. అమెరికనులందరు ఈ ఎన్నికల ప్రచారాన్ని తమ ఇండ్లలో కూర్చొనే చూడడానికి వీలుగా టెలివిజన్‌ద్వారా ప్రసారం చేశారు. ఎన్నికలలో ప్రచారానికి టెలివిజన్‌ను ఉపయోగించడానికి అదే మొదటిసారి. దేశీయ సమస్యలపైన రిపబ్లికన్లకు ప్రాబల్యంగల కాంగ్రెస్‌తో వివాదపడి ప్రయోజనంలేదనే సంగతి తేటతెల్లమయిపోయింది. పైగా, డెమొక్రాటిక్ పార్టీలోకూడా వామ దక్షిణశాఖలు రెండూ ప్రెసిడెంటుకి వ్యతిరేకమవడం ఇంతకన్న ముఖ్యమైన విషయం. నీగ్రోల హక్కులను కాపాడడానికి కేంద్రప్రభుత్వంచేత శాసనాలు చేయించేందుకు ట్రూమన్ ప్రయత్నిస్తునందున దక్షిణరాష్ట్రాలలో ప్రజాభిప్రాయం ట్రూమన్‌కి వ్యతిరేకమయింది; దానితో నిజంగా డెమొక్రాటిక్ పార్టీలోని దక్షిణశాఖ ఆయనకు వ్యతిరేకమయింది. ఇక లోగడ రోజ్వెల్టు టరములో వైస్‌ప్రెసిడెంటుగా పనిచేసిన హెన్రీ వాలెస్ నాయకత్వాన డెమొక్రాటిక్ పార్టీలోని వామశాఖ రష్యాతో సమాధానపద్ధతి అవలంబించాలంటూ ప్రెసిడెంట్‌ని ఒత్తిడి చేస్తున్నది. ఈ వాలెస్ ప్రెసిడెంటు, ట్రూమన్ టరములోకూడా వాణిజ్యశాఖా మంత్రిగా పనిచేస్తూ, ప్రెసిడెంటు విధానాలను బహిరంగంగా ఖండించినందు వలన బర్తరఫు చేయబడ్డాడు. 1948 లో ఇతడు డెమొక్రాటిక్‌పార్టీలో నుంచి విడిపోయి "ప్రోగ్రెసీవ్" పార్టీ అనే నూతనపక్షానికి నాయకత్వం వహించాడు. అమెరికన్ కమ్యూనిస్టులుకూడా ఈ పార్టీని బలపరిచారు.

ప్రెసిడెంట్, జాతివిచక్షను నిర్మూలనం చేయడానికిగాను తన కేంద్రప్రభుత్వ పౌరసత్వ కార్యక్రమాన్ని ఆమోదించాలని పట్టుపట్టి

ఉండకపోతే, డెమొక్రాటిక్ పార్టీ మహాసభలో దక్షిణాది రాష్ట్రాల డెమొక్రాట్లంతా ఆయననే బలపరచి ఉండేవారు. నీగ్రోలను, ఇతర అల్పసంఖ్యాక వర్గాలవారిని కిరాయికి పెట్టుకొనడానికి ప్రతిబంధకంగా ఏర్పాటుచేయబడిన నిబంధనలను రద్దుచేయవలెననే ఉద్యమం యుద్ధకాలంలో "న్యూడీల్" కార్యక్రమానికి చెందిన ఉచితోద్యోగుల సంప్రదాయసంఘంవారే లేవదీశారు. ఈ విధానాన్ని అమలుజరపడానికి ప్రభుత్వానికి అధికారమిస్తూ శాసనం చేయవలసినదిగా ట్రూమన్ కాంగ్రెసును కోరాడు. దక్షిణాది నీగ్రోలకు, తెల్లవారిలో పేదవారికీ కూడా, వోటింగ్ హక్కు లేకుండా చేసిన "పోల్ పన్ను" ను రద్దుచేయడానికి ఒక శాసనం చేయవలసినదనికూడా ట్రూమన్ కోరాడు.

పౌరసత్వాల కార్యక్రమాన్ని దక్షిణాది ప్రతినిధులంతా తీవ్రంగా ప్రతిఘటించారు. నీగ్రోలకు ఇతోధిక స్వత్వాలు కలిగించే అధికారం రాష్ట్రప్రభుత్వాలదనీ, కేంద్రప్రభుత్వం ఆ విషయంలో కల్పించుకొనరాదనీ వారివాదం. వాషింగ్టన్‌లో చేయబడిన శాసనము దక్షిణాదిన అప్పటికీ అతి క్లిష్టస్థితిలోఉన్న జాతివిచక్షణ సమస్యను ఒక్కసారిగా తుడిచిపెట్టజాలదని వారి అభిప్రాయం. ఆ రాష్ట్రాలలో నీగ్రోలకు మంచి మంచి బడులు, ఉద్యోగాలు ఇబ్బొ కొత్తగా ఏర్పాటుచేయబడుతున్న సంగతికూడా వారు వివరించారు.

కాని, పౌరసత్వాల విషయంలో ట్రూమన్ తాను పట్టినపట్టు విడువకపోయేసరికి, దక్షిణాది రాష్ట్రాల ప్రతినిధులు చాలామంది ఆ డెమొక్రాటిక్ పార్టీ మహాసభనుండి నిష్క్రమించి, వేరే రాష్ట్రస్వత్వాల పార్టీ, లేక డిక్సీక్రాట్ పార్టీని స్థాపించారు. దక్షిణ కెరోలినా గవర్నరు జె. స్ట్రాంథర్మండ్‌ని ఈ పార్టీ ప్రెసిడెంటు పదవికి తన అభ్యర్థిగా నిలిపింది. ఏతావతా, ఈ ఎన్నికలో ప్రెసిడెంట్ పదవికి డ్యూయీ, ట్రూమన్, థర్మండ్, వాలెస్ అనే నలుగురు అభ్యర్థులు పోటీచేస్తున్నారు.

ఎన్నికల ప్రచారం ముమ్మరమైనకాలదీ రిపబ్లికనులకు సులభంగా విజయం లభించగలదని పరిశీలకులు జోస్యంచెప్పడ మారంభించారు. ప్రతిపక్షం చీలిపోవడమే దానికి కారణమన్నారు. అందువల్ల డ్యూయీ పెద్దగా ప్రచారంచేయడంగాని, వివాదాస్పదవిషయాలను ప్రస్తావించ

డంగాని, మానుకున్నాడు. ప్రెసిడెంటు ట్రూమన్ అలాకాక పట్టుదలగా దేశంలో ఈమూలనుండి ఆ మూలవరకు సంచారంచేసి, టాఫ్ట్-హార్ట్లీ శాసనాన్ని తీవ్రంగా ఖండిస్తూ, "ఏమీచేయని" రిపబ్లికన్ కాంగ్రెసు వైఖరిని తూర్పారబడుతూ కమ్యూనిజాన్ని ప్రతిఘటించడానికి ప్రభుత్వం తీసుకున్న తీవ్రచర్యలను ప్రస్తుతిస్తూ, పౌరసత్వాలను సమర్థిస్తూ రైతులకు నూతన సదుపాయాలు, సాంఘిక భద్రతా సౌకర్యాలూ వాగ్దానంచేస్తూ సామాన్యమానవుని భాషలో తీవ్రమైనప్రచారంచేశాడు. ఉప్పెన గాలివలె ఈ ప్రచారం దేశమంతటినీ కదిలించివేసింది. ఈ ఎన్నిక ఫలితం అమెరికా రాజకీయ చరిత్రలో అత్యాశ్చర్యకరమైనదిగా పరిణమించింది.

వోట్లన్నీ లెక్కపెట్టేసరికి, ఎన్నికదార్ల వోట్లలో ట్రూమన్‌కి 303, గవర్నర్ డ్యూయీకి 189 థర్మండ్‌కి 39 వచ్చి వాలెస్‌కి ఒక్క వోటుకూడా రాలేదు. డిక్సీక్రాట్లు యెంత తంటాలు పడినా, దక్షిణాది రాష్ట్రాలు చాలాభాగం ట్రూమన్‌కే వోటు చేసినవి. వాలెస్ వాటం వారి విధానం ఎవరినీ ఆకర్షించలేదు. వెనుక "న్యూడీల్" సందర్భంలోలాగే రైతులు, కార్మికులు పూర్తిగా డెమొక్రాటిక్ పార్టీ వంకకు మొగ్గారు. కాంగ్రెస్ ఉభయసభలలో న్యూ డెమొక్రాట్లకు మెజారిటీ వచ్చింది. ఇక, ప్రెసిడెంటు తన "ఫెయిర్ డీల్" (ఉచిత విధాన) కార్యక్రమాన్ని సుఖంగా అమలు జరుపుకొనవచ్చునని పించింది.

రెండవటరము పదవీస్వీకరణోత్సవ సందర్భంలో ట్రూమన్ మరొక విదేశాంగ కార్యక్రమాన్ని వెల్లడించాడు. అతడు ప్రతిపాదించిన ఇట్టి కార్యక్రమాలలో ఇది నాల్గవది. ఈ "చతుర్థ సూత్ర కార్యక్రమం" అమెరికా సంయుక్తరాష్ట్రం సాధించిన శాస్త్రీయవిజ్ఞాన, పారిశ్రామికాభ్యుదయాల ప్రయోజనాలను అభివృద్ధి లోపంగల ప్రాంతాలకు లభింపజేస్తుంది. సాంకేతిక సహాయకార్యక్రమం క్రింద విదేశాలలో వ్యాధినిరోధం, బంజరుభూముల సాగు, సహజసంపదల అభివృద్ధి, మొదలైన అనేక ప్రయోజనకర కార్యక్రమాలకు తోడ్పడుతూ, ప్రపంచప్రజల జీవనస్థాయిని హెచ్చుచేయడానికి అమెరికా కృషిచేస్తుంది.

అయినప్పటికీ, దేశీయ వ్యవహారాలలో మాత్రం ప్రెసిడెంటుకి ఆశాభంగాలే ఎదురైనవి. కొత్త కాంగ్రెస్ దృక్పథం అనుకున్న దాని కన్న ఎక్కువ మితవాద ధోరణికి తేలింది. ఉత్తరాది రిపబ్లికనులు కొందరు, దక్షిణాది డెమొక్రాట్లు కొందరు ఏకమై ప్రెసిడెంటు తల పెట్టిన శాసనాలన్నింటికీ అడ్డుతగిలారు. బడ్జెట్ మొత్తాన్ని తగ్గించి వేయడానికికూడా ప్రయత్నం జరిగింది. ప్రభుత్వంలో వ్యర్థవ్యయం, అసమర్థతా హెచ్చుగా ఉన్నవని బహిరంగంగా ఆరోపణలు చేయ బడినవి.

ఈ ఆరోపణ లన్నింటికన్న దారుణమయినవి, విదేశాంగ మంత్రి డీన్ ఎచిసన్ ఆధిపత్యంక్రింద ప్రభుత్వ విదేశాంగశాఖ కమ్యూనిస్టుల, వాళ్ళసానుభూతిపరుల పుట్టగా ఉన్నదంటూ విస్కాన్సిన్ రాష్ట్రంనుండి ఎన్నికయిన సెనేటర్ జోసెఫ్ మెకార్థీ చేసిన ఆరోపణవంటివికూడా ఉన్నవి. "న్యూడీల్," ద్వితీయ ప్రపంచయుద్ధ సమయాలలో, రష్యాతో సంబంధాలు లాంఛనంగా, స్నేహమయంగా ఉన్నప్పుడు చాలామంది ప్రభుత్వోద్యోగులు కమ్యూనిస్టుల ఏజెంట్లు గాను, సానుభూతిపరులుగాను తయారయారని వారివివరణ. ముఖ్యంగా విదేశాంగ శాఖలో రహస్యోద్యోగం చేస్తూన్న ఆల్జెర్ హిస్‌ను విచారణచేసి శిక్షించడంతో, విస్తృతమైన కమ్యూనిస్టు గూఢచారి వ్యవస్థ, దేశవిద్రోహ ప్రమాదం ఉన్నదన్న భయం ప్రజలలో ప్రబలంగా ఏర్పడింది.

"ప్రచ్ఛన్నయుద్ధం" సాగినకొలది, కమ్యూనిస్టుపార్టీని, దానితో అనుబంధంగల సంస్థలను అణచడానికి కాంగ్రెసు కొత్తగా కొన్ని చర్యలు తీసుకున్నది. అట్టి సంస్థలన్నీ రిజిస్టరు చేయించుకొని, వాటి కార్యక్రమాలను ఎప్పటికప్పుడు ప్రభుత్వానికి తెలియపరుస్తూ ఉండాలని శాసించారు. 1949 లో సంయుక్తరాష్ట్ర ప్రభుత్వాన్ని కూల ద్రోయడానికి కుట్రలు పన్నుతున్నారన్న అపరాధానికి పదిమంది కమ్యూనిస్టు నాయకులకు కారాగారశిక్షలు విధింపబడినవి. కమ్యూనిస్టులపట్ల సానుభూతి గలిగి ఉన్నారనే అనుమానాలపై ఎందరో వ్యక్తులపైనా, సంఘాలపైనా స్థానికంగా చాలాచోట్ల విచారణలు జరిగనవి. బాధ్యతా రహితంగా ప్రవర్తించే ఈ విచారణోపసంఘాలు, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని గురించిన అమెరికా ప్రాతిపదిక సూత్రాలను

ఉల్లంఘిస్తున్నవని కొందరు భయాలు వెల్లడించారు. 1798 లో చేయ బడిన శత్రుజవిద్రోహక చర్యల శాసనాలను అమలుజరుపడం కొంత వరకు ఇట్టి భయాలకు కారణమయింది. కాని, అమెరికా ఆత్మరక్షణార్థం తగిన చర్యలు తీసుకోవలసి ఉన్నదని, ఏవిధంగా చూచినా కమ్యూనిస్టుల న్యాయవిధానాలకన్న అమెరికా న్యాయవిధానాలు వేయిరెట్లు మంచివి అనీ ప్రభుత్వం జవాబు చెప్పింది.

ఈ విధంగా, కమ్యూనిజం దేశంలో అనేక విధాల విద్రోహక సమస్యలను, న్యాయపద్ధతులను తారుమారులను కల్పిస్తూ ఉండగా, కొరియాలో స్వాతంత్ర్యపైన మరొక రకమైన దాడి సాగింది.

* * *

ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామానంతరం ఆసియాలో జరిగిన సంఘటనలు చాలా ఆందోళనకరంగా పరిణమించినవి. కొన్ని సంవత్సరాలపాటు అచటి పరిస్థితులు చక్కబరచి, తరువాత అచటినుండి ఉపసంహరించుకొనవచ్చునని అమెరికా భావించింది. కాని, అంతకంతకు ఆసియా ఖండ వ్యవహారాల్లో ఎక్కువగా చిక్కుపడి పోయింది.

ఫిలిప్పీనులకు స్వాతంత్ర్యం ప్రసాదించగలనని లోగడ చేసిన వాగ్దానం ప్రకారం అమెరికా 1946 జూలై 4 వ తేదీన ఆ దీవులకు స్వాతంత్ర్యం ప్రసాదించింది. ఫిలిప్పీన్స్ రిపబ్లిక్ కొన్ని కీలకప్రాంతాలలో సైనిక స్థావరాలు ఏర్పాటు చేసుకొనడానికి అమెరికాకు అవకాశం కల్పించింది.

యుద్ధానంతరం జెనరల్ మెకార్థర్ జపాన్ మిలిటరీ గవర్నర్‌గా నియోగింపబడ్డాడు. ఆయన జపాన్‌లో అనేక ప్రజాస్వామ్య సంప్రదాయాలను ఏర్పాటు చేశాడు. హీరోహీటో చక్రవర్తి తన పదవిని నిలుపుకొన్నాడు. కాని రాజ్యాంగం మాత్రం కొత్తగా ఏర్పాటు చేయబడింది. దాని ప్రకారం, స్త్రీ పురుషు లందరిచేతా ఎన్నుకొనబడిన ఒక శాసనసభ ఏర్పాటు చేయబడింది. 1951 లో రష్యా ప్రతిఘటించినప్పటికీ, జపాన్‌తో యుద్ధంచేసిన ఇతర దేశాలన్నీ ఆ దేశంతో శాంతిసంధి చేసుకొన్నవి. ఈ సంధి ప్రకారం జపాను తన నడిగడ్డకు వెలుపల లోగడ తనకుగల సామ్రాజ్య ప్రాంతాలన్నింటినీ వదులుకొన్నది. అయినప్పటికీ, ఆసంధిపత్రంపై సంతృప్తితోనే జపాన్

సంతకం చేసింది. ఈ సంధిపత్రాన్ని సంయుక్తరాష్ట్ర విదేశాంగశాఖ ప్రత్యేక ప్రతినిధి జాన్ ఫాస్టర్ డల్లెస్ తయారుచేశాడు. పిమ్మట జపాను పసిఫిక్ ప్రాంతరక్షణకై సంయుక్త రాష్ట్రానికి కొన్ని సైనిక స్థావరాలను ఇచ్చింది.

చైనాలో, అమెరికా రాజనీతి అంతగా ఫలించలేదు. యుద్ధ కాలంలో చైనా ప్రభుత్వాధిపతి అయిన చియాంగ్ కై షేక్ కీ, చైనాలోని విశాల ప్రాంతాలలో గెరిల్లా యుద్ధాలు చేస్తూన్న కమ్యూనిస్టులకూ రాజీ చెయ్యడానికి అమెరికా ఒక విఫల ప్రయత్నం చేసింది. జపాన్ కి వ్యతిరేకంగా చైనా అంతటినీ ఏకంచెయ్యడం ఆనాడు సంయుక్తరాష్ట్ర లక్ష్యం.

అంతవరకు చియాంగ్ కై షేక్ తో స్నేహంగా సంచరిస్తూన్న రష్యా, జపాన్ తో యుద్ధం ముగిసిపోయిన వెంటనే, చైనా కమ్యూనిస్టులకు భారీగా సైనిక సామగ్రులు సరఫరా చేసింది. వాటిసాయంతో వారు చైనా జాతీయవాదులమీద గట్టిగా దెబ్బతీయడం ప్రారంభించారు. చియాంగ్ సేనలు సమర్థంగా పోరాడలేక పోవడానికి కారణం ఆయన ప్రభుత్వంలోని అవినీతే అని చాలామంది అమెరికనులు అభిప్రాయపడ్డారు. అయితే, చియాంగ్ లో ఎన్నిలోపాలున్నా, ఇంకా పటిష్ఠమైన సహాయం చేసి ఉంటే, అతడి సైన్యాలు కమ్యూనిస్టులను అరికట్టగలిగి ఉండేవని మరికొందరు విమర్శించారు.

చైనా ప్రమాదస్థితిలో పడినమీదట, ఇక సైనిక ఆర్థికసహాయం చేసినా, చియాంగ్ ప్రభుత్వం నిలవదనీ, దానికి ప్రజాబలం లేకుండాపోయిందనీ అమెరికా ప్రభుత్వం నిశ్చయించుకొన్నది. ఆ పైన, అమెరికా సహాయం తగ్గిపోయింది. చివరకు చియాంగ్ తన సైన్య శేషంతో ఫార్మోజాకు పారిపోయాడు. చైనాదేశపు నడిగడ్డ అంతా కమ్యూనిస్టుల వశమయింది.

ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం ముగిసిపోవచ్చే సమయంలో రష్యనులు జపాన్ పై యుద్ధం ప్రకటించినప్పుడు, వారిసైనికులు జపాన్ ఆధిపత్యంకింద ఉన్న కొరియాపై దండయాత్రచేసి, 38-వ అక్షాంశం వరకూ దక్షిణానికి చొచ్చుకొనివచ్చారు. పిమ్మట, ఆ 38-వ అక్షాంశ రేఖకు దక్షిణ భాగంలోని జపాన్ సైన్యము అమెరికన్ సేనకు లొంగి

పోవాలనీ, ఆ రేఖకు ఉత్తరప్రాంతం రష్యనుల రక్షణలో ఉండాలనీ ఉభయపక్షాలు లాంఛనంగా ఆమోదించినవి. కొరియాకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఇవ్వబడాలని యుద్ధకాలంలోనే నిశ్చయింపబడింది.

కాని, ఆ ద్వీపకల్పంలో తన వశంలో ఉన్న భాగాన్ని వదులుకొనడానికి కమ్యూనిస్టులకు ఇష్టంలేక ఉత్తర కొరియాను కమ్యూనిస్టు ప్రాంతంగా మలచడం ప్రారంభించింది. సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం ఈ విషయాన్ని గురించి ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశానికి ఫిర్యాదుచేసింది. ఈ ఫిర్యాదుపైన, కొరియా అంతటా ఎన్నికలు జరిపి, ఆ దేశమంతటికీ స్వతంత్రప్రభుత్వాన్ని ఏర్పాటు చెయ్యాలని ఐక్యరాజ్యసమితి ఆదేశించింది. కాని, ఉత్తర కొరియాలో ఎన్నికలు జరపడానికి అచటి రష్యా అధికారులు అంగీకరించలేదు. అందువల్ల దక్షిణ కొరియాలో మాత్రమే ఎన్నికలు జరుపబడినవి. సింగ్మన్‌రీ కొత్త రిపబ్లిక్ అధ్యక్షుడుగా ఎన్నిక అయాడు. అతని ప్రభుత్వం కొరియా అంతటికీ ప్రభుత్వమని ఐక్యరాజ్యసమితి గుర్తించింది. పిమ్మట ఆ ద్వీపకల్పంలోని అమెరికా ఆక్రమణ దళాలు ఉపసంహరింపబడినవి.

ఈలోగా, రష్యనులు ఉత్తరకొరియాలో ఒక కీలుబొమ్మ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి దానికి "ఉత్తరకొరియా పీపుల్స్ డెమొక్రాటిక్ రిపబ్లిక్" అని నామకరణంచేశారు. ఒక సైన్యాన్నికూడా తరిఫీదుచేసి, ఆధునిక సైనికపరికరాలన్నీ ఇచ్చి అక్కడనుంచి, తమ సైన్యంలో చాలాభాగాన్ని ఉపసంహరించారు. 1950 జూన్ 25 ఉత్తర కొరియనులు పెద్ద ఎత్తున దక్షిణ కొరియాపై దండయాత్ర ప్రారంభించారు.

ఐక్యరాజ్యసమితి వెంటనే చర్య తీసుకొన్నది. ఆ సమయంలో రష్యా సహాయ నిరాకరణం చేస్తున్నందున, రష్యా ప్రతినిధి లేకుండానే భద్రతా సంఘం సమావేశ మయింది. "కొరియాలో జరుగుతూన్న సాయుధ దౌర్జన్యాన్ని తిరుగకొట్టవలసినది" గా ఐక్యరాజ్యసమితి సభ్యులందరినీ ఆదేశించింది. ప్రజాస్వామ్య దేశాలకు ఇది అగ్నిపరీక్ష అయింది. కొరియాలో కమ్యూనిస్టులకు విజయం కలిగితే, ఆసియాలో వారు ఇంకా చాలా దండయాత్రలు సాగిస్తారు. ముఖ్యంగా, కమ్యూనిస్టులు అంతర్యుద్ధం సాగిస్తూన్న ఇండోచైనాలో అలాంటి అవకాశం సంసిద్ధంగానే ఉన్నది.

ఐక్యరాజ్యసమితి ఆదేశానికి జవాబుగా సంయుక్తరాష్ట్రం తరఫున ప్రెసిడెంట్ ట్రూమన్ చాలా సాహసంగా ప్రవర్తించాడు. దక్షిణకొరియా ప్రతిఘటనకు అమెరికా సైన్యాలు సహాయపడగలవని ఆయన ప్రకటించాడు. చైనా, ఫార్మోజాల ప్రాంతంలోకూడా యుద్ధం ప్రారంభంకాకుండా చూడడానికిగాను అమెరికా సప్తమ నౌకాదళం ఆ ప్రాంతంలో వెళ్ళి నిలబడాలనికూడా ఆయన ఆదేశించాడు. కొరియాలో ఐక్యరాజ్యసమితి సైన్యాన్ని నడపడానికి ఒక సర్వసైన్యాధ్యక్షుణ్ణి నియమించడానికి సమితి ట్రూమన్‌కు అధికారమిచ్చింది. జనరల్ మెకార్థర్ సర్వసైన్యాధ్యక్షుడుగా నియమింపబడ్డాడు. అమెరికా సేనలు జపాన్‌నుండి యుద్ధరంగానికి ఉరికించబడినవి. ఐక్యరాజ్యసమితిలోని ఇతర సభ్యత్వదేశాలుకూడా కొరియాకు వెంటనే కొన్ని సైన్యాలను, సరుకులను పంపినవి.

యుద్ధారంభదశలో ఉత్తర కొరియనులు ఐక్యరాజ్యసమితి సైన్యాలను దాదాపు ఆ ద్వీపకల్పంనుండి తరిమివేసినంత పని జరిగింది. దక్షిణకొరియా రాజధాని సోల్‌ను పట్టుకొని దక్షిణాన పుసాన్‌వరకూ కమ్యూనిస్టుసేనలు చొచ్చుకొనివచ్చినవి.

కాని, 1950 సెప్టెంబర్‌లో మెకార్థర్ ఇన్‌ఛాన్‌వద్ద నౌకా, పదాతి దళాలను దించి శత్రువులపై గట్టి ఎదురుదెబ్బ తీశాడు. ప్రధానంగా, దక్షిణ కొరియా, అమెరికా సేనలతోనే కూడిఉన్న ఐక్యరాజ్యసమితి సైన్యం తిరిగి సోల్ నగరాన్ని పట్టుకొని, 38 వ అంక్షాంశరేఖను దాటి, ఉత్తరకొరియా లోపలికంటా చొచ్చుకొనిపోయింది. ఈ సైన్యపు అగ్రగామి దళాలు పూర్తిగా, మంచూరియా సరిహద్దు అయిన యాలూ నది దాకా కూడా పురోగమించినవి.

ఈ స్థితిలో కమ్యూనిస్టు చైనా "వాలంటీర్లు" ఆకస్మాత్తుగా తండోపతండాలుగా వచ్చి ఐక్యరాజ్య సైన్యాలను ఎదుర్కొని, తిరిగి 38 వ అక్షాంశం దిగువవరకు తరిమికొట్టినవి. ఈ దండయాత్రకు తన ప్రోత్సాహ మేమీలేదని రష్యా ప్రకటించింది; కాని, ఈ విషయంలో పరిశీలకులలో చాలామంది ఆ సంగతి అసత్యమని స్పష్టంగా చూచారు. చాలాదూరం వెనుకకు తగ్గివచ్చిన తరువాత ఐక్యరాజ్యసమితి సైన్యాలు

ఎదురుతిరిగి పోరాడటం ప్రారంభించినవి. భయంకరంగా పోరాడుతూ, చైనా, ఉత్తర కొరియాల కమ్యూనిస్టులకు తీవ్రమైన నష్టాలు కలిగిస్తూ, సమితి సేన తిరిగి 38 వ అక్షాంశంవరకూ ఆక్రమించుకొన్నది. చివరికి, ఉభయపక్షాలూ అక్కడే తమ స్థానాలు కట్టుదిట్టం చేసుకున్నవి.

కొరియా యుద్ధంలో చైనా జోక్యం కల్పించుకొన్నందుకు ఏమి చెయ్యాలా అనేది ఐక్యరాజ్యసమితికి పెద్ద సమస్య అయింది. చైనాతీర మంతటిని బంధించివేయాలనీ, ఫార్మోజాలోని చియాంగ్ కై షేకు సైన్యాలను కొరియాయుద్ధంలో ఉపయోగించాలనీ, మంచూరియాలోని శత్రు విమానాశ్రయాలపై బాంబులు వేయాలనీ సూచిస్తూ, జెనరల్ మెకార్థర్ సంపూర్ణ విజయసాధనకొక కార్యక్రమం తయారుచేశాడు. ఈ కార్యక్రమం ఆకర్షకంగా ఉన్నప్పటికీ సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమూ, ఐక్యరాజ్యసమితిలోని ఇతరసభ్యులూ దానిని ఆమోదించ లేదు. ఆ కార్యక్రమం తృతీయ ప్రపంచ మహాసంగ్రామానికి నాంది కాగలదని వారంతా భయపడ్డారు. కాని, మెకార్థరు విజ్ఞప్తులు చాలా తీవ్రధోరణిలో ఉన్నందువల్లను ఐక్యరాజ్యసమితి విధానానికి భిన్నంగా అతడు ప్రకటనలు చేస్తున్నందువల్లను ప్రెసిడెంటు ట్రూమన్ అతన్ని బర్తరఫు చేశాడు. జెనరల్ మెకార్థర్ స్వదేశానికి తిరిగివచ్చాడు. అతడు యెంత వివాదాస్పద స్వభావంగలవాడైనా ప్రజల కాతనిపట్ల గౌరవం ఉన్నది.

1951 జూన్‌లో ఐక్యరాజ్యసమితిలో రష్యా ప్రతినిధివర్గం ఒక సూచన చేసింది. "కొరియాలో యుద్ధాన్ని విరమించడానికిగాను, యోధ దేశాలమధ్య సమాలోచనలు ప్రారంభించాలి" అని ఈ సూచన సారాంశం. ఉభయపక్షాలూ వెంటనే ఈ సూచనను ఆమోదించి, 38వ అక్షాంశరేఖ సమీపంలోని కేసాంగ్ పట్టణంలో సమాలోచనలు ప్రారంభమైనవి. కాని, అచిరకాలంలోనే యుద్ధవిరమణ సరిహద్దు ఎక్కడ ఏర్పాటు చెయ్యాలన్న అంశంపైన, యుద్ధఖైదీల విడుదల సమస్య విషయంలోను వివాదాలు యేర్పడినవి. యుద్ధఖైదీలందరు విడుదల చేయబడాలని కమ్యూనిస్టులు కోరారు. కాని, యుద్ధంలో ఖైదీలుగా పట్టుబడిన ఉత్తరకొరియా సైనికులలో చాలామంది కమ్యూనిస్టులు కారు. తమను తిరిగి కమ్యూనిస్టులకు అప్పగించడానికి వారు

ఇష్టపడలేదు. ఈ సమస్య చాలా జటిలంగా పరిణమించింది. సమాలోచనలు నానువుతులో పడినవి. ఈ లోగా, ఐక్యరాజ్యసమితి సైన్యంలో పోరాడుతూన్న 2,50,000 మంది అమెరికనులు 38వ అక్షాంశరేఖ పొడుగునా పోరాడుతూ మరణిస్తున్నారు.

* * *

ఐరోపాఖండ వ్యవహారాలలో ప్రెసిడెంట్ ట్రూమన్ విదేశాంగ విధానాన్ని సమర్థించినట్లే, ఆసియాలో కమ్యూనిజం విజృంభణను అరికట్టడానికి ఆయన తీసుకున్న చర్యలనుకూడా అమెరికనులు ఆమోదించారు. కాని, కొరియాలో యుద్ధోపహతులసంఖ్య పెరిగిపోతూండడంతో, జాతీయఋణం వృద్ధి అవడంతో, ప్రబలతరమైన మరొక యుద్ధానికి సిద్ధంకాకుండా ఈ యుద్ధాన్ని గెలిచేందుకు ఉపాయం కనిపించక గందరగోళస్థితి ఏర్పడడంతో - ప్రజలకు ప్రభుత్వంలో విశ్వాసం తగ్గిపోయింది.

ఈ అసంతృప్తికితోడు ప్రభుత్వంలోని, అవినీతికీ, లంచగొండితనానికీ దృష్టాంతాలు బయటపడినవి. దేశీయ ప్రభుత్వాదాయశాఖలోని ఉన్నతోద్యోగులు పన్నులు ఎగగొట్టే ఆసాములపై కేసులు పెట్టడానికి బదులు వారివద్ద లంచాలు తిని, శిస్తులను మాఫీ చేస్తున్నారనే వదంతి బయలుదేరింది. పునర్నిర్మాణ ద్రవ్యసంస్థలోని వారిని గురించికూడా ఇలాంటి అపవాదులు బయలుదేరినవి. ఆ సంస్థ ఉద్యోగులు, కాంగ్రెసు సభ్యులనుండీ పారిశ్రామికుల వద్దనుండి రకరకాల లాభాలు, లంచాలు రాబట్టుకొని, వారికి అప్పులు ఇప్పిస్తున్నట్టు అల్లరి అయింది. కాన్సాస్ నగరంలో అవినీతికరమైన పెండర్‌గాస్ట్ రాజకీయయంత్రాంగంలో వోట్ల కుంభకోణాన్ని గురించిన విచారణలో, న్యాయశాఖకూడా ఇట్టి విమర్శలకు గురి అయింది. ఈ రాజకీయ యంత్రాంగమే ప్రెసిడెంట్ ట్రూమన్ రాజకీయ జీవితానికి ఒరవడి పెట్టింది.

భవిష్యత్తులో సంయుక్తరాష్ట్రపు ప్రెసిడెంట్లు రెండు టరములు కన్న ఎక్కువకాలం ఆ పదవిలో ఉండరాదనీ, లేక అంతకు పూర్వం రెండేళ్ళకుపైగా ప్రెసిడెంట్‌గా వ్యవహరించిన వ్యక్తి అయితే ఒక నిండు టరముకిమించి ప్రెసిడెంటుగా ఉండరాదనీ నిషేధిస్తూ 1951 లో అమెరికా రాజ్యాంగానికి 22వ సవరణ ఆమోదించబడింది. ఈ సవరణ ప్రతిపాదించబడినప్పుడు, ప్రెసిడెంటు పదవిలోనున్న వ్యక్తిని ఉద్దేశిం

చలేదు. కాని, పిమ్మట తను అభ్యర్థిగా పోటీ చేయదలచుకొనలేదని ప్రెసిడెంట్ ట్రూమన్ ప్రకటించాడు.

1952 లో మళ్ళీ ఎన్నికలు వచ్చినవి. రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిగా పోటీచేసే సంకల్పం తనకు ఉన్నదని ఒక సంవత్సరం ముందుగానే సెనేటర్ రాబర్ట్ టాఫ్ట్ ప్రకటించేసరికి ఎన్నికలప్రచారం ముమ్మరంగా ప్రారంభమయింది. సెనేటర్ టాఫ్ట్ తీవ్రస్వభావి, వివేచనదక్షుడు అయినప్పటికీ, అమెరికా ప్రజానీకంలో అతడికి పలుకుబడిలేదు. పైగా, అతడు ఏకాకివిధానం (Isolationism) వంకకు మొగ్గుతాడనే ప్రతీతి కూడా ఉన్నది. అయినప్పటికీ, అతడు రాజకీయవేత్తగా చాలా సమర్థుడు. రిపబ్లికన్ పార్టీ యంత్రాంగం ఆయన చేతులలో ఉన్నది.

ప్రజలను ఇంకా ఎక్కువగా ఆకర్షించగల అభ్యర్థిని నిలుపుతే బాగుంటుందనే ఆశయంతో, అంతర్జాతీయ దృక్పథంగల రిపబ్లికనులు కొందరు మాసాచూసెట్స్ రాష్ట్రంనుండి ఎన్నిక అయిన సెనేటర్, కాబట్ లాడ్జ్ (జూనియర్) నాయకత్వాన ఐరోపాలో ఉత్తర అట్లాంటిక్ సంధిసంస్థ అధ్యక్షుడుగా పనిచేస్తూన్న జెనరల్ ఐసెన్‌హోవర్‌ను కలుసుకొని ఆయన రాజకీయాభిప్రాయాలను వివరించవలసినదిగా కోరారు. ఐసెన్ హోవరు ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామంలోని జాతీయవీరులలో అగ్రగణ్యుడు. కాని, అతని రాజకీయ అభిప్రాయాలేమిటో ఎన్నడూ అతడు ప్రకటించలేదు. అందువల్ల లోగడ 1948 లో డెమొక్రాట్లు తమ పార్టీ తరపున పోటీచేయవలసినదిగా ఆయన కోరారు.

లాడ్జ్, అతడి సహచరులు చేసిన ప్రయత్నం ఫలించింది. ఐసెన్ హోవరు తాను రిపబ్లికన్ పార్టీ వాడైనట్లు ప్రకటించి, రిపబ్లికన్ పార్టీ కోరితే ప్రెసిడెంట్ పదవికి పోటీచెయ్యడానికి తనకు అభ్యంతరం లేదని వివరించాడు. తాను రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిగా పేర్కొనబడే అవకాశం గట్టిగా ఉన్నదని తేలగానే జెనరల్ ఐసెన్ హోవరు తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఎన్నిక ప్రచారంలో పాల్గొనడానికి స్వదేశానికి తిరిగివచ్చాడు.

ఐసెన్ హోవరుపై మోజును ప్రతిఘటించడానికి టాఫ్ట్ ఆయన అనుచరులు తీవ్రంగా కృషిచేశారు. రిపబ్లికన్ పార్టీ మహాసభలోని సాంద్రవాతావరణంలో ఎక్కువమంది ప్రతినిధులను ఓహియో రాష్ట్ర రాజకీయవేత్త టాఫ్ట్‌కి అనుకూలంగా తిప్పడానికి సర్వప్రయ

త్నాలూ జరిగినవి. కాని, ఐసెన్‌హోవరు పైనిగల మోజును అతిశయించడం సాధ్యంకాలేదు. మొదటి వోటింగ్‌లో ఐసెన్‌హోవరు రిపబ్లికను పార్టీ అభ్యర్థిగా ఎన్నికయాడు. వైస్ ప్రెసిడెంట్ పదవికి అభ్యర్థిగా కాలిఫోర్నియానుండి ఎన్నిక అయిన సెనేటరు రిచర్డ్ నిక్సన్ పేర్కొనబడ్డాడు.

ఇక డెమొక్రాట్లలో ప్రెసిడెంటు ట్రూమన్ వారసులుగా వైట్ హౌస్‌లో ప్రవేశింపగోరిన వారిలో సెనేటరు కిఫావర్ (టెన్నెసీ) ఒకడు. ఇతడు అపరాధశోధకుడుగా టెలివిజన్ ద్వారా జాతీయ విఖ్యాతి సంపాదించాడు. రెండవవాడు వైస్ ప్రెసిడెంటు ఆల్బెన్ బార్క్లే; మూడు: సెనేటర్ రిచర్డ్ రసెల్ (జార్జియా); నాలుగు: పరస్పర భద్రతా కార్యకర్త ఎవెరెల్ హారిమన్ ఈ అభ్యర్థులలో ఎవరూ ప్రెసిడెంటు ట్రూమన్‌కి నచ్చలేదు. అతడు ఇలినాయ్స్ గవర్నర్ అడ్లీ స్టీవెన్సన్ అభ్యర్థిత్వాన్ని బలపరిచాడు.

స్టీవెన్సన్ రాజకీయాలకు కొత్త; సుప్రసిద్ధుడు; గవర్నరుగా విశేష ప్రస్తుతులు సంపాదించినవాడు. అట్టివాణ్ణి డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా నిలిపితే ఆ పార్టీ అవినీతికరమైనదన్న చెడ్డపేరు మాసిపోవచ్చునని భావించారు. సహజంగా స్టీవెన్‌స్సన్‌కి ప్రెసిడెంటు పదవికి పోటీ చెయ్యాలనే అభిలాష లేదు; కాని పార్టీ వత్తిడివల్ల ఆయన నిలబడ్డాడు. దక్షిణాదిరాష్ట్రాల వోట్లు సంపాదించడానికిగాను వైస్-ప్రెసిడెంటు పదవికి సెనేటర్ జాన్ స్పార్క్‌మన్ (అలబామా)ను అభ్యర్థిగా పేర్కొన్నారు.

1952లో జరిగిన ఈ ఎన్నిక విశిష్టత: అభ్యర్థులిద్దరిలో ఎవరికీ ఎక్కువ రాజకీయానుభవం లేకపోవడం, జెనరల్ ఐసెన్‌హోవరుకి అలాంటి అనుభవం బొత్తిగా శూన్యంకావడం. ప్రచారం ముమ్మరంగా సాగినకొలది, ఐసెన్‌హోవరు నిరాడంబరంగా, నిర్మొగమాటంగా వెలిబుచ్చే విశ్వాసాలకూ, ప్రతిభావంతంగా హాస్య సమ్మిళితంగా, అలంకారయుతంగా అతడి ప్రత్యర్థి జాతీయ అంతర్జాతీయ సమస్యలపై చేసే ఉపన్యాసలకు చాలా వ్యత్యాసం కనిపించింది.

ఈ ఎన్నిక ప్రచారంలో ప్రధాన సమస్యలు: కొరియా, అవినీతి, ఫెయిర్‌డీల్‌ని గురించిన వివాదాలు. మొదటి రెండు ఐసెన్‌హోవరుకి

అనుకూలమైనవి. సైనిక నిపుణుడుగా కొరియాయుద్ధ సమస్యను ఆయన సమర్థంగా పరిష్కరించగలడని ఆశ. పైగా, ప్రెసిడెంటుగా ఎన్నికైతే, వెంటనే తాను స్వయంగా కొరియాకువెళ్ళి పరిస్థితులను అవగాహన చేసుకొనగోరుతున్నట్టు ఆయన ప్రకటించాడు. అవినీతి సమస్య విషయంలో స్టీవెన్సన్ ఎంత సచ్ఛీలుడైనప్పటికీ, అతడు ప్రెసిడెంటు ట్రూమన్ నిలబెట్టిన అభ్యర్థి అవడం, అతడికొరకు ట్రూమన్ తీవ్రంగా ఎన్నికలప్రచారం చేస్తూఉండడం, అతడికి పెద్దలోపాలైనవి.

"ఫెయిర్ డీల్" విషయంలో తాను, రూజ్వెల్ట్, ట్రూమన్‌ల అడుగుజాడలలో ప్రవర్తింపదలచుకొన్నట్టు స్టీవెన్సన్ ప్రకటించాడు. కాని, ఈ విషయంలోకూడా అతడు నిజానికి ఐసెన్‌హోవరుకన్న ఎక్కువ ఆకర్షించగలిగినదేమీ లేదు. డెమొక్రాట్ల విధానాలవలన "బడుగు మనిషి" కి ఆర్థికంగాను, సాంఘికంగాను విశేష సౌకర్యాలు లభించినవనీ, తానుకూడా ఆ విధానాలనే—అవినీతికి, అంచగొండితనానికి అవకాశం లేకుండా—అనుసరింపదలచుకొన్నాననీ ఐసెన్‌హోవరు స్పష్టంగా ప్రకటించాడు.

అప్పటికీ, డెమొక్రాట్లవైపే మొగ్గుచూపుతూన్న దక్షిణాది రాష్ట్రాలు ఈ ఎన్నికలధోరణిని శ్రద్ధగా గమనిస్తున్నవి. యుద్ధవీరుడుగా జెనరల్ ఐసెన్‌హోవర్ అచటి ప్రజాభిమానాన్ని చూరగొన్నాడు. అతని జన్మస్థానం టెక్సాస్. ఉద్యోగివర్గ నిరంకుశత్వంపైన, అధికార కేంద్రీకరణంపైన ఆయన చేస్తూఉండిన విమర్శలు అతడు రాష్ట్రాల హక్కుల విషయంలో పట్టుదలగలవాడన్నట్టు సూచించినవి. "దుస్సహమైన రిపబ్లికన్ పార్టీ" జెఫర్సన్, కాహూన్‌ల సిద్ధాంతాలను డెమొక్రాట్లకన్న మిన్నగా అనుసరించబోతున్నదా? అని ప్రజలు తమను తామే ప్రశ్నించుకొనడ మారంభించారు.

సముద్రతీరపు నూనెగనుల అభివృద్ధిసమస్య ముఖ్యంగా దక్షిణాది వారికి ప్రధానవిషయం. టెక్సాస్, లుయీజియానా ఫ్లారిడా, కాలిఫోర్నియా తీరాలవెంబడి నీటి అడుగున గొప్ప నూనెగనులు ఉన్నవనీ, వాటిని తవ్వి తీయడం చాలా లాభదాయకం కాగలదని వారి ఆశ. అచట దొరికే నూనె ఖరీదు 4,000 కోట్ల డాలర్లు మొదలు 25,000 కోట్ల డాలర్లవరకు ఉండవచ్చునని అంచనాలు వేయబడినవి. ఈ నూనె

గనులు ఎవరికి చెందాలి:—తత్సమీప రాష్ట్రాలకా లేక కేంద్ర ప్రభుత్వానికా? అన్న ప్రశ్న వచ్చింది. మూడు పర్యాయాలు సుప్రీంకోర్టు కేంద్రప్రభుత్వానికే అనుకూలంగా తీర్పు చెప్పింది.

ఏ రాష్ట్రతీరంలోనైనా చరిత్రాత్మకంగా ఆ రాష్ట్రానికి చెందదగిన మేర సముద్రంలో ఈ నూనెగనులు ఉన్నట్టయితే, అనగా కాలిఫోర్నియా లుయీజియానాలవంటి ఉన్న సముద్రంలో మూడుమైళ్ళవరకు, టెక్సాస్ ఫ్లారిడా రాష్ట్రాల నంటిఉన్న సముద్రంలో పదిన్నరమైళ్ళవరకు ఉన్న నూనెగనులు :- ఆయారాష్ట్రాలకే చెందాలని ఐసెన్‌హోవరు తన ప్రచారంలో చెప్పడంవల్ల, దక్షిణాదివారి అభిమానాన్ని మరికొంత సంపాదించాడు. గవర్నరు స్టీవెన్సను ఈ అభిప్రాయాన్ని ఖండించి సముద్రగర్భంలోని గనులు ప్రభుత్వానికీ, అమెరికా ప్రజలందరికీ చెందవలసి ఉన్నవనీ, అయితే, తత్సమీప రాష్ట్రాలకు ఆ ఆదాయంలో కొంతభాగం చెందజేసే విషయం ఆలోచించవచ్చునని స్టీవెన్సను ప్రకటించాడు.

ఐసన్‌హోవరు-స్టీవెన్సన్ ఎన్నికలలో రాజకీయజోస్యాలు చెప్పే నిపుణులంతా తాము వేసిన గ్రాఫులను, అంకెలను గుణించి, గుణించి చివరికి పోటీ చాలా హోరాహోరీగా జరిగిందనీ, కొద్దిపాటి మెజారిటీతో ఎవరు నెగ్గినా నెగ్గవచ్చునని ఉద్ఘోషించారు. ఇరవైనాలుగు గంటల తరువాత తిరిగి మరొకసారి వారు తెల్లబోయి, ఒకరిముఖాలొకరు చూచుకొని, తమ జోస్యాలు అంతగా తప్పిపోవడానికిగల హేతువులను వివరించడ మారంభించారు.

పెద్ద మెజారిటీతో ఐసన్‌హోవరు ఎన్నిక అయాడు. ఎన్నికదార్ల వోట్లలో ఐసన్ హోవరుకి 442 వోట్లు వస్తే, స్టీవెన్సన్‌కి 89 మాత్రమే వచ్చినవి ఇక ప్రజల వోట్లలో ఐసెన్‌హోవర్‌కి 3,40,00,000 వోట్లు వస్తే, స్టీవెన్సన్‌కి 2,70,00,000 వోట్లు వచ్చినవి. సాధారణంగా ఒకే పక్షానికి వోటుచేసే దక్షిణాది రాష్ట్రాలవోట్లు ఈ పర్యాయంచీలిపోయినవి. వర్జీనియా, టెన్నెసీ, టెక్సాస్, ఫ్లారిడా రాష్ట్రాలు రిపబ్లికనులకు వోటు చేసినవి తొమ్మిదిరాష్ట్రాలలో మాత్రమే స్టీవెన్సన్‌కి ఎక్కువ వోట్లు వచ్చినవి. వీటిలో ఒక్క పశ్చిమ వర్జీనియాతప్ప మిగిలినవన్నీ దాక్షిణాదిరాష్ట్రాలే. గవర్నరు స్టీవెన్సను అద్భుతంగా ప్రచారంచేసి,

ప్రజల ప్రేమాదరాలను చూరగొన్నాడు. కాని వరుసగా 20 సంవత్సరాలు డెమొక్రాట్లు పరిపాలన తరువాత ప్రభుత్వాన్ని మార్పుచేయవలసిన సమయం వచ్చిందని అమెరికా ప్రజలు తీర్పుచెప్పారు.

* * *

1953 జనవరి 20వ తేదీన ప్రెసిడెంటు ఐసెన్‌హోవర్ వాషింగ్టన్ ప్రభుత్వభవనంలో సంయుక్తరాష్ట్రాల 34వ ప్రెసిడెంటుగా పదవీ స్వీకారం చేశాడు. సాధారణంగా సాయిలా ఫాయిలాగా, చిరునవ్వు నవ్వుతూ మాట్లాడే ఐసెన్‌హోవరు ఆ సందర్భంలో గంభీరుడై తన జాతికి, ప్రపంచానికి ఇలా ఉపన్యసించాడు; "నా సహచర పౌరులారా! ప్రపంచమూ, మనమూ ఈ శతాబ్దిలో అత్యంతాందోళనతో కూడిన తొలి సగాన్ని గడిపి ముఖ్యభాగానికి చేరుకున్నాం. ఎప్పటివలెనే దుష్టశక్తులు శిష్టశక్తులు ప్రబలంగా ఆయుధసహితంగా పరస్పరం ప్రతిఘటించుకొంటూనే ఉన్న సంగతి మనం సర్వేంద్రియాలతో గ్రహిస్తున్నాం... మనం వివేకంతో, అంతరాత్మశుద్ధిగా కృషిచేయవలసి ఉన్నది. మనం కష్టించి పనిచేయడం, సమాధాన పద్ధతిలో బోధపరచడం, విశ్వాసంతో ప్రబోధించడం, మన ప్రతిచర్యను జాగరూకతతో, కారుణ్యంతో తూచి చూచుకొనడం అవసరం. ముఖ్యంగా మనమీ సత్యాన్ని సదా గుర్తించుకోవాలి. ప్రపంచంలో ఏవిధమైన పరిణామం జరగాలని మనం కోరుకుంటున్నామో, ఆ పరిణామం మన హృదయంలోనే ముందుగా జరగాలి."

—0—

AMERICA SAMYUKTA RASHTRA SAMGRAHA CHARITRA [Tel.] Rs. 2-50.
[A Brief History of the United States]



# అమెరికా సంయుక్తరాష్ట్ర సంగ్రహ చరిత్ర

● అమెరికా విప్లవమూ, రాజ్యాంగమూ, పునర్నిర్మాణమూ, మొదటి ప్రపంచ సంగ్రామమూ, క్రొత్తసాధనాలూ, రెండవ ప్రపంచ సంగ్రామమూ, విదేశాంగవిధానమూ, క్రొత్త వలసస్థాపనా మొదలైన విషయాలు విపులీకరిస్తూ, కొలంబస్ మొదలు ఐసన్‌హోవర్ వరకు చరిత్రలో ముఖ్యఘట్టాలను వివరించిన అమెరికా సంయుక్త రాష్ట్రాల జాతీయగాథ.

● ఈ చిన్నగ్రంథం అమెరికా చరిత్రలో అక్కడకొంచెం ఇక్కడ కొంచెంగా తెలిసికొన్నవారి కోసము, అసలే తెలియనివారికోసము రచించబడింది. అమెరికా సంయుక్తరాష్ట్రాలను ఏకజాతిగా రూపొందించిన మహాశక్తులను సమస్యలను గురించి ముఖ్యంగా ఇందులో విశదీకరించబడింది. భౌతిక, నైతిక, ఆర్థిక రూపములయిన ఈ వివిధశక్తులు సంయుక్తరాష్ట్రప్రజల కొకవిలక్షణతనుచేకూర్చినవి.



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A 10 13 111 |
| పుస్తకం పేరు | అమరావతి సంయుక్త రచనల సంపుటి |
| తారీఖు | 24-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 241 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1, BC1 |
| లేని పేజీలు | 19 to 20 |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |